ఓమ్

శ్రీరస్తు

ఆరోగ్యమస్తు

ఆంధ్రతాత్పర్యసహిత



# ఆయుర్వేదౌషధరత్నాకరము


గ్రంథకర్త

"ఆయుర్వేదభూషణ" "భిషగ్వర"

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఏ. ఎమ్. ఏ. సి.

చరకసంహితానువాదకుడు

ఆంధ్రభైషజ్యరత్నావళి ప్రణేత

భస్మప్రకాశిక ప్రణేత

అనుభవదీపిక ప్రణేత

వైద్యవిజ్ఞాన ప్రణేత

కృష్ణాఫార్మసీ వ్యవస్థాపకుడు



ఆరవ ముద్రణము : 3000 ప్రతులు

రాజమంద్రి

సుజన రంజనీ ముద్రాశాలయందు

ముద్రితము

ప్రకాశకులు :

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ఏ. ఎమ్. ఏ. సి.


 వెల 40-00

# విజ్ఞాపన

( ప్రథమ ముద్రణము )

ఈ పుస్తకమునందలి చాలయోగములు అనేక ప్రాచీన శిథిలగ్రంథములనుండియు చాలమంది యొద్దనున్న వ్రాత పుస్తకములనుండియు గ్రహింపబడి వ్రాయబడి యున్నవి ఆ యోగములలో కొన్ని అసంపూర్ణముగను సందిగ్ధముగను తప్పులుగను భేదములుగను నున్నవి. మరియు ఆశ్చర్యజనకమగు వ్యాఖ్యను కూడ కలిగియున్నవి. అటువంటి ఆ యోగములయొక్క స్వరూపమును ఇంతవరకు సవరించి వ్రాయుటకు నేను పొందిన శ్రమ వ్రాయనలవికాదు. అందుచే ఇంతకన్నను పరిశుద్ధముగను వ్యాఖ్యానము ఇంకను విపులముగను వ్రాయుటకు ఈ ముద్రణయందు ఇంతకంటె అవకాశము కలుగలేదు. భగవంతుని దయవలన కొద్దిగ సంస్కృతమును కొద్దిగ ఆయుర్వేదమును తెలియుటచేతను, 10 సంవత్సరములనుండియు అనేక విధములగు యోగములను సంపాదించియుండుటచేతను, ఇంతవరకైనను వ్రాయగలిగితిని.

.... .... .... .... ....
1—12—1924

ఇట్లు గ్రంథకర్త,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

---

# విజ్ఞాపన

( ద్వితీయ ముద్రణము )

భగవంతుడగు నా ధన్వంతరి యొక్క కరుణాకటాక్షము వలన నీ ఆయుర్వేదౌషధరత్నాకరము యొక్క రెండవ ముద్రణమును ఈ విధముగ ముద్రింపించి ఆంధ్రవైద్య సోదరులకందించినందులకు ఆ ధన్వంతరికి అనేక శిరఃప్రణామము లర్పించుచున్నాడను. ఇట్లు విమర్శనముగ వ్రాయుట కింత వరకు మంచిదేయని మొదట్లు తెలిసినను చాలకాలము కావలయునని యిప్పుడట్లు వ్రాయలేను. ఇప్పుడింకను అనేక విషయములను వ్రాయదలచి కూడ కొన్ని కారణములచే ప్రస్తుతమిట్లు ముగించితిని,

శాస్త్రకారులు వస్తుసంయోగమునే ప్రధానముగ నెంచుకొని శబ్ద ప్రయోగమును సరిగ చూడకపోవుటచే యోగములం దచ్చటచ్చట భాగముల యందు అనేక విధములగు అర్థములను కల్పించుటకు తగిన అవకాశమేర్పడు చున్నది. అట్టి విషయములను బాగుగ ఆలోచించి చాలవరకు సవరించియే వ్రాసితిని. కాని కొన్ని స్థలములయందు మార్పుచేయుటకు వీలులేక అటులనే యుంచవలసి వచ్చినది.

నేను వ్రాసిన మందుల పేరులయొక్క అర్థమునందు కొన్నిటికి ధాత్వర్థము సరిగ లేకపోయినను సామాన్యాభిప్రాయముతో కొన్ని యర్థము లను వ్రాయవలసి వచ్చినది. ఇందు సూతికాభరణము, త్రైలోక్యచింతామణి, నవరత్నచింతామణి, మొదలగు మందులు ప్రతివారును చేయునవి కాదు గదా యెందులకు వ్రాయవలయునని కొందరికి సందేహము కలుగవచ్చును. సూతికాభరణము మొదలగు వానిని అందరును చేయకపోయినను వాడు చున్నారు. వాడునప్పుడు అందు కలియు వస్తువులును గుణములును తెలియ నక్కరలేదా? మరియు నవరత్నచింతామణి మొదలగు యోగముల యొక్క స్వభావము తెలిసియుండుటయు అనేక విధముల మంచిదే.

ఆయుర్వేదమునందు అసంఖ్యాకములగు యోగములు కలవు. ఇది చాల గొప్ప విషయము. ఒక్క యోగము కూడ అనవసరముగ వ్రాయబడి యుండలేదు. దీనిని గూర్చి ప్రశ్న సమాధాన పరంపరలో వ్రాసియే యున్నాను. కాని యోగములు సరిగ నిర్ధారితములుగ లేకపోవుటవలన ననేకాసందర్భములు కలుగుచున్నవి. ఎట్లు చేసినను కస్తూరిమాత్రలని సామాన్యముగ పేరు ఒకటియే. ఎవరి ఇష్టము వచ్చినట్లు వారు చేసెదరు. అందు ఏ వస్తువులు పడినవో కస్తూరి ఎంత కలసినదియో ఎవరికిని తెలియదు. అది అట్లుండ సువర్ణవాతరాక్షసము, మహాలక్ష్మీవిలాసము, మొదలగు కొన్ని యోగములను కొందరు కొన్నిటిని మరికొందరు మరికొన్నిటిని చేయుదురు. మరియు అందరికిని తెలిసిన సన్నిపాతభైరవి, శీతాంశురసము మొదలగు యోగములయందే భాగములను భేదముగ వేయుచున్నారు. ఇట్టివి అనేక విషయములు కలవు. ఇట్లుండుటచే ఒకరు చేసిన మందును ఇంకొకరు వాడుటకు తగిన వీలులేకున్నది. కాన ఆయుర్వేద మభివృద్ధిలోనికి

రా వలయునన్నచో ఆంధ్రవైద్య సోదరులందరును కలిసి ఆంధ్రదేశమునందలి యోగములైనను సరిగ నిర్ధారణ చేయవలయును. కాని ఈ కష్టము మందులను చేయువారలకే తెలియును గాని ఇతరులకు తెలియకున్నది. ఇతరుల యొద్ద నుండి మందులను తెప్పించి వాడువారు "మనము ఈ రజతలోహరసాయన మును ఈ కస్తూరి మాత్రలను తెప్పించి వాడుచున్నాము. వీనియందు ఏ వస్తువులు ఎంతెంత కలిసి యున్నవి" అని విమర్శించి వాడుటలేదు. చేసినవారు ఏ యోగప్రకారముచేసిరో వీరికి చెప్పుటలేదు. ఇట్లు చేయుట న్యాయమా? ఆయుర్వేదపు మందులను ఎవరికివారే చేసికొని వాడవలయు ననియు ఇతరుల యొద్ద తెప్పించి వాడుట ఆయుర్వేదాభివృద్ధికి భంగకర మనియు స్వాతంత్ర్యము నశించుననియు కొందరు పెద్దలు చెప్పుచు, ఎందుచేతనో పరులమీదనే ఆధారపడుచున్నారు. మందులను చేయుట యనునది ఎంతమాత్రమును సామాన్య విషయము కాదు. మందులను చేయుటకు అన్ని సంగతులును తెలియుట, ఓపిక, అభిరుచి, ధనము, మొదలగు ననేకవిషయములు కావలయును, ఎంతమంది రోగులకైనను సమాధానము చెప్పవచ్చును. కాని ప్రతి వస్తువును సమకూర్చుట, శుద్ధులు చేయుట, వండుట, మొదలగు ననేకశ్రమలుకల యొక యౌషధమును తయారుచేయుట బహుకష్టము. ఎంత తెలిసినను ఒక్కొక పాకసమయమున ననేకవిధములగు కష్టములు కలుగుచుండును. ఒక నిమిషమునకే పాకభేదము కలుగును. ఇట్లుండ స్వయముగ దగ్గరనుండి మందులను తయారు చేయించని యెడల అవి ఎట్లు తయారగునో వేరుగ చెప్పనక్కరలేదు. ప్రతి నిమిషము నకును ప్రతి విషయమును స్వయముగ చూచుచుండవలయును.

అనేక యోగములయందనేకవిధములగు మతభేదములు కలవు. వాని నన్నిటిని విమర్శించి యిందు వ్రాసినచో నంతములేని విషయమగును. కాన నా మతభేదములన్నిటిని సాధ్యమైనంతవరకు విమర్శించి నాకు మంచిదని తోచిన మతమునే యిందు వ్రాసితిని.

మొదటి ముద్రణ విజ్ఞాపనలో నేను వ్రాసిన విధమున సూక్ష్మములగు ఛ థ మొదలగు వర్ణవ్యత్యాసములనేగాక పదవిభాగావకాశములు మొదలగు నతిసూక్ష్మ విషయములను కూడ అధికమగు శ్రమతో చాలవరకు సవరించి ముద్రింపించితిని.

లఘుసూర్యావర్తి, సువర్ణసూర్యావర్తి, రసరాట్, రజతలోహ రసాయనము, మొదలగు మందులే ఇదివరలో నందరికిని సులభగ్రాహ్యాము లగునట్లు ప్రత్యక్షములో లేకపోవుటచే నీగ్రంథమింత శ్రమపడి వ్రాయ వలసివచ్చినది.

ఆయుర్వేదమునందు అనేక గ్రంథకర్తలు మిక్కిలి శ్రమపడి జనోపయోగమే ముఖ్యమనితలచి యనేకయోగములను చెప్పిరి. కాని ఎవరైనను వాడుకలోనున్న వాతరాక్షసము వాతవిధ్వంసులనే చేసి వాడెదరు. కాని అటువంటి వనేకయోగములుండగ వానినిచేసి వాడి గుణగతులను గ్రహించుటలేదు. భయము, ఔదాసీన్యము, మొదలగునవియే యిందులకు కారణములుగ తోచుచున్నవి. అట్టివానిని విడనాడి కొందరు కొన్ని యోగములను మరికొందరు మరికొన్ని యోగములనుచేసి వాడుచు క్రమముగ నన్నియోగములను వాతరాక్షస వాతవిధ్వంసులనువలె చేసినచో మందు లన్నియు వాడుకలోనికి వచ్చి ఆయుర్వేద మిప్పటికంటె మహోన్నత దశను పొందగలదు. అపారమగు నీ యాయుర్వేదమును మథించి విమర్శించి నచో సముద్రమథనముచే దేవతలమృతమును పొంది అజరామరణులై నట్లుగ, అమృతతుల్యమగు ననేకవిషయములను పొంది శాస్త్రములయందు చెప్పబడిన విధముగ జరావ్యాధులు లేనివారై యనేక సంవత్సరములు సుఖముగ జీవింపగలరు.

వివరముగ వ్రాసినచో ఆయుర్వేదము యొక్క గుట్టు (రహస్యము) పోవుననియు గౌరవముండదనియు కొందరభిప్రాయ పడవచ్చును. రహస్య ములు బయలు పడుటచేతనే ఏ శాస్త్రమైనను అభివృద్ధి నొందగలదనియు గౌరవమును పొందగలదనియు నా అభిప్రాయము.

అధిక వ్యయప్రయాసలతో రచింపబడిన ఈ ఆయుర్వేదౌషధ రత్నాకరమును ఆంధ్రవైద్య సోదరులందరును సాంతముగ పరిశీలించి గ్రహింపదగిన విషయములున్నచో గ్రహించి నా శ్రమకు సాఫల్యమును గలుగజేయగలందులకు అనేక విధముల ప్రార్థించుచున్నాడను.

ఇట్లు గ్రంథకర్త,

................ }
1—1—1929 }

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# విజ్ఞాపన

(పంచమ ముద్రణము)

ఆదిదేవుడైన శ్రీమద్ధన్వంతరి కటాక్షమువలనను, వైద్య సోదరుల యొక్క ఆదరాభిమానములవలననూ మా యీ "ఆయుర్వేదౌషధరత్నాకరము" అచిరకాలములోనే పంచమ ముద్రణము పొందినది.

ఇదివరలోని ముద్రణముల యొక్క విజ్ఞాపనలలో అనేక విషయములు వ్రాయబడి యుండుటవలన గ్రంథవిస్తరభీతిచే ఈ విజ్ఞాపనను ఇంతటితో ముగించుచున్నాము. అచ్చుటచ్చుటగల ముద్రణాది స్వల్పదోషములను సరిచేసి సరిగ చతుర్థ ముద్రణమువలెనే ప్రచురించితిమి.

రాజమండ్రి
1—8—1954

ఇట్లు సకల సజ్జన విధేయులు,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి & సన్సు

---

# విజ్ఞాపన

(ఆరవ ముద్రణము)

మా యీ "ఆయుర్వేదౌషధరత్నాకరము" మరల ఆయుర్వేద వైద్య సోదరులకును, వైద్యాభిమానులకును, అందించగలిగినందుకు శ్రీమద్ధన్వంతరికి సహస్రప్రణామము లొనరించుచున్నాము.

ఎన్నియో సంవత్సరములక్రితమే ఈ గ్రంథము యొక్క పునర్ముద్రణ చేయవలసియున్నప్పటికినీ, కాగితము నిర్ణీతమైన ధరకు దొరకకపోవుట వలన ఈ పునర్ముద్రణ ఆలశ్యమైనది.

మాయొక్క అన్ని ఆయుర్వేదగ్రంథముల పునర్ముద్రణకు మేము కోరిన వెంటనే కావలసిన కాగితం అంతయూ నిర్ణీతధరకు అందుబాటు చేసినందులకు ప్రభుత్వము వారికి మేమంతయో కృతజ్ఞులము.

రాజమండ్రి
31—8—1954

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి & సన్సు

# ఔషధానుక్రమణిక



ఓమ్

శ్రీరస్తు

ఆరోగ్యమస్తు

## ఆంధ్ర తాత్పర్య సహిత

# ఆయుర్వేదౌషధరత్నాకరము

---

### మంగళాచరణము

శ్లో॥ నమామి ధన్వన్తరిమాదిదేవం సురాసురైర్వన్దితపాదపద్మమ్ ।
లోకేజరారుగ్భయమృత్యునాశం దాతారమీశం వివిధౌషధీనామ్ (1)

అ॥ ఆదిదేవుడైనట్టియు, దేవతలచేతను రాక్షసులచేతను నమస్కరింపబడిన పాదపద్మములు కలిగినట్టియు, లోకమునందు ముసలితనము యొక్కయు వ్యాధుల యొక్కయు భయమును మృత్యువును నశింపజేసినట్టియు, సమస్తమైన ఓషధులయొక్క జ్ఞానమునిచ్చినట్టియు, ప్రభువైనట్టియు, ధన్వంతరిని నమస్కరించుచున్నాడను.

శ్లో॥ యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన ।
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతఞ్జలిం ప్రాఞ్జలిరానతోఽస్మి (1)

అ॥ యోగశాస్త్రముచే మనస్సుయొక్కయు, వ్యాకరణశాస్త్రముచే వాక్కుల యొక్కయు, వైద్యశాస్త్రముచే శరీరముయొక్కయు, మాలిన్యమును పోగొట్టి నట్టియు మునిశ్రేష్ఠుడైనట్టియు పతంజలికి దోసిలొగ్గి నమస్కరించుచున్నాడను.

శ్లో॥ ఆయుర్వేదమహాశాస్త్రంధర్మార్థసుఖసాధనమ్ । యేభ్యోఽగమంస్తాన్ గోపాలాచార్యాదీన్గురుసత్తమాన్ (1) ప్రణమ్య శిరసాసమ్యక్ప్రథితౌషధ శేవధిమ్ । సర్వలోకహితార్థాయ గ్రన్థం పరమదుర్లభమ్ ॥ కరోమి సూక్ష్మయా బుద్ధ్యాలోకరఞ్జకముత్తమమ్ (2)

అ॥ మహాశాస్త్రమును ధర్మార్థసుఖసాధనమునైన ఆయుర్వేదమును అభ్యసింప చేసినట్టియు, గురుశ్రేష్ఠులైనట్టియు, గోపాలాచార్యులు మొదలగువారిని శిరస్సుచే బాగుగ నమస్కరించి ప్రసిద్ధౌషధములకు నిధియైనట్టియు, మిక్కిలి దుర్లభమైనట్టియు

లోకమును సంతోషింపజేయునట్టియు, శ్రేష్ఠమైనట్టియు, గ్రంథమును లోకము యొక్క మేలు కొఱకు సూక్ష్మబుద్ధిచే రచించుచున్నాడను.

శ్లో॥ శ్రీపాదసోమయాజ్యాఖ్యం పితరం పుత్రవత్సలమ్। గురుం పరమ పూజ్యం మే స్మరామి హృది సర్వదా (1) అశేషసుగుణోపేతాం మాతరం పరదేవతామ్ । సుబ్బమాంబాభిధాం వన్దే నిత్యం శ్రేయోఽభివృద్ధయే (2)

అ॥ శ్రీపాదసోమయాజియనెడి పేరుగలిగినట్టియు, పుత్రప్రేమ కలిగినట్టియు, గౌరవనీయుడైనట్టియు అధికముగ పూజింపదగినట్టియు, తండ్రిని హృదయమం దెల్లప్పుడు స్మరించుచున్నాడను. సమస్త సుగుణములతో కూడినట్టియు, దైవస్వరూపిణి యైనట్టియు, సుబ్బమ్మయనెడి పేరుకలిగినట్టియు, తల్లిని శ్రేయోభివృద్ధి కొఱకు నెల్లప్పుడు నమస్కరించుచున్నాడను.

శ్లో॥ తయోర్ద్వితీయపుత్రోఽహం ప్రథమో వేఙ్కటేశ్వరః । సుబ్రహ్మణ్యో రామమూర్తిస్సత్యనారాయణస్తతః (1) శేషరాయో నృసింహశ్చ క్రమాత్పఞ్చాపి మేఽనుజాః । సుబ్బమామ్బా రామమామ్బా వేఙ్కటరత్నామ్బి కాతథా (2) సోదర్యోఽస్మాకమభవం స్త్రిస్రస్సుగుణరాశయః । గోదావరీతటే కోనసీమ్ని విద్వద్వరావృతే (3) మోదేకుర్త్యాఖ్యసద్గ్రామే జాతాః ఖ్యాతిం గతా వయమ్। సోఽహం కౌశికసద్గోత్ర శ్రీపాదకుల సమ్భవః (4) కృష్ణమూర్తి సమాఖ్యాతో వైద్యవిద్యావిశారదః । పరీక్ష్య వివిధాన్యోగాన్కరోమి గ్రన్థ ముత్తమమ్ । ఆయుర్వేదౌషధాభిఖ్యరత్నాకర సమాహ్వయమ్ (5)

అ॥ మా తల్లితండ్రులకు నేను ద్వితీయపుత్రుడను. వెంకటేశ్వర్లు ప్రథమ పుత్రుడు. సుబ్రహ్మణ్యము, రామమూర్తి సత్యనారాయణ, శేషారావు, నృసింహము ఈ యైదుగురు నాకు క్రమముగ ననుజాలు (తమ్ములు). సుబ్బమ్మ, రామమ్మ, వెంకట రత్నమ్మ అనెడి సుగుణవతులగు ముగ్గురు తోబుట్టువులు (అక్కచెల్లెండ్రు) మాకు గలరు. మేము గోదావరి ప్రాంతమున కోనసీమయందు విద్వాంసులతోకూడినట్టియు, మోదేకుర్రు అనెడి పేరు కలిగినట్టియు, యోగ్యమైనట్టియు గ్రామమందు జన్మించితిమి. కౌశిక సగోత్రమందు శ్రీపాదవంశమున జన్మించినట్టియు, కృష్ణమూర్తి యనెడి పేరు కలిగినట్టియు వైద్యవిద్యనభ్యసించినట్టి నేను అనేకవిధములైన యోగములను విమర్శించి శ్రేష్ఠమైనట్టియు, ఆయుర్వేదౌషధరత్నాకరమనెడి పేరు కలిగినట్టియు, గ్రంథమును రచించుచున్నాడను.

# గ్రంథ ప్రారంభము

## ప్రథమగుచ్ఛము

### కాంతవల్లభరసము

శ్లో॥ కాన్తం షోడశభాగం చ చతుర్దశమయోరజః । కిట్టం ద్వాదశకంచైవ దశభాగంతు టఙ్కణమ్ (1) మనశ్శిలామష్టభాగాం షడ్భాగం చ శిలాజితు। సర్వేణ చ సమం సూతం గన్ధకం చాపి తత్సమమ్ (2) ఆర్ద్రిమూషోదరేన్యస్య వాలుకాయన్త్రికే క్షిపేత్ । పాచయేత్సప్త రాత్రంతు సంగ్రాహ్యః సూక్ష్మచూర్ణితః (3) సేవితో మధునాయుక్తః నిష్కార్ధేన సమన్వితః । పాణ్డురోగం క్షయం గుల్మం గ్రహణీరోగకం తథా (4) కాసం శ్వాసం జ్వరం ఛర్దిం ప్లీహోదరమరోచకమ్ । మన్దాగ్నిం కుష్ఠరోగం చ మూలరోగం భగన్దరమ్ (5) వాతం శూలం హరేద్వృష్యస్తథా చైవాతిదీపకః । తుష్టిపుష్టికరః కాన్తివర్ధకోబలవర్ధకః (6) కాన్తవల్లభనామాఽయం విష్ణునా నిర్మితః పురా । సర్వపాణ్డు క్షయహరః లోకస్యారోగ్యహేతుకః (7)

అ॥ కాంతభస్మ 16 భా, ఖడ్గలోహభస్మ 14 భా, మాండూరభస్మ 12 భా, శు॥ వెలిగారము 10 భా, శు॥ మణిశిల 8 భా, శిలాజితుభస్మ 6 భా, వీనియన్నిటికిని సమానము శు॥ పాదరసము, పాదరసముతో సమానము శు॥ గంధకము, ఇట్లు వీనిని గ్రహించి ఆర్ద్రిమూసయందు పోసి వాలుకాయంత్రమునుంచి యేడురోజులు వండవలయును. పిమ్మట తీసి మెత్తగ చూర్ణించి అర్ధనిష్కపరిమాణము చొప్పున తేనెతో సేవించినయెడల పాండురోగము, క్షయ, గుల్మము, గ్రహణీరోగము, కాస, శ్వాస, జ్వరము, వాంతి, ప్లీహోదరము, అరోచకము, అగ్నిమాంద్యము, కుష్ఠరోగము, మూలవ్యాధి, భగందరము, వాతము, శూల, ఈ రోగములను హరించును. వీర్యవృద్ధిని, అధికమగు జాఠరదీప్తిని, మనస్సంతోషమును, శరీరపుష్టిని, కలిగించును. శరీరకాంతిని, బలమును, వృద్ధిపొందించును. కాంతవల్లభరసమనెడి యీ యౌషధము పూర్వకాలమందు విష్ణువుచే చెప్పబడినది. సమస్తములైన పాండురోగములను, క్షయలను, హరించును. లోకమునకు ఆరోగ్యమును కలిగించును.

### సువర్ణకాంతవల్లభరసము

శ్లో। కాన్తం షోడశభాగం చ చతుర్దశమయోరజః । కిట్టం ద్వాదశకంచైవ దశభాగం తు టఙ్కణమ్ (1) మనశ్శిలామష్టభాగాం షడ్భాగంచ

శిలాజతు। సువర్ణమేకభాగం చ రౌప్యకం చ ద్విభాగకమ్ (2) సర్వైస్సమం శుద్ధసూతం గన్ధకం సూతతుల్యకమ్ । జమ్బీరఫలసారేణ దృఢం మర్ద్యం చ యత్నతః (3) ఆర్ద్రమూషోదరే న్యస్య వాలుకాయన్త్రకే క్షిపేత్ । పాచయేత్సప్తరాత్రం తు సంగ్రాహ్యః సూక్ష్మచూర్ణితః (4) జలేన తు విమర్ద్యశ్చ వటకాంశ్చైవకారయేత్। సేవితో మధునాయుక్తశ్చతుర్గుఞ్జాప్రమాణతః (5) పాణ్డురోగం క్షయం గుల్మం గ్రహణీరోగకం తథా । కాసం శ్వాసం జ్వరం ఛర్దిం ప్లీహోదరమరోచకమ్ (6) మన్దాగ్నిం కుష్ఠరోగం చ మూలరోగం భగన్దరమ్ । వాతం శూలం హరేద్వృష్యస్తథాచైవాతిదీపకః (7) తుష్టిపుష్టికరః కాన్తివర్ధకో బలవర్ధకః। కాన్తవల్లభనామాఽయంసువర్ణపదపూర్వకః(8)

అ॥ కాంతభస్మ 16 భా, ఖడ్గలోహభస్మ 14 భా, మాండూరభస్మ 12 భా, శు॥ వెలిగారము 10 భా శు॥ మణిశిల 8 భా, శిలాజతుభస్మ 6 భా, సువర్ణభస్మ 1 భా, వెండిభస్మ 2 భా, వీనియన్నిటికిని సమానము శు॥ పాదరసము, పాదరసముతో సమానము శు॥ గంధకము, ఇట్లు వీనిని గ్రహించి నిమ్మకాయరసముతో దృఢముగ మర్దించి ఆర్ద్రమూషయందు పోసి వాలుకాయంత్రమందుంచి యేడురోజులు వండవలయును. పమ్మట తీసి మెత్తగ చూర్ణించి నీటితోనూరి కుప్పెలుగ చేసి నాలుగు గురివింపగింజలపరిమాణముగ తేనెతో సేవించినయెడల పాండురోగము, క్షయ, గుల్మము, గ్రహణీరోగము, కాస, శ్వాస. జ్వరము, వాంతి, ప్లీహోదరము, అరోచకము, అగ్నిమాంద్యము, కుష్ఠరోగము, మూలవ్యాధి, భగందరము, వాతము, శూల, ఈరోగములు హరించును. వీర్యవృద్ధిని, అధికముగు జాఠరదీప్తిని, మనస్సంతోషమును, శరీరపుష్టిని, కలిగించును. శరీరకాంతిని, బలమును, వృద్ధిపొందించును. ఇది సువర్ణకాంతవల్లభరసమని చెప్పబడును.

## మహాసువర్ణకాంతవల్లభరసము

శ్లో॥ కాన్తం షోడశభాగం చ లోహభస్మచతుర్దశ । కిట్టంద్వాదశకం చైవ చతుర్భాగం తథాభ్రకమ్ (1) తామ్రభస్మ త్వష్టభాగం షడ్భాగాంచ మనశ్శిలాం । టఙ్కణం తు చతుర్భాగం ద్విరౌప్యం చైకస్వర్ణకం (2) సర్వైస్సమం శుద్ధసూతం గన్ధకం సూతతుల్యకమ్ ।హంసపాదీరసైర్మర్ద్యం వాలుకాయన్త్రయోగతః (3) పాచయేత్సప్తదివసం సంగ్రాహ్యః సూక్ష్మచూర్ణితః । నీరేణ తు విమర్ద్యశ్చ వటకాంశ్చైవ కారయేత్ (4) సేవితో మధునాయుక్తః గుఞ్జాత్రయప్రమాణతః।పాణ్డురోగం క్షయం గుల్మం గ్రహణీ

రోగకం తథా (5) అజీర్ణం వివిధం హన్తి జీర్ణజ్వర వినాశకః। కాసం శ్వాసం జ్వరం ఛర్దిం ప్లీహోదర మరోచకమ్(6) శోఫం చ వివిధం హన్యాత్కామలాంచ హలీమకమ్। కుష్ఠరోగమతీసారం మూలరోగం భగన్దరమ్(7) వాతవ్యాధిహరః శ్రేష్ఠః శూలఘ్నః శ్లేష్మరోగహృత్। అనుపానవిశేషేణసర్వరోగహరః పరమ్ (8) తుష్టిపుష్టికరః కాన్తివర్ధకో బలవర్ధకః వీర్యవృద్ధికరశ్చైవ తథా శ్రేష్ఠం రసాయనమ్ (9) కాన్తవల్లభనామాయం సువర్ణపద పూర్వకః। లోకానాం రక్షణార్థం చ లక్ష్మీనాథ ప్రకల్పితః (10)

అ॥ కాంతభస్మ 16 భా, ఖడ్గలోహభస్మ 14 భా, మండూరభస్మ 12 భా, అభ్రకభస్మ 4 భా, తామ్రభస్మ 8 భా, శు॥ మణిశిల 6 భా, శు॥ వెలిగారము 4 భా, వెండిభస్మ 2 భా, సువర్ణభస్మ 1 భా, వీనియన్నిటికిని సమానము శు॥ పాదరసము, పాదరసముతో సమానము శు॥ గంధకము, ఇట్లు వీనిని గ్రహించి హంసపాదిరసముతో మర్దించి వాలుకాయంత్రమందు ఏడురోజులు వండవలయును. పిమ్మట తీసి మెత్తగ చూర్ణించి నీటితోనూరి కుప్పెలను చేసి మూడుగురివిందగింజల ప్రమాణముగ తేనెతో సేవించినయెడల పాండురోగము, క్షయ, గుల్మము, గ్రహణిరోగము, అజీర్ణము, జీర్ణజ్వరము, కాస, శ్వాస, జ్వరము, వాంతి, ప్లీహోదరము, అరోచకము, నంజు, కామిర్లు, హలీమకము, కుష్ఠరోగము, అతిసారము, మూలవ్యాధి, భగందరము, వాతవ్యాధులు, శూల, శ్లేష్మవ్యాధులు, ఇవి హరించును. అనుపానవిశేషములతో సేవించినయెడల సర్వరోగములు హరించును. మనస్సంతోషమును, శరీరపుష్టిని చేయును, శరీరకాంతిని, బలమును, వృద్ధిపొందించును. వీర్యవృద్ధిని చేయును. శ్రేష్ఠమైన రసాయనము, ఈమహా సువర్ణకాంతవల్లభరసము, లక్ష్మీనాధునిచే లోకరక్షణార్థమై చెప్పబడినది.

## రజతలోహరసాయనము

శ్లో॥ ఏకైకం సూతరూప్యే చ ద్విభాగం జీవలోహకమ్। గన్ధకం తు త్రిభాగం చ తథా ఖల్వే వినిక్షిపేత్ (1) కన్యారసేన విమలా భృఙ్గరాజ కతిల్లకైః। భద్రేణ వజ్రవల్ల్యా చ ప్రత్యేకం మర్దయేద్దినమ్ (2) అథాతో వాలుకాయన్త్రే పచేద్యామచతుష్టయమ్। భాషితం పూజ్యపాదేన తారలోహ రసాయనమ్ (3) గుఞ్జాద్వయం ప్రదాతవ్యమనుపానవిశేషతః। రాజయక్ష్మాదికాన్ రోగాన్ శ్లేష్మపిత్తాధికాన్ జయేత్ (4) అజీర్ణం తిమిరం శ్వాసం కాసం చైవాతిదుస్తరమ్। పాణ్డుం శోఫంచ హృద్రోగం కమలాం కుమ్భకామలామ్। పక్షఘాతార్దితౌ హన్తి వాతవ్యాధి వినాశకమ్ (5)

అ॥ శు॥ పాదరసము 1 భా, వెండిభస్మ 1 భా, శు॥ ఉక్కురజను 2 భా, శు॥ గంధకము 3 భా, ఇట్లు వీనిని ఖల్వమందు వేసి కలుబంద, సాంబరేణి, గుంటగలగర, గలిజేరు, అల్లము, నల్లేరు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక్క దినము మర్దించి వాలుకాయంత్రమందు నాలుగుజాములు వండవలయును. ఈరజతలోహరసాయనము పూజ్యపాదునిచే చెప్పబడినది. రెండు గురివిందగింజలపరిమితిగ అనుపాన విశేషములతో నియ్యవలయును. రాజయక్ష్మ మొదలగు వ్యాధులను, శ్లేష్మమధికముగల వ్యాధులను, పిత్తమధికముగల వ్యాధులను, నశింపజేయును. అజీర్ణము, తిమిరవ్యాధి, శ్వాస, కాస, పాండువు, సంజు, హృద్రోగము, కామిర్లు, కుంభకామల, పక్షవాతము, అర్దితవాతము, వాతవ్యాధి, వీనిని నశింపజేయును.

## రజతలోహరసాయనము

సీ॥ రసమేకభాగంబు రజతజీవపులోహబలియుగ్మభాగముల్ బాగు
గాను ఖల్వంబులోనుంచి కలుబంద సాంబ్రాణిభృంగపర్ణ వశృంగవేర।
వహ్ని వజ్రవల్లిరసములతో నూరి వజ్రమూసనుంచి వాలుకమున। వండి
చల్లార్చి మున్వాడిన రసముల మఱలమర్దనజేసి మాషమాత్ర। పరిమితంబును
తగుననుపానమునను। సేవనముజేయుజనులకు చెలువుగాను। రోగముల
నెల్ల వేగమె రూపుమాపు। జగమునను తారలోహరసాయనంబు ॥

అ॥ శు॥ రసము 1 భా, వెండి 2 భా, శు॥ లోహరజను 2 భా, శు॥ గంధకము 2 భా, వీనిని ఖల్వమందుంచి కలుబంద, సాంబరేణి, గుంటగలగర, గలిజేరు, అల్లము, చిత్రమూలము, నల్లేరు, వీనియొక్క రసములతో మర్దించి వజ్రమూసయందుంచి వాలుకాయంత్రమందు వండి చల్లారిన పిదప మొదటి రసములతో మఱల మర్దింపవలయును. దీనిని మాషపరిమితిగ తగినయనుపానములతో సేవించినయెడల సమస్తమైన వ్యాధులు వెంటనే నశించును. ఇది రజతలోహరసాయనమని చెప్పబడును.

## రజతలోహరసాయనము (పుటయోగము)

శ్లో॥ రజతాద్ద్విగుణం తీక్ష్ణం ద్వయోస్తుల్యంతు పారదమ్। పారదాద్ద్వి
గుణం గన్ధం కుమార్యాతు విమర్దయేత్ (1) మూషామధ్యే వినిక్షిప్య బన్ధ
యేద్వస్త్రమృత్తికామ్। తతస్సూక్ష్మపుటే పాచ్యం స్వాఙ్గశీతల ముద్ధరేత్ (2)
పునర్నవాకుమార్యోశ్చ బ్రాహ్మీజమ్భీరయో స్తథా। వజ్రవల్ల్యారసేనాపి
పేషయేద్దివసత్రయమ్ (3) ఔషధం గులికాన్ కృత్వా ఛాయాయాం శోష
యే త్తతః మాషద్వయం ప్రదాప్య మనుపానవిశేషతః (4) కాసశ్వాసక్షయ

హార్దం మేహవ్యాధివినాశకమ్ పాణ్డురోగం నిహన్త్యాశు వాతఘ్నం కఫనాశకమ్ (5) రక్తపిత్తాతిసారఘ్నం ఛర్దిహిక్కావినాశకమ్ । సర్వశూలహరం చైవ సర్వజ్వరహరం పరమ్ (6) తత్తద్రోగానుపానేన సర్వరోగ నికృన్తకమ్, సఞ్జీవనీ సమం జ్ఞేయం తారలోహ రసాయనమ్ (7)

అ॥ వెండిభస్మ 1 భా, శు॥ ఉక్కులోహము 2 భా, శు॥ పాదరసము 3 భా, గంధకము 6 భా, ఇటుల వీనిని కలుబందరసముతో మర్దించి మూసలయందుంచి మట్టి పూసినగుడ్డలచే సంధిబంధనమును చేసి చిన్నపుటమును వేసి స్వాంగశీతలమైనపిదప తీసికొనవలయును. పిప్పిమ్రట, గలిజేరు, కలుబంద, సరస్వతీయాకు, నిమ్మకాయ, నల్లేరు, వీనియొక్క రసములతో మూడురోజులు మర్దించి కప్పెలను చేసి నీడను ఎండించవలయును. పిప్పిమ్రట రెండు మాషముల పరిమితిగ అనుపాన విశేషముతో నియ్యవలయును. కాస, శ్వాస, క్షయ, మేహవ్యాధి, పాండురోగము, వాతవ్యాధి, కఫవ్యాధి, రక్తపిత్తము, అతిసారము, వాంతి, ఎక్కిళ్ళు, శూల, జ్వరము, ఈ వ్యాధులు హరించును. ఆయారోగములకు తగిన యనుపానములతో నిచ్చినయెడల సమస్తరోగములను నశింపచేయును. ఈరజతలోహరసాయనమును సంజీవనితో సమానమైనదానినిగ తెలిసికొనవలెను.

## తా ర (ర జ త) లో హ ర సా య న ము

శ్లో॥ అయోరజస్త్రిభాగం చ త్రిభాగం సూతకం తథా । షడ్భాగం గన్ధకం చైవ తారమభ్రకసంజ్ఞకమ్ (1) కన్యారసేన సంమర్ద్యం సాతలాయారసేన చ । నిర్గుణ్డ్యాభృఙ్గరాజస్య శోఫఘ్న్యాశ్చార్ద్రకస్య చ (2) చిత్రభానోర్వజ్రవల్ల్యా రసైరష్టభిరేవహి । మర్దయేదష్టరాత్రం తు వాలుకాయన్త్రకే పచేత్ (3) తారలోహరసో నామ విష్ణునా నిర్మితః పురా । పాణ్డుక్షయశ్వాసకాసమజీర్ణారోచకం హరేత్ (4) శోఫం జీర్ణజ్వరం హన్తి శూలఘ్నః కఫనాశకః । అనుపానవిశేషేణ సర్వరోగహరః పరమ్ (5)

అ॥ శు॥ ఉక్కురజను 3 భా, శు॥ పాదరసము 3 భా, శు॥ గంధకము 6 భా, వెండిభస్మ 1 భా, ఇట్లు వీనిని గ్రహించి కలుబంద, సాంబరేణు, వావిలి, గుంటగలగర, గలిజేరు, అల్లము, చిత్రమూలము, నల్లేరు, ఈ యెనిమిదివస్తువులయొక్క రసములచే ఎనిమిదిదినములు మర్దించి వాలుకాయంత్రమందు వండవలయును. ఇది తారలోహరసాయనమని చెప్పబడును. పూర్వకాలమందు విష్ణువుచే చెప్పబడినది. పాండువు,

క్షయ, శ్వాస, కాస, అజీర్ణము, ఆరోచకము, నంజు, జీర్ణజ్వరము, శూల, కఫవ్యాధి, ఈ వ్యాధులను హరించును, అనుపానవిశేషముతో సమస్తవ్యాధులను హరించును.

## రజతలోహ రసాయనము (పుటయోగము)

సీ॥ ఖడ్గరాపొడి తులము గంధకంబును తులము రజతచూర్ణము తులము రసము తులము। ఖల్వంబులోనుంచి కలగరరసమున సాంబ్రాణిరసమున సరసముగను। వజ్రవల్లిరసము వహ్ని పునర్నవ కలుబందయల్లము కాకరాకు। ఇన్నిరసంబుల విడవకుండగ జాల రెండురోజులునూరి రేయిబగలు। అది బిళ్ళవలెజేసి యార్చి ప్రమిదనుబెట్టి ప్రమిదగప్పియు మన్ను ప్రబలరాచి। గజముపొడవున పుటము ఘనముగావేసియు శీతలంబునతీసి శీఘ్రముగను ముందురసములతో నూరి ముదముమీర। అనుదినంబును నౌషధమడ్డిగెత్తు। అనుభవించిన జనులకు నమృతమగును। సర్వవ్యాధుల మాన్పును జగతిలోన। రజత లోహరసాయనంబంద్రు దీని॥

అ॥ శు॥ ఖడ్గరాపొడి 1తు, శు॥ గంధకము 1తు, శు॥ వెండిరాపొడి 1 తు. శు॥ రసము 1 తు, వీనిని ఖల్వమందుంచి గుంటగలగర, సాంబరేణు, నల్లేరు, చిత్రమూలము, గలిజేరు, కలుబంద, అల్లము, కాకరాకు, వీనియొక్క రసములతో రెండు రోజులు రాత్రింబగళ్లు విడువకుండనూరి బిళ్ళలుచేసి ఆరనిచ్చి ప్రమిదలోబెట్టి పైన ప్రమిదమూసి మన్ను బాగుగపూసి గజముపొడవున పుటము బాగుగపెట్టి చల్లారిన పిదప తీసి పూర్వపురసములతో నూరవలయును. దీనిని అడ్డిగెత్తు చొప్పున పుచ్చుకొనిన యెడల అమృతతుల్యమగును. సమస్తవ్యాధులను నశింపజేయును. రజతలోహరసాయనమని చెప్పబడును.

## జ్వరగజాంకుశము

శ్లో॥ రసామ్లసారగన్ధోచదన్తీ బీజం సటఙ్కణమ్। కజ్జలీవత్సం ప్రమర్ధ్యం ముద్గమాత్రం ప్రమాణతః (1) చణమాత్రం చ వా దేయో నాగవల్లిదలాన్వితః। అయం సర్వజ్వరాన్ హన్తి సన్తతం తరుణం తథా (2) పథ్యం చైవ ప్రదాతవ్యం దధిక్షీరం చ శర్కరామ్। పూజ్యపాదేనచ ప్రోక్తశ్చాయం జ్వరగజాఙ్కుశః (3)

అ॥ శు॥ పాదరసము, శు॥ ఆమరశిలగంధకము, శు॥ నేపాళపు విత్తులు, శు॥ వెలిగారము, వీనిని కొట్టుకవలెనూరి పెసరగింజపరిమితిగ గాని సెనగగింజ పరిమితిగ గాని తమలపాకులతో కూడ నియ్యవలయును. ఇది సమస్తజ్వరములను, సంతతజ్వరమును, తరుణజ్వరమును హరించును. పెరుగును, పాలను, పంచదారను, పథ్యములనుగ నియ్యవలయును. ఈ జ్వరగజాంకుశము పూజ్యపాదునిచే చెప్పబడినది.

## సూచికాముఖరసము

శ్లో॥ రుచకం చాభ్రగన్ధౌ చ నేపాలం చ మనశ్శిలామ్ । ఖర్పరం తుత్థకం చైవ తాలకం టఙ్కణం తథా (1) దరదం సైన్ధవం చైవ సర్వతుల్యం తు పారదమ్ । మధుపుష్పస్యతైలేన సంమర్ద్యం దివసత్రయమ్ (2) డోలాయన్త్రే పచేద్యామం తన్నీత్వా ఖల్వమధ్యకే । కృష్ణసర్పస్య పిత్తేన సంభావ్యం దివసద్వయమ్ । బ్రహ్మద్వారే క్షురేణైవ ఛిత్వా గుఞ్జాం విమర్దయేత్ । జమ్బీరనీరే యుఞ్జీత సంనిపాతాన్నిహన్తి చ (4) హిక్కాం మూర్ఛాం చ కమ్పం చ మూకత్వం బధిరత్వకమ్ । కాసాంస్తథోర్ధ్వశ్వాసంచ మధువాతం నికృన్తయేత్ । సూచికాముఖనామాఽయం రసః ప్రాణప్రదాయకః (5)

అ॥ సౌవర్చలవణము, అభ్రకభస్మ, శు॥ గంధకము, శు॥ నేపాళపు విత్తులు, శు॥ మణిశిల, శు॥ కపరి, శు॥ మైలతుత్థము, శు॥ తాళకము, శు॥ వెలిగారము, శు॥ ఇంగిలీకము, సైంధవలవణము, వీనిని సమభాగములుగను వీనియన్నిటితో సమానమగు శు॥ పాదరసమును గ్రహించి ఇప్పనూనెతో మూడు రోజులు మర్దించి డోలాయంత్రమందొకజాము వండవలయును. పిదప తీసి ఖల్వమునుంచి నల్లత్రాచుపాము యొక్క పిత్తముచే రెండురోజులు భావన చేయవలెను. బ్రహ్మద్వారమునందు కత్తిచే గీరి యీ యౌషధమును గురివిందగింజపరిమితిగ నిమ్మకాయ రసముతో కలిపి యాగాయమునందు వేసి వ్రేలితో రుద్దినయెడల సంనిపాతములు, ఎక్కిళ్లు, మూర్ఛ, వణుకు, మూగతనము, చెముడు, దగ్గులు, ఊర్ధ్వశ్వాస, మధువాతము, వీనిని నశింపజేయును. సూచికా ముఖరసమనెడి యీ యౌషధము ప్రాణముల నిచ్చును.

## పంచవక్త్రరసము

శ్లో॥ శుద్ధసూతం విషం గన్ధం మరిచం టఙ్కణం కణామ్ । మర్దయేద్ధూర్తజద్రావైర్దినమేకం తు శోషయేత్ (1) పఞ్చవక్త్రరసోనామ ద్విగుఞ్జః

సంనిపాతజత్ । అర్కమూలకషాయంచ త్ర్యూషణం చానుపాయయేత్ (2) యుక్తం దధ్యోదనం పథ్యం జలయోగం చ కారయేత్ । రసేనానేనశామ్యన్తి సక్షౌద్రేణ కఫాదయః (3) మధ్వార్ద్రకరసం చానుపిబేదగ్ని వివృద్ధయే । యథేష్టఘృతమాంసాశీ శక్తోభవతి పావకః (4).

అ॥ శు॥ పాదరసము, శు॥ నాభి, శు॥ గంధకము, మిరియాలు, శు॥ వెలిగారము, పిప్పళ్లు, వీనిని సమభాగములనుగ గ్రహించి ఉమ్మెత్తరసముతో నొకదినము మర్దించి ఎండించవలయును. పంచవక్త్రరసమని చెప్పబడును. రెండుగురివిందగింజలపరిమితిగ నిచ్చినయెడల సంనిపాతములను నశింపచేయును. జిల్లేడువేళ్ళయొక్కయు, త్రికటుకములయొక్కయు, కషాయమును అనుపానముగ నివ్వవలయును. పెరుగుతో కూడిన యన్నమును పెట్టవలయును. స్నానమును చేయింపవలయును. దీనిని తేనెతోకూడ నిచ్చినయెడల కఫరోగములు మొదలగునవి నశించును. ఘృతమును, మాంసమును ఇష్టానుసారముగ భుజించి దీనిని సేవించి వెంటనే తేనెను, అల్లపురసమును త్రాగిన యెడల జఠరాగ్ని వృద్ధినిపొంది ఘృతమాంసములను వెంటనే జీర్ణింపజేయును.

## చండభానురసము

శ్లో॥ సూతం త్రైగుణ్యగన్ధం పరిమితమమృతం తీక్ష్ణకం భానునేత్రం। హరితాళం తచ్చతుష్కం గగనమథయుగం మారిచం సర్వతుల్యమ్ । ఏతం దద్యాన్నిహన్తి జ్వరవనదహనస్తామసాహేః ఖగేన్ద్రః ॥ కాసశ్వాసాపహన్తా క్షయతరుదహనః పాణ్డురోగాపహన్తా (1) వాతవ్యాధీభసింహో హ్యుదర జలనిధేశ్శోషకో బాడబాగ్నిః । నష్టాగ్నేర్దీప కస్స్యాజ్జఠరమలమహాక్లేశ హృద్రోగహారీ । శూలవ్యాధ్యన్ధకారప్రశమన తపనః కుష్ఠరోగాపహన్తా । నామ్నాఽయం చణ్డభానుస్సకలగదహారో భాషితః పూజ్యపాదైః (2)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 3 భా, శు॥ నాభి 3 భా, లోహభస్మ 3 భా, తామ్రభస్మ 3 భా, శు॥ తాలకము 4 భా, అభ్రకభస్మ 2 భా, మిరియాలు 19 భా, వీనిని నూరి యివ్వవలయును. జ్వరమనెడివనమునకు కారుచిచ్చువంటిదగును. సంనిపాతమనెడిపామునకు గరుత్మంతునివంటిదగును. దగ్గును, వగర్పును, హరించును. క్షయయనెడివృక్షమును దహింపచేయును. పాండురోగను హరించును, వాతవ్యాధులనెడిగజములకు సింహమువంటిదగును. ఉదరరోగమనెడిసముద్రమునకు శోషింపజేసెడి బాడబానలమువంటిదగును. నష్టమైన జాఠరాగ్నిని ప్రజ్వలింపచేయును. జాఠరాశ్రితమలజనితవ్యాధులను, హృద్రోగములను, హరించును. శూలవ్యాధియనెడి

చీకటికి సూర్యునివంటిదగును. కష్టరోగములను హరించును. చండభానురసమని చెప్పబడును. సమస్త వ్యాధులను హరించును. పూజ్యపాదునిచే చెప్పబడినది.

## సంనిపాతభైరవరసము

శ్లో॥ తాలకం గన్ధకం సూతం వత్సనాభం త్రిభిస్సమమ్ । శిలాం చ టఙ్కణం చైవ సర్వైస్తుల్యం తు హిఙ్గులమ్ (1) సంమర్ద్యం చిత్ర జమ్భాభ్యార్ద్రికేణ దినత్రయమ్ । అనుపానవిశేషేణ సంనిపాతకభైరవః (2) త్రిదోషజాతిసారం చ కఫం పాణ్డుమరోచకమ్ । కుక్షిశూలముదావర్తం సంనిపాతం నికృన్తయేత్ (3)

అ॥ శు॥ తాళకము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ పాదరసము 1 భా, శు॥ నాభి 3 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ వెలిగారము 1 భా, శు॥ ఇంగిలీకము 8 భా, వీనిని చిత్రమూలము, నిమ్మకాయ, అల్లము, వీనియొక్క రసములచే మూడురోజులు మర్దించవలయును. ఈసంనిపాతభైరవరసమును అనుపానవిశేషముతో నిచ్చినయెడల మూడుదోషముల వలన జనించిన యతిసారమును, కఫవ్యాధిని, పాండువును, అరోచకమును, ఉదరశూలను, ఉదావర్తమును, సంనిపాతమును, నశింపజేయును.

## వైష్ణవరసము (వైష్ణవీరసము)

శ్లో॥ హిఙ్గులం వత్సనాభం చ చక్రాఙ్గీం కటుకత్రయమ్ । చిత్రమూల కషాయేణ సమభాగంవిమర్దయేత్ (1) దోలాయన్త్రేయామమాత్రం పచేన్నిష్పాదితో భవేత్ । ఆర్ద్రికస్యానుపానేన మాషమాత్రం జ్వరాపహః (2) ద్వన్ద్వజ్వరం సంనిపాతం పురాణం విషమజ్వరమ్ । నాశయేదఖిలాన్ రోగాన్నామ్నాఽయం వైష్ణవోరసః (3)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ నాభి, కటుకరోహిణి, త్రికటుకములు, వీనిని సమభాగములుగ గ్రహించి చిత్రమూలకషాయముతో నూరి డోలాయంత్రమందు నొకజాము వండవలయును. తయారగును. దీనిని రెండుమాషముల పరిమితిగల అల్లపు రసముయొక్క అనుపానముతో నిచ్చినయెడల జ్వరములు, ద్వంద్వజ్వరము, సంనిపాతజ్వరము, పురాణజ్వరము, విషమజ్వరము, అనువ్యాధులను నశింపచేయును. సమస్తమైన వ్యాధులను నశింపజేయును. ఇది వైష్ణవరసమని చెప్పబడును.

## సూచికాభరణరసము

శ్లో॥ విషం పలమితం సూతం శాణికం చూర్ణయేద్ద్వయమ్ । తచ్చూర్ణం సమ్పుటే క్షిప్త్వా కాచలిప్తశరావయోః (1) ముద్రాం కృత్వా చ

సంశోష్య తతశ్చుల్ల్యాం నివేశయేత్ । వహ్నింశనైశ్శనైః కుర్యాత్ప్రహరద్వయ మాత్రకమ్ (2) తతః ఉద్ఘాట్య తన్ముద్రాముపరిస్థశరావకే । సంలగ్నో యోభవేత్సూతస్తం గృహ్ణీయాచ్ఛనైశ్శనైః (3) వాయుస్పర్శో యథా న స్యాత్తథాకూప్యాం నివేశయేత్ । యావత్సూచ్యాముఖేలగ్నః కూప్యానిర్యేతి చాగదః (4) తావన్మాత్రోరసోదేయో మూర్ఛాయాం సంనిపాతినః । క్షరేణ ప్రచ్ఛితే మూర్ధ్ని తత్రాఙ్గుల్యా చ ఘర్షయేత్ (5) రక్తభేషజసమ్పర్కాన్మూర్ఛితోఽపిహిజీవతి । తథైవ సర్పదష్టస్తు మృతావస్థోఽపిజీవతి । యది తాపో భవేత్తస్య మధురం చైవ దీయతామ్ (6)

అ॥ శు॥ నాభి 1 పలము, శు॥ పాదరసము 1 శాణము, ఈ రెండింటిని చూర్ణము చేసి గాజుపూసినమూకళ్ళయందుంచి సంధిబంధనమును చేసి ఎండించి పొయ్యిమీద పెట్టి రెండుజాములకాలము మెల్లమెల్లగ మంటను వేయవలయును. పిమ్మట సంధి బంధనమును తీసి పైమూకటియందు పట్టుకొనియున్న పాదరసమును మెల్లమెల్లగ తీసి గాలి తగులకుండ సీసాయందుంచవలయును. సంనిపాతరోగికి మూర్ఛకలిగినప్పుడు (స్మారకము తప్పినప్పుడు) శిరస్సునందు కత్తితో గీరి సూదికొనకు వచ్చినంత యౌషధమును యాగాయమునందు వేసి వ్రేలితో రుద్దవలయును. ఔషధము రక్తముతో కలియగనే స్మారకములేనివాడు కూడ జీవించును. ఇటుల చేసినచో పాముచే కరవబడి చచ్చుటకు సిద్ధముగనున్నవాడు కూడ జీవించును. ఈ యౌషధప్రయోగముచే రోగికి తాపము కలిగినయెడల మధురపదార్థముల నీయవలయును.

## వాతవిధ్వంసిరసము

శ్లో॥ రసం గన్ధకం నాగవఙ్గే చ లోహం తథా తామ్రజం వ్యోమనిశ్చన్ద్రికంచ । కణాం టఙ్కణం చోషణం నాగరం వై పృథగ్భాగ మేకం క్షిపేత్ ఖల్వమధ్యే (1) తతో వత్సనాభం చతుస్సార్ధభాగం దృఢం మర్దయేద్వ్యోషజైశ్చ త్రివారమ్ । వరాచిత్రకైర్మార్కవైః కుష్ఠజాద్భిః పృథగ్భావయేత్సిన్ధువారార్ద్రివాసైః (2) తథా మోహినీజమ్భనీరైః పృథగ్వైభావయేద్వాతవిధ్వంసకోఽయం రసః సమీరే చ శూలే తథా శ్లేష్మరోగే తథా సంనిపాతే చ మూకే (3) అపస్మారప్లీహోదరే కుష్ఠరోగేఽగ్నిమాన్ద్యే తథా శీతపిత్తే చ దద్యాత్ । స్త్రియస్సూతికావాతరోగే తథైవ ద్విగుఞ్జం ప్రదద్యాదిమం సూతరాజమ్ (4)

అ॥ శు॥ పాదరసము, శు॥ గంధకము, సీసభస్మ, వంగభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, అభ్రకభస్మ, పిప్పళ్ళు, శు॥ వెలిగారము, మిరియాలు, శుంఠి, వీనిని ప్రత్యేకముగ నొక్కొక్క భాగముగను శు॥ నాభిని నాలుగున్నరభాగముగను గ్రహించి ఖల్వమందుంచి త్రికటుకములు, త్రిఫలములు, చిత్రమూలము, గుంటగలగర, చెంగల్వకోష్టు, వావిలి, అల్లము, అడ్డరసము, గంజాయాకు, నిమ్మకాయ, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులు చొప్పున దృఢమగు మర్దనను, భావనను, చేయవలయును. ఇది వాతవిధ్వంసకరసమని చెప్పబడును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ వాతరోగము, శూల, శ్లేష్మరోగము, సన్నిపాతము, మూగ, అపస్మారము, ప్లీహోదరము, కుష్ఠరోగము, అగ్నిమాంద్యము, శీతపిత్తము, ఈ వ్యాధులయందును స్త్రీలకు గలుగు సూతికావాతరోగమునందు నియ్యవలయును.

## బృహద్వాతవిధ్వంసిరసము

శ్లో॥ సూతాభ్రతీక్ష్ణకాన్తాని తామ్రతాలకగన్ధకాన్ । స్వర్ణంశుణ్ఠీం బలాం ధాన్యం కట్ఫలం చాభయాం విషమ్ (1) పథ్యాం శృఙ్గీం పిప్పలీం చ మరిచం టఙ్కణం తథా । తుల్యం ఖల్వేదినం మర్ద్యం ముణ్డీనిర్గుణ్డిజద్రవైః (2) ద్విగుఞ్జాం వటికాం ఖాదేత్సర్వ వాతప్రశాన్తయే సాధ్యాఽసాధ్యం నిహన్త్యాశు వాతవిధ్వంసకో రసః (3)

అ॥ శు॥ పాదరసము, అభ్రకభస్మ, ఖడ్గలోహభస్మ, కాంతలోహభస్మ, తామ్రభస్మ, శు॥ తాలకము, శు॥ గంధకము, సువర్ణభస్మ, శుంఠి, ముత్తవపులగము, ధనియాలు, పెగ్గుమ్ముడు, కరక్కాయ, శు॥ నాభి, ఉసిరికపప్పు, కర్కాటకశృంగి, పిప్పళ్ళు, మిరియాలు, శు॥ వెలిగారము, వీనిని సమభాగములనుగ గ్రహించి ఖల్వమందువేసి బోడసరరసముతోడను వావిలిరసముతోడను ఒకరోజు మర్దించవలయును. రెండు గురివిందగింజల పరిమితిగల మాత్రను సేవించినయెడల సమస్తములగు వాతరోగములు శమించును. ఈ వాతవిధ్వంసకరసము, సాధ్యములును, అసాధ్యములును నైన సమస్త వ్యాధులను నశింపచేయును.

## మహావాతవిధ్వంసిరసము

శ్లో॥ సూతతారకాభ్ర గన్ధతామ్రకాన్తనాగవఙ్గతాలకం శిలా । కృష్ణలోహమాక్షితీక్ష్ణశుక్తికా వరాటికా చ శఙ్ఖకం తథా (1) వీరవృక్ష వజ్రవహ్ని సూర్యపుష్పికారసేన మర్దితంతథా । మాషమాత్రకంచకాచ కుమ్భవాలుకాఖ్య యన్త్రపాచితం తథా (2) దినత్రయం పాచయిత్వా గృహిత్వా

సాఙ్గశీతలం । తత్తుల్యం వత్సనాభం చ మర్దయేచ్చ జయారసైః (3) సిన్ధువారార్కభృఙ్గాణాం వారిణా నిమ్బవక్త్రియోః॥ మర్దయేత్త్రిదినంచైవ త్వౌషధం ముద్గమాత్రకమ్ (4) హన్తి వాతాన్సూతికాదీన్సంనిపాతాంస్త్రయోదశ । కణ్ఠరోగాన్నాశయేచ్చ సర్వరోగ వినాశకః । భాషితశ్చాశ్వినేయాభ్యాం వాతవిధ్వంసి నామకః (5)

అ॥ శు॥ రసము, రజతభస్మ, అభ్రకభస్మ, శు॥ గంధకము, తామ్రభస్మ, కాంతభస్మ, సీసభస్మ, వంగభస్మ, శు॥ తాళకము, శు॥ మణిశిల, మాండూరభస్మ, మాక్షికభస్మ, ఖడ్గలోహభస్మ, ముత్యపుచిప్పలభస్మ, గవ్వలభస్మ, శంఖభస్మ, వీనిని వెణుతురవేళ్ళు, నల్లేరు, చిత్రమూలము, జిల్లేడు, వీనియొక్క రసములతో మర్దించి మాషప్రమాణము మాత్రలుచేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడు రోజులు వండి సాంగశీతలమైన పిదప దీసి యామందుకు సమానమగు శు॥ నాభిని కలిపి తెక్కలి, వావిలి, జిల్లేడు, గుంటగలగర, వేప, నేలమున్గ, వీనియొక్క రసములతో మూడురోజులు మర్దించవలయును. దీనిని పెసరగింజపరిమితిగ సేవించినయెడల సూతికావాతము, మొదలగు వాతములు, పదుమూడు సంనిపాతములు, కంఠవ్యాధులు, సమస్త వ్యాధులు నశించును. అశ్వినీదేవతలచే చెప్పబడినది. వాత విధ్వంసి యని చెప్పబడును.

## మహావాతవిధ్వంసిరసము (గ్రన్థాన్తరే)

శ్లో॥ వజ్రం హేమాభ్రకం తామ్రంకాన్తం రజతలోహకే । మృతం భాగోత్తరంసర్వం మాక్షికం గన్ధకం శిలామ్ (1) తాలకంచ ప్రవాలంచ ప్రత్యేకం చైకభాగకమ్ । సర్వం ఖల్వేచ సంమర్ద్యం పాదాంశం రసభస్మచ (2) కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాయన్త్రకే పచేత్ । సాఙ్గశీతలముద్ధృత్య వత్సనాభాష్టభాగకమ్ (3) స్నుహ్యర్కక్షీరసర్వాక్షీ భృఙ్గరాజకురణ్డకైః । ప్రత్యేకం భావయేత్ ఖల్వే భావయేద్దివసద్వయమ్ (4) విషముష్టికషాయేణ మాతులుఙ్గరసేనచ । తద్వజ్జమ్బీరజద్రావైరార్ద్రకస్య ద్రవేణ చ (5) అయం సిద్ధరసస్సేవ్యో మహావాతవినాశకః (6) త్రయోదశసంనిపాతాన్ సర్వవాతగదానపి । సూతికారోగజాలం చ నాశయేన్నాత్ర సంశయః (7)

అ॥ వజ్రభస్మ, 1 భా, సువర్ణభస్మ 2 భా, అభ్రకభస్మ 3 భా, తామ్రభస్మ 4 భా, కాంతలోహభస్మ 5 భా, రజతభస్మ 6 భా, ఖడ్గలోహభస్మ 7 భా, మాక్షికభస్మ 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ తాళకము 1 భా.

పగడభస్మ 1 భా, రసభస్మ $\frac{1}{4}$ భా, ఇటుల వీనిని ఖల్వమందుంచి నూరి కాచకుప్పె యందుంచి వాలుకాయంత్రమందు వండి స్వాంగశీతలమైన పిదప తీసి 8 భాగముల శు॥ నాభిని కలిపి జెముడుపాలు, జిల్లేడుపాలు, సర్పాక్షీరసము, గుంటగలరరసము,

గోరింటరసము, విషముష్టిగింజల కషాయము, మాదీఫలరసము, నిమ్మకాయరసము, అల్లపురసము, అనెడివానిచే రెండేసి రోజులు భావనను చేయవలెను. ఈ మహావాత విధ్వంసనరసమును సేవించినయెడల పదమూడువిధములగు సన్నిపాతములను, సమస్తములగు వాతరోగములను, సూతికారోగములను, నిశ్చయముగా నశింపచేయును.

## సువర్ణవాతవిధ్వంసిరసము

సీ॥ కాఞ్చనభస్మ మొక్కటితామ్రభస్మంబు రెండుపాళ్ళను నాభి మూడుపాళ్ళు । రసగంధకంబులు రహి మూడు వైక్రాన్తభస్మ మొక్కటి రెండు వఙ్గభస్మ । నాగభస్మము రెండునభ్రకంబును మూడు పరిశుద్ధ టఙ్కణ భస్మనాల్గు । పగడభస్మంబును బలుతీక్ష్ణలోహంబు నొక్కొకపాల్ గూర్చి నిక్కమైన । కాన్త భస్మంబైదుగా గూర్చి వావిలిచిత్రమూలము భానుపత్ర రసము । లందు నాల్గుదినంబులందముగానూరి కాచకుప్పెను వాలుకమున వండి । తీసి గోవులచేదు భాసురమౌచేపచేదులు ఖల్వానచేర్చికల్పి । నూతులు జీరసాన మర్దనంబైదురోజులు సల్పి । మరియు కస్తూరికల్పి । పూటకు చిన్నంబుపాటి గ్రోలిన వాతషణ్ణతల్ సన్నులసమయజేయు ॥ మన్దాగ్నులను దుష్టమారుతంబుల దోషచయములనెల్లను సమయజేయు । పక్షఘాతామయంబుల బారద్రోలు । వాతశోఫలనెల్లను వడి హరించు । దాహకరపాద దాహముల్ దగ్ధపరచు । దరణి సౌవర్ణ వాతవిధ్వంసి యనగ ॥

అ॥ బంగారుభస్మ 1 భా, తామ్రభస్మ 2 భా, శు॥ నాభి 3 భా, శు॥ పాదరసము 3 భా, శు॥ గంధకము 3 భా, వైక్రాంతభస్మ 1 భా, వంగభస్మ 2 భా, సీసభస్మ 2 భా, అభ్రకభస్మ 3 భా, టంకణభస్మ 4 భా, పగడభస్మ 1 భా, ఖడ్గలోహభస్మ 1 భా, కాంతభస్మ 5 భా, వీనిని వావిలి, చిత్రమూలము, జిల్లేడాకులు, వీని యొక్క రసములతో నాలుగురోజులు బాగుగ మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి తీసి ఖల్వమందుంచి గోవులచేదును, చేపలచేదును, కలిపి మాదీఫలరసముతో నైదురోజులు మర్దించి కస్తూరిని కలపవలయును. దీనిని పూటకు చిన్నము వొప్పున పుచ్చుకొనిన యెడల వాతములు, సంనిపాతములు, అగ్నిమాంద్యములు, దుష్టవాతములు దోషసముదాయములు, పక్షవాతములు, వాతనంజులు, తాపము,

పాదములయందును చేతులయందును మంట ఇవి హరించును. ఇది సువర్ణవాతవిధ్వంసి యని చెప్పబడును.

## జ్వరమురారిరసము

శ్లో॥ త్రిస్సప్తజమ్భరసభావితఖర్పరస్య చూర్ణం విమర్ద్య నవనీత సమానయుక్తమ్ । వల్లద్వయం హరతి శర్కరయానుపానం సద్యోజ్వరం జ్వరమురారిసమాఖ్యమేతత్ (1)

అ॥ నిమ్మకాయరసముతో 21 సారులు భావనచేయబడిన కఖరియొక్క చూర్ణమును సమానమగువెన్నతో మర్దించి రెండువల్లముల పరిమితిగ పంచదారయనుపానముతో పుచ్చుకొనినచో జ్వరము వెంటనే హరించును. ఇది జ్వరమురారియనెడి పేరు కలది.

## జ్వరగజకేసరిరసము

శ్లో॥ జలదదరదయుక్తం శుద్ధసూతం సగన్ధం ప్రహరమధుసుపిష్టం వల్లయుగ్మం చ దద్యాత్ । జ్వరగజహరిసంజ్ఞః శృఙ్గవేరోదకేన ప్రథమ జ్వరిత దాహే క్షీరభక్తం చ భోజ్యమ్ (1)

అ॥ తుంగగడ్డలు, శు॥ ఇంగిలీకము, శు॥ రసము, శు॥ గంధకము, వీనిని తేనెతో నొకజాము బాగుగ నూరవలయును. దీనిని రెండువల్లముల పరిమితిగ, అల్లపు రసముతో జ్వరము వచ్చిన వెంటనే కలిగిన తాపమునందియ్యవలయును పాలతోకూడిన అన్నమును పెట్టవలయును. ఇది జ్వరగజకేసరి యనబడును.

## పైత్యాంతకరసము

వ॥ అల్లము 6 భా, జీలకర్ర 6 భా, సైంధవలవణము 1 భా, శు॥ నాభి 1 భా, రససిందూరము 2 భా, శు॥ ఇంగిలీకము 3 భా, వీనిని నిమ్మకాయలరసముతో మర్దించవలయును. దీనిని మాషపరిమితిగ సేవించినయెడల సమస్తమైన పైత్యవ్యాధులు, అజీర్ణము, అరోచకము, అగ్నిమాంద్యము, ఒడలుతిరుగుట, కడుపులో మంట, నోటిపూత, ఎక్కిళ్ళు, మొదలగునవి నశించును.

## పైత్యాంతకరసము (ప్రకారాంతరము)

వ॥ అల్లము 1 భా, జీలకర్ర 1 భా, ఉసిరికపప్పు 1 భా, సైంధవలవణము 1 భా, రససిందూరము 1 భా, వీనిని నిమ్మకాయలరసముతో 2 నెలలు మర్దించి

సేవించిన యెడల వాంతులు, అరుచి, ఆమ్లపిత్తము, ఎక్కిళ్ళు, కడుపులో మంట, వికారముగ నుండుట, తల తిరుగుట, నోట నీరూరుట, మొదలగు సమస్త పైత్య వ్యాధులు నశించును.

## పై త్యాం త క ర స ము

వ॥ ధనియాలు 3 భా, ఉసిరికపప్పు 3 భా, నాగకేసరములు 3 భా, జీలకర్ర 3 భా, శుంఠి 3 భా, సైంధవలవణము 3 భా, శు॥ ఇంగిలీకము 3 భా, వీనిని అల్లపు రసముతోడను నిమ్మకాయలరసముతోడను 2 నెలలు మర్దించి గురువిందగింజ పరిమితిగ సేవించిన యెడల ఆమ్లపిత్తము, నోట నీరూరుట, అరోచకము, కడుపులో మంట, ఒడలు తిరుగుట, మొదలగు సమస్త పైత్యవికారములు నశించును.

## హే మ ర జ త ర సా య న ము

శ్లో॥ హేమ తారం లోహసూతా సమభాగం తు కారయేత్ । గన్ధకం తు చతుర్భాగం ఖల్వమధ్యే వినిక్షిపేత్ (1) వజ్రవల్లీరసేనైవ వహ్నిమూలరసేన చ । దినైకం మర్దయేచ్చైవ మూషామధ్యే వినిక్షిపేత్ (2) మూషాముఖం బన్ధయిత్వా మృదా సంలేపయేద్బహిః । క్షిప్త్వా గజపుటే పాచ్యం స్వాఙ్గ శీతలముద్ధరేత్ (3) ద్విగుఞ్జం భక్షయేన్నిత్యం సర్వరోగాన్వినాశయేత్ । శుక్లస్రావం తథా కాసం ప్రమేహానపి దుస్తరాన్ (4) క్షయం పాణ్డుమజీర్ణం చ ప్రదరౌ శ్వేతరక్తకౌ । దౌర్బల్యం చ తథా వృష్యో రసాయన వరస్తథా । హేమతారరసో నామ సీతానాథప్రకల్పితః ॥

అ॥ సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, లోహభస్మ 1 భా, శు॥ రసము 1 భా, శు॥ గంధకము 4 భా, వీనిని ఖల్వమందుంచి వజ్రవల్లీరసముతోడను, చిత్రమూలరసము తోడను, ఒకరోజు మర్దించి మూసయందుంచి మూసయొక్క ముఖమును కప్పి పైన మట్టిని పూసి గజపుటమును వేసి స్వాంగశీతలమైనపిదప తీయవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ పుచ్చుకొనిన యెడల సమస్త వ్యాధులను నశింపజేయును. మరియు శుక్లస్రావము, దగ్గు, ప్రమేహములు, క్షయ, పాండువు, అజీర్ణము, శ్వేత ప్రదరము, రక్తప్రదరము, దౌర్బల్యము, వీనిని నశింపజేయును. వీర్యవృద్ధిని చేయును. రసాయనములలో శ్రేష్ఠమైనది. హేమతారరస (హేమరజతరసాయన) మని ప్రసిద్ధమైనది. సీతానాథునిచే చెప్పబడినది.

## వాతకుఠారరసము

శ్లో॥ దరదం చ శిలాగన్ధౌ సమభాగం తు కారయేత్ । రసేన్ద్రిం చ తథా కుర్యాజ్జమ్బునీరేణ మర్దయేత్ (1) ఛాయాశుష్కం తు తం కృత్వా లోహపాత్రే తు ద్రావయేత్ । గుఞ్జాభాన్ వటకాన్ కృత్వా వాతరోగేషు యోజయేత్ (2) అనుపానవిశేషణ సర్వశ్లేష్మగదేషు చ । కాసే శ్వాసే తథా కుష్ఠే నామ్నా వాతకుఠారకః (3)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ మణిశిల, శు॥ గంధకము, శు॥ పాదరసము, వీనిని సమభాగములనుగ గ్రహించి నిమ్మకాయరసముతో నూరి నీడను ఎండించి ఇనుపపాత్ర యందు కరగించి గురివిందగింజపరిమితిగ మాత్రలను చేసి వాతవ్యాధులు, శ్లేష్మ వ్యాధులు, కాస, శ్వాస, కుష్ఠము, వీనియందు అనుపానవిశేషములతో నియ్య వలయును. వాతకుఠారమని చెప్పబడును.

## వాతగజాంకుశరసము

శ్లో॥ అష్టభాగం రసస్యాపి విషతిన్దో స్తథైవచ । గన్ధకస్య త్రిభాగం చ కటుత్రయఫలత్రయే (1) గుఞ్జామాత్రా వటీః కుర్యాద్వాతాశీతివినాశకః । ఊరు స్తమ్భం నిహన్త్యాశు నామ్నా వాతగజాఙ్కుశః ॥

అ॥ శు॥ పాదరసము 8 భా, శు॥ విషముష్టిగింజలు 8 భా, శు॥ గంధకము 3 భా, త్రికటుకములు 3 భా, త్రిఫలములు 3 భా, వీనిని గురువిందగింజపరిమితిగల మాత్రలను చేసి సేవించినయెడల ఎనుబదివాతములను నశింపజేయును. ఊరుస్తంభ మును వెంటనే నశింపజేయును. వాతగజాంకుశమని చెప్పబడును.

## సింహప్రతీపాలనము

శ్లో॥ సూతం గన్ధకవత్సనాభగరలం చైకైకభాగాన్వితమ్ । సర్వం మర్దయ హంసపాదిస్వరసే గుఞ్జాతు మాత్రామితిః । తైలాభ్యఙ్గ జలోప చార సహితం పథ్యంచ దధ్యోదనమ్ । శాన్తిం నేష్యతి సర్వదోషనివహం సింహప్రతీపాలనమ్ (1)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ నాభి, గరళము, వీని నొక్కొక్క భాగముగ గ్రహించి హంసపాదిరసముతో మర్దింపవలయును. ఈ సింహప్రతీపాలన

మును గురివిందగింజపరిమితిగ నిచ్చి తైలాభ్యంగమును శీతలజలోపచారమును చేయించి పెరుగుతోకూడిన యన్నము నిచ్చినచో సమస్తదోషములను శాంతింప జేయును

## రజతచంద్రోదయము

శ్లో॥ ద్విభాగం రజతం చైవ హ్యష్టభాగం తు పారదమ్ । గన్ధకం షోడశ భాగంచ కన్యయా తు విమర్దయేత్ (1) త్రిదినం వాలుకాయన్త్రే పాచయే త్స్వాఙ్గశీతలః । అనుపానవిశేషేణ ప్రమేహాన్ హన్తి దుస్తరాన్ (2) శుక్లస్రావం తథాకాసం దౌర్బల్యం శ్వాసమేవ చ । పాణ్డుం జీర్ణ జ్వరం హన్తి మన్దాగ్నిం క్షయనాశకః । తత్తద్రోగానుపానేన సర్వరోగ వినాశకః (3)

అ॥ వెండిభస్మ 2 భా, శు॥ పాదరసము 8 భా, శు॥ గంధకము 16 భా, వీనిని కలుబందరసముతో మర్దించి వాలుకాయంత్రమందు మూడుదోజులు వండి స్వాంగశీతల మైనపిదప తీయవలయును. దీనిని అనుపానవిశేషములతో నిచ్చినయెడల ప్రమేహ ములు, శుక్లస్రావము, దగ్గు, బలహీనత, ఆయాసము, పాండువు, జీర్ణజ్వరము, అగ్ని మాంద్యము, క్షయ, ఈ రోగములను నశింపజేయును. ఆయారోగములకు తగిన యను పానములతో నిచ్చినయెడల సమస్తవ్యాధులను నశింపజేయును.

## తారచంద్రోదయము (రజతచంద్రోదయము)

శ్లో॥ రజతం తు చతుర్భాగమష్టభాగం తు పారదమ్ । గన్ధకం షోడశ భాగం చ కన్యయా తు విమర్దయేత్ (1) రక్తకార్పాసపుష్పైశ్చ మాసమేకం ప్రయత్నతః । క్రమాగ్నౌ వాలుకాయన్త్రే పాచయేత్తు దిన త్రయమ్ (2) స్వాఙ్గ శీతలముద్ధృత్య త్వగేలాపత్రకేసరైః । అనుపాన విశేషైర్వా మిశ్రితసర్వరోగహృత్ (3) క్షయం పాణ్డుం ప్రమేహాంశ్చ దౌర్బల్యం కాసమేవ చ । హన్త్యా జీర్ణం తథా హిక్కాం గ్రహణీం మూల రోగకమ్ (4) వీర్యవృద్ధిం కరోత్యేష శుక్రస్తమ్భం చ కారయేత్ । స ముదా మనసా నిత్యం నరో గచ్ఛేత్ ప్రియా శతమ్ । తారచన్ద్రోదయో నామ్నా నిర్మితో నిజతేజసా (5)

అ॥ వెండిభస్మ 4 భా, శు॥ పాదరసము 8 భా, శు॥ గంధకము 16 భా, వీనిని కలుబందరసముతోడను, ఎఱ్ఱప్రత్తిపూలరసముతోడను, ఒకనెలరోజులు మర్దించి

వాలుకా యంత్రమందు క్రమాగ్నులచే మూడురోజులు వండి స్వాంగశీతలమున తీయవలయును. పిదప దాల్చినచెక్క, ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, వీనితోగాని అనుపాన విశేషములతోగాని యిచ్చినయెడల సమస్తవ్యాధులు హరించును. క్షయ, పాండువు, ప్రమేహములు, బలహీనత, దగ్గు, అజీర్ణము, ఎక్కిళ్ళు, గ్రహణీరోగము, మూలవ్యాధి, ఈ రోగములుకూడ హరించును. ఇది వీర్యవృద్ధిని శుక్రస్తంభమును, చేయును. దీనిని సేవించిన మనుజుడు సంతోషముతోకూడిన మనస్సుకలవాడై ఎల్లప్పుడును నూరుగురు స్త్రీలను రమించును. ఇది తారచంద్రోదయ (రజతచంద్రోదయ) మని చెప్పబడును. నిజోక్తిచే చెప్పబడినది.

## వాతరాక్షసము (పుటయోగము)

సీ॥ రౌప్యభస్మంబును రససింధురము నభ్రకము లోహకాన్తముల్ క్రమముగాను । కాఞ్చనభస్మంబు ఘనతామ్రమును గన్ధకము వత్సనాభియు సముచితముగ । సమములుగాగూర్చి చక్కగా మర్దించి యొప్పుమీరంగను తిప్పతీగ । తెల్లగలిజేరును నల్లము తులసియు వహ్నిద్రవంబుల వరుస గాను । మర్దనల్ చేసియు మహితకుక్కుటపుటం బొనరించి చల్లార్చి తిసర నదియు । తద్రసంబుల జేతగ రెండు దినములు మర్దన మొనరించి మానిత ముగ । గుటికలు గావించుకొని పూటకద్ది గెత్తనుపానములతోడ నలర గొనిన । పార్శ్వశూలయును పక్షవాతంబు కంపమున్ పదుమూడుసంధుల బలము లణచి । సూతికావాతముల్ శూల రోగంబుల పెంపు నణచియు చాల నింపుగాను । సర్వరోగంబులను దన్తిసముదయమును । కొదమసింగం బురీతిని మదమణంచి । వాతరాక్షస మనుపేర వన్నెమీర । నిలను వివరించునని పల్కెనీశ్వరుండు॥

అ॥ వెండిభస్మ, రససింధూరము, అభ్రకభస్మ, లోహభస్మ, కాంతభస్మ, బంగారుభస్మ, తామ్రభస్మ, శు॥ గంధకము, శు॥ నాభి, వీనిని సమభాగములుగ గ్రహించి బాగుగనూరి తిప్పతీగ, తెల్లగలిజేరు, అల్లము, తులసాకు, చిత్రమూలము, వీనియొక్క రసములతో వరుసగ మర్దనచేసి కుక్కుటపుటమువేసి చల్లారినపిదప పూర్వపురసములతో రెండురోజులు మర్దించి కుప్పెలుకట్టవలయును. దీనిని పూటకు ఉద్దిగెత్తు అనుపానవిశేషములతో సేవించినయెడల పార్శ్వశూల, పక్షవాతము, కంపవాతము, పదుమూడుసన్నిపాతములు, సూతికావాతములు, శూలలు, వీనిని సమస్తవ్యాధులను, మదపుటేనుగులను సింహమణంచురీతి నణంచును. వాతరాక్షసమనెడి పేరుతో ప్రసిద్ధి నొందునని యీశ్వరుడు పలికెను.

## వాతరాక్షసము (వంటయోగము)

శ్లో॥ శుద్ధసూతం తథా తామ్రం కాన్తం చాభ్రకమేవ చ । తారం హేమ చతాలంచ మౌక్తికం విద్రుమం తథా (1) మనశ్శిలాం మాక్షికం చ సర్వతుల్యంతు గన్ధకమ్ । పునర్నవారసేనైవ హంసపాదీరసేన చ (2) మర్దయేచ్ఛాయయా శుష్కం వాలుకాయన్త్రకే క్షిపేత్ । పాచయేద్దశయామంచ సాఙ్గశీతలం సముద్ధరేత్ (3) గుఞ్జామాత్రం నిహన్త్యాశు హ్యానుపానవిశేషతః । ఊరుస్తమ్భం వాతరక్తం గాత్రభఙ్గంతథైవ చ (4) ఆమవాతం ధనుర్వాతం కుబ్జవాతంతథైవ చ । సన్ధివాతం పక్షవాతం । సూతికావాతమేవ చ । వాత రాక్షస నామాఽయం వాతరోగాన్వినాశయేత్ (5)

అ॥ శు॥ పాదరసము, తామ్రభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, రజతభస్మ, స్వర్ణభస్మ, శు॥ తాళకము, ముత్యపుభస్మ, పగడపుభస్మ, శు॥ మణిశిల, మాక్షికభస్మ, వీనిని సమభాగములుగను వీనియన్నిటితో సమానముగ శు॥ గంధకమును, గ్రహించి గలిజేరు రసముతోడను, హంసపాదిరసముతోడను మర్దించి నీడయందు ఎండించి వాలుకాయంత్రమందు పదిజాములు వండి సాంగశీతలమైన పిదప తీయవలయును. దీనిని గురివిందగింజ పరిమితిగ అనుపానవిశేషములతో సేవించినయెడల ఊరుస్తంభము, వాతరక్తము, గాత్రభంగము, ఆమవాతము, ధనుర్వాతము, కుబ్జవాతము (గూను), సంధివాతము, పక్షవాతము, సూతికావాతము, ఈ వ్యాధులను హరింపజేయును. ఈ వాతరాక్షసము సమస్తవాత రోగములను శమింపచేయును.

## వాతరాక్షసము (పుటయోగము)

శ్లో॥ రసం గన్ధకం వత్సనాభకం కాన్తతామ్రకే । స్వర్ణం తారం సమం చైవ వృశ్చిరకరసేన చ (1) అమృతావహ్ని తులసీపిప్పలీనాం రసేన చ । ఖల్వేతు మర్దయేత్సమ్యగ్దినైకం చ పృథక్పృథక్ (2) గులికాన్ ఛాయయా శుష్కాఞ్ఞిక్షిపేచ్ఛరావసమ్పుటే । పక్త్వాలఘుపుటే నైవ సాఙ్గశీతలముద్ధరేత్ (3) ద్విగుఞ్జో భక్షితశ్చైవ తాపజ్వర వినాశకః ఆమవాతం ధనుర్వాతం పక్షాఘాతం చ నాశయేత్ (4) ఆక్షేపకం హనుస్తమ్భం మన్యాస్తమ్భంతథైవ చ । సన్నిపాతజ్వరంహన్తి వివిధాన్విషమానపి । వాతరాక్షసకో నామ గౌరీనాథ ప్రకల్పితః (5)

అ॥ శు॥ పాదరసము, శు॥ గంధకము, శు॥ నాభి, అభ్రకభస్మ, కాంతభస్మ, తామ్రభస్మ, సువర్ణభస్మ రజతభస్మ వీనిని సమ భాగములనుగ గ్రహించి కలిపేసి, తిప్పతీగ, చిత్రమూలము, తులసి, పిప్పళ్ళు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక్కరోజు ఖల్వమందు బాగుగ మర్దించి మాత్రలనుగ జేసి, నీడయందు ఎండించి, మూకుళ్ళయందుంచి, లఘు పుటమును వేసి స్వాంగ శీతలమైనపిదప తీయవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ సేవించిన యెడల తాపజ్వరము, ఆమవాతము, ధనుర్వాతము, పక్షవాతము, ఆక్షేపకవాతము, హనుస్తంభము, మన్యాస్తంభము, సన్నిపాతజ్వరము, విషమజ్వరము ఈ వ్యాధులను నశింపచేయును. ఇది వాతరాక్షసమని ప్రసిద్ధమైనది. గౌరీనాథునిచే చెప్పబడినది.

## వాతరాక్షసము (వంటయోగము)

సీ॥ తామ్రవంగము లోహతారకాంచనములు నాల్గురసంబులు నభ్రకమును । కాన్తము గన్ధంబు కపరి నేపాలంబు సమభాగములుగూర్చి చక్కగాను । ఖల్వమందుంచి త్రికటుకరసమున మర్దనముజేసి కుప్పెలో నమరబెట్టి । సరసంబుగా నది చట్టిలోపల బెట్టి యిసుక చుట్టును బోసి యిష్టముగును । పదునాఱు గడియలు పక్వంబుగా వండి దేహమను పానంబు దెలిసికొనుచు । నడ్డిగెత్తును పూటకు నమరనిడిన । వాతరోగంబులన్నియు వదలిపోవు । శోషకాసల శూలల సొంపునణచు । వాతరాక్షసమిదియును వాడికలది॥

అ॥ తామ్రభస్మ, వంగభస్మ, లోహభస్మ, రజతభస్మ, సువర్ణభస్మ, శు॥ రసము శు॥ రసకర్పూరము, శు॥ ఇంగిలీకము, రససిందూరము, అభ్రకభస్మ, కాంతభస్మ, శు॥ గంధకము, శు॥ కపరి, శు॥ నేపాళములు వీనిని సమ భాగములుగ గ్రహించి ఖల్వమందుంచి త్రికటు రసముతో మర్దించి కుప్పెయందుంచి కుండలోబెట్టి చుట్టు నిసుక బోసి పదునాఱు గడియలు పక్వముగనట్లు వండవలయును. తత్వమును, అనుపానమును తెలిసికొని దీనిని పూటకు అడ్డిగెత్తు నిచ్చినయెడల వాతరోగములు, నంజులు, కాసలు, శూలలు ఇవి చిత్రముగ హరించును. ఇది వాతరాక్షసమని చెప్పబడును. మిక్కిలి వాడికలది.

## వాతరాక్షసము

శ్లో॥ మృతం సూతం తథా గన్ధం కాన్తంచాభ్రకమేవ చ । తామ్రభస్మ కృతం సమ్యఙ్మర్దయిత్వాసమాంశకమ్ (1) పునర్నవాగుడూచ్యగ్ని సురసా త్ర్యూషణైస్తథా । ఏతేషాం స్వరసేనైవ భావయేత్త్రిదినం పృథక్ (2) దత్వా లఘుపుటం సమ్యక్ స్వాఙ్గశీతలం సముద్ధరేత్ । వాతరాక్షస

నామాఽయం వాతరోగే ప్రయోజయేత్ (3) తత్తద్రోగానుపానేన ద్విగుఞ్జా మాత్ర సేవనాత్ । ఊరుస్తమ్భం వాతరక్తం గాత్రభఙ్గం తథైవ చ (4) ఆమవాతం ధనుర్వాతం వేదనావాతమేవ చ । పక్షఘాతం కమ్పవాతం సర్వ సన్ధిగతం తథా (5) సుప్తివాతం చ శూలం చ హ్యున్మాదం చ వినాశయేత్ తత్తద్రోగానుపానేన వాతాశీతి వినాశకః (6)

అ॥ రసభస్మ, శు॥ గంధకము, కాంతిభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ వీనిని సమభాగములనుగ గ్రహించి గలిజేరు, తిప్పతీగ, చిత్రమూలము, తులసి, త్రికటుకములు వీనియొక్క రసములతో నూరి వీనియొక్క రసములచేతనే మూడేసి రోజులు భావనను చేసి చిన్న పుటమును వేసి స్వాంగశీతలమైన పిదప తీయవలయును. ఇది వాతరాక్షసమని చెప్పబడును. దీనిని వాతరోగములందీయవలయును. ఆయా రోగములకు తగిన అనుపానములతో రెండు గురివింద గింజపరిమితిగ నిచ్చినయెడల ఊరుస్తంభము, వాతరక్తము, గాత్రభంగము, ఆమవాతము, ధనుర్వాతము, వేదనావాతము, పక్షవాతము, కంపవాతము, సంధివాతము, సుప్తివాతము, శూల, ఉన్మాదము ఈ రోగములను నశింపచేయును. ఆయా రోగములకు తగిన యనుపానములతో నిచ్చినయెడల ఎనుబది వాతములను నశింపచేయును.

## మహావాతరాక్షసము

శ్లో॥ హేమ రౌప్యాభ్రకే లోహం రసేన్ద్రం శుద్ధగన్ధకమ్। వైక్రాన్తం మౌక్తికంచైవ విద్రుమం తామ్రతాలకే (1) శఙ్ఖచూర్ణం మృతం వఙ్గం మాణ్డూరం కాన్తమేవచ । త్రిఫలాచూర్ణకం చైవ సూతార్ధం విషకంతథా (2) వాశానిమ్బరసైః పఞ్చ భావనాశ్చ పృథక్పృథక్ । చతుర్యామం మర్దనం చ కారయేచ్ఛోషయేత్తతః (3) కుక్కుటాఖ్యపుటే పక్త్వా స్వాఙ్గశీతం విచూర్ణయేత్ । గుఞ్జామాత్రప్రయోగేణ కణామధ్వాజ్యసంయుతమ్ (4) ఊరుస్తమ్భం వాతరక్తం గాత్రస్తమ్భం చ నాశయేత్ । ఆమవాతం ధనుర్వాతం సూతికావాత మేవచ (5) ఆధ్మానంచాగ్నిమాన్ద్యంచ తూనీంప్రతితునీమపి । వాతరాక్షస నామఽయం వాతాశీతి వినాశకః (6)

అ॥ సువర్ణభస్మ, రజతభస్మ, అభ్రకభస్మ, ఖడ్గలోహభస్మ, శు॥ పాదరసము, శు॥ గంధకము, వైక్రాంతభస్మ, ముత్యపుభస్మ, పగడపుభస్మ, తామ్రభస్మ, శు॥ తాళకము, శంఖభస్మ, వంగభస్మ, మండూరభస్మ, కాంతభస్మ, త్రిఫలచూర్ణము వీనినొక్కొక్క భాగముగను శు॥ నాభిని అర్ధ భాగముగను గ్రహించి అడ్డసరపు రసము

తోడను, వేపరసముతోడను ప్రత్యేకముగ నైదేసి భావనలను, నాలుగేసి జాములు మర్దనను చేసి నీడను యెండించి కుక్కుట పుటమును వేసి, స్వాంగశీతలమైన పిదప తీసి చూర్ణమునుగ చేయవలెను. దీనిని గురివిందగింజ పరిమితిగ పిప్పళ్ళు, తేనె, నెయ్యి వీనితో నిచ్చినయెడల ఊరుస్తంభము, వాతరక్తము, గాత్రస్తంభము, ఆమవాతము, ధనుర్వాతము, సూతికావాతము, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, తూని, ప్రతితుని ఈ వ్యాధులను నశింపచేయును. ఈ వాతరాక్షసము ఎనుబది వాతములను నశింపచేయును.

## మహావాతరాక్షసము (ప్రకారాంతరము)

శ్లో॥ తామ్రం విద్రుమమభ్రకాన్తరజతం వైక్రాన్తకం మాక్షికమ్ । వైడూర్యాయసభస్మనీ మృతరసం స్వర్ణం చ వహ్నిం సమమ్ । సర్వం హంసపదీద్రవైస్త్రిదివసం పిష్ట్వా శరావైరిథమ్ । కుర్యాత్సూక్ష్మపుటం నిహన్తి మరుతో వాతాసురోఽయం రసః (1)

అ॥ తామ్రభస్మ, పగడభస్మ, అభ్రకభస్మ, కాంతభస్మ, రజతభస్మ, వైక్రాంత భస్మ, హేమమాక్షికభస్మ, వైడూర్యభస్మ, లోహభస్మ, రసభస్మ, సువర్ణభస్మ, చిత్రమూలము వీనిని సమభాగములనుగ గ్రహించి హంసపాదిరసముతో మూడు రోజులు మర్దించి, మూకుళ్ళయందుంచి చిన్న పుటమును వేసి యుపయోగించినచో వాతరోగములను నశింపజేయును. ఇది వాతాసురము (వాతరాక్షసము) అని చెప్పబడును.

## సువర్ణవాతరాక్షసము

శ్లో॥ స్వర్ణం నాగం వఙ్గలోహం తామ్రం కాన్తం చ తారకమ్ । రసభూతిం గన్ధకంచ విషనేపాలమాక్షికాన్ (1) ఖర్పరం తుత్థకం చైవ వరాటం శఙ్ఖభస్మకమ్ । టఙ్కణం దరదం చైవ తాలకం చ మనశ్శిలామ్ (2) కృష్ణాభ్రకం సమం చైవ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కటుభద్రరసే నైవ లవఙ్గక్వాథకేన చ (3) చిత్రమూలరసేనైవ మర్దయేద్వటకాన్కురు । కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాయన్త్రయోగతః (4) మన్దాగ్నినా ద్వియామం చ పాచయేత్స్వాఙ్గశీతలమ్ ద్విగుఞ్జం మాక్షికేనైవ ఖాదేద్వాతవినాశనమ్ (5) స్నాయువాతం పిత్తవాతం సూతికావాతమేవ చ । పక్షాఘాతార్దితానాహాన్కుబ్జవాతం చ నాశయేత్ (6) ఊరుజానుకటీసన్ధిం మూత్రపిణ్డాగతం కలమ్ ।

అశీతివాత జాన్రోగాన్నాశయేన్నాత్ర సంశయః। వాతరాక్షసనామాఽయం సువర్ణపదపూర్వకః (7)

అ॥ సువర్ణభస్మ, సీసభస్మ, వంగభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, రజతభస్మ, రసభస్మ, శు॥ గంధకము, శు॥ నాభి, శు॥ నేపాళములు, హేమమాక్షిక భస్మ, శు॥ కపురి, శు॥ మైలతుత్థము, గవ్వలభస్మ, శంఖభస్మ, శు॥ టంకణము, శు॥ ఇంగలీకము, శు॥ తాళకము, శు॥ మణిశిల, కృష్ణాభ్రక భస్మ వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి అల్లము, లవంగములు, చిత్రమూలము వీనియొక్క రసములతో మర్దించి మాత్రలు చేసి, కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మందాగ్నిచే రెండుజాములు వండి స్వాంగశీతలమున తీయవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ తేనెతో సేవించినయెడల వాతము, స్నాయువాతము, పైత్యవాతము, సూతికావాతము, పక్షవాతము, అర్దితవాతము, అనాహవాతము, కంపవాతము, ఇవి నశించును. తొడలు మోకాళ్ళు కటిప్రదేశము సంధులు మూత్రపిండములు వీనిని పొందిన వాతము నశించును. ఎనుబదివాతరోగములును నిశ్చయముగ నశించును. ఇది సువర్ణ వాతరాక్షసమనబడును.

## రత్నవాతరాక్షసము

శ్లో॥ రసం చ గన్ధకం వజ్రం కాన్తం లోహం చ తామ్రకమ్। అభ్రకం దరదం తాలం నాగం వఙ్గం చ హాటకమ్ (1) రౌప్యకం చైవ వైక్రాన్తం రాజావర్తం చ మౌక్తికమ్। విద్రుమం విషతార్క్ష్యే చ సమంఖల్వే వినిక్షి పేత్ (2) సూర్యాహ్వాయస్య పయసా కృష్ణోన్మత్తరసేన చ। చిత్రమూలరసేనైవ త్రివారంతు పృథక్పృథక్ (3) సప్తధా వ్యోషనిర్యాసైర్భావయేద్వాత రాక్షసమ్। శ్లేష్మోద్రేకే త్రికటుకైర్వల్లమాత్రం ప్రయోజయేత్ (4) త్రయోదశ సన్నిపాతాఞ్జ్వరానష్టౌ నివారయేత్। అపస్మారం ధనుర్వాతం విద్రధిం రక్తగుల్మకమ్ (5) ఆనాహం మూత్రకృచ్ఛ్రం చ సర్వవాతగదానపి। వాతరాక్షసనామాఽయం ప్రసిద్ధో రత్నపూర్వకః (6)

అ॥ రసభస్మ, శు॥ గంధకము, వజ్రభస్మ, కాంతభస్మ, ఖడ్గలోహభస్మ, తామ్రభస్మ, అభ్రకభస్మ, శు॥ ఇంగిలీకము, శు॥ తాళకము, సీసభస్మ, వంగభస్మ, సువర్ణభస్మ, రజతభస్మ, వైక్రాంతభస్మ, రాజావర్తభస్మ, ముత్యపుభస్మ, పగడపుభస్మ, శు॥

నాభి, పచ్చలభస్మ, వీనిని సమభాగములనుగ గ్రహించి ఖల్వమందుంచి జిల్లేడుపాలు, నల్లగూరవెల్లుల్లిరసము, చిత్రమూలరసము, వీనితో ప్రత్యేకముగ మూడేసిసారులు భావనచేయవలయును. పిదప త్రికటురసముతో ఏడుసారులు భావనను చేయవలయును. ఈ వాతరాక్షసమును శ్లేష్మోద్రేకమందు త్రికటుకములతోకూడ వల్లపరిమితిగ నివ్వవలయును. ఇది పదమూడువిధములగు సన్నిపాతములను, ఎనిమిదివిధములగు శ్వాసములను, అపస్మారమును, ధనుర్వాతమును, విద్రధిని, రక్తగుల్మమును, ఆనాహమును, మూత్రకృచ్ఛ్రమును, సమస్తవాతవ్యాధులను, నశింపచేయును. ఇది రత్నవాతరాక్షసమని ప్రసిద్ధమైనది.

## పాషాణవాతరాక్షసము

శ్లో॥ రసభూతిం చాభ్రకం చ లోహం తామ్రం చ హిఙ్గులమ్ । జాతరూపం నాగవఙ్గే ఉల్లిపాషాణటఙ్కణౌ (1) తుత్థద్వయం వత్సనాభం మాక్షికం విమలాలకే । నవసారం కునటికాం రామఠం ఘటికీం తథా (2) సమాంశం నిక్షిపేత్ ఖల్వే వహ్నిమూలరసేన చ । కటుత్రయరసేనైవ హ్యాజమోదాల వఙ్గకైః । హస్తికర్ణ్యా రసేనైవ మర్దయేద్ద్విదినం పృథక్ । వటకాన్కారయేచ్ఛుష్కాన్వజ్రమూషాన్తరే క్షిపేత్ (4) ద్వియామం వాలుకాయన్త్రే పాచయేత్స్వాఙ్గశీతలమ్ । ఆర్ద్రకస్య చ నిర్గుణ్డ్యా లశునస్య రసేన చ (5) త్రిదినం మర్దయేచ్చైవ హ్యనుపానవిశేషకైః । ఖాదయేదతిశీఘ్రం చ వాతాశీతిం వినాశయేత । వాతరాక్షసనామాఽయం వాణీనాథ ప్రకల్పితః (6)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, శు॥ ఇంగిలీకము. సువర్ణభస్మ, సీసభస్మ, వంగభస్మ, శు॥ ఉల్లిపాషాణము, శు॥ వెలిగారము, శు॥ మైలతుత్థము, శు॥ పాలతుత్థము, శు॥ నాభి, మాక్షికభస్మ, విమలభస్మ శు॥ తాళకము, నవాసారము, శు॥ మునిపెల, శు॥ ఇంగువ, శు॥ పటిక, వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమందుంచి చిత్రమూలము, త్రికటుకములు, వాము, లవంగములు, బలురక్కసి, వీనియొక్కరసములతో ప్రత్యేకముగ రెండేసిరోజులు మర్దించి మాత్రలను చేసి ఎండించి వజ్రమూసయందుంచి వాలుకాయంత్రమందు రెండుజాములు వండి స్వాంగశీతలమైన పిదప తీసి అల్లము, వావిలి, వెల్లుల్లి, వీనియొక్కరసములతో మూడురోజులు మర్దింపవలయును. దీనిని అనుపానవిశేషములతో నిచ్చినయెడల ఎనుబది వాతములను అతిశీఘ్రముగ నశింపచేయును. ఈ వాతరాక్షసము వాణీనాథునిచే చెప్పబడినది.

## కఫరికల్పము

శ్లో॥ ఖర్పరం మర్దయేత్ క్షీరైర్యామాంశ్చతురశీతికాః । నిరన్తరం దివారాత్రం మర్దనేనామృతం భవేత్ । మాషమాత్రం సానుపానో జ్వరం హన్తి దినార్థతః (1)

అ॥ శు॥ కఫరిని ఆవుపాలతో ఎనుబదినాలుగుజాములు రాత్రింబవళ్ళయందు ఎడతెగక మర్దించినయెడల అమృతతుల్యముగ నగును. దీనిని మాషపరిమితిగ అనుపానములతోకూడ నిచ్చినయెడల జ్వరమును అర్ధదినములో హరించును.

## కఫరికల్పము (ప్రకారాంతరము)

శ్లో॥ ఖర్పరం శోధితం కృత్వా సమగన్ధకమిశ్రితమ్ । అజాక్షీరేణ సమ్మర్ద్య హ్యష్టాశీతికయామకమ్ (1) గవాం క్షీరేణ దాతవ్యశ్చాగ్ని మాన్ద్య జ్వరాదికాన్ । శమయేద్ఘటికార్ధేన దేవానామమృతం యథా (2)

అ॥ శు॥ కఫరిని, సమానపరిమితిగల శు॥ గంధకముతో చేర్చి మేకపాలతో ఎనుబదియెనిమిది జాములు మర్దించి ఆవుపాలతోకూడ నిచ్చినయెడల దేవతలకు అమృతమువలె అగ్నిమాంద్యము, జ్వరము మొదలగువ్యాధులను అర్థఘడియకాలములో శమింపచేయును.

## మాలినీవసంతము (పురాణజ్వరములకు)

శ్లో॥ రసకయుగలభాగం వేల్లజం చైకభాగం ద్వితయమపి చ ఖల్వే మర్దయేత్ శ్లక్ష్ణకేన । భవతి జ్వరవిముక్తో నిమ్బనీరేణ తావత్ జ్వరహరమభకు ర్యాన్మాలినీ ప్రాగ్వసన్తమ్ (1) శ్లో॥ జీర్ణజ్వరే ధాతుగతేఽతిసారే రక్తాన్వితే రక్తగవిట్స్వరూపే । జ్వరేఽస్థిగే మాంసగతే పురాణే వల్లద్వయం దుగ్ధమతీవ పథ్యమ్ (2)

అ॥ శు॥ కఫరి 2 భా, మిరియాలు 1 భా, ఈ రెంటిని ఖల్వమందుంచి వేపచెక్క రసముతో మెత్తగ నూరి సేవించినయెడల జ్వరములు హరించును. వసంతమాలిని యనబడును. దీనిని జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము, అతిసారము, రక్తాతిసారము, రక్తముతోకూడిన మలాతిసారము, అస్థిగతజ్వరము, మాంసగతజ్వరము, పురాణ జ్వరము, వీనియందు రెండువల్లముల పరిమితిగ నియ్యవలయును. పాలు మిక్కిలి పథ్యకరముగ నుండును.

## మహాలక్ష్మీవిలాసరసము

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం తీక్ష్ణలోహాభ్రకే తథా। నాగవఙ్గ ప్రవాలం చ మౌక్తికం కృష్ణకాన్తకే (1) రసం వైక్రాన్తకం చైవ శుద్ధ భస్మీకృతాని చ। సమభాగం తు సంగ్రాహ్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) త్రికటుక్వాథకే మర్ద్యం లవఙ్గక్వాథకే తథా॥ భావ్యం చ శోషయేత్పశ్చా చ్చూర్ణయేచ్చ ద్విగుఞ్జకః (3) వ్యోషచూర్ణసమాయుక్తః సేవితో రాజ రోగకమ్। సర్వమేహాన్ వ్రణాన్ ఘోరాన్ శ్వాసం కాసం క్షయంహరేత్ (4) లిఙ్గదార్ఢ్యం బలం పుష్టిమాయుః కాన్తిం చ వర్ధయేత్। రసో లక్ష్మీ విలాసాఖ్యస్సర్వరోగాన్వినాశయేత్ (5)

అ॥ బంగారపుభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, ఉక్కుభస్మ, అభ్రకభస్మ, సీస భస్మ, వంగభస్మ, పగడపుభస్మ, ముత్యపుభస్మ, ఇనుపభస్మ, కాంతలోహభస్మ, రసభస్మ వైక్రాంతభస్మ, వీనిని సమభాగములనుగ గ్రహించి ఖల్వమందుంచి త్రికటు కషా యముతోడను, లవంగకషాయముతోడను, మర్దనను భావనను చేసి ఎండించి చూర్ణించ వలయును. దీనిని రెండుగురివిందగింజలపరిమితిగ త్రికటుచూర్ణముతో సేవించిన యెడల రాజయక్ష్మను, సమస్తమేహములను, ఘోరమైనవ్రణములను, ఆయాసమును దగ్గును, కృశించుటను, హరించును. లింగదార్ఢ్యమును, బలమును, శరీరపుష్టిని, ఆయు వును, శరీరకాంతిని, వృద్ధిపొందించును, లక్ష్మీవిలాసరసమని చెప్పబడును. సమస్త వ్యాధులను నశింపజేయును.

## మహాలక్ష్మీవిలాసరసము (పుటయోగము)

శ్లో॥ సువర్ణతారాభ్రకతామ్రవఙ్గ త్రిలోహనాగామృతమౌక్తికాని ఏతత్సమం భస్మ రసస్య యుఞ్జ్యాత్ ఖల్వే కృతం స్యాత్కృతకజ్జలీకమ్ (1 సుమర్దయేన్మాక్షికసంప్రయుక్తం తచ్ఛోషయేద్ద్విత్రిదినం చ ఘర్మే। కరే తు మూషోదరమధ్యగామి యత్నాత్కృతం తార్క్ష్యపుటేన పక్వమ్ (2) యామాష్టకం పావకమర్దితం చ లక్ష్మీవిలాసో రసరాజ ఏషః। క్షయం త్రిదోష ప్రభవం చ పాణ్డుం సకామలాసర్వసమీరణం చ (3) శోఫప్రతిశ్యాయ నష్టవీర్యం మూలామయం చైవ సశూలకుష్ఠమ్। మన్దాగ్నిమేహానపి సంని పాతం శ్వాసంచ కాసం చ హరేత్ప్రయుక్తః॥ తారుణ్యలక్ష్మీప్రతిబోధనాయ శ్రీమద్విలాసో రసరాజ ఏషః (5)




అ॥ బంగారుభస్మ, వెండిభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, వంగభస్మ, ఖడ్గలోహభస్మ, మాండూరభస్మ, కాంతభస్మ, సీసభస్మ, శు॥ నాభి, ముత్యభస్మ, వీనిని సమభాగములుగను వీనియన్నిటితో సమానమగు రసభస్మమును ఖల్వమందుంచి మెత్తగనూరి తేనెతో బాగుగ మర్దించి 2–3 రోజులు ఎండయందు ఎండించి దానిని మూషయందుంచి తార్క్ష్యపుటముచే పక్వముచేసి చిత్రమూలరసముతో నెనిమిదిజాములు మర్దించవలయును. ఇది లక్ష్మీవిలాసమని చెప్పబడును. శ్రేష్ఠమైనది. దీనిని సేవించిన యెడల త్రిదోషములవలన జనించిన క్షయ, పాండువు, కామిర్లు, సమస్తవాతవ్యాధులు, నంజు, జలుబు, వీర్యనష్టము, మూలవ్యాధి, శూల, కుష్ఠము, అగ్నిమాంద్యము, ప్రమేహములు, సంనిపాతము, శ్వాస, కాస, ఇవి హరించును. ఇది అధికమగులక్ష్మిని కలిగించును.

## మహాలక్ష్మీవిలాసరసము (వంటయోగము)

సీ॥ మృతరౌప్యకనకముల్ మఱి కాన్తలోహముల్ తగహేమమా
క్షికదరదములను । సరిగూర్చి యంతకుసమముఁగారసముంచి తద్రసతుల్య
గన్ధకమునొసగి । పిప్పలీగెను నేడుదినములు మర్దించి పూతవెట్టిన కుప్పెబోసి
యుంచి । వాలుకాయంత్రాన పరుస నెన్మిదిజాములమరంగ వండి చల్లార్చితీసి ।
యల్లపురసముతో నమరకుప్పెలుజేసి యనుపానములచేత నడ్డిగెత్తు । సేవ
జేయగవలయు లక్ష్మీవిలాస । మనిలకఫపిత్తరాజయక్ష్మోర్ధ్వశోఫ । పాండు
కామిలగుల్మముపవనశీత । సతతతాపజ్వరంబుల శాంతిబఱచు ॥

అ॥ వెండిభస్మ 1 భా, బంగారుభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, లోహభస్మ 1 భా, హేమమాక్షికభస్మ 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ రసము 6 భా, శు॥ గంధకము 6 భా, వీనిని తిప్పతీగరసముతో నేడుదినములు మర్దించి చీలమన్ను లిచ్చిన కుప్పెయందుపోసి వాలుకాయంత్రమందు ఎనిమిదిజాములు వండి చల్లారినపిదప తీసి అల్లపురసముతో కుప్పెలు కట్టవలయును. దీనిని దీనిని అనుపానవిశేషములతో నడ్డిగెత్తు సేవించవలయును. లక్ష్మీవిలాసమని చెప్పబడును. ఇది వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, పైత్యవ్యాధులు, రాజయక్ష్మ, మూలవ్యాధి; నంజు, పాండువు, కామిర్లు గుల్మము, వాతజ్వరము, శీతజ్వరము, సంతతజ్వరము, తాపజ్వరము, వీనిని శాంతింపజేయును.

## క్రమవృద్ధిమహాలక్ష్మీవిలాసరసము

శ్లో॥ హేమభస్మైకభాగం చ రౌప్యభస్మ ద్విభాగకమ్ । శుల్బభస్మ త్రిభాగం చ చతుర్భాగం తు కాన్తకమ్ (1) పఞ్చభాగం తీక్ష్ణకం చ షడ్భా

గం లోహకిట్టకమ్ । నిశ్చన్ద్రికం వ్యోమభస్మ గృహ్ణీయాత్సప్తభాగకమ్ (2) అష్టభాగం వజ్రభస్మ నవభాగంతు నాగకమ్ । దశభాగం మౌక్తికంచ తథైకా దశభాగకమ్ ॥ 3 ॥ ప్రవాలభస్మ గృహ్ణీయాద్యత్నతో కుశలో భిషక్ । సర్వైస్సమం హిఙ్గులోత్థరససిన్దూరకం తథా (4) మర్దయేద్భావ యేచ్చాపి జాతి ప్రత్యా రసేన చ । త్రికటుత్రిఫలాచాతుర్జాతసారేణ కుఙ్కుమైః (5) మృగనాభ్యా చ తద్వద్ధి సప్తాహం చ భిషగ్వరైః । మాషమాత్ర ప్రయోగేణ సితాజ్యమధుసంయుతః (6) రాజరోగం నిహన్త్యాశు క్షయంపాణ్డుం వినాశయేత్ ॥ ద్వన్ద్వజం మూర్ఛరోగం చ శ్వాసం కాసం చ కామలామ్ (7) తాపజ్వరం చ గుల్మం చ సర్వశూలాని నాసయేత్ । ఉన్మాదం చ మతిభ్రంశమజీర్ణకమరోచకమ్ (8) ప్రమేహం వింశంతి విధం షణ్డత్వంచ జ్వరంజయేత్, మన్దాగ్నిం కుష్ఠరోగం చ మూలరోగం భగన్దరమ్ (9) వాతశూలం హరేద్వృష్యస్తథా చైవాతిదీపకంః । తుష్టిపుష్టికరో బల్యః కఫవాతవినాశకః । అసాధ్యరోగహన్తా చ మహాలక్ష్మి విరాజితః (10)

అ॥ బంగారపుభస్మ 1 భా. వెండిభస్మ 2 భా. తామ్రభస్మ 3 భా; కాంతభస్మ 4 భా, ఉక్కుభస్మ 5 భా, మాండూరభస్మ 6 భా, అభ్రకభస్మ 7 భా, వంగభస్మ 8 భా, సీసభస్మ 9 భా, ముత్యపుభస్మ 10 భా, పగడపుభస్మ 11 భా, వీని యన్నిటికిని సమానము శు॥ ఇంగిలీకమునుండి తీయబడిన పాదరసముతో వండబడిన రససిందూరము, ఇటుల వీనిని గ్రహించి జాపత్రి, త్రికటుములు, త్రిఫలములు, చాతుర్జాతకములు, వీనియొక్క రసములతోడను కుంకుమపువ్వుతోడను కస్తూరితోడను ఏడు రోజులు మర్దనను భావననుచేసి మాషపరిమితిగ పంచదార, నెయ్యి, తేనె, వీనితో నిచ్చిన యెడల రాజయక్ష్మ, క్షీణించుట, పాండురోగము, ద్వంద్వమువలన జనించిన మూర్ఛరోగము, శ్వాస, కాస, కామిర్లు, తాపజ్వరము, గుల్మము, సమస్తశూలలు, ఉన్మాదము, మతిభ్రంశము, అజీర్ణము, అరోచకము, ఇరువదివిధములగు ప్రమేహములు, నపుంసకత్వము, జ్వరము, అగ్ని మాంద్యము, కుష్ఠము, మూలరోగము, భగందరము, వాతశూల, ఇవి హరించును. ఇది వీర్యవృద్ధిని అధికమగు జాఠరదీప్తిని, మనస్సంతోషమును, శరీర పుష్టిని, బలమును, కలిగించును. కఫవాతములను నశింపచేయును. అసాధ్యములగు రోగములను హరించును. మహాలక్ష్మీ విలాసమని చెప్పబడును.

## వంగాది యోగము

శ్లో॥ మారితం త్రపుకం సీసం హరిణశ్శృఙ్గమాకులమ్ । కార్పాసో నాకులీ తక్రకం మాహిషంచ ప్రమేహజిత్ (1)

అ॥ వంగభస్మ, సీసభస్మ, దుస్సికొమ్ముభస్మ, ప్రత్తివిత్తులలోనిపప్పు, తంగేడు విత్తులు; వీనిని బత్తెనుజ్జిగతో నిచ్చినయెడల ప్రమేహములు నశించును.

## సుధానిధిరసము

శ్లో॥ గన్ధకం పారదం చాభ్రమేలాతగరకేసరాః । సమభాగం తథా ఖల్వేజీరకేణ చ మర్దయేత్ (1) కాచకూప్యాం నివేశ్యాథ ద్వియామంతు తుషాగ్నినా । పాచయేత్స్వాఙ్గశీతలం చ ద్విగుఞ్జం భక్షయేత్సదా । శర్కరా మధుసంయుక్తం సర్వపిత్తవికారనుత్ (2)

అ॥ శు॥ గంధకము, శు॥ పాదరసము, అభ్రకభస్మ, ఏలకులు, గ్రంథితగరము, నాగకేసరములు, వీనిని సమభాగములనుగ గ్రహించి జీలకర్రరసముతో మర్దించి కాచ కుప్పెయందుపోసి ఊముకనిప్పులో రెండుజాములు వండి సాంగశీతలమైనపిదప తీయ వలయును. దీనిని రెండుగురివిందగింజలపరిమితిగ పంచదారతోడను, తేనెతోడను, పుచ్చుకొనినయెడల సమస్తములగు పిత్తవ్యాధులును నశించును.

## మహాతాలేశ్వరరసము

శ్లో॥ తాలం తాప్యం శిలాం సూతం శుద్ధం సైన్ధవటఙ్కణే । సమాంశం చూర్ణయేత్ ఖల్వే సూతాద్ద్విగుణగన్ధకమ్ (1) గన్ధతుల్యం మృతం తామ్రం జమ్బీరైర్దినపఞ్చకమ్ । మర్ద్యం షడ్భిః పుటైః పాచ్యం భూధరే సమ్పుటోదరే (2) పుటేపుటే ద్రవైర్మర్ద్యం సర్వమేతచ్చ షట్పలమ్। ద్విపలం మారితం తామ్రం లోహభస్మ చతుష్పలమ్ (3) జమ్బీరామ్లేన తత్సర్వం దినం మర్ద్యం పుటేల్లఘు । త్రింశాంశం చ విషంచాస్య క్షిప్త్వా సర్వం విచూర్ణ యేత్ (4) మాహిషాజ్యేన సమ్మిశ్రం నిష్కార్ధం భక్షయేత్సదా । మధ్వాజ్యైర్వాకుచీచూర్ణం కర్షమాత్రం లిహేదను । సర్వకుష్ఠాన్నిహన్త్యాశు మహాతాలేశ్వరో రసః (5)

అ॥ శు॥ తాళకము 1 భా, స్వర్ణమాక్షికభస్మ 1 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ పాదరసము 1 భా, సైంధవలవణము 1 భా, శు॥ వెలిగారము 1 భా, శు॥ గంధకము 2 భా, తామ్రభస్మ 2 భా, వీనిని నిమ్మకాయరసముతో నైదురోజులు మర్దించి మూసలయందుంచి భూధరయంత్రమునందు ఆరుపుటములను వేయవలయును, ప్రతి

పుటమునకును నిమ్మకాయరసముతో నూరవలయును. పిదప దీనిని ఆరుపలములుగను తామ్రభస్మమును రెండుపలములుగను లోహభస్మము నాలుగుపలములుగను గ్రహించి నిమ్మకాయరసముతో నొకదినము మర్దించి లఘుపుటమును వేయవలయును. పిదప నీమందున ముప్పదియవవంతు శు॥ నాభిని కలిపి నూరవలయును. దీనిని అర్థనిష్క పరిమితిగ బత్తైవెన్నతో పుచ్చుకొని వెంటనే కర్ష పరిమితిగల భావం చాలచూర్ణమును తేనె, నెయ్యి, వీనితో పుచ్చుకొనవలయును. ఈ మహాతాలేశ్వరరసము సమస్త కుష్ఠము లను వెంటనే హరించును.

## పూర్ణచంద్రోదయరసము (ఛర్దులకు)

శ్లో॥ తుల్యంతుల్యం రసం గన్ధం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కపిత్థమూల సారేణ మర్దయేచ్ఛ దినత్రయమ్ (1) వటకాఞ్ఛాయయాశుష్కాన్ కాచ కూప్యాం వినిక్షిపేత్ । భాన్డమధ్యే వినిక్షిప్య వాలుకాభిః ప్రపూరయేత్ (2) దీపాగ్నౌచ ద్విషడ్యామం పాచయేత్స్వాఙ్గశీతలమ్ । కపిత్థమూలసారేణ త్రిదినం మర్దయేత్ క్రమాత్ (3) బిల్వమూలకషాయేనమర్దయే త్త్రిదినంపునః । చాతుర్జాతక కర్పూరలవఙ్గానాం తథైవచ (4) చూర్ణం రససమంచైవ మేలయేచ్చాథ యత్నతః । లాజచూర్ణ సితామిశ్రం మధునా సహ సేవ యేత్ (5) వల్లద్వయమితం సూతం వమనస్తమ్భకస్తథా । కాసానాం పఞ్చ ఛర్దీనామరుచేర్నాశకస్తథా (6) హృద్రోగం స్వరభఙ్గం చ మన్దాగ్నిం చ నివారయేత్ । పూర్ణచన్ద్రోదయోనామ నిర్మితస్శూలపాణినా (7)

అ॥ శు॥ పాదరసమును, శు॥ గంధకమును, సమభాగములుగ ఖల్వమందుంచి వెలగవేళ్ళరసముచే మూడురోజులు మర్దించి మాత్రలనుగ చేసి నీడను ఎండించి కాచ కుప్పెయందుంచి కుండయందిడి ఇసుకచే నింపి దీపాగ్నియందు పండ్రెండు జాములు వండి స్వాంగశీతలమైనపిదప తీసి వెలగవేళ్ళరసముతోడను, మారేడువేళ్ళరసము తోడను, మూడేసిరోజులు మర్దించి చాతుర్జాతకములు, పచ్చకర్పూరము, లవంగ ములు, వీనియొక్క చూర్ణమును పాదరసముతో సమానముగ కలుపవలయును. ఈ యౌషధమును రెండువల్లములపరిమితిగ పేలాలపిండి, పంచదార, వీనితోకలిపి తేనెతో పుచ్చుకొనవలయును. వాంతి కట్టును. దగ్గులను, అయిదువిధములగు ఛర్దులను, అరుచిని, హృద్రోగమును, స్వరభంగమును, అగ్నిమాంద్యమును, నశింపచేయును. పూర్ణచంద్రోదయమని చెప్పబడును. శూలపాణిచే చెప్పబడినది.

## విద్యాధరరసము

శ్లో॥ గన్ధకం తాలకం తాప్యం మృతం తామ్రం మనశ్శిలామ్ । శుద్ధ సూతం చ తుల్యాంశం మర్దయేద్భావయేద్దినమ్ (1) పిప్పలీనాం కషాయేణ వజ్రీక్షీరేణ చైవ హి । నిష్కార్ధం భక్షయేత్ క్షౌద్రైర్గుల్మప్లీహాదికం జయేత్ । రసో విద్యాధరో నామ గోమూత్రం తు పిబేదను (2)

అ॥ శు॥ గంధకము, శు॥ తాళకము, మాక్షికభస్మ, తామ్రభస్మ, శు॥ మణిశిల, శు॥ పాదరసము, వీనిని సమభాగములనుగ గ్రహించి పిప్పళ్ళకషాయముతోడను, జెముడుపాలతోడను, ఒక్కొక్కదినము చొప్పున మర్దనను, భావనను చేయవలయును. దీనిని యర్ధనిష్కపరిమితిగ తేనెతో సేవించి వెంటనే గోమూత్రమును త్రాగినయెడల గుల్మము, ప్లీహావ్యాధి, మొదలగునవి నశించును. విద్యాధరరసమని చెప్పబడును.

## రసభూపతి

శ్లో॥ రసం గన్ధామృతే చైవ తీక్ష్ణమౌదుమ్బరం సమమ్ । హంసపాదీ ద్రవైః ఖల్వే మర్దయేద్దివసత్రయమ్ (1) కాచకూప్యాం నివేశ్యాథ లేపయే ద్వస్త్రమృత్తికామ్ । వాలుకాయన్త్రకే క్షిప్త్వా శనైః మృద్వగ్నినా పచేత్ (2) ద్విషడ్యామం సముద్ధృత్య చూర్ణయేన్మాషమాత్రకః । ఆర్ద్రకస్యాను పానేన సర్వశోఫాన్ నిహన్తి చ । రసోహ్యగ్నికుమారాఖ్యో యోగోఽయం రస భూపతిః (3)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ నాభి, ఉక్కుభస్మ, తామ్రభస్మ, వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి హంసపాదియాకురసముతో మూడుదినములు మర్దించి కాచకుప్పెయందుంచి మట్టిపూసినగుడ్డలను చుట్టి వాలుకాయంత్రమందుంచి మందాగ్నిచే పండ్రెండుజాములు మెల్లగవండి తీసి చూర్ణముగ చేయవలయును. దీనిని మాష పరిమితిగ అల్లపురసముతో పుచ్చుకొనినయెడల సమస్తములగు శోఫలును హరించును. అగ్నికుమారరసమని చెప్పబడును. రసౌషధములలో శ్రేష్ఠమైనది.

## త్రినేత్రరసము

శ్లో॥ టఙ్కణం హారిణం శృఙ్గం స్వర్ణం శుల్బం మృతం రసమ్ । దినైక మార్ద్రకద్రావైర్మర్ద్యం రుద్ధ్వా పుటే పచేత్ (1) త్రినేత్రాఖ్యరస

సైృకం మాషం మధ్వాజ్యకైర్లిహేత్ । సైన్ధవం జీరకం హిఙ్గు మధ్వాజ్యాభ్యాం లిహేదను । పక్తిశూలహరః ఖ్యాతో మాసమాత్రా న్నసంశయః (2)

అ॥ శు॥ వెలిగారము, గుప్పిటొమ్ముభస్మ, సువర్ణభస్మ, తామ్రభస్మ, రసభస్మ, వీనిని సమభాగములనుగ గ్రహించి అల్లపురసముచే నొక దినము మర్దించి మూషలో యుంచి సంధిబంధనమును చేసి పుటమును వేయవలయును. ఈ త్రినేత్రరసమును మాషపరిమితిగ తేనె, నెయ్యి, వీనితో పుచ్చుకొని వెంటనే సైంధవలవణము, జీలకర్ర శు॥ ఇంగువ, వీనిని తేనె, నెయ్యి, వీనితో పుచ్చుకొనినయెడల నొక మాసమునకు పరిణామశూల నిశ్చయముగ హరించును.

## స్వచ్ఛందభైరవము (స్వచ్ఛన్నము)

శ్లో॥ సమభాగాంశ్చ సంగృహ్య పారదామృతగన్ధకాన్ । జాతీఫలం చ భాగార్ధం తథా కుర్యాచ్చ కజ్జలీమ్ (1) సర్వార్ధం మాగధీచూర్ణం మర్దయిత్వా నిధాపయేత్ । ద్విగుఞ్జం వా త్రిగుఞ్జం వా నాగవల్లీరసేన చ (2) ఆర్ద్రికస్య రసేనాపి ద్రోణపుష్పీరసేన వా । శీతజ్వరే సన్నిపాతే విషూచ్యాం విషమజ్వరే (3) పీనసే చ ప్రతిశ్యాయే జ్వరేఽజీర్ణే తథైవ చ । మన్దాగ్నౌ వమనే చైవ శిరోరోగే చ దారుణే । ప్రయోజ్యో భిషజా సమ్యగ్గసస్స్వచ్ఛన్దభైరవః (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ నాభి 1 భా, శు॥ గంధకము 1 భా, జాజికాయలు ½ భా, పిప్పళ్లచూర్ణము 1¾ భా, ఇటుల వీనిని గ్రహించి కాటుకవలె నూరవలయును. దీనిని 2-3 గురిజందగింజలపరిమితిగ తమలపాకులరసముతోగాని అల్లపురసముతోగాని తుమ్మిపువ్వులరసముతోగాని శీతజ్వరము, సన్నిపాతము, విషూచి, విషమజ్వరము, పీనసము, జలుబు, జ్వరము, అజీర్ణము, అగ్నిమాంద్యము, వాంతి, శిరోరోగము, వీనియందు ఇయ్యవలయును. స్వచ్ఛందభైరవరసమని చెప్పబడును.

## మహాచంద్రకలారసము

శ్లో॥ ప్రత్యేకం తోలకం చైవ సూతం తామ్రాభ్రభస్మనీ । గృహీత్వా గన్ధకం చైవ కృత్వా కజ్జలికాం తథా (1) ముస్తామూలతిదూర్వాభిః కేతకీస్తన వారిణా । సహదేవ్యాః కుమార్యాశ్చ పర్పటస్య చ వారిణా (2) మృణాలానాం శతాహ్వాయాః శతావర్యాస్తథైవ చ । భావయిత్వా ప్రయత్నేన దివసేదివసే పృథక్ (3) క్షీరేచ్ఛుడూచికా సత్వం పర్పటో శీరమాగధీః ।

శ్రీగన్ధం శారిబాం చైవ సమాంశం సూక్ష్మచూర్ణితమ్ (4) ద్రాక్షాదికకషాయేణ సప్తధా పరిభావయేత్ । ఛాయాయాం పరిశోష్యాథ వట్యః కార్యాశ్చణోపమాః (5) అయంచన్ద్రకలానామా రసేన్ద్రః పరికీర్తితః । సర్వపిత్తగదధ్వంసీ వాతపిత్త గదాపహః (6) అన్తర్బాహ్యమహాదాహధ్వంస కోఽయం మహారసః । గ్రీష్మకాలే శరత్కాలే విశేషేణ ప్రశస్యతే (7) కురుతే నాగ్నిమాన్ద్యం చ మహాతాపజ్వరం హరేత్ । శోషం మూర్ఛాం హరత్యాశు స్త్రీణాం రక్తం మహాస్రవమ్ (8) ఊర్ధ్వాధోరక్తపిత్తం చ రక్తవాన్తిం విశేషతః । మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయేన్నాత్ర సంశయః (9)

అ॥ శు॥ రసము, కాంతభస్మ, అభ్రకభస్మ, శు॥ గంధకము, వీనినొక్క తులముపరిమితిగ గ్రహించి మెత్తగానూరి తుంగగడ్డలు, మాలతీపుష్పములు, గరికవేళ్ళు, మొగలిచన్నులు, సహదేవి, కలుబంద, పర్పాటకము, తామరతూండ్లు, సదాప, పిల్లిపీచర, వీనియొక్క రసములతో నొక్కొక్కరోజు భావనచేసి తిప్పసత్తు, పర్పాటకము, వట్టివేళ్ళు, పిప్పళ్ళు, చందనము, సుగంధిపాల, వీనియొక్క చూర్ణమును ఆ యౌషదమునకు సమభాగముగ కలిపి ద్రాక్ష మొదలగువానియొక్క కషాయముతో నేడురోజులు భావనను చేసి నీడయందు ఆరనిచ్చి సెనగగింజలంతమాత్రలను చేయవలయును. ఇది మహాచంద్రకళారసమని చెప్పబడును. సమస్త పైత్యవ్యాధులను, వాతపైత్యవ్యాధులను, అంతస్తాపమును, బాహ్యతాపమును, హరించును. గ్రీష్మకాలమందును, శరత్కాలమందును, మిక్కిలి ప్రశస్తముగ నుండును. అగ్ని మాంద్యమును చేయదు. తాపజ్వరము, కృశించుట, మూర్ఛ, స్త్రీలకు గలుగు రక్తస్రావము, ఊర్ధ్వగరక్తపిత్తము, అధోగరక్తపిత్తము, రక్తవమనము, మూత్రకృచ్ఛ్రము, వీనిని నిశ్చయముగ నశింపచేయును.

## శూలగజకేసరిరసము

శ్లో॥ సూతం ద్విగుణగన్ధం చ యామైకం మర్దయేద్దృఢమ్ । ద్వయోస్తుల్యే శుద్ధతామ్రసమ్పుటే తన్నిరోధయేత్ (1) ఊర్ధ్వాధో గన్ధకం దత్వా మృద్భాణ్డే ధారయేద్భిషక్ । తతో గజపుటే పక్త్వా స్వాఙ్గశీతం సముద్ధరేత్ (2) సమ్పుటం చూర్ణయేత్సూక్ష్మం పర్ణఖణ్డైర్ద్వి గుఞ్జకమ్ । భక్షయేత్సర్వశూలార్తో హిఙ్గు శుణ్ఠిం సజీరకామ్ (3) వచాం మరిచజం చూర్ణం కర్షముష్ణజలైః పిబేత్ । అసాధ్యాన్నాశయేత్ శూలాన్ రసోఽయం గజకేసరీ (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, వీనినొకజాము ద్రుఢము మర్దించి ఈ రెండింటిని సమానమైనట్టియు శుద్ధిచేయబడినట్టియు, రాగిడిప్పలయొక్క సంపుటమునందుంచి సంధిబంధనముచేసి కుండయందుంచి యాసంపుటమునకు క్రింద మీదను శు॥ గంధకమును పోసి కుండకు మూతిమూసి సంధిబంధనముచేసి గజపుటమ నందు పక్వముచేసి చల్లారినపిదప తీసి యాసంపుటమును మెత్తగ చూర్ణముచేం వలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ తమలపాకురసముతో సేవిం శు॥ ఇంగువ, శుంఠి, జీలకఱ్ఱ, వస, మిరియాలు, వీనియొక్క చూర్ణమును కర్ష పరిమితి వేడినీటితో పుచ్చుకొనినయెడల సమస్తములగు శూలలు హరించును. ఈ శూలగ కేసరిరసము అసాధ్యములగు శూలలను కూడ హరించును.

## లఘుసింధూరభూషణము

శ్లో॥ అభ్రం గన్ధం టఙ్కణం చ రససిన్దూరకం తథా । సంగృహ సమభాగం చ కృష్ణధత్తూరకేన చ (1) మర్దయేద్భిషగిత్యేవం లఘుసిన్దూ భూషణమ్ । అనుపానవిశేషేణ సర్వరోగనికృన్తకమ్ (2) గర్భిణీరో కాన్హాన్యాత్ శుష్కకాసవినాశకమ్ । వింశతిం చ ప్రమేహాణాం నాశయేన్నాత్ర సంశయః (3)

అ॥ అభ్రకభస్మ, శు॥ గంధకము, శు॥ వెలిగారము, రససింధూరము, వీనిని సమ భాగములుగ గ్రహించి నల్లఉమ్మెత్తరసముతో మర్దింపవలయును. ఇది లఘుసింధూ భూషణమని చెప్పబడును. అనుపానవిశేషములతో సమస్తవ్యాధులను నశింప జేయును. గర్భిణీస్త్రీకి కలుగు వ్యాధులను, పొడిదగ్గును, ఇరువదివిధములగు ప్రమేహ ములను నిశ్చయముగ నశింపజేయును.

## మహాసింధూరభూషణము

శ్లో॥ అభ్రం గన్ధం టఙ్కణం చ రససిన్దూరకం తథా । నాగం వఙ్గం చ కాన్తం చ లోహం విద్రుమభస్మకమ్ (1) తథా దినత్రయం ఖల్వే భావయేచ్చామ్బుభిస్తథా । మర్దయేద్భిషగిత్యేవం మహాసిన్దూరభూషణమ్ (2) ఔషధం సర్వరోగఘ్నం నానామేహవినాశకమ్ । క్షయాధికానశేషాంశ్చ నాశయేన్నాత్ర సంశయః (3)

అ॥ అభ్రకభస్మ, శు॥ గంధకము, శు॥ వెలిగారము, రససిందూరము, సీసభస్మ వంగభస్మ, కాంతభస్మ, ఉక్కుభస్మ, పగడపుభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకముతో మూడుదినములు భావనను, మర్దనను, చేయవలయును. ఇది మహాసిందూ

భూషణమని చెప్పబడును. సమస్త వ్యాధులను హరించును. సమస్త ప్రమేహములను, క్షయ మొదలగు సమస్త వ్యాధులను, నిశ్చయముగ హరించును.

## సువర్ణసిందూరభూషణము

శ్లో॥ సువర్ణం మౌక్తికం చైవవిద్రుమం చాభ్రకం తథా । గన్ధకం టఙ్కణం చైవ రససిన్దూరకం తథా (1) కృష్ణధత్తూరతోయేన మర్దయే న్మాషమాత్రకమ్ । సేవితం చానుపానేన క్షయరోగం వినాశయేత్ (2) చత్వారింశత్పైత్తికాంశ్చ ప్రమేహానపి దుస్తరాన్ । ప్రయోజ్యం సర్వరోగేషు గర్భిణీనాం విశేషతః । సిన్దూరభూషణంనామసువర్ణపదపూజితమ్ (3)

అ॥ సువర్ణభస్మ, ముత్యభస్మ, పగడపుభస్మ, అభ్రకభస్మ, శు॥ గంధకము, శు॥ వెలిగారము, రససిందూరము, వీనిని సమభాగములుగ గ్రహించి నల్లఉమ్మెత్త రసముతో మర్దించవలయును. దీనిని మాషపరిమితిగ సేవించినయెడల క్షయ, నలుబది విధములగు పైత్యవ్యాధులు, దుస్సాధ్యములగు ప్రమేహములు, నశించును, గర్భిణీ స్త్రీలకు కలుగు సమస్త వ్యాధులయందును ముఖ్యముగ నియ్యతగినది. సువర్ణసిందూర భూషణమని చెప్పబడును.

## మహాసువర్ణసింధూరభూషణము

శ్లో॥ సువర్ణం రజతం వజ్రం మౌక్తికం చాపి విద్రుమమ్ । భుజఙ్గ మభ్రకం కాన్తం రససిన్దూరవఙ్గకే (1) పృథగ్ద్విభాగం పూర్వార్ధే త్వేకభాగం పరార్ధకే । జాతీపుష్పదసైశ్శోణమునిపుష్పైఃశువాలకైః (2) వరావారాహీలా మజ్జాహి మశాల్మలివారిభిః । ప్రత్యేకం త్రిదినం పిష్ట్వా మాషమాత్రం తు మానతః (3) మధునా సేవయేత్ప్రాతః కుష్ఠం సర్వం చ కామలామ్ । వింశతిం చ ప్రమేహాంశ్చ చత్వారింశచ్చ పైత్తికాన్ (4) సిన్దూరభూషణం నామ గర్భిణీ రోగనాశకమ్ । వీర్య వృద్ధికరం నిత్యం షణ్ఢోఽపి తరుణాయతే (5)

అ॥ బంగారపుభస్మ 2 భా, వెండిభస్మ 2 భా, వజ్రభస్మ 2 భా, ముత్యపుభస్మ 2 భా, పగడపుభస్మ 2 భా, సీసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, రససిందూరము 1 భా, వంగభస్మ 1 భా, వీనిని జాజిపువ్వులు, ఎఱ్ఱఅవిసిపువ్వులు, చెఱకు, కురువేరు, పిల్లిపీచర, నేలతాడి, వట్టివేళ్ళు, ఎఱ్ఱచందనము, బూరుగ, వీని యొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులు మర్దింపవలయును. దీనిని మాష పరిమితిగ తేనెతో ఉదయమున సేవించినయెడల పదునెనిమిది కుష్ఠములు, కామిర్లు, ఇరువది ప్రమేహములు, నలుబది పైత్యవ్యాధులు, నశించును. సిందూరభూషణమని

చెప్పబడును. గర్భిణీస్త్రీలకు గలుగు వ్యాధులను నశింపజేయును. నిత్యము వీర్యవృద్ధిని చేయును. నపుంసకుని కూడ యౌవనవంతునిగ చేయును.

## మహాసువర్ణసిందూరభూషణము. (ప్రకారాంతరము)

శ్లో॥ సువర్ణంచైవ వైక్రాన్తం వజ్రం విద్రుమమౌక్తికే। భుజఙ్గమ భ్రకం కాన్తం రససిన్దూరం విమిశ్రయేత్ (1) ఏకైకభాగం సంగృహ్య సువర్ణా దీని పఞ్చచ । భుజఙ్గాదీని చత్వారి చతుర్భాగం పృథక్పృథక్ (2) జాతీ పుష్పరసై రక్తమునిపుష్పైశ్చవాలకైః । వరావారాహిలామజ్జాహిమ శాల్మలి వారిభిః (3) పృథగ్గినైకమర్ద్యంచ మాషమాత్రం తు సేవయేత్ । వింశతిం శ్లైష్మికాన్ రోగాన్ చతుర్వింశతిపైత్తికాన్ (4) అశీతిం వాతజాన్ రోగాన్ కుష్ఠం సర్వం చ కామలామ్ । ప్రమేహాంశ్చ తథా శూలం స్సని పాతాంస్త్ర యోదశ (5) అతిసారం చ యక్ష్మాణం శ్లేష్మపాణ్డుం జ్వరం జయేత్ । ప్రదరం గలరోగం చ వీర్యవృద్ధికరం తథా (6) నిత్యం చ సేవనాదస్య షణ్డోఽపి తరుణాయతే । బాలవృద్ధాదిభి స్సేవ్యం గర్భిణీభిర్విశేషతః సిన్దూర భూషణం నామ రేవణేన సుభాషితమ్ (7)

అ॥ సువర్ణభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, వజ్రభస్మ 1 భా, పగడపుభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, శీసభస్మ 4 భా, అభ్రకభస్మ 4 భా కాంతభస్మ 4 భా, రససిందూరము 4 భా, వీనిని జాజిపువ్వులు, ఎఱ్ఱఅవిసిపువ్వులు, చెఱుకు, కురువేరు, పిల్లిపీచర, నేలతాడి, వట్టివేళ్ళు, ఎఱ్ఱచందనము, బూరుగ, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొకరోజు మర్దింపవలయును. దీనిని మాషపరిమితిగ సేవించిన యెడల ఇరువది శ్లేష్మవ్యాధులు, ఇరువదినాలుగు పైత్యవ్యాధులు, ఎనుబదివాత వ్యాధులు, పదునెనిమిది కుష్ఠములు, కామిర్లు, ప్రమేహములు, శూల, పదమూడు సన్ని పాతములు, అతిసారము, రాజయక్ష్మ, శ్లేష్మపాండువు, జ్వరము, ప్రదరము, కంఠ వ్యాధులు, ఇవి నశించును. వీర్యవృద్ధి కలుగును. దీని నెల్లప్పుడు సేవించినచో నపుంస కుడు కూడ యౌవనవంతుడగును. బాలురు, వృద్ధులు, మొదలగువారిచే కూడ సేవింప దగినది. గర్భిణీస్త్రీలచే ప్రధానముగ సేవింపదగినది. సిందూరభూషణమని ప్రసిద్ధ మైనది. రేవణునిచే చెప్పబడినది.

## ఆమకుఠారరసము

శ్లో॥ జాతీఫలం త్రికటుకం టఙ్కణం రసగన్ధకౌ । అహిఫేనం వత్స నాభం చ ముస్తాం కుటజచిత్రకే (1) వరాం చాతివిషాం మోచనిర్యాసంక్షార

రామతే । సంమర్దయేచ్చ విజయాస్వరసేన దినత్రయమ్ (2) వల్లప్రమాణ వటికా శుణ్ఠీ ద్రావానుపానతః । అమం శూలమతీసారం గ్రహణీంచ చిరన్తనామ్ । హన్తిచామకుఠారాఖ్యో రసస్త్రైలోక్యపూజితః (3)

అ॥ జాజికాయలు, త్రికటుకములు, శు॥ వెలిగారము, శు॥ రసము, శు॥ గంధకము, శు॥ నల్లమందు, శు॥ నాభి, తుంగగడ్డలు, కొడిశపాల, చిత్రమూలము, త్రిఫలములు, అతివస, బూరుగబంక, యవక్షారము, శు॥ ఇంగువ, వీనిని సమభాగములుగ గ్రహించి గంజాయిఆకురసముతో మూడురోజులు మర్దించి వల్లపరిమితిగ మాత్రలను చేసి శుంఠిరసానుపానముతో సేవించినయెడల ఆమము, శూల, అతిసారము, చిరకాలగతమైన గ్రహణీరోగము, నశించును. ఈ ఆమకుఠారరసము మూడులోకముల యందును ప్రసిద్ధమైనది.

## ఆనందరసము

శ్లో॥ జాతీఫలం హిఙ్గులసైన్ధవం చ వరాటశుణ్ఠీవిష హేమబీజం । సపిప్పలీకంవటికాంప్రకుర్యాద్ధుత్తూరమూలస్య రసేన మర్ద్యమ్ (1) గుఞ్జాప్రమాణం జఠరామయఘ్నం నిహన్తి వాతం కఫశూలకం చ । ఆమాతిసారం గ్రహణీ వికారం నిహన్తి శోషం సితయా సమేతమ్ । రసోఽయమానన్ద ఇతి ప్రదిష్టో గ్రహణీగదానాం యమపాణిదణ్డః (2)

అ॥ జాజికాయలు, శు॥ ఇంగిలీకము, సైంధవలవణము, గవ్వలభస్మ, శుంఠి శు॥ నాభి, శు॥ ఉమ్మెత్తవిత్తులు, పిప్పళ్ళు వీనిని ఉమ్మెత్తవేళ్ళరసముతో మర్దించి గురివిందగింజపరిమితిగల మాత్రలను చేసి సేవించినయెడల జఠరరోగములు, వాతము, కఫము, శూల, ఆమాతిసారము, గ్రహణీరోగము, ఇవి హరించును. పంచదారతో పుచ్చుకొనినయెడల కృశించుట హరించును. ఆనందరసమని చెప్పబడును. గ్రహణీవ్యాధులకు యమదండమువంటిది.

## గ్రహణీవజ్రకవాటరసము

శ్లో॥ మృతే సూతాభ్రకే గన్ధం యవక్షారం చ టఙ్కణమ్ । అగ్నిమన్థం వచాం కుర్యాత్సమభాగం తథా సుధీః (1) తతో జయన్తీజమ్బీరభృఙ్గద్రావైర్విమర్దయేత్ । త్రివాసరం తతో గోలం కృత్వా సంశోష్య ధారయేత్ (2) లోహపాత్రే శరావం చ దత్వోపరి విముద్రయేత్ । అధోవహ్నిం శనైః కుర్యాద్యామార్థం తత ఉద్ధరేత్ (3) రసతుల్యామతివిషాం దద్యాన్మో

చరసం తథా । కపిత్థవిజయానీ రైర్భావయేత్సప్తధా పృథక్ (4) ధాతకీన్ద్రి యవాముస్తాలోధ్రప్రతివిషామృతాః । ఏతద్ద్రివైర్భావయిత్వా దినైకంచ విశోష యేత్ (5) రసో వజ్రకవాటాఖ్యో మాషైకం మధునా లిహేత్ । వహ్నిం శుణ్ఠిం వేల్లబిల్వాలవణం చూర్ణయేత్సమమ్ । పి బేదుష్ణాంబునా చాను సర్వాం చ గ్రహణీం హరేత్ (6)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, శు॥ గంధకము, యవక్షారము, శు॥ వెలిగారము. కారసెల్లి, వస, వీనిని సమభాగములుగ గ్రహించి వెలగ, నిమ్మకాయ, గుంటగల గర, వీనియొక్క రసములతో మూడురోజులు మర్దించి ఉండచేసి ఎండించి లోహ పాత్రయందుంచి పైన మూకుడుమూసి సంధిబంధనముచేసి క్రిందను అరజాము మెల్లిగ మంటవేసి తీసి యామందునకు సమానమగు అతివసను, బూరుగబంకను, కలిపి వెలగ యొక్కయు, గంజాయియొక్కయు, రసములతో నేడేసి రోజులును ఆరెపువ్వు, కొడిశ పాలవిత్తులు, తుంగగడ్డలు, లొద్దుగ, అతివస, తిప్పతీగ, వీనియొక్క రసములతో నొక్కొకరోజును భావనచేసి ఎండింపవలయును. వజ్రకవాటరసమని చెప్పబడును. దీనిని మాషపరిమితిగ తేనెతో పుచ్చుకొని వెంటనే చిత్రమూలము, శుంఠి, వాయు విడంగములు, మారేడు, సైంధవలవణము, సమభాగములగు వీనియొక్క చూర్ణమును వేడినీటితో పుచ్చుకొనవలయును. సమస్తమైన గ్రహణీరోగములు హరించును.

## ప్రదరరిపురసము

శ్లో॥ రసం గన్ధం సీసం మృతమితిసమం తైస్తు రసకం సమానం సర్వైస్స్యాత్తులితమపి లోధ్రం వృషరసైః । దినం పిష్టం నామ్నా ప్రదరరిపు రేషోఽప హరతి ద్వివల్లః క్షౌద్రేణ ప్రదరమపి దుస్సాధ్యమపి చ (1)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, సీసభస్మ, ఇవి సమభాగములు వీనితో సమాన ము శు॥ కపురి, వీనియన్నిటితో సమానము లొద్దుగచూర్ణము, వీనిని అడ్డసరపురస ముతో నొకరోజు మర్దించవలయును. ఇది ప్రదరరిపురసమనబడును. దీనిని రెండువల్ల ములపరిమితిగ తేనెతోపుచ్చుకొనినయెడల కఠినసాధ్యమైన ప్రదరవ్యాధికూడ నశించును.

## నింబనిర్యాసయోగము

శ్లో॥ పిచుమన్దస్య నిర్యాసో ధాత్రీక్వాథేన పేషితః । శిలాధాతుసమా యుక్తశ్శుక్ల మేహవినాశకః (1)

అ॥ వేపబంకను ఉసిరికపండ్లరసముతో నూరి శిలాజతు కలిపి సేవించిన యెడల శుక్లమేహము హరించును.

## నారాచరసము

శ్లో॥ భృష్టటఙ్కణకం చైవ మరిచం చ రసం తథా । ఏకైకభాగం సంగృహ్య యత్నతః కుశలో భిషక్ (1) గన్ధకం పిప్పలీం శుణ్ఠీం ద్విభాగం చ విచూర్ణయేత్ ॥ సర్వతుల్యం తథా దన్తీబీజం కృతమకల్మషమ్ । ద్విగుఞ్జం రేచనం చైతదుదరాణి వ్యపోహతి (2)

అ॥ పొంగించిన వెలిగారము 1 భా, మిరియాలు 1 భా, శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, పిప్పళ్ళు 2 భా, శుంఠి 2 భా, శు॥ నేపాళపువిత్తులు 9 భా, వీనిని చూర్ణముచేసి రెండు గురివిందగింజల పరిమితిగ సేవించినయెడల విరేచనములను చేయును. ఉదరములను నశింపచేయును.

## మృతసంజీవనీరసము

శ్లో॥ కర్పూరం రసగన్ధకే చ దరదం తీక్ష్ణోద్భవం భస్మకం । కాలేయేన్ద్రయవాజమోదహుతభుక్చిఞ్చాస్థికం ధాతకీమ్ । ఏలామాంసిలవఙ్గశాల్మలిమలం జాతీఫలం టఙ్కణం । సీకాసిన్ధుభవం విషం సమమిదం ప్రత్యేకనిష్కాన్వితమ్ (1) సర్వేషాం సదృశం చ బిల్వఫలకం కాన్త్యాభ్రసిన్దూరకం । సిన్ధూరం చ సఫేనకం చ తులితం ధుత్తూరబీజం క్షిపేత్ । భఙ్గా పత్రరకోకిలాక్షసహితం సర్వం చ చూర్ణీకృతం । ధుత్తూరస్వరసేన సప్తమిదం గుఞ్జాప్రమాణా వటీ (2) సేవ్యా చేన్మధునా హరేత్ప్రశమియం రక్తాతిసారం పరం । సర్వేషు గ్రహణీగదేషు సహజేష్వామాతిసారేషు చ । తప్తుచ్ఛాయయురాంశ్చ దుస్తరతరాన్నానాతిసారాన్జయేత్ (3)

అ॥ శు॥ రసకర్పూరము, శు॥ రసము, శు॥ గంధకము, శు॥ ఇంగిలీకము, తీక్ష్ణలోహభస్మ, కస్తూరిపసుపు, కొడిశపాలవిత్తులు, వాము, చిత్రమూలము, చింతగింజలు ఆరెపువ్వు, ఏలకులు, జటామాంసి, లవంగములు, బూరుగబంక, జాజికాయలు, శు॥ టంకణము, సముద్రఫలవిత్తులు, శు॥ నాభి, వీనిని ఒక్కొక్కనిష్కము చొప్పునను మారేడు జేసము (గుజ్జు), కాంతభస్మ, అభ్రకసింధూరము, రససింధూరము, శు॥ నల్లమందు, శు॥ ఉమ్మెత్తవిత్తులు, శు॥ గంజాయాకు, నీరుగులిమిడివిత్తులు, వీనిని పంచా

మిశ్రినిశ్శ్రములు చూర్ణమును గ్రహించి ఉమ్మెత్త రసముతో ఎడతెగక మర్దించి గురివింద గింజపరిమితిగల మాత్రలనుచేసి తేనెతో సేవించినయెడల రక్తాతిసారము, సమస్త గ్రహణీరోగములు, ఆమాతిసారములు, ఇవి నశించును. నొప్పితోకూడినట్టియు, అసాధ్యములైనట్టియు, అతిసారములుకూడ నశించును.

## పూగాదిలేపము (ఉపదంశమునకు)

శ్లో॥ పూగం సుదగ్ధమేకైకం రసం గన్ధకహిఙ్గులౌ । ఖదిరం తుత్థకం చైవ మర్దయేన్నిమ్బనీరకైః । ఉపదంశేష్వృతైర్లేపస్త్రిదినాద్వ్రణరోపణమ్ (1)

అ॥ పోకచెక్కలమసి, రసము, గంధకము, ఇంగిలీకము, చంద్ర, మైలతుత్థము, వీనినొక్కొక్కభాగము గ్రహించి వేపాకురసముతోనూరి నేతితోపూసినయెడల కొరుకు రోగమందలి పుండ్లు మూడురోజులలో శమించును.

## స్వర్ణమాలినీవసంతము

శ్లో॥ స్వర్ణం ముక్తాదరదమరిచం భాగవృద్ధ్యా ప్రదేయం । ఖర్పర్యష్టౌ ప్రథమనవనీ తేన నిమ్బ్వమ్బునా చ యావత్స్నేహో వ్రజతి విలయం మర్దయేద్దీయతేఽసౌ । గుఞ్జాద్వన్ద్వం మధుచపలయా సర్వరోగే వసన్తః (1) శ్లో॥ జీర్ణజ్వరే ధాతుగతేఽతిసారే రక్తాన్వితే రక్తభవే వికారే। ఘోరవ్యధే పిత్తభవే చ దోషే వల్లద్వయం దుగ్ధయుతం చ పథ్యమ్ (2) శ్లో॥ ప్రదరం నాశయ త్యాశు తథా దుర్నామశోణితమ్ । విషమం నేత్రరోగం చ గజేన్ద్రమివ కేసరీ (3) వసన్తో మాలినీపూర్వస్సర్వ రోగహరశ్శివః । గర్భిణ్యాస్తత్ర దేయో హి జయిన్యాః పుష్పకేస్సహ । సర్వరోగహరశ్శ్రేష్ఠో గర్భపోషణ ఉత్తమః (4)

అ॥ బంగారుభస్మ 1 భా, ముత్యపుభస్మ 2 భా, శు॥ ఇంగిలీకము 3 భా, మిరియాలచూర్ణము 4 భా, శు॥ కఫర 8 భా, వీనిని పాలు-చిలికతీసిన వెన్నతోడను, నిమ్మకాయరసముతోడను, మర్దింపవలయును. వెన్నయొక్క చముర (జిడ్డు) పోవువరకు మర్దింపవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ తేనె, పిప్పళ్ళు, వీనితో సమస్తవ్యాధులయందు నియ్యవలయును. స్వర్ణమాలినీవసంతమని చెప్పబడును. జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము, అతిసారము, రక్తాతిసారము, రక్తదోషము, అధికమగు బాధగల పిత్తదోషము, వీనియందు రెండువల్లములపరిమితిగ నిచ్చి పాలతోకూడిన యాహారము నియ్యవలయును. ప్రదరము, అర్శస్సునుంచి రక్తము స్రవించుట, విషమజ్వరము,

నేత్రవ్యాధులు, వీనిని "ఏనుగు సింహమువలె" హరించును. పసిపిల్లలకు కలుగు సమస్త వ్యాధులను హరించును. గర్భిణీ స్త్రీలకు తెక్కలిపుష్పరసముతో నియ్యవలయును. సమస్తజ్వరములను హరించుటయందు శ్రేష్ఠమైనది. గర్భమును పోషించుటయందుత్తమమైనది.

## స్వర్ణమాల్యవసంతము

శ్లో॥ హేమభస్మం చ భాగైకం మౌక్తికం చ ద్విభాగకమ్ । దరదం చ త్రిభాగం చ చతుర్థం మరిచం క్షిపేత్ (1) భాగాష్టకం సూతభస్మ జమ్బీరేణ విమర్దయేత్ । నవనీతేన మర్ద్యం చ గులికాన్ కారయేద్భిషక్(2) యక్ష్మరాజం నిహన్త్యాశు ధాతుగజ్వరనాశకః । ఛర్ద్యతీసారహన్తా చ స్వర్ణ మాల్య వసన్తకః (3)

ఆ॥ బంగారుభస్మ 1 భా, ముత్యభస్మ 2 భా, శు॥ ఇంగిలీకము 3 భా, మిరియాల చూర్ణము 4 భా, రసభస్మ 8 భా, వీనిని నిమ్మకాయరసముతోడను, వెన్నతోడను మర్దించి కుప్పెలను కట్టవలయును. ఇది రాజయక్ష్మను, ధాతుగతజ్వరమును, వాంతిని, అతిసారమును, హరించును. స్వర్ణమాల్యవసంతమని చెప్పబడును.

## సువర్ణవసంతమాల్యము

శ్లో॥ సువర్ణం మౌక్తికం తారం వఙ్గం వైక్రాన్తమభ్రకమ్ ॥ కాన్తం ఖర్పరతాలే చ ప్రవాలం తామ్రమీఙ్గులౌ (1) సర్వభాగైస్సమం సూతం సూతతుల్యం చ గన్ధకమ్ । సుముహూర్తే ఖల్వమధ్యే చాదిత్యే గురువాసరే (2) మర్దయేద్ద్రాక్షజరసై రక్తకార్పాసజద్రవైః । కుమార్యాశ్చ రసేనైవ కాచ కూప్యాం ప్రపాచయేత్ (3) స్వాఙ్గశీతల ముద్ధృత్య నవనీతేన మర్దయేత్ । పునర్జమ్బీరనీరేణ మర్దయేద్యామ మాత్రకమ్ (4) మాషమాత్రం ప్రదాతవ్యం మధుశర్కరయాయుతమ్ । ఏకాదశక్షయాన్ హన్తి పాణ్డుకామలనాశకః (5) వింశతిం చ ప్రమేహాంశ్చ చతుర్వింశతిపైత్తికాన్ । శుక్లమేహమజీర్ణం చ కాస శ్వాశజ్వరాన్ హరేత్ । అశ్వినీదేవతైః ప్రోక్తః స్వర్ణమాల్యవసన్తకః (6)

అ॥ సువర్ణభస్మ, ముత్యభస్మ, రజతభస్మ, వంగభస్మ, వైక్రాంతభస్మ, అభ్రకభస్మ, కాంతలోహభస్మ, శు॥ కఘరి, శు॥ తాలకము, పగడభస్మ, తామ్రభస్మ, శు॥

ఇంగిలీకము, వీనిని సమభాగములుగను వీనియన్నిటితో సమానమగు శు॥ పాదరసమును, పాదరసముతో సమానమగు శు॥ గంధకమును, యోగ్యమైన ముహూర్తమునందు ఖల్వమందుంచి ఆదిత్య (ఆది) వారమునందును, గురువారమునందును ద్రాక్షపండ్లరసముతోడను, ఎఱ్ఱపత్తి పువ్వులరసముతోడను, కలుబందరసముతోడను, మర్దించి కాచకుప్పెయందుంచి వండి స్వాంగశీతలమునతీసి వెన్నతో మర్దించి మరల నిమ్మకాయ రసముతో నొకజాము మర్దించి మాషపరిమితిగ తేనె, పంచదార, వీనితోకూడ నిచ్చిన యెడల పదనొకండు క్షయలు, పాండువు, కామిర్లు, ఇరువది ప్రమేహములు, ఇరువది నాలుగు శైత్యవ్యాధులు, శుక్లనష్టము, అజీర్ణము, దగ్గు. ఆయాసము, జ్వరము, ఇవి హరించును. ఇది అశ్వినీదేవతలచే చెప్పబడినది. స్వర్ణమాల్యవసంతమని చెప్పబడును.

## సువర్ణమాల్యము

వ॥ బంగారుభస్మ 1 భా, వెండిభస్మ 2 భా, ఇనుపలోహభస్మ 3 భా, ఖడ్గలోహభస్మ 4 భా, శంఖభస్మ 5 భా, మాండూరభస్మ 6 భా, ముత్యభస్మ 7 భా, పగడభస్మ 8 భా, హేమమాక్షికభస్మ 9 భా, వైక్రాంతభస్మ 10 భా, కాంతభస్మ 11 భా, సీసభస్మ 12 భా, వంగభస్మ 13 భా, అభ్రకభస్మ 14 భా, కస్తురి 3½ భా, వీనిని ఆవువెన్న, వేపచక్కరసము, నిమ్మపండ్లరసము, వీనితోనూరి కుప్పెలు కట్టవలయును. దీనిని సేవించినయెడల ఏకాదశక్షయలు, ఇరువదిప్రమేహములు, శుక్లనష్టము, శ్వేతరక్తప్రదరములు, జీర్ణజ్వరము, దౌర్బల్యము, దగ్గు, పాండువు, అజీర్ణము, అతిమూత్రము, మధుమేహము, మొదలగు వ్యాధులు నశించును. ఇది వీర్యమును చిక్కపరచి వీర్యస్తంభమును చేయును. సంభోగశక్తిని హెచ్చించును.

## జలజామృతరసము

శ్లో॥ త్వక్క్షీరీం చ శిలాధాతుం వఙ్గం కుణ్డలిసత్త్వకమ్ । మేహారిబీజ కాన్యేవ విదారీజీవనీరసైః (1) భావయేచ్చత్రివారం సితోపల సమన్వితః । జలజామృతవిఖ్యాతో రసోఽయం మేహకృచ్ఛ్రినుత్ (2)

అ॥ వెదురుప్పు, శిలాజతు, వంగభస్మ, లిప్పసత్తు, నేలతంగేడివిత్తులు, వీనిని నేలగుమ్మడియొక్కయు, పాలకూరయొక్కయు, రసములతో మూడురోజులుభావన చేయవలయును. జలజామృతరసమనెడి యీయౌషధమును పటికబెల్లముతో సేవించిన యెడల మేహములను, మూత్రకృచ్ఛ్రమును నశించును.

## లోకనాధరసము (గ్రహణ్యాదులకు)

శ్లో॥ శుద్ధసూతం విషం గన్ధం టఙ్కణం లోహభస్మకమ్ । జాతీఫలం ధాతకీం చ వరాఙ్గం చిత్రమూలకమ్ (1) జీరకం నాగరం సిన్ధుం చూత

బీజం చ పిప్పలీమ్ । మోచాపిచ్ఛాం బిల్వమజ్జాం ముస్తాం చాతి విషాం పృథక్ (2) సప్తభాగమఫేనం చ సర్వతుల్యం మృతాభ్రకమ్ । ధత్తూరత్వక్కషాయేణ మర్దయేద్యామమాత్రకమ్ (3) బదరాస్థిసమం ఖాదేద్వహ్నిదీప్తికరః పరమ్ । అనుపానవిశేషేణ గ్రహణీం చ చిరన్తనామ్ । సర్వాజీర్ణాని మధునా శమయత్యేవ నిశ్చయమ్ (4)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ టంకణము, లోహభస్మ, జాజికాయలు ఆరెపువ్వు, దాసనచెక్క, చిత్రమూలము, జీలకర్ర, శుంఠి, సైంధవలవణము, మామిడి టెంకలోని పప్పు, పిప్పళ్ళు, బూరుగబంక, మారేడుగుజ్జు, తుంగగడ్డలు, అతివస, వీని నొక్కొక భాగముగను, శు॥ నల్లమందును 7 భాగములుగను, అభ్రక భస్మమును వీని యన్నిటితో సమానముగను గ్రహించి ఉమ్మెత్త వేళ్ళ పట్టయొక్క కషాయముతో నొకజాము మర్దింపవలయును. దీనిని రేగుగింజంత పరిమితిగ సేవింపవలయును. అగ్ని దీప్తిని చేయును. అనుపాన విశేషముతో చిరకాలగతమైన గ్రహణీ రోగమును, తేనెతో సమస్తమైన అజీర్ణములను, నిశ్చయముగ శమింపజేయును.

## హృ ద య బం ధు ర స ము

శ్లో॥ రసగన్ధాభ్రభస్మాని పార్థవృక్షత్వగమ్బునా । ఏకవింశతిధా ఘర్మే భావయేచ్చ విధానతః (1) మాషమాత్రమిదం చూర్ణం మధునా సహ లేహయేత్ । వాతజం పిత్తజం శ్లేష్మసముద్భూతం వా త్రిదోషజమ్ । కృమిజం చాపి హృద్రోగం నిహన్త్యేవ న సంశయః (2)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, అభ్రకభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి మద్దిచెక్కరసముతో ఇరువదియొక పర్యాయములు ఎండయందు యథావిధిగ భావనచేసి చూర్ణము చేయవలయును. ఈ చూర్ణమును తేనెతోకూడ పుచ్చుకొనిన యెడల వాతమువలనను, పిత్తమువలనను, శ్లేష్మమువలనను, జనించునట్టియు త్రిదోషములవలనగాని క్రిములవలనగాని జనించునట్టియు హృద్రోగము నిశ్చయముగ నశించును.

## శూ లే భ హ రి ర స ము

శ్లో॥ రసవిషగన్ధకపర్దక్షారేణ సిన్ధుపిప్పలివిశ్వైః । అహివల్ల్యమ్బువిఘృష్టశ్శూలేభహరిరసో గుఞ్జాద్వయకః (1)

అ॥ శు॥ రసము, శు॥ నాభి, శు॥ గంధకము, గవ్వలభస్మ, శు॥ వెలిగారము సైంధవలవణము, పిప్పళ్ళు, శుంఠి, వీనిని తమలపాకు రసముతో నూరి రెండు గురివింద గింజల పరిమితిగ సేవించినయెడల ఏనుగును సింహామువలె శూలను హరించును.

## సువర్ణభూపతి

శ్లో॥ శుద్ధసూతం సమం గన్ధం మృతశుల్బం తయోస్సమమ్ । అభ్రలోహకయోర్భస్మ కాన్తభస్మ సువర్ణజమ్ (1) రజతం చ విషం సమ్యక్ పృథక్సూత సమం భవేత్ । హంసపాదీరసైర్మర్ద్యం దినమేకం వటీకృతమ్ (2) కాచకూప్యాం వినిక్షిప్య మృదా సంలేపయేద్బహిః । శుష్కాం తాం వాలుకాయన్త్రే శనైర్మృద్వగ్నినా పచేత్ (3) చతుర్గుఞ్జామితం దేయం పిప్పల్యార్ద్రద్రవేణ తు । క్షయం త్రిదోషజం హన్తి సంనిపాతాంస్త్రయోదశ (4) ఆమవాతం ధనుర్వాతం శృఙ్ఖలా వాతమేవ చ । ఆఢ్యవాతం పఙ్గువాతం కఫవాతాగ్నిమాన్ద్యకమ్ (5) కటివాతం సర్వశూలం నాశయేన్నాత్ర సంశయః । గుల్మశూల ముదావర్తం గ్రహణీమతిదుస్తరామ్ (6) ప్రమేహముదరం సర్వా మశ్మరీం మూత్రనిగ్రహమ్ । భగన్దరం సర్వకుష్ఠం విద్రధిం మహతీం తథా । శ్వాసం కాసమజీర్ణం చ జ్వరమష్టవిధం తథా (7) కామలాం పాణ్డురోగం చ శిరోరోగం చ నాశయేత్ (8) అనుపానవిశేషేణ సర్వరోగాన్వినాశయేత్ । యథా సూర్యోదయే నశ్యేత్తమః సర్వగతం తథా । సర్వరోగవినాశాయ సర్వేషాం స్వర్ణభూపతిః (9)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, తామ్రభస్మ 2 భా, అభ్రకభస్మ 1 భా, లోహభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, వెండిభస్మ 1 భా, శు॥ నాభి 1 భా, వీనిని హంస పాదిరసముతో నొకదినము మర్దించి మాత్రలుచేసి కాచకుప్పెయందుంచి మట్టితో పైనపూసి ఎండినపిదప వాలుకాయంత్రమందుంచి మందాగ్నిచే మెల్లగ వండవలయును. దీనిని నాలుగు గురివిందగింజల పరిమితి చొప్పున పిప్పళ్ళు, అల్లము, వీనియొక్క రసముతో నిచ్చినయెడల త్రిదోషజక్షయ, త్రయోదశ సంనిపాతములు, ఆమవాతము, ధనుర్వాతము, శృంఖలావాతము, ఆఢ్యవాతము, పంగువాతము, కఫము, వాతము, అగ్నిమాంద్యము, కటివాతము, సమస్తశూలలు, గుల్మశూల, ఉదావర్తము, కఠినమైన గ్రహణి, ప్రమేహము, ఉదరవ్యాధి, అశ్మరి, మూత్రబంధము, మలబంధము, భగందరము, సమస్తకుష్ఠములు, విద్రధి, శ్వాస, కాస, అజీర్ణము, ఎనిమిది జ్వరములు, కామిర్లు, పాండురోగము, శిరోరోగము, ఇవి నశించును. అనుపాన విశేషముతో సమస్తవ్యాధులను హరించును. సూర్యోదయము సర్వవ్యాప్తమైన చీకటినివలె నీ స్వర్ణభూపతి సమస్తవ్యాధులను నశింపజేయును.

## గుంజాగర్భరసము

శ్లో॥ నిష్కత్రయం శుద్ధసూతం నిష్కద్వాదశగన్ధకమ్ । గుఞ్జాబీజం విషం నిష్కం నిమ్బబీజం జయాం తథా (1) ప్రత్యేకం నిష్కమాత్రం తు మాషం జేపాలబీజకమ్ । జాతీజమ్బీరధత్తూరకాకమాచీద్రవైర్దినమ్ (1) మర్దయేచ్చవటీః కుర్యాత్ ఘృతైర్గుఞ్జాద్వయం లిహేత్ । గుఞ్జాగర్భరసో నామ హిఙ్గు సైన్ధవసంయుతమ్ । మణ్డం తు దాపయేత్పథ్యమూరుస్తమ్భ ప్రశాన్తయే (3)

అ। శు। రసము 3 నిష్కములు, శు। గంధకము 12ని, గురివిందగింజలు 1 ని, శు॥ నాభి 1 ని, వేపగింజలు, 1 ని, తెక్కలి 1 ని, శు। నేపాళములు 1 మాషము, ఇట్లు వీనిని గ్రహించి జాజికాయలు, నిమ్మకాయలు, ఉమ్మెత్త, కాచికూర, వీని యొక్క రసములతో నొకదినము మర్దించి వప్పెలు కట్టవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ నేతితో సేవించవలయును. గుంజాగర్భరసమని చెప్పబడును. ఇంగువ, సైంధవలవణము, వీనితోకూడిన మండము (జావసూది తేటను) పథ్యముగ నియ్యవలయును. ఊరుస్తంభము శాంతించును.

## లంకేశ్వరరసము

శ్లో॥ పలైకం శుద్ధసూతం చ కర్షైకం శుద్ధగన్ధకమ్ । గన్ధతుల్యం మృతం తామ్రం సూతాంశం మర్దయేద్విషమ్ (1) సర్వతుల్యం పునర్గన్ధం దత్వాకించిద్విమర్దయేత్ । ఘృతాభ్యక్తే లోహపాత్రే పచేద్యామం సముద్ధరేత్ (2) రమ్భాపత్రపుటే చాథ పాచయేత్పర్పటీం యథా । మాషైకం చూర్ణితం ఖాదేత్సర్వకుష్ఠం నియచ్ఛతి । నిష్కైకం వాకుచీచూర్ణం క్షౌద్రైర్లేహ్యం తథాను చ (3)

అ। శు। రసము 1 పలము, శు। గంధకము 1 కర్షము, తామ్రభస్మ 1 కర్షము, శు॥ నాభి 1 పలము, ఇట్లువీనిని గ్రహించి మర్దించి అన్నిటికిని సమానముగ శు॥ గంధకము మరలచేర్చి కొద్దిగనూరి నేతితో పూయబడిన ఇనుప పాత్రయందు నొకజాము వండి పర్పటీరసమువలెనే అరటియాకుల యందుంచుకొనవలయును, పిదప చూర్ణము చేసి మాషపరిమితిగ సేవించి వెంటనే నిష్కపరిమితిగల బావంచాల చూర్ణమును తేనెతో పుచ్చుకొనినయెడల సమస్త కుష్ఠవ్యాధులును నశించును.

## రక్తమారేశ్వరము

శ్లో॥ సూతం గన్ధం మృతం స్వర్ణం రససిన్దూరకాన్తకే । అభ్రకం సర్వద్విగుణం తామ్రభస్మ ద్విభాగకమ్ (1) నాగం వఙ్గం తథా రౌప్యం ప్రత్యేకం సూతసామ్యకమ్ । లోహభస్మ త్రిభాగం చ ముణ్డ సిన్దూరకం తథా (2) సర్వం ఖల్వే వినిక్షిప్య మర్దయేదతియత్నతః । ఖర్జూరో యష్టికా ద్రాక్ష మధుపుష్పం శతావరీ (3) లోధ్రః కాశ్మర్యహ్రీబేరే పద్మ కేసరపద్మకే । మృణాలం చన్దనోశీరనీలోత్పలఘనా స్తథా (4) శ్రీగన్ధం వాలుకం కుష్టం బలాశాల్మలి మూలకే । రమ్భాకన్దం గోక్షురకః మాధవీ సహదేవికా (5) పర్యూషణం తథైభిస్తు భావయేచ్చత వారకమ్ । వల్లప్రమాణకం చైవ శర్కరామృతమాక్షికైః (6) భక్షయేత్ ఘృతమిశ్రం తు రక్తపిత్తహరః పరమ్ । వింశతిం చ ప్రమేహాణాం మూత్రకృచ్ఛ్రం సుదుస్తరమ్ (7) మధుమేహం శుక్లమేహం ప్రదరౌ శ్వేతరక్తకౌ । సర్వాంశ్చ పైత్తికాన్ హన్తిరక్తమారేశ్వరోరసః (8)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, బంగారుభస్మ 1 భా, రససిందూరము 1 భా, కాంతభస్మ 1 భా, అభ్రకభస్మ 10 భా, తామ్రభస్మ 2 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, రజతభస్మ 1 భా, ఖడ్గలోహభస్మ 3 భా, ముండలోహసిందూరము 3 భా, వీనిని ఖల్వమందుంచి బాగుగ మర్దించి ఖర్జూరకాయలు, అతిమధురము, ద్రాక్షపండ్లు, ఇప్పపువ్వు, పిల్లితేగలు, లొద్దుగచెక్క, పెద్దగుమ్మడు, కురువేరు, తామరఅగరులు, పద్మకాష్టము, తామరతూండ్లు, రక్తచందనము, వట్టివేళ్ళు, నల్లకలువ, తుంగగడ్డలు, చందనము, కూతురుబుడము, సంగల్వాకోష్టు, ముత్తవపులగము, బూరుగచెక్క, ముల్లంగి, అరటిదుంప, పల్లేరు, పుష్పలగురివింద, సహదేవి, చిట్రీక, వీనియొక్క రసములతో నూరుసారులు భావనచేయవలయును. దీనిని వల్లపరిమితిగ పంచదార తిప్పసత్తు, తేనె వీనితోకూడచేర్చి నేతితోకలిపి సేవింపవలయును. రక్తపిత్తము, ఇరువది ప్రమేహములు, కఠినమైన మూత్రకృచ్ఛ్రము, మధుమేహము, వీర్యనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, సమస్తమైన పైత్యములు, ఇవి హరించును. రక్తమారేశ్వరరసమని చెప్పబడును.

## రక్తమారేశ్వరము (ప్రకారాంతరము)

శ్లో॥ సూతం గన్ధకచూర్ణం చ కాన్తం వైక్రాన్త మాక్షికౌ । నాగం వఙ్గం చ తారం చ ప్రత్యేకం వేదభాగకమ్ (1) లోహభస్మ త్రిభాగం చ

తత్సమం కృష్ణలోహకమ్ । తామ్రభస్మ ద్విభాగం చ తత్సమం కాకమాక్షికమ్ (2) శాల్మలీరససంమిశ్రం మర్దయేదేకరాత్రకమ్ । పాచయేద్వాలుకాయన్త్రే తత ఉద్ధృత్య శీతలమ్ (3) అభ్రం వింశతిభాగం చ సిన్దూరం సూతభాగకమ్ । విమిశ్రయేత్తతః క్షిప్త్వా ఖల్వమధ్యే తు యత్నతః (4) ఖర్జూరో యష్టికాద్రాక్షా మధుపుష్పం శతావరీ । లోధ్రః కాశ్మర్యహ్రీబేరే పద్మకేసరపద్మకే (5) మృణాలం చన్దనోశీరనీలోత్పలఘనాస్తథా । శ్రీగన్ధం వాలుకం కుష్ఠంబలా శాల్మలిమూలకే (6) రమ్భాకన్దం గోక్షురకో మాధవీ సహదేవికా । పరూషణం తథైభిస్తు భావయేచ్ఛతవారకమ్ (7) వల్లప్రమాణకం చైవ శర్కరామృతశర్కరైః ॥ భక్షయేత్ ఘృతమిశ్రం తు రక్తపిత్తహరః పరమ్ (8) వింశతిం చ ప్రమేహాణాం మూత్రకృచ్ఛ్రం సుదుస్తరమ్ । మధుమేహం శుక్లమేహం ప్రదరౌ శ్వేతరక్తకౌ । సర్వాంశ్చ పైత్తికాన్ హన్తి రక్తమారేశ్వరో రసః (9)

అ॥ శు॥ రసము 4 భా, శు॥ గంధకము 4 భా, కాంతభస్మ 4 భా, వైక్రాంతభస్మ 4 భా, హేమమాక్షికభస్మ 4 భా, సీసభస్మ 4 భా, వంగభస్మ 4 భా, వెండిభస్మ 4 భా, ఖడ్గలోహభస్మ 3 భా, మాండూరభస్మ 3 భా, తామ్రభస్మ 2 భా, కాకమాక్షికభస్మ 2 భా, వీనిని బూరుగచెక్క రసముతో నొకరోజు మర్దించి వాలుకాయంత్రమందు వండి చల్లారిన పిదప తీసి 20 భాగముల అభ్రక భస్మను, 4 భాగముల రససింధూరమును కలిపి ఖర్జూరపుకాయలు, యష్టిమధుకము, ద్రాక్షపండ్లు, ఇప్పపువ్వు, పిల్లిపీచర, లొద్దుగ, పెగ్గుమ్మడు, కురువేరు, తామరఅగరులు, పద్మకాష్ఠము, తామరతూండ్లు, రక్తచందనము, వట్టివేళ్లు నల్లకలువ, తుంగగడ్డలు, చందనము, కూతురుబుడమ, చెంగల్వకోష్ఠు, ముత్తవపులగము, బూరుగ, ముల్లంగి, అరటిదుంప, పల్లేరు, పువ్వులగురువింద, సహదేవి, చిట్టీత, పెనియొక్క రసములతో నూరుసారులు భావన చేయవలయును. దీనిని వల్లపరిమితిగ పంచదార, తిప్పసత్తు, వీనితోగూడ చేర్చి నేతితో కలిపి సేవింపవలయును. రక్తపిత్తము ఇరువది ప్రమేహములు, కఠినమైన మూత్రకృచ్ఛ్రము, మధుమేహము, వీర్యనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము సమస్తమైన పైత్యములు, యివిహరించును. రక్తమారేశ్వరరసమని చెప్పబడును.

### తాలకభస్మయోగము

శ్లో॥ అపామార్గస్య భస్మాని ఘటే నిక్షిప్య యత్నతః । తన్మధ్యే తాలకం క్షిప్త్వా పచేద్ద్వాదశయామకమ్ (1) ధవలం జాయతే భస్మ సర్వకుష్ఠనివారణమ్ । సర్వవాతప్రశమనం సర్వరోగనివారణమ్ (2)

ఆ॥ ఉత్తరేణి బూడిదను కుండయందుంచి యాబూడిదమధ్యయందు శు॥ తాళకమును ఉంచి 12 గ్రాములు వంశిసయెడల తెల్లగ భస్మమగును. ఇది సమస్త కష్టములను, సమస్త వాతములను, సమస్త రోగములను నివారింపచేయును.

## క్షయకుతారము

శ్లో॥ శుద్ధసూతం విషం గన్ధమభ్రం తామ్రం వరాటకమ్। ప్రవాలం తారకం చైవ లోహం మాణ్డూరటఙ్కణౌ (1) మాక్షికం నాగవఙ్గే చ తథా మౌక్తికకాన్తకే। సమభాగం చ సంగ్రాహ్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) వర్షాభూమూలసారేణ వజ్రవల్లీరసేన చ। పీలూచిత్రరసాభ్యాం చ హంస పాదీ రసేన చ (3) గుడూచ్యా భృఙ్గరాజస్య నాగవల్ల్యాస్తథైవ చ। కుణ్డల్యాశ్చ రసేనాపి పృథగ్యామం విమర్దయేత్ (4) శరావసమ్పుటే చైవ కౌక్కుటే పుటకే పచేత్। స్వాఙ్గశీతలముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ (5) శిగ్రు మూల రసేనైవ దినైకం మర్దయేద్దృఢమ్, గులికాః కారయిత్వాథ ఛాయాశుష్కాంశ్చ కారయేత్ (6) తత్తద్రోగానుపానేన దేయం గుఞ్జాచతుష్టయమ్। తువరీముద్గయూషౌ చ తణ్డులీయకమేవ చ (7) గోక్షీరం వాస్తుకం చైవ తథాఽలర్కం త్వజాపయః। గోఘృతం మధుతక్రం చ సైన్ధవం లవణం భిషక్ (8) తథా పురాణశాలిం చ దీయతాం తత్ర యత్నతః। క్షయం క్షయకృతాః వ్యాధీనస్థిగజ్వరకం తథా (9) వాతం పిత్తం హరేచ్చైవ పాణ్డుం గుల్మం కఫం హరేత్ ॥ సద్యః క్షయకుతారోఽయం పూజ్యపాదేన నిర్మితః (10)

ఆ॥ శు॥ పాదరసము, శు॥ నాభి, శు॥ గంధకము, అభ్రకభస్మ, తామ్రభస్మ, గవ్వలభస్మ, పగడభస్మ, వెండిభస్మ, శుద్ధలోహభస్మ, మాండూరభస్మ, శు॥ టంకణము, హేమమాక్షికభస్మ, నాగభస్మ, వంగభస్మ, ముత్యభస్మ, కాంతభస్మ, వీనిని సమభాగములు గ్రహించి ఖల్వమందుంచి గలిజేరువేళ్ళు, నల్లేరు, వరగోగు, చిత్రమూలము, హంసపాది, తిప్పతీగ, గుంటగలగర, తమలపాకులు, ఉప్పి, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక జాము మర్దించి శరావసంపుటమందుంచి కుక్కుటపుటము వేసి స్వాంగశీతలమున తీసి ఖల్వమందుంచి మునగవేళ్ళ రసముతో నొకరోజు దృఢముగ మర్దించి మాత్రలుచేసి నీడను ఎండింపవలయును. దీనిని ఆయారోగములకు తగిన యనుపానములతో నాలుగు గురివింద గింజల పరిమితిగనిచ్చుచు కందికట్టు, పెసరకట్టు, చిర్రికూర, ఆవుపాలు, చక్రవర్తికూర, తెల్లజిల్లేడుకూర, మేకపాలు, ఆవు

నెయ్యి, తేనె, ఆవుమజ్జిగ, సైంధవలవణము, పాతబియ్యము, వీనిని పథ్యముగనిచ్చు చుండినయెడల క్షయ, క్షయవలన కలిగిన వ్యాధులు, అస్థిగతజ్వరము, వాతవ్యాధులు, పిత్తవ్యాధులు, పాండువు, గుల్మము, శ్లేష్మవ్యాధులు, ఇవి నెంటనే హరించును. ఈక్షయ కుఠారము పూజ్యపాదునిచే జెప్పబడినది.

## మహాక్షయకుఠారము

శ్లో॥ స్వర్ణం తారం తామ్రలోహే నాగం వఙ్గం చ మౌక్తికమ్। ప్రవాలం విషమాణిక్యే సూతభస్మ సమాంశకమ్ (1) గన్ధకం పఞ్చభాగం చ హ్యాభ్రకం చ త్రిభాగకమ్। అహిఫేనం చతుర్భాగం చతుర్భాగం చ చిత్రకమ్ (2) లవఙ్గం పిప్పలీమూలం ప్రత్యేకం పఞ్చభాగకమ్ మరిచం పిప్పలీం చైవ ప్రత్యేకం చైక భాగకం (3) ప్రత్యేకం త్రిదినం మర్ద్యం ధత్తూర విజయా రసైః। చతుర్దినం పచేదగ్నౌ వాలుకాయన్త్రయోగతః (4) ద్విగుఞ్జం మధు సర్పిర్భ్యాం లవఙ్గేన చ దీయతామ్। వాతికాన్ శ్లైష్మికాంశ్చైవ యక్ష్మాణం శూలకం తథా (5) పాణ్డురోగ మజీర్ణం చ హరేచ్చైవ న సంశయః। మహాక్షయకుఠారోఽయం గౌరీనాథప్రకల్పితః (6)

అ॥ సువర్ణభస్మ 1 భా, వెండిభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, లోహభస్మ 1 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, పగడభస్మ 1 భా, శు॥ నాభి 1 భా, మాణిక్యభస్మ 1 భా, రసభస్మ 1 భా, శు॥ గంధకము 5 భా, అభ్రకభస్మ 3 భా, శు॥ నల్లమందు 4 భా, చిత్రమూలము 4 భా, లవంగములు 5 భా, మోడి 5 భా, మిరియాలు 1 భా, పిప్పళ్ళు 1 భా, ఇట్లు వీనిని ఖల్వమందుంచి ఉమ్మెత్త, గంజాయి, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులు మర్దించి వాలుకాయంత్రమందు నాలుగు రోజులు వండవలయును. దీనిని తేనె, నెయ్యి, లవంగములు, వీనితో రెండు గురిగింజగింజల పరిమితిగనిచ్చినయెడల వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, రాజయక్ష్మ, శూల, పాండురోగము, అజీర్ణము, ఇవి హరించును. ఈ మహాక్షయ కుఠారము గౌరీనాథునిచే చెప్పబడినది.

## మహాక్షయకుఠారము (ప్రకారాంతరము)

శ్లో॥ లోహస్య భసితం తామ్రం వైక్రాన్తం కాన్తమభ్రకమ్। నాగం వఙ్గం చ మాణ్డూరం శఙ్ఖశుక్తివరాటికాన్ (1) పారదం గన్ధకం చైవ తాలకం చ మనశ్శిలామ్। సువర్ణం రజతం చైవ ప్రత్యేకం సమభాగకమ్ (2) కన్యారసేన సంమర్ద్య కాచకూప్యన్తరే క్షిపేత్। పాచయేద్వాలుకాయన్త్రే

క్రమాగ్నౌ యామయుగ్మకమ్ (3) రక్తచిత్రక మూలం చ వ్యాఘ్రీక న్దదు రాలభే । కన్యా భృఙ్గీ కాకమాచీ నిర్గుణ్డీ చ కురణ్టకః (4) వాసా ముణ్డీ కాక జఙ్ఘా నీలీ నిమ్బపటోలకే ఏభిర్యామం పృథక్ మర్ద్యం భావయేచ్చ పునః పునః (5) మహాక్షయకుఠారోఽయం సర్వరోగనిబర్హణం । క్షయం కాసం జ్వరం శ్వాసం శోథం పాణ్డుంచ పీనసమ్ (6) మన్దాగ్నిం తిమిరం వాతం మేహజక్షయకం జయేత్ । కఫజాన్వివిధాన్ రోగానజీర్ణం గుల్మ మేవ చ । సర్వ రోగాన్హరేచ్ఛీఘ్ర మాత్రేయమునిభాషితః (7)

అ॥ లోహభస్మ, తామ్రభస్మ, వైక్రాంతభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ నాగ భస్మ, వంగభస్మ, మాండూరభస్మ, శంఖభస్మ, ముత్యపు చిప్పలభస్మ, గవ్వలభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, శు॥ తాళకము, శు॥ మనశ్శిల, సువర్ణభస్మ, రజతభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి కలుబందరసముతో మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే రెండు జాములు వండి తీసి ఎఱ్ఱచిత్రమూలము, వాకుడు, అడవికంద, దూలగొండి, కలుబంద, గుంటగలగర, కాచికూర, వావిలి, గోరింట, అడ్డసరము, బోడసరము, వెలుసుసంధి, నీలి, వేప, చేదుపొట్ల, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక జాము మర్దింపవలయును. తఱచు భావననుకూడ చేయవలయును. ఈ మహాక్షయ కుఠారము సర్వరోగములను నశింపచేయును. మఱియు క్షయ, కాస, జ్వరము, శ్వాస, నంజువ్యాధి, పాండువు, జలుబు, అగ్నిమాంద్యము, తిమ్మిర్లు, వాతవ్యాధులు, మేహక్షయ, సమస్తమైన శ్లేష్మవ్యాధులు, అజీర్ణము, గుల్మము, వీనిని నశింపజేయును. సమస్తవ్యాధులను వెంటనే హరించును. ఆత్రేయమునిచే చెప్పబడినది.

## అర్శఃకుఠారము

శ్లో॥ శుద్ధసూతం పలైకం తు ద్విపలం శుద్ధగన్ధకమ్ । మృతం తామ్రం మృతం లోహం ప్రత్యేకం చ పలత్రయమ్ (1) త్ర్యూషణం లాఙ్గలీం దన్తీం చిత్రకం పీలుకం తథా । ప్రత్యేకం ద్విపలం యోజ్యంయవక్షారం చ టఙ్కణమ్ (2) ఉభేపఞ్చపలం యోజ్యే సైన్ధవం పలపఞ్చకమ్ । ద్వాత్రింశత్పలగో మూత్రం స్నుహీక్షీరం చ తత్సమమ్ (3) మృద్వగ్నినా పచేత్సమ్యక్ స్థాల్యాం యావత్సుపిణ్డితమ్ । మాషద్వయం సదా ఖాదేద్రసో హ్యర్శఃకుఠారకః (4)

అ॥ శు॥ రసము 1 పలము, శు॥ గంధకము 2 ప, తామ్రభస్మ 3 ప, లోహభస్మ 3 ప, త్రికటుకములు 2 ప, చెన్న చెర్లగడ్డ 2ప, శు॥ నేపాళములు 2ప, చిత్రమూలము 2 ప, వరగోగు 2 ప, యవక్షారము 5 ప, శు॥ వెలిగారము 5 ప, సైంధవలవణము 5 ప, గోమూత్రము 32 ప, జెముడుపాలు 32 ప, వీనినన్నిటిని కలిపి కుండయందు చిన్న మంటచే ముద్దయగువరకు చక్కగ వండవలయును. దీనిని రెండుమాషముల పరిమితిగ నెల్లప్పుడు తినవలయును. ఈ అర్శఃకుఠారరసము అర్శస్సులను ఛేదించును.

## శుద్ధామృతరసము

శ్లో॥ పారదం చ క్రియాశుద్ధం తత్తుల్యం శుద్ధగన్ధకమ్। అభ్రకం తుద్వయోస్తుల్యం త్రిభిస్తుల్యంతు గుగ్గులుమ్ (1) సర్వాంశ మమృతాసత్వం భావయేచ్చ పృథక్ పృథక్ । నిర్గుణ్డీగోక్షురచ్ఛిన్నా కోకిలాక్షాఖ్యజైర సైః (2) సప్తవారంతతో యుఞ్జాద్వాతర క్తే త్రివల్లకమ్ । కోకిలాక్షస్య మూలానాం కషాయ మనుపాయయేత్ (3)

అ॥ శు॥ రసము 1భా, శు॥ గంధకము 1 భా, అభ్రకభస్మ 2 భా, శు॥ మహిషాక్షిగుగ్గులు 4భా, తిప్పసత్తు 8భా. ఇట్లు వీనిని గ్రహించి వావిలి, పల్లేరు, తిప్పతీగ, నీరుగొలిమిడివేళ్ళు వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నేడేసిరోజులు భావనను చేయవలయును. దీనిని మూడువల్లములపరిమితిగ సేవించి వెంటనే నీరుగొలిమిడివేళ్ల కషాయమును త్రాగినయెడల వాతరక్తము నశించును.

## అర్శోలేపము

శ్లో॥ గౌరీపాషాణకకర్షం స్నుహీకాణ్డే వినిక్షిపేత్। పాచయేత్పుట పాకేన తత ఉద్ధృత్య యత్నతః (1) రేవాచనీంచ కుషంచ కల్కీకృత్యత్రయం సమమ్। లేపయేత్తేన చార్శాంసి నివార్యన్తే నసంశయః॥

అ॥ ఒకకర్ష పరిమితిగల గౌరీపాషాణమును జెముడుకాడయందుంచి పుటపాకముగ పచనము చేసి జాగ్రత్తగ తీసి రేవల్చిన్ని, చెంగల్వకోష్టు, వీనిని ప్రత్యేకముగ పాషాణముతో సమానముగ గ్రహించి మూడింటిని కలిపి నూరి ముద్దచేసి లేపనము (పూత) చేసినయెడల మూలవ్యాధులు నిస్సందేహముగ నివారించును.

## క్షయగజకేసరిరసము

శ్లో॥ మృతమభ్రం మృతం సూతం మృతం లోహంచ తామ్రకమ్। మృతం నాగం మృతం కాంస్యం మణ్డూరం విమలం మృతమ్ (1) వజ్రం

ఖర్పరకంతాలం శఙ్ఖం టఙ్కణమాక్షికౌ। స్వర్ణం కాన్తంమౌక్తికం చ వైక్రాన్తం విద్రుమం తథా (2) వరాటికా కునటికే తథా వికటగన్ధకౌ। సమమేకత్ర సమిశ్ర్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ (3) మర్దయేదగ్ని ఖాను ఖ్యాంప్రపుటేత్త్రిదినం లఘు। భావయేన్మర్దయే దేభిర్ద్వారాం స్త్రీంశ్చపృథక్పృథక్ (4) మాతులుఙ్గవరావహ్నిస్వమ్లవేతసమార్కవైః। హయమారార్ద్రిక రసైః పాచయేల్లఘువహ్నినా (5) వాతపిత్తకఫోత్క్లేశాన్ జ్వరాన్ సంమర్ధితానపి। సంనిపాతం నిహన్త్యాశు సర్వాఙ్గైకాఙ్గమారుతాన్ (6) క్షయమేకాదశవిధం శోషం పాణ్డుం కృమీన్జయేత్। కాసం పఞ్చవిధం శ్వాసం మేహం మేదో మహోదరమ్ (7) అశ్మరీం శర్కరాం శూలం ప్లీహగుల్మౌ హలీమకమ్। సేవితశ్చ సితాయుక్తః మాగధీరజసాయుతః (8) మధుకార్ద్రికసంయుక్తః తద్వ్యాధిహరణౌషధైః। సర్వవ్యాధిహరో బల్యో వృష్యో మేధ్యో రసాయనమ్। క్షయేభ కేసరిరసో బ్రహ్మణా నిర్మితః పురా (9)

అ॥ అభ్రకభస్మ, రసభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, సీసభస్మ, కంచుభస్మ మండూరభస్మ, విమలభస్మ, వంగభస్మ, శు॥ కఫరి, శు॥ తాళకము, శంఖభస్మ, శు॥ టంకణము, హేమమాక్షికభస్మ, బంగారుభస్మ, కాంతభస్మ, ముత్యభస్మ, వైక్రాంత భస్మ, పగడభస్మ, గవ్వలభస్మ, శు॥ మణిశిల, శు॥ గౌరీపాషాణము, శు॥ గంధకము, వీనిని సమభాగములుగ కలిపి ఖల్వమందుంచి చిత్రమూలము, జిల్లేడు, వీనియొక్క రసములతో మర్దించి మూడురోజులు లఘుపుటము వేయవలయును. పిదప మాదీఫలము, నేలతాడి, చిత్రమూలము, అమ్లవేతసము, గుంటగలగర, గన్నేరు, అల్లము, వీని యొక్క రసములతో ప్రత్యేక ప్రత్యేకముగ మూడేసిరోజులు భావనను, మర్దనను, చేసి మందాగ్నిచే వండవలయును. దీనిని పంచదార, పిప్పళ్ళచూర్ణము, తేనె, అల్లపు రసము, వీనితో సేవించినయెడల వాతపిత్తకఫములవలన జనించిన జ్వరములు, కఠిన మైన జ్వరములు, సంనిపాతము, సర్వాంగవాతము, ఏకాంగవాతము, పదునొకండు క్షయలు, కృశించుట, పాండువు, క్రిములు, దగ్గు, అయిదువిధములైనశ్వాసలు, మేహ ములు, మేదోవ్యాధులు మహోదరము, అశ్మరి, శర్కరయనెడివ్యాధి, శూల, ప్లీహ వ్యాధి, గుల్మము, హలీమకము, ఇవి హరించును. అయావ్యాధినాశకములగు అనుపాన ములతో సేవించినయెడల సర్వవ్యాధులును, హరించును. బలమును, వీర్యమును, జ్ఞాపక శక్తియు, వృద్ధినొందును, ముసలితనమును, వ్యాధులును, నశించును, ఈ క్షయగజ కేసరిరసము పూర్వమందు బ్రహ్మచే చెప్పబడినది.

## కీటమర్దరసము (కృమిముద్గరరసము)

శ్లో॥ శుద్ధసూతం శుద్ధగన్ధ మజమోదాం విడఙ్గకమ్। విషముష్టిం బ్రహ్మ బీజం క్రమాదూర్ధ్వగుణంగ్రహేత్ (1) చూర్ణయేన్మధునా లేహ్యాం నిష్కైకం జన్తుజిద్భవేత్। కీటమర్ద రసోనామ ముస్తాతోయంపి బేదను. (2)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, వాము 3 భా, వాయువిడంగములు 4 భా, శు॥ విషముష్టిగింజలు 5 భా, మోదుగవిత్తులు 6 భా, ఇట్లు వీనిని గ్రహించి చూర్ణము చేయవలయును. దీనిని తేనెతోగూడ నిష్క పరిమితిగ సేవించి వెంటనే తుంగగడ్డలకషాయమును త్రాగినయెడల కృములు నశించును. కీటమర్దరసమని చెప్పబడును.

## స్మృతిసాగరరసము

శ్లో॥ రసగన్ధకతాలానాం సశిలాతామ్రభస్మనామ్। శుద్ధానాం మూర్ఛితానాం చ చూర్ణం భావ్యం వచాశృతైః (1) ఏకవింశతిధా పశ్చాత్ బ్రాహ్మీ వారా తథైవ చ। కటభీబీజతైలేన భావయే దేకవారకమ్ (2) స్మృతిసాగర నామాఽయం రసోఽపస్మారనాశకః। సర్పిషా మాష మాత్రోఽయం భుక్తో హన్యాదపస్మృతిమ్ (3)

అ॥ శు॥ రసము, శు। గంధకము, శు। తాళకము, శు। మణిశిల, తామ్రభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి వస కషాయముతో 21 సారియు, సరస్వతీ యాకు రసముతో 21 సారియు, జ్యోతిష్మతీతైలముతో 1సారియు భావనను చేయవలయును. ఇది స్మృతిసాగర రసమని చెప్పబడును. దీనిని నేతితో మాషపరిమితిగ పుచ్చుకొనిన యెడల అపస్మారము హరించును.

## శ్వాసకాసక్షయమత్తగజకేసరిరసము

శ్లో॥ రసం విషం చాభ్రకాలేగన్ధకం టఙ్కణం శిలామ్। గరలందరదం తుత్థం నిర్విషం విషబీజకమ్ (1) తీక్ష్ణం తామ్రమయోభస్మ వఙ్గం నాగం చ కాంస్యకమ్॥ వైక్రాన్తం కాన్తవిమలౌ మనోహ్వాం చ వరాటికామ్ (2) మృతం రౌప్యం మృతం స్వర్ణం మృతౌ మౌక్తికవిద్రుమౌ। మాణిక్యం గారుడం నీలం గోమేదం పుష్యరాగకమ్ (3) వైడూర్యం

వజ్రకంచైవ సమభాగం చ కారయేత్। బృహతీక్షురగోకణ్ట ముణ్డీమర్కటి భృఙ్గకైః (4) నిదిగ్ధికామృతావాసావిషముష్టికషాయకైః। పృథక్ పృథక్ దినం భావ్యం కాచ కూప్యన్తరే క్షిపేత్ (5) మృదా సంలేపనం కృత్వా తామ్రపాత్రేఽథ నిక్షిపేత్। వాలుకాయన్త్రికే పాచ్యం త్రియామం మన్ద వహ్నినా (6) స్వాఙ్గశీతలముద్ధృత్య ఖల్వే మధ్యేవినిక్షిపేత్। వాసా నిర్గుణ్డ్యోః క్వాథేనబృహతీత్రయక్వాథకైః (7) చిత్రమూలకషాయేణ కణ్టకార్యా పృథక్పృథక్। కాసఘ్నమూల క్వాథేన ముణ్డీక్వాథేన మర్దయేత్ (8) పృథక్సంభావ్య తత్తుల్యం మిశ్రయేత్గ్ మారిచం రజః। అనుపాన విశేషేణ శ్లేష్మజ్వరవినాశకః (9) క్షుద్రశ్వాసం మహాశ్వాసం తమకం చోర్ధ్వశ్వాసకం। ఛిన్నశ్వాసం చ పఞ్చైతాన్సర్వాన్ శ్వాసాన్ హరేత్పరమ్ (10) కాసం పఞ్చవిధా హిక్కాః హృద్రోగం పీనసం తతః। ఏకాదశ క్షయాన్ హన్తిశ్లేష్మరోగం మహాభయం (11) తిమిరం చ తథా శూలం వాతవ్యాధిం చ నాశయేత్। పాణ్డు శోఫం చ వివిధం జీర్ణజ్వర మజీర్ణకం (12) అనుపానవిశేషేణ మహారసప్రభావతః। బహురోగహరః శ్రేష్ఠః విద్యతే నాత్ర సంశయః (13) నామ్నా కాసక్షయశ్వాస మత్తద్విరద కేసరీ। లోకోపకరణార్థం చ శమ్భునా నిర్మితః పురా (14)

అ॥ శు॥ రసము, శు॥ నాభి, అభ్రకభస్మ, శు॥ తాళకము, శు॥ గంధకము, శు॥ వెలిగారము, శు॥ గౌరీపాషాణము, గరళము, శు॥ ఇంగిలీకము, శు॥ మైలతుత్తము, శు॥ విషముష్టిగింజలు, ఖడ్గలోహభస్మ, తామ్రభస్మ, ఇనుపభస్మ, వంగభస్మ, సీసభస్మ కంచుభస్మ, వైక్రాంతభస్మ, కాంతభస్మ, విమలభస్మ, శు॥ మణిశిల, గవ్వలభస్మ, వెండి భస్మ, బంగారుభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, కెంపులభస్మ, పచ్చలభస్మ, నీలభస్మ, గోమేధికభస్మ, పుష్యరాగభస్మ, వైడూర్యభస్మ, వజ్రభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి పెద్దవాకుడు, పెద్ద నేలములగ, గొబ్బి, పల్లేరు, బోడతరము, దూలగొండి, గుంటగలగర, చిన్న నేలములగ, తిప్పతీగ, అడ్డసరము. ముషిణిగింజలు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక్క దినము భావనజేసి మట్టిచే పూయబడిన కాచ కుప్పెయందు పోసి తామ్రపాత్రయందుంచి కాచకుప్పె చుట్టును యిసుకపోసి మందాగ్నిచే మూడు జాములు వండి స్వాంగశీతలమున తీసి ఖల్వమందుంచి అడ్డసరము, వావిలి, చిన్న నేలములగ, నేలములగ, పెద్ద నేలములగ, చిత్రమూలము, పల్లేరు, కసివింద, బోడసరము, వీనియొక్క రసముతో ప్రత్యేకముగ నొక్కొక్క రోజు మర్దనము, భావనను జేసి ఆ మందుకు సమాన పరిమితిగల మిరియాల చూర్ణమును కలపవలయును.

దీనిని అనుపాన విశేషములతో సేవించినయెడల శ్లేష్మజ్వరము, క్షుద్రశ్వాస, మహా శ్వాస, తమకశ్వాస, ఊర్ధ్వశ్వాస, ఛిన్నశ్వాస అనెడి యైదు విధములైన సమస్త శ్వాసలు, దగ్గులు, అయిదు విధములైన ఎక్కిళ్ళు, హృద్రోగము, జిలుబు, పోటు నొకండు క్షయలు, భయంకరమైన శ్లేష్మ వ్యాధులు, తిమిర వాతము, శూల, వాత వ్యాధులు, పాండువు సమస్తమైన నంజులు, జీర్ణజ్వరము, అజీర్ణము ఇవి హరించును. ఇది మహా రసమగుటచే ననుపాన విశేషములతో ననేకములైన రోగములను నిశ్చయముగ హరించును. ఈ శ్వాసకాసక్షయమత్తగజకేసరి రసము లోకోపకారార్థమై పూర్వ మందు శివునిచే చెప్పబడినది.

## అజీర్ణబడబానలరసము

శ్లో॥ ద్విపలం శుద్ధసూతం చ గన్ధకం చ సమం మతమ్ । లోహం తామ్రమంతథాతాలం విషం తుత్థం చ వఙ్గకమ్ (1) పృథక్ వల్లప్రమాణం చ లవఙ్గం టఙ్కణం తథా । చవ్యమూలం త్రివృచ్చూర్ణ మేకైకం పలసంమితమ్ (2) అజమోదాం యవానీం చ ద్వౌక్షారౌ లవణాని చ పృథ గర్ధపలం గ్రాహ్యమేకీకృత్య చ భావయేత్ (3) ఆర్ద్రికస్యరసేనైవ వింశతిః పఞ్చకోలజైః । దశవైఖానసాస్త్రోక్తైర్గుడూచీనాం రసైర్దశ (4) సర్వార్ధం మరిచం దత్వా కాచకూప్యాం చ ధారయేత్ । చణమాత్రాంవటీం కృత్వా ఛాయాయాం పరిశోషయేత్ (5) ఏషః ప్రఖ్యాపితరసోహ్యజీర్ణ బడబానలః । అనేక కాలనష్టాగ్నేర్దీప కోనితరాం స్మృతః (6) ఆమవాత కులధ్వంసీ ప్లీహపాణ్డు గదాపహః । ప్రమేహానాహవిష్టమ్భ సూతికాగ్రహ ణీహరః (7) శ్వాసకాస ప్రతిశ్యాయయక్ష్మ క్షయవినాశకః । అమ్లపిత్తం చ శూలం చ భగన్దరగుదోద్భవౌ (8) అష్టోదరాణి ప్లీహానం యకృతం హన్తి దారుణం ఆకణ్ఠం భోజయిత్వాతు ఖాదయేచ్ఛరసోత్తమమ్ (9) అర్ధ యామేన తత్సర్వం భస్మీభవతి నిశ్చయమ్ । చతుర్విధరసోపేతం మహా భోజనమిచ్ఛతః (10) భోజస్యనృపతేః కాఙ్క్షా భోజనాయ దయాకృతః గహనానన్దనాథేన సర్వలోక హితైషిణా (11)

అ॥ శు॥ రసము 2 పలములు, శు॥ గంధకము 2 ప, లోహభస్మ 1 వల్లము, తామ్రభస్మ 1 వ, శు॥ తాళకము 1 వ, శు॥ నాభి 1 వ, శు॥ మైలతుత్థము 1 వ, వరగ భస్మ 1 వ, లవంగములు 1 వ, శు॥ వెలిగారము 1 వ, శు॥ చేపాళములు 1 ప, తెగడ

1 ప, శొంఠి ½ ప, కురాసాని వాము ¼ ప, సద్యక్షారము ½ ప, యవక్షారము ½ ప, పంచలవణములు ½ ప, ఇట్లు వీనిని గ్రహించి ఏకముగ చేసి, అల్లపు రసముతో 20 సారులును, పంచకోల కషాయముతో 10 సారులును, తిప్పతీగ రసముతో 10 సారులును, భావనచేసి యీ మందునకు సగము మిరియాల చూర్ణమును కలిపి సెనగగింజలంత మాత్రలుగచేసి నీడను యెండించి సీసాయందుంచవలయును. ఇది అజీర్ణబడబానల రసమని చెప్పబడును. దీనిని సేవించినయెడల చిరకాలముగనున్న యగ్నిమాంద్యము, ఆమవాతములు, ప్లీహావృద్ధి, పాండువ్యాధి, ప్రమేహములు, ఆనాహము, మలబంధము సూతికా వ్యాధులు, గ్రహణీరోగము, శ్వాస, కాస, జలుబు, రాజయక్ష్మ, కృశిం, చుట, ఆమ్లపిత్తము, శూల, భగందరము, మూలవ్యాధి, ఎనిమిది విధములైన ఉదర వ్యాధులు, ప్లీహావ్యాధులు దారుణమైన యకృద్వ్యాధులు ఇవి హరించును. కంఠము పర్యంతము భుజింపజేసి ఈ మందును తినిపించినయెడల నాభోజనమంతయు నర్ధ యామమునకు నిశ్చయముగ జీర్ణమగును. చతుర్విధరసోపేతమై నట్టియు, అధికమైన ట్టియు, భోజనమునందిచ్ఛగల భోజమహారాజునకు భోజనమందధికమగు యిచ్ఛ కలుగు టకై సర్వలోక హితమును కోరిన గహనానందనాథునిచే నీయౌషధము చెప్పబడినది.

## ఛర్దిరిపు రసము

శ్లో॥ మనశ్శిలామాగధికోషణానాం చూర్ణం కపిత్థామరసేనయుక్తమ్
లాజైస్సమాం శైర్మధునాఽవలీఢం ఛర్దిం ప్రసక్తామసకృన్నిహన్తి ॥

ఆ॥ శు॥ మణిశిల, పిప్పళ్ళు, మిరియాలు వీనిని వెలగపండ్ల రసము (గుజ్జు) తో కలిపి దీనికి సమానముగు పేలాలను కలిపి తేనెతో సేవించినయెడల తఱుచు కలుగు వాంతి హరించును.

## అరోచకరిపు రసము

శ్లో॥ సూతగన్ధాభ్రమాగధ్యామ్లికా మరిచసైన్ధవైః । గుటికాఽరోచక హరా జిహ్వావశనశుద్ధికృత్ ॥

ఆ॥ శు॥ రసము, శు॥ గంధకము, అభ్రకభస్మ, పిప్పళ్ళు, చింతపండు, మిరియాలు, సైంధవలవణము వీనిని సమ భాగములుగ గ్రహించి మాత్రలు చేసి సేవించిన యెడల అరోచకమును పోగొట్టును. నాలుకను, నోరునను శుభ్రతను కలుగ చేయును.

## వాసాసూతము

శ్లో॥ అటరూషనవపల్లవద్రవే పాలికేసరభస్మవల్లకమ్ । కర్షసంమిత మధు ప్రయోజితం ప్రాశనాద్ధరతి రక్తపిత్తకమ్ ॥

అ॥ అడ్డసరపు లేత చిగుళ్ళయొక్క యొక పలము రసమందు నొక పల్లపరిమితి గల రసభస్మను కలిపి యందొక కర్ష పరిమితిగల తేనెను కలిపి సేవించినయెడల రక్తపిత్తము నశించును.

## త్రిభువనకీర్తిరసము

శ్లో॥ హిఙ్గులం చ విషం వ్యోషం టఙ్కణం మాగధీం శిఫామ్, సంచూర్ణ్య భావయేత్త్రిధాసురసార్ద్రికహేమభిః (1) రసస్త్రిభువనకీర్తిర్గుఞ్జా కార్దరసేనవై । వినాశయేజ్జ్వరాన్సర్వాంనిపాతాంస్త్రయోదశ (2)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ నాభి, త్రికటుకములు, శు॥ టంకణము, పిప్పళ్ళు, మోడి వీనిని చూర్ణముచేసి తులసి, అల్లము, ఉమ్మెత్త వీనియొక్క రసములతో మూడేసి సారులు భావనచేయవలయును. ఈ త్రిభువనకీర్తిరసమును అల్లపురసముతో గురివిందగింజ పరిమితిగ నిచ్చినయెడల సమస్తజ్వరములును, పదమూడు సన్నిపాతేములును హరించును.

## క్రవ్యాదరసము (క్రవ్యాద లేక రసక్రవ్యాది)

శ్లో॥ ద్విపలం గన్ధకం శుద్ధం ద్రావయిత్వా వినిక్షిపేత్ । పారదం పలమానం తు మృతశుల్బాయసీ పృథక్ (1) పలార్ధమానే సంమిశ్ర్య పశ్చాజ్జ్గులదలే క్షిపేత్ । తతో విచూర్ణ్య యత్నేన లోహ పాత్రే విచక్షణః (2) నిధాపయేచ్ఛతపలం తత్ర జమ్బీరవారిణః । వస్త్రపూతం తతః కృత్వా లోహ పాత్రే వినిక్షిపేత్ (3) మృద్వగ్నినా పచేత్తత్ర దర్వ్యా సంచాలయేన్ముహుః । సంచూర్ణ్య పఞ్చకోలోత్థైః కషాయైస్సామ్లవేతసైః (4) భావనాః కిల దాతవ్యాః పఞ్చాశత్ప్రమితాః పృథక్ । భృష్టటఙ్కణచూర్ణేన తుల్యేన సహమేలయేత్ (5) తదర్ధం కృష్ణలవణం మరిచం సర్వతుల్యకమ్ । సప్తధా భావయేత్పశ్చాత్ చణకక్షారవారిణా (6) తతస్సంశోష్య సంపేష్య కూప్యాశ్చ జఠరే క్షిపేత్ । అత్యన్తగురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః (7) భుక్త్వా చ కణ్ఠపర్యన్తం చతుర్వల్లమితో రసః । పట్వమ్లతక్రసహితః పీతమాత్రోహి పాచయేత్ (8) పునర్భోజయతి క్షిప్రం కింపునర్మన్దవహ్నితామ్ । రసః క్రవ్యాదనామాఽయంప్రోక్తో మన్థానభైరవైః (9) సింహలక్షోణిపాలస్య

భూరిమాంసప్రియస్య చ । ప్రోక్తో భోజనకామస్య భైరవానన్దయోగినా (10) శ్లో॥ కుర్యాద్దీపనమూర్ధ్వజత్రుగదహృద్దుష్టామసంశోధక । స్తున్దస్థౌల్య నిబర్హణో మదహరః శూలార్తిమూలాపహః । గుల్మప్లీహ వినాశకో బహురుజాం విధ్వంసకో వాతహః । వాతగ్రన్థిమహోదరాపహరణః క్రవ్యదనామారసః (11)

అ॥ శు॥ గంధకము 2 పలములు కరగించి యందు శు॥ పాదరసము 1 ప, తామ్రభస్మ ½ ప, లోహభస్మ ½ ప, వీనిని మిశ్రమముజేసి ఆముదపాకునందు పోయవలయును. పిదప లోహ పాత్రయందు నూరి నూరు పలముల నిమ్మకాయ రసమును పోసి వడపోసి లోహపాత్రయందుంచి, గరిటెతో త్రిప్పుచు మందాగ్నిచే వండవలయును. పిదప చూర్ణముచేసి పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, వీని యన్నిటియొక్కయు, ఆమ్లవేతసముయొక్కయు కసాయములతో ప్రత్యేకముగ యేబది భావనలనుచేసి యందు పొంగించిన వెలిగారము చూర్ణము 4 పలములు, కృష్ణ లవణము 2 ప, మిరియాల చూర్ణము 10 ప. యిట్లు వీనిని కలిపి సెనగ పులుసుతో యేడుసారులు భావనచేసి యెండించి నూరి సీసాయందుంచవలయును. అత్యంత గురుగుణముకల మాంసములను అనేక విధములైన గుర్వాహారములను కంఠపర్యంతము భుజించి సైంధవ లవణము, పుల్లని మజ్జిగ వీనితో నీమందును నాలుగువల్లముల పరిమితిగ సేవించినయెడల, సేవించినవెంటనే యా భుజింపబడిన వానిని పచింపజేయును. మరల వెంటనే భోజనము కావలసినట్లు చేయును. ఇట్లుండ అగ్నిమాంద్యమును నశింపచేయునని యేమి చెప్పవలయును? మన్థాన భైరవులచే చెప్పబడిన ఈ క్రవ్యాద రసము యెల్లప్పుడును అధికమగు మాంసమును భుజించు స్వభావము కలిగినట్టియు, భోజనప్రియుడైనట్టియు, సింహలద్వీపపు రాజునకు భైరవానంద యోగిచే చెప్పబడినది. ఇది అగ్ని దీపనమును చేయును. మరియు ఊర్ధ్వజత్రుగత వ్యాధులు, దుష్టమైన ఆమము, కడుపు పెరుగుట, స్థౌల్యము, మదము, శూల, మూలవ్యాధి, గుల్మము, ప్లీహ వ్యాధి, అనేకవిధములైన వ్యాధులు, వాతము, వాతగ్రంధులు, మహోదరము వీని నీక్రవ్యాదరసము హరించును,

## లఘుక్రవ్యాదరసము

శ్లో॥ పారదాద్ద్విగుణం గన్ధంగన్ధాంశం మృతలోహకమ్ । పిప్పలీం పిప్పలీ మూలమగ్నిం శుణ్ఠీం లవఙ్గకమ్ (1) లోహసామ్యం పృథక్కుర్యా ద్రససామ్యం తథాషికమ్ । టఙ్కణం మరిచం చాపిగన్ధతుల్యం ప్రదాపయేత్ (2) ఏతద్విచూర్ణ యత్నేన భావయేత్సప్తధామ్లకైః । అయం రసాయనశ్రేష్ఠో మాష మాత్రం ప్రదాపయేత్ (3) తక్రేణ కేవలం వాఽపి దద్యాద్భోజన

పక్తయే। శీఘ్రం తజ్జీర్యతే భుక్తం దీపనం చ భవేద్ధ్రువమ్। సర్వాజీర్ణ ప్రశమకో లఘుక్రవ్యాదసంజ్ఞితః (4)

అ॥ శు॥ పాదరసము 1 భాగము, శు॥ గంధకము 2 భా, లోహభస్మ 2 భా, పిప్పళ్ళు 2 భా, మోడి 2 భా, చిత్రమూలము 2 భా, శుంఠి 2 భా, లవంగములు 2 భా, సౌవర్చలవణము 1 భా, పా॥ వెలిగారము 2 భా. మిరియాలు 2 భా, ఇట్లు వీనిని గ్రహించి బాగుగ చూర్ణించి అమ్లవర్గద్రవ్యరసములతో యేడుసారులు భావనను చేయవలయును. ఇది శ్రేష్ఠమైన రసాయనము. ఆహారము జీర్ణించుటకై దీనిని మాష పరిమితిగ మజ్జిగతోగాని, కేవలముగగాని సేవించినయెడల ఆహారము వెంటనే జీర్ణమగును. అగ్నిదీప్తి కలుగును. ఇది సమస్తమైన అజీర్ణములను శమింపజేయును. లఘుక్రవ్యాదరసమని చెప్పబడుచున్నది.

## సువర్ణక్రవ్యాదరసము

శ్లో॥ సువర్ణతారేత్వహికాన్తతీక్ష్ణం వైక్రాన్తకం మాక్షికమేకకర్షమ్। పలం రసస్య ద్విపలం బలేస్స్యాత్తుల్యాయసీ చార్ధపలప్రమాణమ్ (1) సంపేష్య సర్వం ద్రుతిమగ్నియోగాదేరణ్డపత్రేషు నివేశనీయమ్। కృత్వాతతః కజ్జలికాంని ధాయ లోహే సుపాత్రేరసపూరితేఽస్మిన్ (2) జీర్ణే రసే భావితమేతదేవ సపఞ్చ కోలోద్భవవారిపూరైః। సవేతసామ్లం చ శతార్ధభావ్యం సమం రజోటఙ్కణజం సుభృష్టమ్ (3) బిడం తదర్ధం మరిచం సమాంశం తత్సర్వమార్ద్రే చణకామ్లకే చ। క్రవ్యాదనామా ఖలు చైవ భావ్యో రసస్సమస్థానకభైరవోక్తః (4) వల్లద్వయం సైన్ధవతక్రమిశ్రితం సేవ్యేత ఖల్వేష చ భోజనాన్తే। గురూణీ మాంసాని పయాంసి పిష్టం కృత్యాని ఖాద్యాన్యఖిలాని వేగాత్ (5) మాత్రాతిరిక్తాన్యపి తాని చైవ యామద్వయే జారయతి ప్రసిద్ధః। నిహన్త్యజీర్ణానపి షట్ప్రవృద్ధానగ్నిం కరోతిక్రమ సేవనేన (6) కుర్యాద్దీపనముద్ధృతం చ పవనం దుష్టామయోన్మూలనమ్। తున్దస్థౌల్యనిబర్హణం మదహరం మూలార్తి శూలాపహమ్ (7)

అ॥ సువర్ణభస్మ 1 కర్షము, వెండిభస్మ 1 క, సీసభస్మ 1 క, కాంతభస్మ 1 క, ఖడ్గలోహభస్మ 1 క, వైక్రాంతభస్మ 1 క, హేమమాక్షిక భస్మ, 1 క, శు॥ రసము 1 పలము, శు॥ గంధకము 2 ప, తామ్రభస్మ ½ ప, ఇనపలోహభస్మ ½ ప, వీనిని నూరి అగ్నియందు కరిగించి ఆముదపాకులయందు పోసి పిదప మెత్తగా నూరి లోహపాత్ర

యందుంచి యందు నిమ్మకాయ రసము పోసి యారసము యిగురునట్లు పక్వముచేసి పిదప పంచకోలములు, ఆమ్లవేతసము వీనియొక్క రసములతో నేబదిసార్లు భావనచేసి పూర్వపు మందుకు సమానమగు పొంగించిన వెలిగార చూర్ణమును, వెలిగారములో సగము బిడాల లవణమును, మొత్తము మందుకు సమానమగు మిరియాల చూర్ణమును కలిపి అల్లపు రసముతోడను సెనగ పులుసుతోడను భావన చేయవలయును. ఇట్లు సిద్ధమైనది క్రవ్యాదరస మనబడును. ఇది మంథానక భైరవునిచే చెప్పబడినది. దీనిని రెండు వల్లముల పరిమితిగ సైంధవ లవణము, మజ్జిగ వీనితో భోజనానంతరమునందు సేవింపవలయును. గురుకరములైన మాంసములు, పాలు, పిండి వంటలు, భక్ష్యములు వీని నధికముగ భుజించినను రెండు జాములలో వెంటనే జీర్ణింపజేయును. ప్రవృద్ధము లైన యారు విధములగు నజీర్ణములను నశింపజేయును. క్రమముగ సేవించుటచే జాఠ రాగ్నిని వృద్ధిపరచును. ప్రకోపించిన వాతము, దుష్టవ్యాధులు, కడుపు పెరుగుట, స్థౌల్యము, మదము, మూలవ్యాధి, శూల వీనిని హరించును.

## సు వ ర్ణ క్ర వ్యా ద ర స ము (ప్రకారాంతరము)

శ్లో॥ మృతం స్వర్ణం మృతం కాన్తంమృతమ్ శుల్బం చ తీక్ష్ణకమ్। మృతం రౌప్యం చ శఙ్ఖం చ తోలమానం పృథక్పృథక్ (1) మాతులుఙ్గర సైర్మర్ద్యం లోహపాత్రే వినిక్షిపేత్। గన్ధకం ద్విపలం శుద్ధం పారదం పలమానకమ్ (2) తత్రసం మేలయేత్పశ్చాజ్జ్వాలయే న్మృదువహ్నినా। అమ్లవేతస కేనైవహ్యామ్లవర్గేణచైవ హి (3)పఞ్చకోలకషాయేణ శతార్ధం భావయేత్క్రమాత్। భృష్టటఙ్కణచూర్ణేన తుల్యేన సహ మేలయేత్ (4) తదర్ధపఞ్చలవణైః సర్వసామ్య మరీచకైః। త్రిస్సప్తభావనాః పశ్చా చ్చణకక్షారవారిణా (5) తతస్సంశోష్య సంపేష్య కాచకూప్యాం వినిక్షిపేత్। అత్యన్తగురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః (6) భుక్త్వా చ కణ్ఠపర్యన్తం చతుర్వల్లమిమంరసమ్। పట్వమ్లతక్ర సహితం పిబేత్తదనుపానతః (7) క్షిప్రం తజ్జీర్యతేభుక్తం దీపనం జాయతే పునః। రసః క్రవ్యాదనామాఽయం ప్రోక్త శ్చానన్దభైరవైః (8)

అ॥ సువర్ణభస్మ 1 తులము, కాంతభస్మ 1 తు, తామ్రభస్మ 1 తు, ఖడ్గలోహ భస్మ 1 తు, వెండిభస్మ 1 తు, శంఖభస్మ 1 తు, వీనిని మాదీఫల రసముతో మర్దించి లోహపాత్రయందుంచి శు॥ గంధకము 2 పలములు, శు॥ రసము 1 ప, ఇట్లు వీనిని అందు కలిపి, చిన్న మంటచే వండి (గంధకము కరిగి అన్నియు కలియువరకు) పిదప ఆమ్లవేతసము, ఆమ్లవర్గ ద్రవ్యములు, పంచకోలములు వీని రసములతో క్రమముగ నేబది

సారులు భావనను చేసి యా మందునకు సమానముగు పొంగించిన వెలిగారమును, వెలిగారములో సగము పంచ లవణములను, మొత్తము మందునకు సమానమగు మిరియాల చూర్ణమును కలిపి సెనగపులుసుతో నిరువదియొక్క భావనలను చేసి పిదప నెండించి, నూరి సీసాయందుంచవలయును మిక్కిలి గురుగుణముకల మాంసమును; గురుగుణము కలిగినట్టియు, అనేకములైనట్టియు ఆహారములను, కంఠపర్యంతము భుజించి సైంధవ లవణము, పుల్లని మజ్జిగ వీని యనుపానముతో నీ యౌషధమును నాలుగు వల్లముల పరిమితిగ సేవించినయెడల నా పదార్థములు వెంటనే జీర్ణమగును. తిరిగి వెంటనే జాఠరదీప్తి (ఆకలి) కలుగును. ఈ క్రవ్యాదరసము ఆనంద భైరవులచే చెప్పబడినది.

## మహా సువర్ణ క్రవ్యాదరసము

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం కాన్తం వైక్రాన్తతీక్ష్ణకే। ప్రత్యేకం తోలమానేనఖల్వమధ్యే వినిక్షిపేత్ (1) పారదం పలమానం చ ద్విపలం గన్ధకం తథా। సర్వం చైకత్ర సంమిశ్ర్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) పఞ్చకోల కషాయేణ భావయేద్దినపఞ్చకమ్। తతో విచూర్ణ్యయత్నేన నిక్షిప్యాయస పాత్రకే (3) చుల్ల్యాం నివేశ్య యత్నేన జ్వాలయేన్మృదువహ్నినా। తత్పాత్రస్థం చ జమ్బీరరసం సమ్యక్ప్రపచ్యతామ్ (4) జమ్బీరఫలసారేణ పఞ్చకోల కషాయకైః। భావనాః ఖలు దాతవ్యాః చణకక్షారవారిణా (5) ఆర్ద్రకస్య రసేనైవ శిగ్రుమూలరసేన చ। పఞ్చాంశపరిమిత్యా తు భావనాః కిల వింశతిః। సద్యఃక్షారం యవక్షారం క్షారం ధామార్గవోత్థితమ్ (6) భృష్టటఙ్కణచూర్ణం తు సర్వతుల్యం చ మేలయేత్। సౌవర్చలం తదర్ధం చ సర్వతుల్యం మరీచకమ్ (7) సప్తధా భావయేత్పశ్చాచ్చణకక్షారవారిణా। తతస్సం శోష్య సంపేష్య కూపికాజఠరే క్షిపేత్ (8) అత్యన్త గురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః। భుక్త్వాం కణ్ఠపర్యన్తం చతుర్వల్ల మిమం రసమ్ (9) పట్వామ్లతక్రసహితం పిబేత్తదనుపానతః। క్షిప్రం తజ్జీర్యతే భుక్తం జాయతే దీపనం పునః। చతుర్విధమజీర్ణం చ హన్తి దీపకపాచకః (10) శ్లో॥ కుర్యాద్దీపనముద్ధృతం చ పవనం దుష్టామయం ధ్వంసయేత్। తున్దస్థౌల్యనిబర్హణో గరహరః శూలామమూలాపహః। గుల్మ ప్లీహవినాశకో గ్రహణీకారోగం చ విధ్వంసయేత్, వాతవ్యాధి మహోదరాపహరణః క్రవ్యాదనామా రసః (11)

అ॥ సువర్ణభస్మ 1 తులము, రజతభస్మ 1 తు, తామ్రభస్మ 1 తు, కాంతభస్మ 1 తు, వైక్రాంతభస్మ 1 తు, ఖడ్గలోహభస్మ 1 తు, శు॥ రసము 1 పలము శు॥ గంధ

కము ౨ ప, వీనిని ఖల్వమందుంచి నూరి అన్నిటిని కలిపి (వండి) ఖల్వమందుంచి పంచకోల కషాయముతో నైదుదినములు భావనను చేసి, పిదప చూర్ణించి లోహపాత్రయందుంచి పొయ్యిమీద నుంచి నిమ్మకాయరసము పోసి ఆ రసము ఇగురువరకు మందాగ్నిచే పచనముచేసి నిమ్మకాయల రసము, పంచకోల కషాయము, సెనగపులుసు, అల్లపురసము, మునగవేళ్ళ రసము, వీనితో నాలుగు నాలుగు చొప్పున యిరువది భావనలను చేసి సర్జ్యక్షారము, యవక్షారము, ఉత్తరేణిక్షారము, వీనిని ఒక్కొక్క తులము చొప్పున కలిపి ఆ మందునకు సమానమగు పొంగించిన వెలిగారమును, వెలిగారములో సగము సౌవర్చ లవణమును, మొత్తము మందునకు సమానమగు మిరియాల చూర్ణమును కలిపి సెనగపులుసుతో నేడుసారులు భావనచేసి పిదప యెండించి నూరి సీసాయందుంచవలయును. మిక్కిలి గురు గుణముకల మాంసములను, అనేక విధములైనట్టియు, గురు గుణముకలిగినట్టియు ఆహారములను, కంఠము పర్యంతము భుజించి సైంధవలవణము, పుల్లని మజ్జిగ, వీని యనుపానముతో నీయౌషధమును నాలుగు వల్లముల పరిమితిగ సేవించినయెడల నా పదార్థములు వెంటనే జీర్ణమగును. తిరిగి వెంటనే జాఠరదీప్తి (ఆకలి) కలుగును. ఇది నాలుగు విధములగు అజీర్ణములను హరించును. జాఠరదీప్తిని ఆహారపాచనమును చేయును. ప్రకోపించిన వాతము, దుష్టమైన వ్యాధులు, కడుపు పెరుగుట, స్థౌల్యము, కృత్రిమ విషము, శూల, ఆమము, మూలవ్యాధి, గుల్మము, ప్లీహవ్యాధి, గ్రహణీరోగము, వాత వ్యాధులు, మహోదరము, వీనిని హరించును. క్రవ్యాద రసమని చెప్పబడును.

## శీ తాం కు శ ర స ము

శ్లో॥ తుత్థం టఙ్కణసూతఖర్పరవిషం స్యాద్గన్ధకం తాలకమ్ । సర్వం ఖల్వతలే విమర్ద్య ఘుటికాం తత్కారవల్లీరసైః । గుఞ్జైకా ఘుటికా సుశర్కర యుతా సజ్జీరకేణాథవా । ఏ ద్వి త్రిచతుర్థశీత హరణ శ్శీతాఙ్కుశో నామతః (1)

అ॥ శు॥ మైలతుత్తము, శు॥ వెలిగారము, శు॥ రసము, శు॥ కర్పరి, శు॥ నాభి, శు॥ గంధకము, శు॥ తాళకము, వీనిని ఖల్వమందు కాకర రసముతో నొక ఘడియ మర్దించి గురివిందగింజ పరిమితిగల మాత్రను పంచదారతోగాని, జీలకఱ్ఱతోగాని సేవించినయెడల ఏకాహిక జ్వరము, ద్వ్యాహిక జ్వరము, త్ర్యాహిక జ్వరము, చాతుర్థిక జ్వరము, శీత జ్వరము, ఇవి హరించును. ఇది శీతాంకుశ మనెడి పేరు కలది.

## ర క్త పి త్త కు ల కు ఠా ర ర స ము

శ్లో॥ శుద్ధపారదబలిప్రవాలకం హేమమాక్షికత్రపుర్భుజఙ్గకమ్ । మారితం సకలమేతదుత్తమం భావనాం కురు పృథక్త్రివైస్త్రిధా (1) చన్దనస్య

కమలస్య మాలతీకోరకస్య వృషపల్లవస్య చ । ధాన్యవీరణశతావరీద్ర వైశ్యాల్మ లీవటజటామృతస్య చ (2) రక్తపిత్తకులఖణ్డనాభిధో జాయతే రసవరోఽస్రపిత్తినామ్ । ప్రాణదోమధువృషద్రవైరయం సేవితస్తు వసు కృష్ణలైర్మితః । నాస్త్యనేన సమమత్ర భూతలే భేషజం కిమపి రక్త పిత్తినామ్ (3)

ఆ॥ శు॥ రసము, శు॥ గంధకము, పగడభస్మ, హేమమాక్షికభస్మ, వంగభస్మ, సీసభస్మ, వీనిని మంచి గంధకము, కమలములు, మాలతీ పుష్పములు, అడ్డసరపు చిగుళ్ళు, ధనియాలు, వట్టివేళ్ళు, పిల్లిపీచర, బూరుగ, మర్రియూడలు, తిప్పతీగ, వీని యొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిసారులు భావనచేయవలయును. రక్త పిత్తకుల ఖండనము (కుఠారము) అని చెప్పబడును. దీని ఎనిమిది మిరియాల పరిమితిగ తేనె, అడ్డసరపు రసము, వీనితో సేవించినయెడల నిది రక్తపిత్తవ్యాధి కలవారలకు ప్రాణము నిచ్చును. రక్తపిత్త వ్యాధికలవారలకు దీనితో సమానమైన మందు భూతల మందు లేదు,

## కృమికుఠారరసము

శ్లో॥ విశ్వం రామఠసైన్ధవాగ్నిమరిచం పథ్యా వచా గుగ్గులుర్బోలం రాత్రివిడఙ్గకుష్ఠలశునం గన్ధః కుబేరాక్షకం । ఇన్ద్రోగ్రద్యూతపలాశబీజఖదిరాజాజీ కణాదీప్యకం । సౌవర్చం మధునా గుటీ కృమికుఠారాహ్వా హరేజ్జన్తురుక్ (1)

ఆ॥ శుంఠి, శు। ఇంగువ, సైంధవలవణము, చిత్రమూలము, మిరియాలు, కరక పప్పు, వస, శు॥ మహిసాక్షిగుగ్గులు, శు। బాలింతబోలు, పసుపు, వాయువిడంగములు, చెంగల్వకోష్టు, వెల్లుల్లి, కచ్చూరిముసి, కలిగొట్టు, కొడిశపాలవిత్తులు, మోదుగ విత్తులు, చండ్ర, వాము, పిప్పళ్ళు, జీలకఱ్ఱ, సౌవర్చలవణము, వీనిని తేనెతో మాత్రలు చేసి సేవించినయెడల కృమివ్యాధులు నశించును. ఇది కృమి కుఠారమని చెప్పబడును.

## స్వర్ణవంగము (హేమసుందరరసము)

శ్లో॥ పారదం గన్ధకం వఙ్గం నవసారం చ తుల్యకమ్ । కన్యారసేన సంమర్ద్య వాలుకాయన్త్రయోగతః (1) పాచయేద్దినమేకం తు స్వాఙ్గశీతల ముద్ధరేత్ । అనుపానవిశేషేణ సర్వమేహాన్వినాశయేత్ (2) మూత్రకృచ్ఛ్రం శుక్లమేహం ద్వివిధౌ ప్రదరౌ తథా । నాశయేత్పిత్తరోగాంశ్చ దాహం వై

పాణిపాదయోః (3) ఆస్యపాకం చాఙ్గదాహం నేత్రదాహం తథైవ చ।
హేమసున్దరనామాఽయం విష్ణునా నిర్మితః పురా (4)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ వంగము, నవాసారము, వీనిని సమభాగములుగ గ్రహించి కలబందరసముతో నూరి వాలుకాయంత్రమందు ఒకరోజు వండి సాంగశీతలయిన తీయవలయును. దీనిని అనుపానవిశేషములతో సేవించిన యెడల సమస్త మేహములు, మూత్రకృచ్ఛ్రము, శుక్లమేహము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, పైత్యవ్యాధులు, కాళ్ళయందును, చేతులయందును మంట, నోటిపూత, శరీరమందు మంట, కండ్లయందు మంట, ఇవి హరించును. హేమసుందరరసమని చెప్పబడును. పూర్వమందు విష్ణువుచే చెప్పబడినది.

## స్వర్ణవంగము (హేమసుందరరసము)

## (ప్రకారాంతరము)

శ్లో॥ పారదాద్ద్విగుణం గన్ధం గన్ధసామ్యం తు వఙ్గకమ్। నవసారం సూతతుల్యం ఖల్వమధ్యే వినిక్షిపేత్ (1) కన్యారసేన సంమర్ద్య వాలుకాయన్త్రకే పచేత్। గుఞ్జాత్రయం ప్రదాతవ్యం గుడూచీసత్వకేన చ (2) త్రిఫలాచూర్ణకేనాఽపి సర్వమేహాన్వినాశయేత్। మూత్రకృచ్ఛ్రం శుష్కకాసం సోమరోగం చ దారుణమ్ (3) ఆస్యపాకం చాఙ్గదాహం నేత్రదాహం తథైవ చ। శుక్లమేహం చ శ్వాసం చ ప్రదరౌ శ్వేతరక్తకౌ। హేమసుందరనామాఽయం విష్ణునా నిర్మితః పురా (4)

అ॥ శు॥ రసము 1 భా॥, శు॥ గంధకము 2 భా॥, శు॥ వంగము 2 భా॥, నవాసారము 1 భా॥, వీనిని ఖల్వమందుంచి కలబంద రసముతో మర్దించి వాలుకాయంత్రమందు వండవలయును. దీనిని తిప్పసత్తుతోగాని, త్రిఫలా చూర్ణముతోగాని మూడు గురువింద గింజలపరిమితిగ నిచ్చినయెడల సమస్తమేహములు, మూత్రకృచ్ఛ్రము, పొడిదగ్గు, కఠినమైన సోమరోగము, నోటిపూత, శరీరతాపము, నేత్రములయందు మంట, శుక్లమేహము, శ్వాస, శ్వేతప్రదరము, రక్తప్రదరము, ఇవి హరించును. ఈ హేమసుందర రసము పూర్వకాలమందు విష్ణువుచే చెప్పబడినది.

## వంగరాజీయము

శ్లో॥ రసమేతం ద్వయం వఙ్గం వఙ్గసామ్యం తు గన్ధకమ్। కుమార్యాస్స్వరసే మర్ద్యం దినమేకం విచక్షణః (1) పాచయేద్వాలుకాయన్త్రే దినమేకం

క్రమాగ్నినా । తత ఉద్ధృత్య శీతం చ సేవ్యం తదనుపానతః (2) వింశతిం చ ప్రమేహాణాం నాశయేన్నాత్ర సంశయః । మూత్రాతిసారం కృచ్ఛ్రం చ గ్రహణీం పాదదాహకమ్ । మూత్రాఘాతం చాశ్మరీం చ హన్త్యత్ర న విచక్షణా (3)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ వంగము 2 భా, శు॥ గన్ధకము 2 భా, ఇట్లు వీనిని కలుబందరసముతో నొకరోజు మర్దించి వాలుకాయంత్రమందు వండి చల్లారినపిదప తీయవలయును. దీనిని అనుపాన భేదములతో సేవించినయెడల ఇరువది మేహములు మూత్ర మనేకసారులు వెడలుట, మూత్రకృచ్ఛ్రము, గ్రహణీ రోగము, కాళ్లు మంటలు, మూత్రాఘాతము, అశ్మరి, ఇవి నిశ్చయముగ హరించును.

## మేహవంగరాజీయము

శ్లో॥ రసమేకం త్రయం వఙ్గం వఙ్గసామ్యం గన్ధకమ్ । మర్దయేద్దిన మేకం తు కుమార్యాస్స్వరసే బుధః (1) సంస్థాప్య గోలకం భాణ్డే రోధయే త్సుదృఢం ముఖమ్ । పాచయేద్వాలుకాయన్త్రే దినమేకం దృఢాగ్నినా (2) స్వాఙ్గశీతలమాదాయ సంపూజ్యద్విజదేవతాః । పిప్పలీమధునా యుక్తం సర్వమేహేషు యోజయేత్ (3) క్షీరాన్నం యోజయేత్పథ్యం లవణామ్ల వివర్జితమ్ । మేహవఙ్గేశ్వరో నామ సర్వమేహ నికృన్తకః (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ వంగము 3 భా, శు॥ గంధకము 3 భా, వీనిని కలుబందరసముతో నొకరోజు మర్దించి కాచకుప్పెయందు పోసి కుండయందుంచి ఇసుకపోసి కుండయొక్క ముఖమును బాగుగ మూసి (సంధి బంధనముచేసి) దృఢాగ్నిచే నొకరోజు వండి స్వాంగశీతలమున తీయవలయును. పిదప బ్రాహ్మణులను, దేవతలను, పూజించి పిప్పళ్ళ చూర్ణము, తేనె, వీనితో సమస్త మేహములయందును నియ్యవలయును. క్షీరాన్నమును, ఉప్పు పులుపులేని ఆహారమును ఇయ్యవలయును. మేహవంగేశ్వరము (మేహవంగ రాజీయము) అని చెప్పబడును. సమస్త మేహములను హరించును.

## రజతమేహవంగరాజీయము

శ్లో॥ రసమేకం ద్వయం వఙ్గం వఙ్గసామ్యం తు గన్ధకమ్ । రజతం చైకభాగం చ కన్యయా తు విమర్దయేత్ (1) వాలుకాయన్త్రకే పాచ్యం

దినమేకం విచక్షణః । సాఙ్గశీతలముద్ధృత్య నారికేలామ్బుమర్దితమ్ (2) వట కాన్కారయిత్వా తు ద్విగుఞ్జం భక్షయేత్సదా । సర్వమేహాన్హరత్యేవ శుక్ర వృద్ధిం చ కారయేత్ (3) శుక్రదోషం హరత్యేవ బుద్ధీన్ద్రియబలప్రదః । నానారోగప్రశమకస్సర్వమేహనికృన్తకః (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ వంగము 2 భా, శు॥ గంధకము 2 భా, రజతము (వెండి) 1 భా, వీనిని కలుబంద రసముతో మర్దించి వాలుకాయంత్రమందు ఒకరోజు వండి సాంగశీతలమున తీసి కొబ్బరికాయనీటితో మర్దించి కుప్పెలు కట్టవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ సేవించినయెడల సమస్త మేహములను హరించును. శుక్రవృద్ధి కలుగును. శుక్రదోషములు నశించును. బుద్ధికిని, ఇంద్రియములకును బలము కలుగును, సమస్త రోగములును శమించును.

## సువర్ణమేహవంగరాజీయము

శ్లో॥ స్వర్ణమేకం ద్వయం వఙ్గం స్వర్ణసామ్య తు పారదమ్ । గన్ధకం తు ద్విభాగం చ కన్యయా చ విమర్దయేత్ (1) పాచయేద్వాలుకాయన్త్రే త్రి దినం సార్ధం భిషగ్వరైః । సాఙ్గశీతలమాదాయ గుఞ్జాద్వయ ప్రమాణకమ్ (2) సేవనీయం తథా హన్తి చాఙ్గదాహం చ కృచ్ఛ్రకమ్ । క్షయంక్షయకృతా న్వ్యాధీన్ దౌర్బల్యం శ్వాసమేవ చ (3) ప్రమేహాన్వివిధాంశ్చైవ బహు మూత్రం తథైవ చ । వృష్యం రసాయనం చైవ బుద్ధీన్ద్రియబలప్రదమ్ (4)

అ॥ సువర్ణము 1 భా, శు॥ వంగము 2 భా, శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 2 భా, వీనిని కలుబంద రసముతో మర్దించి వాలుకాయంత్రమందు ఒకటిన్నర రోజు వండి సాంగశీతలమున తీయవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ సేవించినయెడల శరీరతాపము, మూత్రకృచ్ఛ్రము, క్షయ, క్షయవలన కలిగిన వ్యాధులు, దౌర్బల్యము, శ్వాస, సమస్తమైన ప్రమేహములు, బహుమూత్రము, ఇవి హరించును. ఇది వీర్యవృద్ధిని చేయును. రసాయనము బుద్ధికిని, ఇంద్రియములకును బలము కలిగించును.

## అమృతకలానిధిరసము

శ్లో॥ అమృతవరాటకమరిచైర్ద్విపఞ్చనవమాంశైః । ముద్గప్రమాణ వటకో జ్వరపిత్తకఫాగ్నిమాన్ద్యహారీ (1)

అ॥ శు॥ నాభి 2 భా, గవ్వల భస్మ 5 భా, మిరియాలు 9 భా, వీనిని పెసర గింజలంత మాత్రలు చేసి సేవించినయెడల జ్వరము, పైత్యము, కఫము, అగ్ని మాంద్యము, ఇవి నశించును.

## రసరాట్

చ॥ దరదము గన్ధలోహపొడి ధాతురకప్పురముల్ రసంబునున్ । ధర వసువేదచన్ద్రహిమధామసుధాంశుల గూర్చి నేర్పుమై । వరుసకుమారిసారమున నొప్పుగ నూరి శరావమందు సు । స్థిరముగనుంచి యగ్నినిడ శీఘ్రమె గన్ధము దగ్ధమయ్యెడు౯ । మరల కుమారిసారమున మర్దనమై రసరాట్టు నందగు౯ । వరకఫజాతుల౯ ప్రబలవాయువుల౯ దెగటార్చు వేగమే ॥

అ॥ శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ గంధకము 8 భా, లోహరాపొడి 4 భా, రస సింధూరము 1 భా, రసకర్పూరము, 1 భా, శు॥ పాదరసము 1 భా, వీనిని కలబంద రసముతో మర్దించి మూకళ్ళయందుంచి అగ్ని వేయగ నందలి గంధకము కాలిపోవును. దానిని మరల కలబందరసముతో మర్దింపవలయును. ఇది రసరాట్టు అనబడును. కఫ వ్యాధులను, వాతవ్యాధులను, వెంటనే నశింపజేయును.

## అగ్నిముఖరసము

శ్లో॥ సూతం గన్ధం విషం తుల్యం మర్దయేదార్ద్రకద్రవైః । అశ్వత్థ చిఞ్చాపామార్గక్షారాః క్షారౌ చ టఙ్కణమ్ (1) జాతీఫలం లవఙ్గం చ త్రికటు త్రిఫలాం సమమ్ । శఙ్ఖక్షారం పఞ్చపలం హిఙ్గు జీరం ద్విభాగకమ్ (2) మర్ద యేదమ్లయోగేన గుఞ్జామాత్రా వటీ శుభా । పాచనీ దీపనీ సద్యోఽజీర్ణశూల విషూచికాః (3) హిక్కాం గుల్మం చోదరం చ నాశయేన్నాత్ర సంశయః । రసేన్ద్రసంహితాయాం చ నామ్నా వహ్నిముఖో రసః (4)

అ॥ శు॥ రసము 1 పలము, శు॥ గంధకము 1 ప, శు॥ నాభి 1 ప, వీనిని అల్లపు రసముతో మర్దించి యందు రావిక్షారము 1 ప, చింతక్షారము 1 ప, ఉత్తరేణిక్షారము 1 ప, యవక్షారము 1 ప, సర్జక్షారము 1 ప, పా॥ వెలిగారము 1 ప, జాజికాయలు 1 ప, లవంగములు 1 ప, త్రికటుకములు 1 ప, త్రిఫలములు 1 ప, శంఖభస్మ 5 ప, శు॥ ఇంగువ 2 ప, జీలకఱ్ఱ 2 ప, వీనిని కలిపి అమ్లవర్గద్రవ్య రసములతో మర్దించి, గురివిందగింజలంత మాత్రలను చేయవలయును. ఇవి పచనశక్తిని, అగ్నిదీప్తిని కలుగ

జేయును. అజీర్ణము, శూల, విషూచి, ఎక్కిళ్ళు, గుల్మము, ఉదరము, వీనిని నిశ్చయముగ హరించును. ఇది రసేంద్రసంహితయందు వహ్నిముఖ రసమని చెప్పబడినది.

## హే మా భ్ర క ర స సిం దూ ర ము (క్షయకు)

శ్లో॥ అభ్రకం రససిన్దూర మిశ్రితం హేమభస్మనా । సమభాగం ప్రయుఞ్జీత రసేనార్ద్రికజేన చ (1) క్షయం చ క్షయపాణ్డుం చ క్షయ కాసం చ కుష్ఠకమ్ । జయేన్మణ్డలపర్యన్తే పూర్వకర్మ విపాకకృత్ (2)

అ॥ అభ్రకభస్మ, రససిందూరము, సువర్ణభస్మ, వీనిని సమభాగములుగ కలిపి అల్లపు రసముతో సేవించినయెడల క్షయ, క్షయవలన కలిగిన పాండువు, క్షయకాస, కుష్ఠము, ఇవి యొక మండలమునకు హరించును. పూర్వకర్మ విపాకము నొందును.

## శ ం ఖో ద ర ర స ము

శ్లో॥ శఙ్ఖభస్మ చతుష్కర్షం కర్షికమహి ఫేనకమ్ । జాతీఫలం టఙ్కణం చ పృథక్కర్షం వినిక్షిపేత్ (1) అతిసూక్ష్మం మర్దయేచ్చ నవనీతేన గుఞ్జకః । రసః శఙ్ఖోదరో నామ సర్వాతీసారనాశకః (2)

అ॥ శంఖభస్మ 4 కర్షములు, శు॥ నల్లమందు 1 క, జాజికాయలు 1 క, పొ॥ వెలిగారము 1 క, వీనిని మిక్కిలి మెత్తగ నూరవలయును. ఇది శంఖోదర రసమని చెప్పబడును. దీనిని వెన్నతోకూడ ఒక గురివిందగింజ పరిమితిగ నిచ్చినయెడల సమస్తమైన అతిసారములును నశించును.

## వ ం గే శ్వ ర ర స ము (లఘు)

శ్లో॥ వఙ్గం కాన్తం చ గగనం హేమపుష్పం సమాంశకమ్ । కుమారీ రసకే భావ్యం సప్తవారం భిషగ్వరైః (1) ఏష వఙ్గేశ్వరోనామ ప్రమేహాన్వింశతిం జయేత్ । మూత్రకృచ్ఛ్రం సోమరోగం పాణ్డురోగం మహాశ్మరీమ్ । రసాయనేషు శ్రేష్ఠోఽయం నాగార్జునవినిర్మితః (2)

అ॥ వంగభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, నేలతంగేడు పువ్వుల చూర్ణము, వీనిని సమభాగములుగ గ్రహించి కలబంద రసముతో నేడుసారులు భావనచేయవలయును. ఇది వంగేశ్వర రసమని చెప్పబడును. దీని సేవనచే వింశతిప్రమేహములు,

మూత్రకృచ్ఛ్రము, సోమరోగము, పాండురోగము, అశ్మరి, ఇవి హరించును. ఇది రసాయనములలో శ్రేష్ఠమైనది. నాగార్జునునిచే చెప్పబడినది.

## వంగేశ్వరరసము

శ్లో॥ రసం వఙ్గం సమం కృత్వా చతుర్భాగం చ గన్ధకమ్ । కుమారీ రససంయుక్తం దినమేకం విమర్దయేత్ (1) మన్దమధ్యమతీవ్రాగ్నా వాలుకా యన్త్రగం పచేత్ । అశ్వగన్ధామృతాసారో మోచారసశతావరీ (2) గోక్షూర ధాత్రీకూష్మాణ్డాః వారాహీపత్రకం కణా । త్రిఫలామర్కటీముస్తా యష్టి చైతాన్నిచూర్ణయేత్ (3) సర్వసామ్య సితాయుక్తాన్ చూర్ణకర్షార్ధసంయుతామ్ । గుఞ్జచతుష్టయాం మాత్రాం గోక్షీరమనుపానతః (4) ప్రాతరుత్థాయ సేవేత లవణామ్లౌ చ వర్జయేత్ । బహుమూత్రం మూత్రకృచ్ఛ్రం రక్తార్శశ్చ ప్రమేహకమ్ (5) మధుమేహం నష్టశుక్రం నష్టలిఙ్గం చ నాశయేత్ । సర్వమేహప్రశమకో వఙ్గేశ్వర ఇతి స్మృతః (6)

అ॥ శు॥ రసము 1 భా॰, శు॥ వంగము 1 భా॰, శు॥ గంధకము 4 భా॰, వీనిని కలుబందరసముతో నొకరోజు మర్దించి వాలుకా యంత్రమందు మంద, మధ్యమ, తీవ్రాగ్నులచే వండవలయును. పెన్నేరు, తిప్పసత్తు, బూరుగబంక, పిల్లిపీచర, పల్లేరు, నేలయుసిరిక, బూడిదగుమ్మడికాయ, నేలకాడి, ఆకుపత్రి, పిప్పళ్ళు, త్రిఫలములు, దూలగొండివిత్తులు, తుంగగడ్డలు, అతిమధురము, వీనిని సమభాగములుగను పంచదారను వీనికన్నిటికిని సమానముగను గ్రహించి చూర్ణము చేయవలయును. అర్ధకర్ష పరిమితిగల ఈ చూర్ణముతో నాలుగు గురువింద గింజలపరిమితిగ నాయౌషధమును కలిపి ఉదయముననేచి సేవించిన వెంటనే ఆవుపాలను త్రాగవలయును. ఉప్పును, పులుపును, విసర్జింపవలయును. ఇట్లు చేసినయెడల బహుమూత్రము, మూత్రకృచ్ఛ్రము, రక్తార్శస్సు, ప్రమేహము, మధుమేహము, శుక్రము తగ్గుట, లింగము క్షీణించుట, సమస్త మేహములు, ఇవి నశించును. వంగేశ్వర రసమని చెప్పబడును.

## బృహద్వంగేశ్వరరసము

శ్లో॥ రసం గన్ధం మృతం లోహం మృతం రౌప్యం చ ఖర్పరమ్ । మృతాభ్రకం మృతం తామ్రం సర్వతుల్యం చ వఙ్గకమ్ (1) పుటేద్గజపుటేనైవ స్వాఙ్గశీతలముద్ధరేత్ । రక్తికాద్వయమానేన మధునా సేవయేన్నరః (2) నిశా చూర్ణం క్షౌద్రయుతం సితేర్ధ్వాత్రీరసం హ్యను । బృహద్వఙ్గేశ్వరో నామ

మహాదేవప్రకాశితః (3) ప్రమేహాన్వింశతింహన్తి చామదోషం విషూచికామ్। విషమ జ్వరగుల్మార్శోమూత్రాతీ సారపిత్తజిత్ । వీర్యవృద్ధికరో హ్యేష సోమరోగ నిబర్హణః (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, లోహభస్మ 1 భా, వెండిభస్మ 1 భా, శు॥ కషరి 1 భా, అభ్రకభస్మ, 1 భా, తామ్రభస్మ 1 భా, వంగభస్మ 7 భా, వీనిని నూరి గజపుటమువేసి సాంగశీతలమున తీయవలయును. దీనిని రెండురక్తికల పరిమితిగ తేనెతో పుచ్చుకొని, వెంటనే పసుపుచూర్ణమును తేనెతో పుచ్చుకొని ఉసిరికపండ్లరసమును త్రాగవలయును. ఇది బృహద్వంగేశ్వరమని చెప్పబడును. మహాదేవునిచే చెప్పబడినది. వింశతిప్రమేహములు, ఆమదోషము, విషూచి, విషమజ్వరము, గుల్మము, అర్శస్సు, అతిమూత్రము, పిత్తవ్యాధులు, వీనిని నశింపజేయును. వీర్యవృద్ధిని చేయును. సోమరోగమును నశింపజేయును.

## మహావంగేశ్వరరసము

శ్లో॥ వఙ్గభస్మ రసం గన్ధం రౌప్యం కర్పూరమభ్రకమ్ । కర్షం కర్షం నూతపాదే గృహీత్వా హేమమౌక్తికే (1) కేశరాజరసైర్భావ్యం గుఞ్జా ద్వయ ప్రమాణతః । ప్రమేహాన్వింశతిం చైవ సాధ్యాసాధ్యమథాపివా (2) మూత్రకృచ్ఛ్రం తథా పాణ్డుం ధాతుస్థం చ జ్వరం జయేత్ । హలీమకం రక్తపిత్తం వాతపిత్తకఫోద్భవాన్ (3) గ్రహిణీమామదోషం చ మన్దాగ్నిత్వ మరోచకమ్ । బహుమూత్రం బహువిధం ప్రదరౌ శ్వేతరక్తకౌ (4) ఏతాన్స ర్వాన్నిహన్త్యాశు వృక్ష మిన్ద్రాశనిర్యథా । ఓజస్తేజస్కరో నిత్యం స్త్రీషు సమ్యక్ వృషాయతే (5) బలవర్ణకరో వృష్యః శుక్లసంస్తమ్భకః వరమ్ , ఛాగం వా యది వా గవ్యంపయో వా దధి నిర్మలమ్ (6) అనుపానం ప్రయోక్తవ్యం బుద్ధ్వాదోషగతీర్భిషక్ । దద్యాచ్ఛ బాలే ప్రౌఢే చ సేవనార్థం రసాయనమ్ । మహావఙ్గేశ్వరో నామ సోమరోగం నిహన్తి చ (7)

అ॥ వంగభస్మ 1 కర్షము, శు॥ రసము 1 క, శు॥ గంధకము 1 క, వెండిభస్మ 1 క, పచ్చకర్పూరము 1 క, అభ్రకభస్మ 1 క, బంగారువుభస్మ¼ క, ముత్యభస్మ ¼ క, వీనిని గుంటగలగరరసముతో భావనచేయవలయును. దీనిని రెండు గురివింద గింజల పరిమితిగ సేవించినయెడల నిది వింశతిప్రమేహములు, సాధ్యమైనట్టిగాని అసాధ్యమైనట్టిగాని మూత్రకృచ్ఛ్రము, పాండువు, ధాతుగతజ్వరము, హలీమకము, రక్తపిత్తము, వాతపిత్తకఫములవలన కలిగిన వ్యాధులు, గ్రహణీరోగము, ఆమ

దోషము, అగ్నిమాంద్యము, అరోచకము, బహుమూత్రము, శ్వేతప్రదరము, రక్త ప్రదరము, వీనిని పిడుగు వృక్షమునువలె నశింపజేయును. ఓజస్సును, తేజస్సును చేయును. స్త్రీల నెల్లప్పుడు వృషభమువలె రమించునట్లు చేయును. బలమును, శరీర కాంతిని, వీర్యవృద్ధిని, శుక్రస్తంభనమును చేయును. ఈ యౌషధమును సేవించిన వెంటనే మేకపాలనుగాని ఆవుపాలనుగాని మేకపెరుగునుగాని ఆవుపెరుగునుగాని దోషగతులను తెలిసికొని అనుపానముగ నియ్యవలయును. దీనిని బాలురకును, యౌవనవంతులకును, ఇయ్యవచ్చును. రసాయనము. మహావంగేశ్వరరసమని చెప్ప బడును. సోమరోగమును నశింపజేయును.

## విష్ణుచక్రరసము

శ్లో॥ కాన్తభస్మ చతుర్భాగం తీక్ష్ణణం లోహం త్రిభాగకమ్ । తత్సమం గిరిజం చైవ సౌభాగ్యం చ ద్విభాగకమ్ (1) తాలం మనశ్శిలాం చైవ ప్రత్యేకం వేదభాగకమ్ । శిలాం వైక్రాన్తమభ్రం చ స్వర్ణం రజతమాక్షికౌ (2) ప్రత్యేకం తు ద్విభాగం చ నాగవఙ్గే వరాటకమ్ । శుక్తిం ప్రవాలం శఙ్ఖం చ ప్రత్యేకం పఞ్చభాగకమ్ (3) తామ్రభస్మ చతుర్భాగం సర్వతుల్యం చ పారదమ్ । తత్సమం గన్ధకం చైవ ఖల్వమధ్యే వినిక్షిపేత్ (4) మాసమేకం తథా కుర్యాత్కార్పాస రసమర్దనమ్ । వాలుకాయన్త్రకే క్షిప్త్వా పాచయేత్సప్త రాత్రకమ్ (5) స్వాఙ్గశీతలముద్ధృత్య దేయం గుఞ్జాప్రమాణత, । క్షయాది కాన్సర్వరోగాన్వాతవ్యాధీంశ్చ నాశయేత్ (6) కఫవ్యాధీనశేషాంశ్చ సంని పాతాంస్త్రయోదశ । జ్వరాంశ్చ వివిధాన్హన్తి నాత్ర కార్యా విచక్షణా । విష్ణు చక్రరసో నామ బ్రహ్మణా నిర్మితః పురా (7)

అ॥ కాంతభస్మ 4 భా, తీక్ష్ణలోహభస్మ 3 భా, శిలాజితు 3 భా, శు॥ టంక ణము 2 భా, శు॥ తాళకము 4 భా, శు। మణిశిల 4 భా, శు। గౌరీపాషాణము 2 భా, వైక్రాంతభస్మ 2 భా, అభ్రకభస్మ 2 భా, సువర్ణభస్మ 2 భా, వెండిభస్మ 2 భా, హేమమాక్షికభస్మ 2 భా, సీసభస్మ 5 భా, వంగభస్మ 5 భా, గవ్వలభస్మ 5 భా, ముత్యపుచిప్పలభస్మ 5 భా, పగడభస్మ 5 భా శంఖభస్మ 5 భా, తామ్రభస్మ, 4 భా, శు॥ పాదరసము 66 భా, శు॥ గంధకము 66 భా, వీనిని ఖల్వమునుంచి ప్రత్తివేళ్ళ రసముతో నొకమాసము మర్దించి వాలుకాయంత్రమందుంచి యేడురోజులు వండి స్వాంగశీతలమున తీయవలయును. దీనిని ఒకగురివిందగింజపరిమితిగ నిచ్చినయెడల క్షయ మొదలగు సమస్తవ్యాధులు, వాతవ్యాధులు, సమస్తమైన శ్లేష్మవ్యాధులు, పద

మూడు సంనిపాతములు, సమస్తజ్వరములు, ఇవి నిశ్చయముగ హరించును. ఇది విష్ణుచక్రరసమని చెప్పబడును. పూర్వకాలమందు బ్రహ్మచే చెప్పబడినది.

## మహావిష్ణుచక్రరసము

శ్లో॥ పారదం గన్ధకం చైవ తుత్థం చైవ మనశ్శిలామ్ । తాలకద్వియం చైవ స్వర్ణభస్మ సమాంశకం (1) ఏతైస్సర్వైస్సమం చైవ నాగభస్మ వినిక్షిపేత్ । ఏతైస్సర్వైస్సమం చైవ వత్సనాభం వినిక్షిపేత్ (2) ఏతైస్సర్వైస్సమం చైవ గరలం చ వినిక్షిపేత్ । ఏతైస్సర్వైస్సమం చైవ హ్యుల్లిపాషాణకం క్షిపేత్ (3) సర్వం ఖల్వే వినిక్షిప్య వహ్నిమూలరసేన చ । కటుత్రయకషాయేణ మూర్వార్ద్రకజహారసైః (4) ఏకైకేన త్రిదివసం దృఢం సంమర్ద్యకారయేత్ ॥ గులికాన్ ఛాయయాశుష్కాన్ వంశనాళే వినిక్షిపేత్ (5) శాలిబీజ ప్రమాణేన హ్యనుపాన విశేషతః । ఘోరాణి సంనిపాతాని త్రయోదశ హరేచ్ఛ్రువై (6) కఫజాన్వివిధాన్ వ్యాధీన్వాతవ్యాధీంస్తథైవ చ । సఞ్జీవనీవ సంరక్షే దన్త్యకాలప్రయోగతః (7) నాతః పరతరః కశ్చిదస్తి శీతలనాశకః । విష్ణుచక్రమితి ఖ్యాతో లక్ష్మీనాథ ప్రకల్పితః (8)

అ॥ శు॥ పాదరసము 1 భా॥ శు॥ గంధకము 1 భా, శు॥ మైలతుత్థము 1 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ తాళకము 1 భా, శు॥ పిండతాళకము (అరిదళము) 1 భా, సువర్ణభస్మ 1 భా, సీసభస్మ 7 భా, శు॥ నాభి 14 భా, గరళము 28 భా, శు॥ ఉల్లిపాషాణము 56 భా, ఇట్లు వనిని గ్రహించి ఖల్వమందుంచి చిత్రమూలము, త్రికటుకములు, చాగ, అల్లము, దూలగొండ, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసి రోజులు దృఢముగ మర్దించి కప్పెలు కట్టి నీడనుఎండించి వెదురు గొట్టమునందుంచవలయును. దీనిని అనుపానవిశేషములతో నొక వడ్లగింజపరిమితిగ నిచ్చినయెడల ఘోరమైన పదుమూడు సన్నిపాతములు, సమస్తమైన శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, ఇవి నశించును. ప్రాణావసానకాలమందు నిచ్చినయెడల సంజీవనివలె జీవింపజేయును. శైత్యమును తగ్గించి వెంటనే వేడి చేయుటకు దీనికంటె శ్రేష్ఠమైన మందు వేరొకటి లేదు. ఇది విష్ణుచక్రరసమని ప్రసిద్ధమైనది. లక్ష్మీనాథునిచే చెప్పబడినది.

## అగ్నికుమారరసము

శ్లో॥ టఙ్కణం రసగన్ధౌ చ సమభాగం త్రయం విషమ్ । కపర్దశఙ్ఖౌ త్రినవౌ వసుభాగం మరీచకమ్ (1) దినం జమ్బామ్భసా పిష్టం భవేదగ్ని

కుమారకః । విషూచీశూలవాతాదివహ్నిమాన్ద్యే ద్విగుఞ్జకః । అజీర్ణే సంగ్రహణ్యాం చ ప్రయోజ్యోఽయం నిజౌషధైః (2)

అ॥ శు॥ టంకణము 1 భా, శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ నాభి 3 భా, గవ్వలభస్మ 3 భా, శంఖభస్మ 9 భా, మిరియాలచూర్ణము 8 భా, వీనిని నిమ్మకాయరసముతో నొకరోజు మర్దించినచో నగ్నికుమార మగును. విషూచి శూల, వాతవ్యాధులు, అగ్నిమాంద్యము, అజీర్ణము, సంగ్రహగ్రహణి, వీనియందు దీనిని తగిన యనుపానములతో రెండుగురివింద గింజల పరిమితిగ నియ్యవలయును.

## అగ్నికుమారరసము

శ్లో॥ రసశ్చ గన్ధోపి చ టఙ్కణాఖ్యస్సమం విషం యోజ్యమతస్త్రిభాగమ్ । కపర్దశఙ్ఖావపి నేత్రభాగౌ మరీచకం చాష్టగుణం విమర్ద్య (1) సుపక్వజమ్బీరరసేన ఖల్వే సిద్ధో భవత్యగ్నికుమారకోఽయమ్ । అజీర్ణవాతం గుదగుల్మవాతం విషూచికాద్యం వినిహన్తి సద్యః (2)

అ॥ శు॥ రసము 1 భా. శు॥ గంధకము 1 భా, శు॥ టంకణము 1 భా, శు॥ నాభి 3 భా, గవ్వలభస్మ 3 భా, శంఖభస్మ 3 భా, మిరియాలచూర్ణము 8 భా, వీనిని ఖల్వమందు నిమ్మకాయలరసముతో మర్దించినయెడల అగ్ని కుమారమగును. ఇది అజీర్ణము, వాతము, గుదవాతము, గుల్మవాతము, విషూచి మొదలగువ్యాధులు, వీనిని వెంటనే హరించును.

## అగ్నికుమారరసము

శ్లో॥ మరిచోగ్రాకుష్ఠముస్తాస్సర్వైరేవ సమం విషమ్ । పేషయేదార్ద్రికేణైవ వటికా రక్తికామితా (1) ఆమజ్వరే ప్రథమతః శుణ్ఠ్యా చ మధుపిష్టయా । ఆర్ద్రికస్వరసేనాపి నిర్గుణ్డ్యాశ్చ కఫజ్వరే (2) పీనసే చ ప్రతిశ్యాయే మరీచస్య చ వారిణా । అగ్నిమాన్ద్యే లవఙ్గేన శోఫే చ దశమూలకైః (3) గ్రహణ్యాం సహ శుణ్ఠ్యా చాతిసారే దశమూలకైః । సామే చ ధాన్యశుణ్ఠీభ్యాం పక్వే సమధుకౌటజైః (4) సంనిపాత జ్వరారమ్భే పిప్పల్యార్ద్రికవారిణా । కణ్టకార్యా రసైః కాసే శ్వాసేవాసారసేన చ (5) పీత్వా వటీద్వయం రోగే స్వాస్థ్యం సముపగచ్ఛతి । సర్వేష్వేవ చ రోగేషు చామదోషప్రశాన్తయే । అగ్నివృద్ధికరో నామ్నా విఖ్యాతోఽగ్నికుమారకః (6)

అ॥ మిరియాలు 1 భా, వస 1 భా, చెంగల్వకోష్టు 1 భా, తుంగగడ్డలు 1 భా, శు॥ నాభి 4 భా, వీనిని అల్లపురసముతో నూరి రక్తిక పరిమితిగల మాత్రలను జేయవలయును. వీనిని ఆమజ్వరముయొక్క ప్రారంభమందు తేనెతో నరగదీయబడిన శుంఠితోడను లేక అల్లపురసముతోడను, కఫజ్వరమందు వావిలాకు రసముతోడను, పీనసయందును జలుబునందును మిరియాల రసముతోడను, అగ్నిమాంద్యమందు లవంగ కషాయము తోడను, సంజునందు దశమూల కషాయముతోడను, గ్రహిణీవ్యాధియందు శుంఠరసముతోడను, అతిసారమందు దశమూల కషాయముతోడను, ఆమాతీసారమందు ధనియాలు శుంఠి దీనియొక్క రసముతోడను, పక్వాతిసారమందు తేనెతో కూడిన కొడిశెపాల కషాయముతోడను, సంనిపాతజ్వరారంభమందు పిప్పళ్ళు అల్లము దీనియొక్క రసముతోడను, దగ్గునందు వాకుడురసముతోడను, శ్వాసయందు అడ్డసరపురసముతోడను, రెండుమాత్రలు చొప్పున పుచ్చుకొనిన యెడల ఆయావ్యాధులయందు స్వాస్థ్యము కలుగును, సమస్తవ్యాధులయందును ఆమదోషమును శాంతింపజేయును. అగ్నివృద్ధిని చేయును. అగ్నికుమారరసమనెడి పేరుతో ప్రసిద్ధమైనది,

## లఘుసూర్యావర్తి

శ్లో॥ మృతాభ్రం మాక్షికం చైవ హేమకార్పాసబీజకమ్ । కాకబిమ్బ్యాశ్చ బీజాని గుడూచీసత్వమేవ చ (1) టఙ్కణం మౌక్తికం చైవ గీర్వాణకుసుమం తథా । హిఙ్గులం సర్వతుల్యం స్యాజ్జామ్బీరేణ విమర్దయేత్ (2) ద్రాక్షార్ద్రికరసైశ్చాపి భావయేత్సప్తవారకమ్ । గుఞ్జామాత్రప్రమాణేన హ్యనుపానవిశేషతః (3) సర్వపిత్త గదధ్వంసీ వాతపిత్తగదాపహః । ఛర్దిహిక్కాహరశ్చైవ గ్రహణీ దోషకం జయేత్ (4) మన్దాగ్ని మమ్లపిత్తం చ కాసం శ్వాసమరోచకమ్ । సూర్యావర్తిరసో నామ హ్యశ్వినీదేవనిర్మితః (5)

అ॥ అభ్రకభస్మ 1 భా, హేమమాక్షికభస్మ 1 భా, పమిడిపత్తిగింజలలోని పప్పు 1 భా, కాకిదొండవిత్తులలోని పప్పు 1 భా, తిప్పసత్తు 1 భా, పొ॥ వెలిగారము 1 భా, ముత్యభస్మ 1 భా, లవంగాలచూర్ణము 1 భా, శు॥ ఇంగిలీకము 8 భా, వీనిని నిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు అల్లము, వీనిరసములతో ఏడురోజులు మర్దనను, భావనను చేయవలయును. దీనిని అనుపానవిశేషములతో నొక గురివిందగింజపరిమితిగ సేవించిన యెడల సమస్తపైత్యవ్యాధులు, వాతపైత్యవ్యాధులు, వాంతులు, ఎక్కిళ్లు, గ్రహణీరోగము, అగ్నిమాంద్యము, ఆమ్లపిత్తము, దగ్గు, వగర్పు, అరోచకము, ఇవి హరించును, ఇది సూర్యావర్తిరసమని చెప్పబడును. అశ్వినీదేవతలచే చెప్పబడినది,

## లఘుసూర్యావర్తి (ప్రకారాంతరము)

శ్లో॥ మౌక్తికం మాక్షికం చైవ టఙ్కణం చోగ్రగన్ధకమ్ । హేమకార్పాసబీజం చ కాకబిమ్బీద్రుమాస్థిజమ్ (1) పృథక్పృథక్చతుర్భాగం ద్వాదశామృత సత్వకమ్ । తత్సమం శుద్ధదరదం జమ్బార్ద్రాభ్యాం విమర్దయేత్ (2) మన్దాగ్నిం ఛర్దిరోగం చ శ్వాసం కాసమరోచకమ్ । హిక్కాం చ మూత్రకృచ్ఛ్రం చ గ్రహణీ మమ్లపిత్తకమ్ (3) సర్వపిత్తగదాన్హన్తి వాతపిత్తగదాపహః । సూర్యావర్తిరసో నామ చేశ్వరేణ సుభాషితః (4)

అ॥ ముత్యభస్మ 4 భా, హేమమాక్షికభస్మ 4 భా, పా॥ టంకణము 4 భా, వస 4 భా, పమిడిపత్తిగింజలలోని పప్పు 4 భా, కాకిదొండవిత్తులలోని పప్పు 4 భా, తిప్పసత్తు 12 భా, శు॥ ఇంగిలీకము 12భా, వీనిని నిమ్మకాయలు, అల్లము, వీనియొక్క రసములతో మర్దింపవలయును, దీనిని సేవించినయెడల అగ్నిమాంద్యము, వాంతులు, శ్వాస, కాస, అరోచకము, ఎక్కిళ్లు, మూత్రకృచ్ఛ్రము, గ్రహణీరోగము, అమ్లపిత్తము, సమస్తమైన పైత్యవ్యాధులు, వాతపైత్యవ్యాధులు ఇవి నశించును. సూర్యావర్తిరసమని చెప్పబడును, ఈశ్వరునిచే చెప్పబడినది.

## సువర్ణసూర్యావర్తి

శ్లో॥ ఏకభాగం జాతరూపం తదర్ధాం మృగనాభికామ్ । త్రిభాగం టఙ్కణం చైవ త్రిభాగం నాగకేసరమ్ (1) లవఙ్గం చ చతుర్భాగం శుణ్ఠీంపైపఞ్చభాగికామ్ । ఏలాం తథా వై షడ్భాగం హ్యమృతాసత్వమేవ చ (2) సప్తభాగం తథా శుద్ధం హిఙ్గులం సప్తభాగకమ్ లవఙ్గార్ద్రరసేనాపి మర్దయేదష వారకమ్ (3) మాషమాత్రప్రయోగేణ హ్యనుపానవిశేషతః । పఞ్చహిక్కాస్తథా ఛర్దిం శ్వాసం కాసమరోచకమ్ (4) సమస్తాన్ పైత్తికాన్ రోగాన్ జీర్ణజ్వరమజీర్ణకమ్ । ఆస్యపాకం కణ్ఠదాహం హృద్రోగం పాణ్డుకామలే (5) ఉన్మాదం మూర్ఛరోగం చ హ్యపస్మారం జ్వరం తథా । మూత్రకృచ్ఛ్రం ప్రమేహాంశ్చ శుక్లమేహం తథాఽశ్మరీమ్ (6) గ్రహిణీం శూలతృష్ణే చ దాహం వైకరపాదయోః । నాశయేన్నాత్ర సందేహో వృష్యశ్చైవ రసాయనమ్ (7) పుష్ట్యాయుఃకాన్తిజనకో హ్యశ్వినీదేవనిర్మితః । సూర్యా

వర్తిరసో నామ మహాకనకపూర్వకః । నాతః పరతరః శ్రేష్ఠోవిద్యతే పిత్తనాశకః (8)

అ॥ బంగారుభస్మ 1 భా, కస్తూరి ½ భా, శు॥ టంకణము 3 భా, నాగకేసరములు 3 భా, లవంగములు 4 భా, శుంఠి 5 భా, ఏలకులు 6 భా, తిప్పసత్తు 7 భా, శు॥ ఇంగిలీకము 7 భా, వీనిని లవంగములు, అల్లము, వీనియొక్క రసములతో నెనిమిది దినములు మర్దింపవలయును. దీనిని అనుపానవిశేషములతో మాషపరిమితిగ నిచ్చిన యెడల అయిదువిధములైన ఎక్కిళ్లు, వాంతి, ఆయాసము, దగ్గు, అరోచకము సమస్తమైన పైత్యవ్యాధులు, జీర్ణజ్వరము, అజీర్ణము, నోటిపూత, కంఠమందుమంట, హృదయవ్యాధి, పాండువు, కామిర్లు, ఉన్మాదము, మూర్ఛరోగము, అపస్మారము, జ్వరము, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహములు, వీర్యనష్టము, అశ్మరి, గ్రహణీరోగము, శూల, దప్పిక, కాళ్లయందును చేతులయందును మంట, ఇవి నిశ్చయముగ నశించును. ఇది వీర్యవృద్ధిని చేయును, ముసలితనమున వ్యాధులను పోగొట్టును. శరీరపుష్టిని ఆయురభివృద్ధిని, శరీరకాంతిని, కలిగించును. మహాసువర్ణసూర్యావర్తియని చెప్పబడును. పైత్యమును నశింపజేయుటకు దీనికంటె శ్రేష్టమైనది వేరొకటి లేదు,

## మహాసువర్ణసూర్యావర్తి (వంటయోగము)

సీ॥ హేమభస్మమొకండు హేమమాక్షికమును కాంతమభ్రకము
వైక్రాంతపవడ । భస్మముల్ మౌక్తికభస్మ వంగంబుటంకణభస్మ పరిశుద్ధ
గంధకంబు రౌహిషశృంగంబు రససిందురంబును వెండిభస్మయు పాళ్ళ
రెండుగాను । పచ్చవరాటకభస్మంబు నాలుగు నాగసిందూరంబు నాల్గుపాళ్ళ ।
ఇంగిలీకపుపాళ్ళు నింపుగా పదునారు నిమ్మదాడిమఫలనీరములను । నారంగ
పులిచింత సారంపు వారి నామలకమాదీఫలసలిలములను । దబ్బకాయలనీట
నిబ్బరంబుగ నూరి తగినట్టి తామ్రపాత్రమున మందు । మాత్రలుగాఁజేసి
మఱి వాలుకంబున నాల్గు జాములువండినయముగాను । తులితమౌ తిప్పసత్తును
కాకిదొండవిత్తులు పైడిపత్తివిత్తులను దంచి । ఔషధంబుకు సరియౌనట్లుగా
దూచి తొల్లిటిరసములతోడ నేడు । దివసంబులును నూరి దిటవుగానందున
మృగనాభి శశిఖండములను జేర్చి కుంకుమంబును గల్పి కుప్పెలనమఱిచి
రేపుమాపును గుంజరీతి గ్రోల । పైత్యకామిలములు పైత్యహృద్రోగముల్
పరిణామశూలల బారద్రోలు । షండతల్ మూర్ఛలుకందువుల్ రుధిరముల్
పైత్యదద్దురముల బాయజేయు । మేహముల్ దుస్తరదాహముల్ కరపాద

దాహముల్ వహ్నులఁ దరిమివైచు । పైత్యకాకలు మహాపైత్యపైత్యాపస్మారగదముల కృమిశూల । గదలడంచు । పైత్యవాతములను పైత్యమేహంబుల పైత్యహిక్కలనెల్ల భస్మజేయు । మందాగ్నులను ఘోరమారుతమరిశస్సు పిచ్చులున్మాదముల్ బెఱికివైచు । మూత్రకృచ్ఛ్రలు బహుమూత్రముల్ కుష్ఠలు శోఫలు పాండవుల్ శూలలార్చు । జ్వరములు సన్నులు శ్వాసకాసంబులు శ్లేష్మముల్ గ్రహణుల చెండివైచు । వీర్యవృద్ధియొనర్చు నవార్యమైన । వంధ్యతలమాన్పు నశ్మరుల్ వదలఁజేయు । నరుచులను గూల్చు శోఫలనార్చివైచు । మహిత కనకసూర్యావర్తి మహిని వెలయు ॥

అ॥ బంగారుభస్మ 1 భా, హేమమాక్షికభస్మ 2 భా, కాంతభస్మ 2 భా, అభ్రకభస్మ 2 భా, వైక్రాంతభస్మ 2 భా, పగడభస్మ 2 భా, ముత్యభస్మ 2 భా, వంగభస్మ 2 భా, టంకణభస్మ 2 భా, శు॥ గంధకము 2 భా, దుప్పికొమ్ముభస్మ 2 భా, రససిందూరము 2 భా, వెండిభస్మ 2 భా, పచ్చగవ్వలభస్మ 4 భా, నాగసిందూరము 4 భా, శు॥ ఇంగిలీకము 16 భా, వీనిని నిమ్మకాయలు, దానిమ్మకాయలు, నారింజపండ్లు, పులిచింత, ఉసిరికపండ్లు, మాదీఫలములు, దబ్బకాయలు, వీనియొక్క రసములతో నూరి రాగిపాత్రయందు మాత్రలుచేసి వాలుకాయంత్రమందు నాలుగుజాములు వండి తీయవలయును. పిదప తివ్వసత్తు, కాకిదొండవిత్తనములలోనిపప్పు, పమిడిపత్తివిత్తనములలోనిపప్పు, వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగ దంచిపూర్వపుమందుతో, సమానముగ తూచి దానితో కలిపి మొదటివియగు నిమ్మ మొదలగువానియొక్క రసములతో నేడురోజులు నూరి యందు కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, వీనిని కలిపి కుప్పెలను చేయవలయును. దీనిని ఉదయమందును, సాయంకాలమందును, గురువిందగింజపరిమితిగ సేవించినయెడల పైత్యకామిర్లు, పైత్యహృద్రోగములు, పరిణామశూలలు, నపుంసకత్వము, మూర్ఛలు, కిందుట, రక్తవ్యాధులు, పైత్యదద్దుర్లు మేహములు, మంటలు, కాళ్ళయందును చేతులయందును మంటలు, పైత్యకాకలు, మహాపైత్యములు, పైత్యములు, అపస్మారములు, కృమిశూలలు, పైత్యవాతములు, పైత్యమేహములు, పైత్యహిక్కలు, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, అర్శస్సు, పిచ్చులు, ఉన్మాదములు, మూత్రకృచ్ఛ్రము, బహుమూత్రము, కుష్ఠములు, నంజులు, పాండువులు, శూలలు, జ్వరములు, సంనిపాతములు, ఆయాసములు, దగ్గులు, శ్లేష్మవ్యాధులు, గ్రహణులు, ఇవి నశించును. ఇది వీర్యవృద్ధిని చేయును. వంధ్యాత్వలు, అశ్మరులు, అరుచులు, శోఫలు, వీనిని హరించును. మహాసువర్ణసూర్యావర్తియనబడును.

## హుతాశనరసము

శ్లో॥ ఏకం చ దిగ్ద్వాదశభాగమానం యోజ్యం విషం టఙ్కణ మూషణం చ। హుతాశనో నామ హుతాశనస్య కరోతి వృద్ధిం కఫవాతహన్తా॥

అ॥ శు॥ నాభి 1 భా, శు॥ టంకణము 8 భా, మిరియాలచూర్ణము 12 భా, వీనిని గ్రహింప (ఉదకముతో నూర) వలయును. ఇది హుతాశనరస మనబడును. జాఠరాగ్నివృద్ధిని చేయును. కఫవ్యాధులను, వాతవ్యాధులను హరించును.

## హుతాశనరసము

శ్లో॥ గన్ధకటఙ్కాంశైశ్చకైకాన్విషమత్ర త్రిభాగకమ్। అష్టభాగం మరీచం చ జమ్భీర్మర్దయేద్దినమ్॥ తద్వటీం ముద్గమానేన కృత్వాఽఽర్ద్రేణ ప్రయోజయేత్। శూలారోచక గుల్మేషు విషూచ్యాం వహ్ని మాన్ద్యకే। అజీర్ణే సంనిపాతాదౌ శైత్యరోగే శిరోగదే (2)

అ॥ శు॥ గంధకము 1 భా, శు॥ రసము 1 భా, టంకణము 1 భా, శు॥ నాభి 8 భా, మిరియాలు 8 భా, వీనిని నిమ్మకాయలరసముతో నొకరోజు మర్దించి పెసర గింజలంత మాత్రలు చేయవలయును. వీనిని అల్లపురసముతో శూల, అరోచకము, గుల్మము, విషూచి, అగ్నిమాంద్యము, అజీర్ణము, సన్నిపాతము మొదలగువ్యాధులు, శైత్యరోగములు, శిరోవ్యాధి, వీనియందియ్యవలయును.

## హుతాశనరసము

శ్లో॥ ఏకాంశకాః పారదగన్ధటఙ్కాః కపర్దశఙ్ఖామృతగేహధూమాః। త్రంశా ఇమేఽధో మరిచం త్విభాంశం సంమర్దితం జమ్బరసేన గాఢమ్ (1) గుల్మాఽరోచకజాఠరాగ్ని సదనాజీర్ణం విషూచీంకఫమ్। జాడ్యం శీర్ష సముద్భవం చ కసనం ముద్గప్రమాణా వటీ। లీఢార్ద్రస్య రసేన హన్తి కథితానేతాన్గదాన్ బ్రహ్మణా। పూర్వం నిర్మిత ఏష యత్నశతకైర్నామ్నా హుతాశోరసః (2)

అ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ టంకణము 1 భా, గవ్వలభస్మ 3 భా, శంఖభస్మ 3 భా, నాభి 3 భా, కతిశూపము 3 భా, మిరియాలు 8 భా, వీనిని నిమ్మకాయలరసముతో దృఢముగ మర్దించి పెసరగింజపరిమాణపు మాత్రను అల్లపురసముతో సేవించినయెడల గుల్మము, అరోచకము, అగ్నిమాంద్యము,

అజీర్ణము, విషూచి, కఫము, శిరోరోగము, దగ్గు, ఈవ్యాధులు హరించును. ఇది బ్రహ్మచే పూర్వకాలమందనేక ప్రయత్నములచే చెప్పబడినది. హుతాశనరసమన బడును.

## వాతాగ్నికుమారరసము

శ్లో॥ పారదం గన్ధకం తుల్యం తాలకం తుల్యభాగరమ్ । తామ్బూలీ వారిణామర్ద్యం మాసమేకం ప్రయత్నతః (1) తతః సూర్యపుటంకృత్వా పునరేవ చ మర్దయేత్ । కాచకూప్యాం వినిక్షిప్య సికతాయన్త్రికే పచేత్ (2) స్వాఙ్గశీతల ముద్ధృత్య హ్యనుపానవిశేషతః సమస్త వాతరోగేషు జ్వరే జీర్ణేతథైవ చ (3) కాసే శ్వాసే క్షయే చైవ కఫరోగేషు యోజయేత్ । శ్లేష్మ జ్వరేషు తథా శీతజ్వరేఽపిచ । నామ్నా ఖ్యాతశ్చ వాతాగ్నికుమారో ధరణీతలే (4)

అ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, తాళకము $\frac{1}{4}$ భా, వీనిని తమలపాకులరసముతో నొకమాసము బాగుగ మర్దించి సూర్యపుటమువేసి మరల తమల పాకులరసముతో మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి సాంగ శీతలమున తీయవలయును. దీనిని అనుపానవిశేషముతో సమస్తమైన వాత వ్యాధులు, జీర్ణజ్వరము, దగ్గు, వగర్పు, క్షయ, శ్లేష్మవ్యాధులు, సమస్తమైన శ్లేష్మజ్వరములు, శీతజ్వరము, వీనియందియ్యవలయును. వాతాగ్నికుమారరసము నెడి పేరుతో భూమండలమందు ప్రసిద్ధమైనది.

## శీతాంశురసము

శ్లో॥ కునటీం శుద్ధతాలం చ తద్యుగ్మం వ్యోషకం క్షిపేత్ । మర్దయేన్ని మ్బునీరేణ గుఞ్జాయుగ్మంతు సేవయేత్ (1) అనుపానం క్షౌద్రపథ్యే చోష్ణవారి తథార్ద్రికమ్ । శీతజ్వరం సంనిపాతం కామలాం పఞ్చగుల్మకమ్ (2) సర్వ శ్వాసం చ కాసంచ హ్యుదరే పూర్వరూపకమ్ । సంనిపాతం తథా ఛర్దిం వాతాశీతిం చ పైత్తికాన్ (3) శూలం శూక మజీర్ణం చ నాభికుక్షిస్థశూలకమ్ । ఆధ్మానానాహవిష్టమ్భాఙ్గ తాపం సర్వాఙ్గదాహకమ్ (4) జఙ్గమస్థావరవిషం హిక్కాం చైవహ్నిమాన్ద్యకమ్ । శోఫం చ భ్రమమూర్ఛే చ తిమిరం విద్రధిం హరేత్ (1) మర్దితో నిమ్బుతో యేన లేపనాద్గజచర్మకమ్ ।

విసర్పమణ్డలేచ్చైవ తుషాచర్మ వ్యపోహతి (6) సేవనం లేపనం కుర్యా ద్వేఘిత్వా గ్రన్థికేఽర్బుదే । లేపితోద న్తరోగాంశ్చ జిహ్వానేత్రరుజ స్తథా (7) అర్కపత్రరసైః కర్ణే కర్ణరోగస్య నాశకః । నిర్గుణ్డీమిశ్రితో నస్యే హ్యపస్మారం శిరోరుజమ్ (8) అఞ్జనం సర్షపసమం నేత్రరోగవినాశతమ్ । మాషమాత్రో సంనిపాతాన్ కామలాం శీతకం జ్వరమ్ (9) ధనుర్వాతం హరేత్ భూతాన్ శేషరోగేషు కా కథా । భాషితో రేవణేనైవ రసః శీతాంశు నామకః (10)

అ॥ శు॥ మణిశిల 1 భా, శు, తాళకము 1 భా, త్రికటుచూర్ణము 2 భా, వీనిని ఖల్వమందుంచి వేపచెక్క రసముతో మర్దింపవలయును. దీనిని తేనె, కరకాయల రసము, వేడినీళ్ళు, అల్లపురసము, వీనియొక్క అనుపానములతో రెండుగురివిందగింజల పరిమితిగ సేవించినయెడల శీతజ్వరము, సన్నిపాతజ్వరము, కామిర్లు, అయిదు విధము లైన గుల్మములు, సమస్తమైన శ్వాసలు, కాస, ఉదరరోగముయొక్క పూర్వరూప ములు, సంనిపాతము, వాంతి, ఎనుబదివాతములు, పైత్యవ్యాధులు, శూల, శూక దోషము, అజీర్ణము, బొడ్డునందలినొప్పి, కడుపునందలినొప్పి, కడుపుబ్బరము, ఆనా హము, విష్టంభము, తాపము, సమస్తశరీరమందు మంటగనుండుట, జంగమవిషము, స్థావరవిషము, ఎక్కిళ్ళు, అగ్నిమాంద్యము, నంజు, భ్రమ, మూర్ఛ, తిమ్మెర్లు, విద్రధి, ఇవి హరించును. వేపాకురసముతో అరగదీసి లేపనముచేసినయెడల గజచర్మము, విస ర్పము, మండలకుష్ఠము, చర్మము పొట్టువలెనూడుట, ఇవి హరించును, కత్తివాట్లువేసి లేపనముచేసి లోనికికూడ పుచ్చుకొనినయెడల గ్రంధి, అర్బుదము, ఇవి నశించును. లేపనము చేసినయెడల దంతరోగములు. జిహ్వారోగములు, నేత్రరోగములు, ఇవి హరించును. జిల్లేడాకురసముతో చెవిలో పోసినయెడల కర్ణరోగములు హరించును. వావిలాకురసముతో కలిపి నస్యము చేయించినయెడల అపస్మారము, శిరోరోగములు, ఇవి హరించును. కన్నులయందు ఆవగింజంత కలికము వేసినయెడల నేత్రరోగములు హరించును. ఇది మాషపరిమితిగ నుపయోగింపబడి సంనిపాతములు, కామిర్లు. శీత జ్వరము, ధనుర్వాతము, భూతవ్యాధులు, వీనిచే హరించుచుండగా నితరవ్యాధులను హరించునని చెప్పనవసరము లేదు. ఇది రేవణునిచే చెప్పబడినది. శీతాంశురసమని చెప్పబడును.

## సు వ ర్ణ పు ష్ప ర సా య న ము

శ్లో॥ ద్విభాగం పారదం శుద్ధం గన్ధకం చ తథావిధమ్, రజతం చ తథా వజ్రమేకభాగం తదర్ధకమ్ (1) సువర్ణం చైవ ఘటకీం టఙ్కణం చ తథావిధమ్ । ద్విభాగం నవసారం చ మర్దయిత్వా భిషగ్వరైః (2) కాచ

కూప్యాం వినిక్షిప్య వాలుకాయన్త్రకే పచేత్ । సాఙ్గశీతలముద్ధృత్య భక్షయేచ్చ నిరన్తరమ్ (3) మణ్డలం మణ్డలార్ధంవా గుఞ్జాద్వయ ప్రమాణతః । అశ్మరీం మూత్రకృచ్ఛ్రం చ సర్వమేహాన్నికృన్తయేత్ (4) దేహపుష్టికరం నృణాం పుత్రప్రసవకారణమ్ । వీర్యవృద్ధిం బలాధిక్యం కురుతే నాత్ర సంశయః (5) మహారాజోపచారేణ పథ్యం దద్యాద్యథావిధి । పూజ్యపాదేన కథితం స్వర్ణపుష్పరసాయనమ్ (6)

అ॥ శు॥ రసము 2 భా, శు॥ గంధకము 2 భా, వెండిభస్మ 1 భా, వంగభస్మ 1 భా, సువర్ణభస్మ ½ భా, పటిక ½ భా, శు॥ టంకణము ½ భా, నవాసారము 2 భా, వీనిని మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి సాంగశీతలముగ తీయవలయును. దీనిని మండలముగాని అర్ధమండలముగాని దినమునకు రెండు గురివిందగింజలపరిమితి చొప్పున సేవించినయెడల అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, సమస్తమైన మేహములు -ఇవి నశించును. ఇది దేహపుష్టినిచేయును. పుత్రసంతానము కలుగుటకు కారణముగ నుండును. వీర్యవృద్ధిని, బలవృద్ధిని నిశ్చయముగ చేయును. దీనిని సేవించునప్పుడు మహారాజులకు చేయు నుపచారమును చేయుచు పథ్యాహారమును యథావిధిగ నియ్యవలయును. ఇది పూజ్యపాదునిచే చెప్పబడినది. సువర్ణపుష్ప రసాయనమని చెప్పబడును.

## జ్వరాంకుశరసము

శ్లో॥ సూతం గన్ధం విషం తుల్యం ధూర్తబీజం త్రిభిస్సమమ్ । చతుర్ణాం ద్విగుణం వ్యోషం చూర్ణయేద్దినమాత్రకమ్ (1) జమ్బీరస్య రసైర్మర్ద్యమార్ద్రికస్య ద్రవేణచ । గుఞ్జాద్వయం ప్రదాతవ్యం వాతజ్వరహరః పరమ్ (2) అయం జ్వరాఙ్కుశో నామ్నా సర్వజ్వరవినాశకః । ఐకాహికం ద్వ్యాహికం చ త్ర్యాహికం చాతురాహికమ్ । త్రిదోషజంవా విషమం హన్తి సత్యం న సంశయః (3)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ నాభి 1 భా, శు॥ ఉమ్మెత్త విత్తులు 3 భా, త్రికటుకములు 12 భా, వీనిని చూర్ణించి నిమ్మకాయరసము, అల్లపు రసము, వీనితో నొకరోజు మర్దింపవలయును. దీనిని రెండుగురివిందగింజల పరిమితిగ నిచ్చినయెడల వాతజ్వరము హరించును. ఇది జ్వరాంకుశరసమని చెప్పబడును. సమస్త జ్వరములను హరింపజేయును. ఐకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహిక జ్వరము, చాతుర్థికజ్వరము, త్రిదోషజ్వరము, విషమజ్వరము, వీనిని నిశ్చయముగ హరింపజేయును.

## మహాజ్వరాంకుశరసము

శ్లో॥ పారదో గన్ధకస్తామ్రం హిఙ్గులస్తాలమేవ చ । లోహం వఙ్గం మాక్షికశ్చ ఖర్పరశ్చ మనశ్శిలా (1) మృతాభ్రకం గైరికం చ టఙ్కణోదన్తి బీజకం । సర్వాణ్యేతాని తుల్యాని చూర్ణయిత్వా విభావయేత్ (2) జమ్బీర విజయాచిత్రవిజయాతిన్త్రిణీరసైః । ఏతైర్దినత్రయం రౌద్రే నిర్జనే ఖల్వ గహ్వరే (3) చణమాత్రవటీః కృత్వా ఛాయా శుష్కాశ్చ కారయేత్ । మహాగ్నిజననీ చైషా సర్వజ్వరవినాశనీ (4) ఏకజం ద్వన్ద్వజం చైవ చిరకాల సముద్భవమ్ । ఐకాహికం ద్వ్యాహికం చ తథా చ త్ర్యాహికం జ్వరమ్ (5) చాతుర్థికం తథాత్యుగ్రం జలదోష సముద్భవమ్ । సర్వాన్ జ్వరాన్నిహన్త్యాశు భాస్కర స్తిమిరం యథా (6) నాతః పరతరం కిఞ్చిజ్జ్వర నాశకభేషజమ్ । మహాజ్వరాఙ్కుశోనామ రసోఽయం మునిభాషితః (7)

అ॥ శు॥ పాదరసము, శు॥ గంధకము, తామ్రభస్మ, శు। ఇంగిలీకము, శు॥ తాళకము, లోహభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, శు॥ కఘరి, శు। మణిశిల, అభ్రకభస్మ, శు॥ కావిరాయి, శు॥ వెలిగారము, శు॥ నేపాళములు, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నిమ్మకాయలు, తులసి, చిత్రమూలము, గంజాయి, చింతాకు, వీని యొక్క రసములతో భయంకరమైనట్టియు, నిర్జనమైనట్టియు, ప్రదేశమందు ఖల్వములో మూడురోజులు భావనచేసి సెనగగింజలంత మాత్రలనుచేసి నీడను ఎండింపవలయును. ఈ మాత్రనుపయోగించినచో నధికమగు అగ్నిదీప్తి కలుగును. సమస్తజ్వరములును నశించును. ఏకదోషజ్వరము, ద్వంద్వజ్వరము, చిరకాలముక్రిందట జనించినజ్వరము, ఐకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహికజ్వరము, చాతుర్థికజ్వరము, అత్యుగ్రమైనజ్వరము, జలదోషముచే జనించినజ్వరము, వీనిని హరింపజేయును. సూర్యుడు చీకటినివలెనిది సమస్తజ్వరములను హరింపజేయును. ఇంతకంటెను శ్రేష్ఠమైనజ్వర నాశకమగు మందు వేరొకటిలేదు. మహాజ్వరాంకుశమని చెప్పబడును. ఇది మునీశ్వరులచే చెప్పబడినది.

## లోకనాథరసము

శ్లో॥ వరాటతుల్యమాణ్డూరం తదర్ధం తీక్ష్ణలోహకమ్ । తత్పాదాంశం మృతం సూతం సూతాద్ద్విగుణగన్ధకమ్ (1) ఖల్వోదరే వినిక్షిప్య మర్దయేద్దివ సత్రయమ్ । వర్షాభూమూలసారేణ వజ్రవల్లీరసేన చ (2) వాసాపాతల శాఖాభ్యాం చ చిత్రమూలేన మర్దయేత్ । గోలకాశ్చాతపే శోష్యా దినాన్తం తు

వినిక్షిపేత్ (3) శరావయోస్తు మృద్వగ్నౌ కుక్కుటాఖ్యపుటే పచేత్ । సూక్ష్మ చూర్ణం తతః కృత్వా తత్సమం మారిచం క్షిపేత్ (4) భావ్యం చానన్తరం చైవ నాగవల్ల్యార్ద్రయోస్తథా । భృఙ్గరాజస్య నిర్గుణ్డ్యా ముణ్డ్యాశ్శిగ్రో రసేనవై (5) త్రిఫలాయా రసేనైవ ఛాయాశుష్కంతు కారయేత్ । నిష్కార్ధం మధునా లేహ్యం యామేయామే చ లేహయేత్ (6) క్షయం క్షయకృశం వ్యాధీన్వాతపిత్తకఫోద్భవాన్ । కాసశ్వాసప్రతిశ్యాయశోఫపాణ్డుగదాదికాన్ (7) హలీమకం చాస్థిగతం వినిహన్తి తథా జ్వరమ్ । దీపనం వీర్యవృద్ధిం చ కాంఽయేన్నాత్ర సంశయః । లోకనాథరసో నామ శమ్భునాపరికీర్తితః (8)

అ॥ గవ్వలభస్మ 1 భా. మాండూరభస్మ 1 భా, తీక్ష్ణలోహభస్మ ½ భా, సూత (రస) భస్మ ½ భా, శు॥ గంధకము ¼ భా, వీనిని ఖల్వమందుంచి గలిజేరువేళ్ళు, నల్లేరు, అడ్డసరము, సాంబరేణాకు, చిత్రమూలము, వీనియొక్క రసములతో మూడు రోజులు మర్దించి మాత్రలు (బిండెలు) చేసి ఎండయందొకరోజు ఎండించి మూకుళ్ళయందుంచి మందాగ్నిచే కుక్కుటపుటమందు పక్వముచేసి పిదప మెత్తగ చూర్ణము చేసి యీ మందుకు సమానపరిమితిగల మిరియాలచూర్ణమును కలిపి తమలపాకులు, అల్లము, గుంటగలగర, వావిలి, బోడతరము, మునగచెక్క, త్రిఫలములు, వీనియొక్క రసముతో భావనచేసి నీడయందెండించవలయును. దీనిని అర్ధనిష్కపరిమితిగ తేనెతో ప్రతిజాముననందున సేవించుచుండినయెడల క్షయ, క్షయచే కలిగిన శరీరకృశత్వము, వాతపిత్తకఫలములవలన కలిగిన వ్యాధులు, దగ్గు, వగర్పు, జలుబు, నంజు, పాండురోగము మొదలగు వ్యాధులు, హలీమకము, అస్థిగతజ్వరము, ఇవి హరించును. అగ్నిదీప్తియు, వీర్యవృద్ధియు, నిశ్చయముగ కలుగును. ఇది లోకనాథరసమని ప్రసిద్ధమైనది. శివునిచే చెప్పబడినది.

## మ హా లో క నా థ ర స ము

శ్లో॥ శుద్ధో బుభుక్షితస్సూతో భాగద్వయమితో భవేత్ । తథా గన్ధస్య భాగౌ ద్వౌ కుర్యాత్కజ్జలికాం ద్వయోః (1) సూతాచ్చతుర్గుణేష్వేవ కపర్దేషు వినిక్షిపేత్ । భాగైకం టఙ్కణాం మర్ద్యం గోక్షీరేణ నిరోధయేత్, (2) తథా శఙ్ఖస్య ఖణ్డానాం భాగా నష్టౌ ప్రకల్పయేత్ । క్షిపేత్సర్వం పుటస్యాన్తశ్చూర్ణలిప్తశరావయోః గర్తే హస్తోన్మితే క్షిప్త్వా పచేద్గజపుటేన చ (3) స్వాఙ్గశీతం సముద్ధృత్య పేషయేత్సర్వమేకతః షడ్గుణ్జా సంమితం చూర్ణ

మనుపాన విశేషతః (4) క్షయం తథాతిసారం చ శ్వాసం కాసమరోచకమ్ । అజీర్ణం గ్రహణీదోషమామం శూలమథాపి చ (5) శ్లేష్మజాన్వివిధాన్ రోగాన్నాశయేన్నాత్రసంశయః । లోకనాథరసో నామ్నా సర్వరోగాన్వినాశయేత్ (6)

అ॥ శుద్ధిచేయబడి బుభుక్షితంబై గంధకాభ్రకాదులను జీర్ణింపచేయబడిన పాదరసము 2 భా, శు॥ గంధకము 2 భా, ఈ రెండింటియొక్క కజ్జలిని 8 భాగముల గవ్వలయందుంచి 1 భాగము టంకణము ఆవుపాలతో నూరి దీనితో గవ్వలయొక్క ముఖములను మూసి యీగవ్వలను, 8 భాగముల శంఖపుముక్కలను, మూకుళ్ళయందుంచి శీలయిచ్చి మూరప్రమాణముగల గోతియందుంచి గజపుటమువేసి సాంగశీతలమున తీసి యన్నిటిని కలిపి యేకముగ నూరవలయును. ఇది అనుపానవిశేషములతో ఆరుగురువింధగింజల పరిమితిగ సేవింపబడి క్షయ, అతిసారము, ఆయాసము, దగ్గు, అరుచి, అజీర్ణము, గ్రహణిదోషము, ఆమదోషము, శూల, సమస్తమైన శ్లేష్మవ్యాధులు, వీనిని నిశ్చయముగ నశింపజేయును. మహాలోకనాథరసమని చెప్పబడును. సమస్తవ్యాధులను నశింపజేయును,

## సువర్ణలోకనాథరసము

సీ॥ కాంచనభస్మంబు గరమొక్కపాలును పారదంబును రెండుపాళ్లుగాను । వరగంధకము మూడు వత్సనాభము నాల్గు ఖడ్గలోహంబైదు కాంతమాఱు । మండూరమారును ఘటిదరదము నేడు సేడుసిందూరమైదభ్రకంబు । శుద్ధటంకణమారు సొంపుగా గ్రహియించి త్రిఫలరసమున తెల్లతెగడనీట । వారాహిరసమున వావిలిరసమున చింతాకురసమున శృంగకంద । రసమున నుమ్మెత్తరసమువ జిల్లేడుపత్రరసంబున బ్రాహ్మినీట । తెలిపునర్నవనీట కలగరాకురసాన చేదుపుచ్చరసంబుచేర్చి యింక । సాంబరాణిరసంబు శైఖరికరసంబు నల్లేరురసముతో నయముగాను । గొబ్బివేళ్లరసాన కూతురుబుడమాకు రసమున వరగోగురసముతోడ । నొక్కొక్కదానిచే నొక్కొక్కదివసంబు మర్దించి కుప్పెనమర్చి మటియు । వాలుకాయంత్రాన మేలుగ నాల్గుయామములు గంధము జీర్ణమగుపఱుసును । వండి కుక్కుటనైరిభంబు కోతిమంమూరచేసచేదుల నందుజేర్చి పిదప । తొల్లిటిరసములతో పదునెన్మిదివాసరంబులు నూరి వల్లమాత్ర । త్రిఫలకషాయాన దినిన శోషలదంగు

రాజయక్ష్మలు పాండురాజి యడగు । మారుతంబులు నగ్నిమాంద్యముల్
షండతల్ శ్వాసకాసములు మూర్ఛలు నడంగు । కామలాదుల నెల్లను
గండడంచు । సూతికావాతశూలముల్ స్రొక్కఁజేయు । సన్నిపాతజ్వరంబుల
సమయఁజేయు । ధరను లోకనాథరసము తథ్యముగను ॥

అ॥ బంగారుభస్మ 1 భా, శు॥ పాదరసము 2 భా, శు। గంధకము 3 భా, శు॥ నాభి 4 భా, ఖడ్గలోహభస్మ 5 భా, కాంతలోహభస్మ 6 భా, మండూరభస్మ 6 భా॥ శు॥ ఇంగిలీకము 7 భా, రససింధూరము 7 భా, అభ్రకభస్మ 5 భా, శు॥ టంకణము 6 భా, వీనిని త్రిఫలములు, తెగడ, నేలతాడి, వావిలి, చింతాకు, మునగవేళ్ళు, ఉమ్మెత్త, జిల్లేడాకు, సరస్వతీయాకు, తెల్లగలిజేరు, గుంటగలగర, వెఱ్ఱిపుచ్చకాయలు, సాంబ్రాణాకు, ఉత్తరేణి, నల్లేరు, గొబ్బివేళ్లు, కూతురుబుడమాకు, వరగోగు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక్కదినము మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు నాలుగుజాములు గంధకము జీర్ణమగునట్లుగ వండి తీసి, కోడి, దున్నపోతు, కోతి, నెమలి, చేప, వీనియొక్క చేదులను చేర్చి మొదటిరసములతో పదునెనిమిది రోజులు నూరవలయును. దీనిని వల్లపరిమితిగ త్రిఫలాకషాయముతో సేవించినయెడల నంజు, రాజయక్ష్మ, పాండువు, వాతవ్యాధులు, అగ్నిమాంద్యము, నపుంసకత్వము, శ్వాస, దగ్గు, మూర్ఛ, కామిగ్లు, సూతికావాతము, శూల, సంనిపాతజ్వరము, ఇవి నశించును. ఇది సువర్ణలోక నాథరస మనబడును.

## అభ్రకయోగము

శ్లో॥ నిశ్చన్ద్రిమాభ్రకం భస్మ సవరారజనీరజః । మధునా లీఢమ
చిరాత్ప్రమేహాన్వినివర్తయేత్ (౹)

అ॥ చంద్రికలేని అభ్రకభస్మము త్రిఫలాచూర్ణము, పసుపుచూర్ణము, వీనితో కూడ చేర్చి తేనెతో కలిపి సేవించినయెడల ప్రమేహములు వెంటనే నివర్తించును.

## లోహరసాయనము

శ్లో॥ రసం చ తీక్ష్ణలోహం చ భాగమేకం ప్రకల్పయేత్ । గన్ధకం చ
ద్విభాగం చ ఖల్వమధ్యే వినిక్షిపేత్ (౹) సహదేవీ వజ్రవల్లీ కన్యార్క
త్రిఫలారసైః । గోమూత్రేణ చ సంమర్ద్య కాచకూప్యాం వినిక్షిపేత్

(2) వాలుకాయన్త్రికే పాచ్యమగ్నిత్రయవిభాగతః । గతోష్ణకం తథోద్ధృత్య పూర్వైర్వేవరసైః పునః (3) మర్దయేదర్ధమాసం చ గుఞ్జాత్రయనిషేవణాత్। శోఫం పాణ్డుం క్షయం శూలమజీర్ణం కామలాం తథా (4) జీర్ణజ్వరం తథాధ్మానం కఫవాతగదాంస్తథా । నాశయత్యేవ క్షిప్రంచ నామ్నా లోహ రసాయనమ్ (5)

అ॥ శు॥ రసము 1 భా, ఖడ్గలోహభస్మ 1 భా, శు॥ గంధకము 2 భా, వీనిని ఖల్వమందుంచి సహదేవి, నల్లేరు, కలుబంద, జిల్లేడు, త్రిఫలములు, వీనియొక్క రసములతోడను గోమూత్రముతోడను మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మందమధ్యమతీక్ష్ణాగ్నులచే వండి చల్లారినపిదప తీసి పూర్వపురసములతో మరల అర్ధమాసము మర్దింపవలయును. దీనిని మూడుగురివిందగింజల పరిమితిగ సేవించినయెడల నంజు, పాండువు. క్షయ, శూల, అజీర్ణము, కామిర్లు, జీర్ణజ్వరము, కడుపుబ్బరము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, ఇవి వెంటనే నశించును. లోహరసాయనమని చెప్పబడును.

### ఆనందభైరవరసము

శ్లో॥ హిఙ్గులం చ చతుర్భాగం టఙ్కణం వసుసంమితమ్ । కణాం చ వత్సనాభం చ ప్రత్యేకమినసఙ్ఖ్యయా (1) ఆర్ద్రికస్య రసేనైవ మాసాని త్రీణి మర్దయేత్ । ఆర్ద్రికస్య రసేనైవ గుఞ్జామాత్రం ప్రదాపయేత్ । సర్వేషు సంనిపాతేషు రసో హ్యానన్దభైరవః (2)

అ॥ శు॥ ఇంగిలీకము 4 భా, శు॥ టంకణము 8 భా, పిప్పళ్ళు 12 భా, శు॥ నాభి 12 భా, వీనిని అల్లపురసముతో మూడుమాసములు మర్దింపవలయును. దీనిని అల్లపురసముతోడనే యొక గురివిందగింజ పరిమితిగ సమస్తమైన సంనిపాతములయందు నివ్వవలయును. ఆనందభైరవరసమని చెప్పబడును.

### ఆనందభైరవరసము

శ్లో॥ హిఙ్గులంచ విషం వ్యోషం మరిచం టఙ్కణం కణామ్ । మాతులుఙ్గరసైర్మర్ద్యం చతుర్మాసం ప్రయత్నతః (1) కాసే శ్వాసే క్షయే గుల్మే ప్రమేహే విషమజ్వరే । తృష్ణాయాం గ్రహణీరోగేఽప్యజీర్ణే సంనిపాతకే। గుఞ్జైకంతు ప్రదాతవ్యో రసో హ్యానన్దభైరవః (2)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ నాభి, త్రికటుకములు, మిరియాలు, శు॥ టంకణము, పిప్పళ్ళు, వీనిని సమభాగములుగ గ్రహించి మాదీఫలరసముతో నాలుగుమాసములు బాగుగ మర్దింపవలయును, దీనిని కాస, శ్వాస, క్షయ, గుల్మము, ప్రమేహములు, విషమజ్వరము, దప్పిక, గ్రహణీరోగము, అజీర్ణము, సంనిపాతము, వీనియందు ఒక గురివిందగింజపరిమితిగ నియ్యవలయును. ఇది ఆనందభైరవరసమని చెప్పబడును.

## ఆనందభైరవరసము

శ్లో॥ దరదం వత్సనాభం చ మరిచం టఙ్కణం కణామ్ । చూర్ణయేత్సమభాగేన జామ్బీరేణ విమర్దయేత్ (1) షణ్మాసంతు దృఢంచైవ రసో హ్యానన్దభైరవః గుఞ్జైకం వా ద్విగుఞ్జం వా బలం జ్ఞాత్వా ప్రయోజయేత్ (2) మధునా లేహయేచ్చాను కుటజస్య ఫలం త్వచమ్ । చూర్ణితం కర్ష మాత్రం తు త్రిదోషోత్థాతిసారజిత్ (3) దధ్యన్నం దాపయేత్పథ్యం గవ్యాజ్యం తక్రమేవచ । పిపాసాయాం జలం శీతం విజయాచ హితానిశి (4)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ నాభి, మిరియాలు, శు॥ టంకణము, పిప్పళ్ళు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణించి నిమ్మకాయరసముతో ఆరు నెలలు దృఢముగ మర్దింపవలయును. ఇది ఆనందభైరవరసమని చెప్పబడును. దీనిని ఒకగురివిందగింజ పరిమితిగ గాని రెండు గురివిందగింజల పరిమితిగ గాని రోగియొక్క బలమును తెలిసికొని యిచ్చి వెంటనే కొడిశపాలయొక్క విత్తులచూర్ణము, పట్టచూర్ణము, వీనిని తేనెతో కర్షపరిమితిగ నిచ్చినయెడల త్రిదోషములవలన కలిగిన అతిసారము నశించును. దీని నిచ్చునప్పుడు పెరుగుఅన్నము, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ, వీనిని పథ్యముగ నియ్యవలయును. దప్పిక అయినయెడల చల్లనినీటిని యియ్యవలయును. రాత్రి యందు గంజాయియాకును ఇచ్చుట మంచిది.

## వంగభస్మప్రయోగము

శ్లో॥ వఙ్గం శిలాజతుయుతం తు మతం ప్రమేహే । జాతీఫలార్కకరహాటలవఙ్గయుక్తమ్॥ ధాతుక్షయే దుర్బలనష్టశుక్రయో । రభ్రేణ యుక్తం తు సుతప్రదం స్యాత్ (1) శ్లో॥ శాల్మలీత్వగ్రసోపేతం సక్షౌద్రరజనీరజః । వఙ్గభస్మ హరేన్మేహాన్పఞ్చాననఇవ ద్విపాన్ (3) గుడూచీసారమధునా వఙ్గభస్మ ప్రమేహజిత్ । నాగభస్మ తథైవాపి సర్వమేహవినాశకమ్ (4)

అ॥ వంగభస్మము శిలాజతుతో కూడ ప్రమేహమందియ్యవలయును. జాజికాయ, జిల్లేడు, తామరదుంప, లవంగములు, వీనితో ధాతుక్షయ, దౌర్బల్యము, శుక్ల నష్టము, వీనియందియ్యవలయును. అభ్రకభస్మముతో నిచ్చినయెడల పుత్రసంతానము కలుగును. బూరుగచెక్క రసముతోడను, తేనె పసుపుచూర్ణము వీనితోడను, ఇచ్చినయెడల సింహము ఏనుగులనువలె ప్రమేహములను హరించును. తిప్పసత్తు, తేనె, వీనితో ప్రమేహములను హరించును. ఈవిధముగనే సీసభస్మకూడ ప్రమేహములను హరించును.

## నవగ్రహి

శ్లో॥ గౌరీశిలాహిఙ్గులగన్ధకాంశ్చ రసం చ గోదన్తమయూర తుత్థే। తాలం శిలాం ఖర్పరసంయుతాం చ సామ్యేన కృత్వా నవ ఖల్వమధ్యే । సుకార వేల్లీరసనిమ్బతో యైర్విమర్దయేత్సార్ధదినం చ గాఢమ్ (1) శ్లో॥ కాచకుమ్భే తతః క్షిప్త్వా వాలుకాయాం చ పాచయేత్ । సర్వరోగేషు దాతవ్యశ్చానుపాన విశేషకైః (2)

అ॥ తు॥ గౌరీపాషాణము, తు॥ ఇంగిలీకము, తు॥ గంధకము, తు॥ పాదరసము తు॥ తాళకము, తు॥ మైలతుత్థము, తు॥ పిండతాళకము, తు॥ మణిశిల తు॥ కపురి, ఈ తొమ్మిదింటిని సమభాగములుగ గ్రహించి ఖల్వమందుంచి కాకరాకురసము తోడను, వేపాకురసముతోడను, ఒకటిన్నరరోజు దృఢముగ మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండవలయును, దీనిని సమస్తవ్యాధులయందు అనుపాన విశేషములతో నియ్యవలయును.

## లక్ష్మీవిలాసము (సూతికలకు సర్వవాతములకు)

వ॥ తు॥ ఇంగిలీకమును చిత్రమూలగసముతో నూరి ఎండించి కోడిగ్రుడ్ల పెంకుల యందుంచి యొకకుండలో ఇసుకపోసి యందు నాకోడిగ్రుడ్ల పెంకులను కంఠమువరకు మునుగునట్లు పెట్టి యొకజాము వండవలయును. ఔషధము పక్వమై గట్టిపడును.

## లక్ష్మీవిలాసము (ప్రకారాంతరము)

వ॥ తు॥ ఇంగిలీకమును కోడిగ్రుడ్లయందలి తెల్లసొనతో మర్దనచేసి కప్పెలుకట్టి బాగుగ ఆరనిచ్చి కోడిగ్రుడ్లలో తెల్లసొనమాత్రముంచి యందు నీ కప్పెలనుంచి వరి పిండితో మూతమూసి డోలాయంత్రమందు సున్నపునీటిలో నొకజాము వండ వలయును.

అరచిన్నము నొక తెగు గోష్వసతములపాకు రసముతో రెండు పూటల యొక్క నియ్యవలయును.

గుణములు:_ సూతికావాతములు, సమస్త వాతవ్యాధులు, జ్వరములు, చంటి పిల్లలకు కలుగు శ్లేష్మవ్యాధులు, మొదలగు వానిని నశింపజేయును.

## కస్తూరి మాత్రలు (4 వ రకము)

వ॥ కస్తూరి 1 భా, మిరియాల చూర్ణము 1 భా, గోరోచనము 1 భా, రససిందూరము 1 భా, పిప్పళ్ళచూర్ణము 1 భా, అక్కలకర్రచూర్ణము 1 భా, శు ఇంగిలీకము 1 భా, వీనిని తమలపాకులరసముతో మర్దించి మాత్రలను కట్టవలయును.

## కస్తూరి మాత్రలు (3 వ రకము)

వ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, వీనిని మొదట మెత్తగా నూరి కజ్జలిచేసి పిదప శు॥ రసకర్పూరము 1 భా, గోరోచనము 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ నాభిచూర్ణము 1 భా, మిరియాలచూర్ణము 1 భా, రససిందూరము 1 భా, శుంఠిచూర్ణము 1 భా, కస్తూరి 1 భా, వీనిని కలిపి తమలపాకురసముతో డను, మిరియాలరసముతో డను, నూరి మాత్రలు కట్టవలయును.

## కస్తూరి మాత్రలు (2 వ రకము)

వ॥ పాపుచారు 1 భా, జున్ను 1 భా, శు॥ రసకర్పూరము 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, గోరోచనము 1 భా, రససిందూరము 1 భా, లవంగముల చూర్ణము 1 భా, మిరియాలచూర్ణము 1 భా, గొయ్యిపీత 1 భా, శు॥ నాభిచూర్ణము 1 భా, కస్తూరి 1 భా, వీనిని మిరియాలరసముతో గాని, చిత్రమూలకషాయముతో గాని మర్దించి మాత్రలు కట్టవలయును.

## కస్తూరి మాత్రలు (1 వ రకము)

వ॥ శు॥ రసకర్పూరము 1 భా, రససిందూరము 1 భా, సన్నిపాతభైరవి 1 భా, జున్ను 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ నాభిచూర్ణము 1 భా, వాతరాక్షసము 1 భా, పాపుడారు 1 భా, గోరోచనము 1 భా, కస్తూరి 1 భా, వీనిని మునగచెక్క రసముతో గాని చిత్రమూలరసముతో గాని నూరి మాత్రలు కట్టవలయును.

గుణములు :_ ఆజీర్ణము, వాతప్రకోపము, శ్లేష్మప్రకోపము, అతిసారము, కాళ్లు, చేతులుచల్లపడుట, చెమటలు కలుగుట, సూతికావాతము, పక్షవాతము, జ్వరము, మొదలగు వ్యాధులను బోగొట్టి వాతమును నశింపజేసి వేడిని కలిగించును. మరియు నివి చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు, డొక్క ఎగరవేయుట, దగ్గు, అజీర్ణవిరేచన

ములు, జ్వరము, శ్లేష్మప్రకోపము, జలుబు, మాంద్యము, వాతవ్యాధులు, కడుపుబ్బ రము, వాంతులు, మొదలగువ్యాధులను నశింపజేసి చక్కని వేడిని కలిగించును.

## విజయసిందూరము

వ॥ నాగభస్మ 3 భా, వంగభస్మ 3 భా, రజితభస్మ 3 భా, పాదరసము 3 భా, శు॥ గంధకము 18 భా, వీనిని కలబందరసముతోడను, గంజాయాకురసముతోడను, నూరి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి సాంగశీతలమునతీసి మొదటి రసములతో మర్దింపవలయును. దీని ననుపానవిశేషములతో సేవించినయెడల ఉడుకు (మేహ) వ్యాధులు, శుక్లనష్టము, బలహీనము, తెల్లబట్ట, ఎఱ్ఱబట్ట, సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, అతిమూత్రము, మొదలగు వ్యాధులు నశించును. వీర్యవృద్ధియు, వీర్యస్తంభనమును కలుగును. ఇది రసాయనము.

## కుముదేశ్వరరసము

శ్లో॥ పారదం శోధితం గన్ధమభ్రకం చ సమం సమమ్ । తదర్ధం దరదం దద్యాత్తదర్ధాం చ మనశ్శిలామ్ (1) సర్వార్థం మృతలోహం చ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । ద్విసప్తభావనా దేయాఃశతావర్యా రసేన చ (2) తతస్సిద్ధో భవత్యేష కుముదేశ్వరసంజ్ఞకః । సితయా మరిచేనాథ గుఞ్జాద్విత్రిప్రమాణతః (3) భక్షయేత్ప్రాతరుత్థాయ పూజయిత్వేష్ట దేవతామ్। యక్ష్మాణముగ్రం హన్త్యేవ వాతపిత్తకఫామయాన్ (4) జ్వరాదీనఖిలాన్ రోగాన్యథా దైత్యాన్ జనార్దనః। సతతాభ్యాస యోగేన వలీపలితనాశకః (5)

అ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, అభ్రకభస్మ 1 భా, శు॥ ఇంగిలీకము ½ భా, శు॥ మణిశిల ¼ భా, లోహభస్మ 1⅞ భా, వీనిని ఖల్వమందుంచి పిల్లిపీచరరసముతో 14 సారులు భావనచేయవలయును. ఇది కుముదేశ్వరరసమని చెప్ప బడును. ఉదయమున లేచి ఇష్టదేవతను పూజించి పంచదార, మిరియాలచూర్ణము వీనితో 2 లేక 3 గురివిందగింజల పరిమితిగ సేవించినయెడల కఠినమైనయక్ష్మను, వాత పిత్తకఫములచే జనించిన వ్యాధులను, జ్వరము మొదలగు వ్యాధులను, విష్ణువు రాక్ష సులనువలె హరించును. ఎల్లప్పుడును సేవించుచుండినయెడల శరీరము ముడతలు పడ టను, వెంట్రుకలు నెరయుటను, నశింపజేయును.

## మహాకుముదేశ్వరరసము

శ్లో॥ హేమభస్మ రసభస్మ గన్ధకం మౌక్తికం తు రసటఙ్కణ తథా । తారభస్మ గరుడం చ తుల్యకం కాఞ్జికేన పరిమర్ద్య గోళకమ్

(1) మృత్స్నయా చ పరివేష్ట్య శోషితం భాణ్డకే లవణగేఽథ పాచయేత్ ॥ సంపుటేన మృదునైక రాత్రకం సిద్ధిమేతి కుముదేశ్వరో రసః । వల్లమస్య మరిచైర్ఘృతాప్లుతై రాజయక్ష్మపరిశాన్తయే పిబేత్ (2)

అ॥ బంగారుభస్మ, రసభస్మ, శు॥ గంధకము, ముత్యభస్మ, శు॥ రసము, శు॥ టంకణము, వెండిభస్మ, పచ్చలభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి పులికడుగుతో నూరి ముద్దచేసి యీ ముద్దకు మట్టిపూసిన గుడ్డలను చుట్టి ఎండించి చిన్నసంపుటమందు ంది ఉప్పుపోసిన కుండయందుంచి యొకరాత్రి వండవలయును. తయారగును. ఇది కుముదేశ్వరరసమని చెప్పబడును. దీని నొకవల్లపరిమితిగ నేతితో కలపబడిన మిరియాలచూర్ణముతో సేవించినయెడల రాజయక్ష్మ శాంతించును.

## షడ్గుణము

వ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 6 భా, ఇట్లు వీనిని కలబందరసముతో నొక మాసమురోజులు నూరి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండవలయును. దీని ననుపానభేదములతో సేవించినయెడల ప్రమేహములు, పొడిదగ్గు, శుక్లనష్టము, బలహీనత, శరీర మెల్లప్పుడు వేడిగనుండుట, జీర్ణజ్వరము, శుష్కించుట, పాండువు, నోటిపూత, మొదలగు వేడివలన జనించు వ్యాధులెల్లను నిశ్చయముగ నశించును.

## సర్వమేహరిపురసము

శ్లో॥ సువర్ణం రజతం కాన్తం నాగం వఙ్గం తథాభ్రకమ్ । రసేన్ద్రం దేవతా పుష్పంసమబాగంతు యోజయేత్ (1) మాతులుఙ్గ రసేనైవ లవఙ్గ శ్వేతచన్దనైః । త్రిదినం మర్దనం కృత్వా వల్ల మాత్రం ప్రదాపయేత్ (2) శ్రీచన్దనానుపానేన దాపయేద్భిష గుత్తమః । బద్ధమూత్రం ఖణ్డమూత్రం మధుమూత్రం హలీమకమ్ (3) అశ్మరీం మూత్రకృచ్ఛ్రంచ సర్వమేహాన్నికృన్తయేత్ । దేహపుష్టికరో నౄణాం పుత్రప్రసవకారణమ్ (4) వీర్యవృద్ధిం బలాధిక్యం కురుతే నాత్రసంశయః । మహారాజోపచారేణ పథ్యం దద్యాద్యథావిధి । సర్వమేహ రిపుర్నామ్నా కాలజ్ఞానేన భాషితః (5)

అ॥ సువర్ణభస్మ, వెండిభస్మ, కాంతభస్మ, సీసభస్మ, వంగభస్మ, అభ్రకభస్మ, రససిందూరము, లవంగములు, వీనిని సమభాగములుగ గ్రహించి మాదీఫలము, లవంగ

ములు, తెల్లచందనము, వీనియొక్క రసములతో మూడురోజులుమర్దింపవలయును. దీనిని చందనముయొక్క అనుపానముతో వల్లపరిమితిగ నిచ్చినయెడల మూత్రము వెడలకుండుట, మూత్రము ఆగిఆగివచ్చుట, మూత్రమునందు తీపియుండుట, హాలీమకము, అశ్మరీవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, సమస్తమైన మేహములు, ఇవి హరించును. ఇది శరీరపుష్టిని కలుగజేయును. పుత్రులు కలుగుటకు కారణముగ నుండును. వీర్యవృద్ధిని, బలవృద్ధిని, నిశ్చయముగ చేయును. దీనిని సేవించినప్పుడు మహారాజోపచారమును చేయుచు పథ్యమును యథావిధిగ చేయింపవలయును. ఇది సర్వమేహారిపురసమనెడి పేరుగలది. కాలజ్ఞానునిచే చెప్పబడినది.

## సువర్ణకల్పామృతము

వ॥ మేలిమిబంగారము 1 భా, శు॥ ఖాదీవెండి 2 భా, శు॥ సీసము 3 భా, శు॥ తగరము 1½ భా, శు॥ సత్తు 2½ భా, వీనినన్నిటి నేకముగ కరిగించి యందు బోడసరపాకుపసరు పోసినయెడల గుల్లగ పొంగును. దీనిని ఖల్వములో కాటుకవలె మెత్తగనూరి బోడసరసపాకురసముతో బాగుగ మర్దించి బిళ్ళచేసి ఆరనిచ్చి కుక్కుటపుటము వేసినయెడల భస్మమగును. దీనిని పంచదార, నెయ్యి, వీనితో పుచ్చుకొనినయెడల వీర్యవృద్ధియు, మేహశాంతియు, కలుగును. మరియు బలహీనత, శుక్లనష్టము, అతిమూత్రము, మొదలగు సమస్తవ్యాధులును నశించును.

## సువర్ణాదిలేపము (సంనిపాతములయందు)

శ్లో॥ సువర్ణ ముక్తారజతప్రవాలం కస్తూరికా కుఙ్కుమరోచనం చ । వరాటరుద్రాక్షమధూకబిల్వం కుష్ఠం చ ఖర్జూరపునర్నవే చ (1) ద్రాక్షాకణా నాగరపుత్రజీవీ సారఙ్గశృఙ్గం కతకస్య బీజమ్ । ఏరణ్డమూలం కరశీర్షికం చ మయూరికాశ్వేతపునర్నవే చ । స్తన్యేన పిష్ట్వా కురు సంనిపాతే లేపం సదా సర్వగదాన్నిహన్తి (2)

అ॥ బంగారము, ముత్యములు, వెండి, పగడములు. కస్తూరి, కుంకుమపువ్వు, గోరోచనము, గవ్వలు, రుద్రాక్షు, ఇప్ప, మారేడు, చెంగల్వకోష్టు, ఖర్జూరము, గలిజేరు, ద్రాక్షు, పిప్పళ్ళు, శుంఠి, పుత్రజీవి, లేడికొమ్ము, చిల్లగింజ, ఆముదపువేరు, రెల్లుగడ్డి, నెమలిపింఛము, తెల్లగలిజేరు, వీనిని చనుపాలతో నూరి సంనిపాతమందు లేపనము చేసినయెడల సకలరోగములు నశించును.

## శ్లేష్మవిధ్వంసిరసము

సీ॥ తామ్రకాంతాభ్రకతారవిద్రుమలోహ భస్మముల్ గంధకపారదములు। పర్పాటకము గంటుభారంకి పిప్పళ్లు చిత్రమూలము మణిశిలయు నాభి। తాళకం బగరును తగ గజపిప్పళ్లు పొగచెట్టుకట్టెలబూడిదయును। పరిశుద్ధులొనరించి సరిపాళ్ళుగా గూర్చి వెల్లుల్లి జిల్లేడు వేళ్ళరసము। మునగ రక్కిస చిత్రమూలము వావిలిరసములు వేర్వేరు కసటుతీసి। యొక్కొక్క దినమును నొప్పుగా మర్దించి యనుపానములచేత నడ్డగెత్తు। మాత్రమివ్వగ నగ్నిమాంద్యంబు లణచును మారుతరుజముల మడియజేయు। దోషత్రయంబు నిశ్శేషంబుగాఁజేయు కృమిరోగములనెల్ల కూలజేయు। క్షయకాస శుష్కకాసలు రక్తకాసయు శీతకాసయు కంఠశ్లేష్మకాస। పైత్యకాస క్షతబంగాళకాసలు బలమైనశ్వాసముల్ బారజేయు। భువిని విద్వేషుడగు పఙ్క్తిముఖుని ద్రుంచి। నట్టి రఘురాము దివ్యబాణాగ్ని మాడ్కి। నఖిల రోగంబులను బట్టి హతముచేయు। శ్లేష్మవిధ్వంసి యిదియంద్రు శేషశయన॥

అ॥ తామ్రభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, వెండిభస్మ, పగడభస్మ, లోహభస్మ, శు॥ గంధకము, శు॥ పాదరసము, పర్పాటకము, గంటుభారంకి, పిప్పళ్ళు, చిత్రమూలము, శు॥ మణిశిల, శు॥ నాభి, శు॥ తాళకము, అగరు, గజపిప్పళ్ళు, పొగాకు చెట్టుకాడలబూడిద, వీనిని సమభాగములుగ గ్రహించి వెల్లుల్లి, జిల్లేడువేళ్ళు, మునగ చెక్క, రక్కిస, చిత్రమూలము, వావిలి, వీనియొక్కరసములతో వేరువేరుగ నొక్కొక దినము మర్దించి అనుపాన విశేషములతో నడ్డిగెత్తు సేవించినయెడల అది అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, దోషత్రయము, క్రిమిరోగములు, క్షయ, కాస, శుష్కకాస, రక్తకాస, శీతకాస, కంఠజిహ్వాకకాస, శ్లేష్మకాస, పైత్యకాస, క్షతకాస, బంగాళీకాస, కఠినమైన శ్వాసవ్యాధులు, వీనిని నశింపజేయును. మఱియు శ్రీరాముని యొక్క దివ్యబాణములు రావణాసురునియొక్క ముఖములను ద్రుంచినట్లు సకల రోగములను నశింపజేయును. దీనిని శ్లేష్మవిధ్వంసి యందురు.

## కఫవిధ్వంసకరసము

శ్లో॥ సూతం గన్ధం స్వర్ణతారే తామ్రం రీతిప్రవాలకే। నాగ వఙ్గాభ్రకస్తూర్యో రోపితాయోమతే విషమ్ (1) హరీతకీం త్రికటుకంసమం ఖల్వే వినిక్షిపేత్। నిర్గుణ్డీభద్రజాద్రైశ్చ త్రిదినం మర్దయే ద్దృఢమ్ (2) గుఞ్జా

మాత్రోఽనుపానేన నాశయేత్ శ్లేష్మజాన్గదాన్ । వాతజాన్వివిధాంశ్చైవ కాసం శ్వాసమజీర్ణకమ్ । కఫవిధ్వంసకోనామ్నా సీతానాథప్రకల్పితః (3)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, ఇత్తడిభస్మ, పగడభస్మ, సీసభస్మ, వంగభస్మ, అభ్రకభస్మ, కస్తూరి, రాయిప్యపీత, మాండూరభస్మ, శు॥ నాభి, కరక్కాయ, త్రికటుకములు, వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమందుంచి వావిలి, వాకుడు, అల్లము, వీనియొక్క రసములతో మూడురోజులు దృఢముగ మర్దింపవలయును. దీనిని ఒక గురివిందగింజపరిమితిగ అనుపానముతో నిచ్చిన యెడల శ్లేష్మవ్యాధులు, సమస్తమైన వాతవ్యాధులు, దగ్గు, వగర్పు, అజీర్ణము, ఇవి హరించును. ఇది కఫవిధ్వంసకరసమని చెప్పబడును. సీతానాథునిచే చెప్పబడినది.

గద్య. ఇతి శ్రీ గోదావరీమణ్డలమణ్డనాయమానకోనసీమాన్తర్వర్తి మోదేకుర్రుగ్రామవాసినా భూసురాగ్రగణ్యేన శ్రీపాదోపనామ్నా కౌశికసగోత్రపవిత్రేణ వేఙ్కటేశ్వరపౌత్రేణ సోమయాజిపుత్రేణ సుబ్బమామ్బాగర్భశుక్తిముక్తాఫలాయమానేన సద్గురుసేవాసమాసాదితసాహితీశబ్దశాస్త్రాయుర్వేదాదివిద్యానిధానేన భిషగ్వరాయుర్వేదభూషణాదిబిరుదావలీవిరాజమానేన విద్వత్ప్రభుసభాస్థానసమ్మాననభ్రాజమానేన సకలసజ్జనవిధేయేన కృష్ణమూర్తి శాస్త్రిణా ప్రణీతే ఆయుర్వేదౌషధరత్నాకరే

ప్రథమగుచ్ఛ

స్సమాప్తః



ఓమ్

శ్రీరస్తు

ఆరోగ్యమస్తు

ఆంధ్ర తాత్పర్య సహిత

# ఆయుర్వేదౌషధరత్నాకరము

## ద్వితీయ గుచ్ఛము

### పూర్ణచంద్రోదయము

శ్లో॥ పలం మృదుస్స్వర్ణదలం రసేన్ద్రాం పలాష్టకం షోడశ గన్ధకస్య। శోణైస్సుకార్పాసభవైః ప్రసూనైస్సర్వం విమర్ద్యాథ కుమారికాద్భిః (1) తత్కాచకుమ్భే నిహితం ప్రగాఢే మృత్పర్పటీభిర్ద్వివసత్రయం చ। పచేత్క్రమాగ్నౌ సికతాఖ్యయన్త్రే తతో రసం పల్లవరాగరమ్యమ్ (2) నిగృహ్య చైతచ్చ పలం పలంచ చత్వారి కర్పూరరజస్తథైవ। జాతీఫలం చోషణమిన్ద్రపుష్పం కస్తూరికాయా ఇహ శాణమేకమ్ (3) చన్ద్రోదయోఽయం కథితోఽస్య మాషో భుక్తోహి వల్లీదలమధ్యవర్తీ। మదోత్కటానాం ప్రమదాశతానాం గర్వాధికత్వం శ్లథయత్యకాణ్డే (4) ఘృతం ఘనీభూతమతీవ దుగ్ధం మృదూని మాంసాని సమణ్డకాని। మాషాన్నపిష్టాని భవన్తి పథ్యాన్యావన్ద దాయీన్యపరాణి చాత్ర (5) వలీపలితనాశనస్తనుభృతాం వయస్తమ్భన। స్సమస్త గదఖణ్డనః ప్రచురరోగపఞ్చాననః। గృహేఽపి గృహభూపతిర్భవతి యస్యచన్ద్రోదయ। స్స పఞ్చశరదర్పితో మృగదృశాం భవేద్వల్లభః (6) శ్లో॥ రతికాలే రతాన్తే వా సేవితవ్యో రసోత్తమః। మానహానిం కరోత్యేష ప్రమదానాం సునిశ్చితమ్ (7) కృత్రిమం స్థావరం చైవ జఙ్గమం చాపి యద్విషం। న వికారాయ భవతి సాధకేన్ద్రస్య వత్సరాత్ (8) మృత్యుఞ్జయో యథాఽభ్యాసాన్మృత్యుం జయతి దేహినాం।

తథాఽయం సాధకేన్ద్రిశ్చ జరామరణనాశకః । తన్త్రాన్తరే ప్రసిద్ధోఽయం మకరధ్వజనామతః (9)

అ॥ మృదువైన సువర్ణదళము 1 పలము, శు॥ పాదరసము 8 ప, శు॥ గంధకము 16 ప, వీనిని ఎఱ్ఱప్రత్తిపువ్వుల రసముతో మర్దించి పిదప కలుబందరసముతో మర్దించి మట్టిపూయబడినగుడ్డలతో బాగుగ చుట్టబడిన కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే మూడురోజులు వండి చిగురుటాకువలె ఎఱ్ఱగ రమ్యంబుగ నుండు రసమును (మందును) గ్రహించి పచ్చకర్పూరము 1 ప, జాజికాయలు 1 ప, పిప్పళ్ళు 1 ప, లవంగాలు 1 ప, కస్తూరి 1 శాణము, వీనిని కలుపవలయును. ఇది చంద్రోదయమని చెప్పబడును. దీనిని మాషపరిమితిగ తమలపాకులలోనుంచి సేవించిన యెడల మిక్కిలి మదించిన నూరుగురు స్త్రీలయొక్క గర్వాధిక్యమును వెంటనే నశింపజేయును. దీనిని సేవించినప్పుడు పేరిన (గడ్డగనున్న) నెయ్యి, అధికమగు పాలు, మృదువైన మాంసము, మీగడ, మినుము, హితకరమైన యన్నము, పిండి వంటలు, మనస్సునకు సంతోషమును కలిగించు ఇతరములు, ఇవి పథ్యకరములుగ (సేవింపదగినవిగ) నుండును. ఇది శరీరము ముడతలు పడుట, వెంట్రుకలు నెరయుట, వీనిని నశింపజేయును. వయస్సు నాపును. సమస్తవ్యాధులను ఖడించును. ప్రసిద్ధరోగములకు సింహము వంటిది. ఎవనిగృహమందు నీ చంద్రోదయ ముండునో నా గృహయజమాని మన్మథోద్రేకముకలవాడై అనేకమంది స్త్రీలకు ఇష్టుడగు (రమించు) ను, ఈ దివ్యౌషధమును రతికాలమందుగాని, రతాంతమందుగాని సేవింపవలయును. దీని సేవన స్త్రీలకు మానహానిని నిశ్చయముగ జేయును. దీని నొకసంవత్సరము సేవించిన యెడల కృత్రిమస్థావర జంగమవిషములు ఉపద్రవమును కలుగజేయ నేరవు. ఈశ్వర ధ్యానముచే మృత్యువు నశించు రీతి దీని సేవనచే ముసలితనమును, మృత్యువును, నశించును. కొన్ని గ్రంథములం దిది మకరధ్వజమని చెప్పబడినది.

## మకరధ్వజము (కజ్జలి)

శ్లో॥ రౌప్యస్య భాగౌ వఙ్గం చ మౌక్తికం కాన్తమేవ చ । జాతీకోశఫలే నాగం కాంస్యం సిన్దూరకం తథా (1) కస్తూరీం చన్ద్రిమభ్రం చ ప్రవాలం చైక భాగకమ్ స్వర్ణసిన్దూరతో భాగాంశ్చతురః కల్పయేద్బుధః (2) నాతః పరతరః శ్రేష్ఠస్సర్వరోగనిషూదనః । తన్త్రాన్తరే ప్రసిద్ధోఽయం మకరధ్వజనామతః । సర్వలోకహితార్థాయ శివేన పరిభాషితః (3)

అ॥ రజతభస్మ 2 భా, వంగభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, జాపత్రి 1 భా, జాజికాయలు 1 భా, సీసభస్మ 1 భా, కంచుభస్మ 1 భా, రససిందూరము 1 భా, కస్తూరి 1 భా, పచ్చకర్పూరము 1 భా, అభ్రకభస్మ 1 భా

పగడభస్మ 1 భా, సువర్ణసిందూరము 4 భా, ఇట్లు వీనిని గ్రహింపవలయును. సర్వ రోగములను నశింపజేయుటకు దీనికంటెను శ్రేష్ఠమైన మందు మరియొకటిలేదు. ఇది తంత్రాంతరములలో మకరధ్వజమనెడి పేరుతో ప్రసిద్ధమైనది. సర్వలోకములకును మేలుకొరకు ఈశ్వరునిచే చెప్పబడినది.

## మకరధ్వజము

శ్లో॥ స్వర్ణాదష్టగుణం సూతం మర్దయేత్త్రికగన్ధకమ్ । రక్తకార్పాస కుసుమైః కుమార్యద్భిర్విమర్దయేత్ (1) శుష్కం కాచఘటే క్షిప్త్వా వాలుకా యన్త్రికే పచేత్ । భస్మ గృహ్ణీయాద్ర సేన్ద్రస్య నవార్కకిరణోపమమ్ (2) భాగా అస్యచతుర్భాగః కర్పూరస్య సుశోభనాః । లవఙ్గం మరిచం జాతీఫలం కర్పూర మాత్రయా (3) మేలయేన్మృగనాభిం చ తత్పాదకమితం తతః । శ్లక్ష్ణపిష్టో రసో నామ్నా జాయతే మకరధ్వజ (4) వల్లం వల్లద్వయం ఖాదేత్తామ్బూలీదలసంయుతమ్ । భక్షయేన్మధురం స్నిగ్ధం మృదుమాంసమ వాతలమ్ (5) శృతశీతం సితాయుక్తం దుగ్ధం గోభవమాజ్యకమ్ । మధ్వాద్య మిష్ట మపరం మద్యాని వివిధాని చ (6) కరోత్యగ్నిబలం పుంసాం వలీపలిత నాశకః । మేధాయుః కాన్తిజనకః కామోద్దీపనకృన్మహాన్ (7) అభ్యాసాదస్య తు స్త్రీణాంశతం జయతి నిత్యశః । రతికాలే రతాన్తే వా సేవితోఽయం రసోత్తమః (8) మానహానిం కరోత్యేవ ప్రమదానాం సునిశ్చితమ్ । కృత్రిమం స్థావరం చైవ జఙ్గమం చాపి యద్విషమ్ (9) న భవేచ్చ వికారాయ సాధకేన్ద్రస్య వత్సరాత్ । మృత్యుఞ్జయో యథాఽభ్యాసాన్మృత్యుం జయతి దేహినామ్ । తథాఽయం సాధకేన్ద్రశ్చ జరామరణనాశకః (10)

అ॥ సువర్ణము 1 భా, శు॥ రసము 8 భా, శు॥ గంధకము 24 భా, వీనిని నూరి ఎఱ్ఱపత్తిపువ్వులరసముతోడను, కలబందరసముతోడను, మర్దించి ఎండినపిదప కాచ కుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి బాలసూర్యునియొక్క కిరణమువలెనుండు దానిని తీసి పచ్చకర్పూరము 4 భా, లవంగములు 4 భా, మిరియాలు 4 భా, జాజి కాయలు 4 భా, కస్తూరి 1 భా, వీనిని కలిపి మెత్తగ నూరవలయును. ఇది మకర ధ్వజమని చెప్పబడును. దీనిని వల్లములేక రెండువల్లముల పరిమితిగ తమలపాకులతో సేవించుచు తియ్యని వస్తువులను, స్నిగ్ధగుణము (చమురు) కల వస్తువులను, వాతమును చేయనట్టియు, మృదువైనట్టియు మాంసమును, కాగి చల్లారినట్టియు, పంచదారకలప బడినట్టియు ఆవుపాలను, నేతిని తేనెమొదలగు ఇష్టమైన ఇతరపదార్థములను, అనేక

విధములైన మద్యములను, పుచ్చుకొనవలయును. దీనివలన జాఠరాగ్నికి బలము కలుగును. శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, ఇవి నశించును. సూక్ష్మబుద్ధి, ఆయురభివృద్ధి, శరీరకాంతి, అధికమగు కామోద్దీపనము, ఇవి కలుగును. దీనిని సేవించుటవలన అనేకమంది స్త్రీలను నిత్యము రమించును. రతికాలమందుగాని రతాంతమందుగాని ఈ దివ్యౌషధమును సేవించినచో స్త్రీలకు మానహానికలుగునట్లు జేయును. దీని నొకసంవత్సరము సేవించినచో కృత్రిమస్థావరజంగమవిషములు ఉపద్రవమును కలుగుజేయనేరవు. ఈశ్వరధ్యానముచే మృత్యువు నశించురీతి దీని సేవనచే ముసలితనమును, మరణమును, నశించును.

## షడ్గుణ బలి జారిత మకరధ్వజము

వ॥ స్వర్ణపత్రము 8 తు, శు॥ పాదరసము 64 తు, శు॥ గంధకము 128 తు, వీనిని కలుబందరసముతో మర్దించి ఎండినపిదప కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి చల్లారినపిదప తీసి 128 తులముల శు॥ గంధకమును కలిపి కలుబందరసముతో బాగుగ మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి చల్లారినపిదప తీసి మరల 128 తులముల శు॥ గంధకమును కలిపి కలుబందరసముతో మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు వండవలయును. ఇట్లు సిద్ధమైన దీనిని షడ్గుణ బలిజారితమకరధ్వజ మందురు.

## సిద్ధ మకరధ్వజము

శ్లో॥ పలమానం రసం సమ్యగ్బహుసంస్కారసంస్కృతమ్। తథాపలద్వయం గన్ధం శుద్ధం హేమ ద్వికర్షికమ్ (1) కైలాసాచల సమ్భూతే సుదృఢే చ సుచిక్కణే। శోణప్రస్తరజే ఖల్వే సర్వం సంస్థాప్య మిశ్రయేత్। (2) మర్దయేద్యత్నతో వైద్యో యామానష్టౌ నిరన్తరమ్। రక్తకార్పాసపుష్పాణాం శ్వేతాఙ్కోటఫలస్య చ (3) కుమార్యాశ్చరసే మర్ద్యం సంభావ్య చ పృథక్ పృథక్। స్థాపయిత్వా కాచకూపీమధ్యే సర్వం ప్రయత్నతః (4) తథా చ సాలసరళఖదిరశ్రీఫలోద్భవైః। కాష్ఠైశ్శ్లేష్మతమైరేవ నీరసైస్తు ప్రతాపయేత్ (5) మృదునానలయోగేన ప్రాగ్యామద్వితయం పచేత్। పునర్యామద్వయం పాచ్యం మధ్యతాపేన వహ్నినా (6) అగ్నినా ప్రఖరేణైవ తతో యామద్వయం పచేత్। భూయో మన్దాగ్నినా పాచ్యమవశిష్టద్వియామకమ్ (7) సాఙ్గశీతమథోద్ధృత్య నవచూతదలోపమమ్। ఖర్జూరే లోహితం ఫిష్టే దాడిమీకుసుమోపమమ్ (8) తతోఽవతార్య గన్ధేన ద్విగుణేన

విమర్దయేత్। భావయేత్పూర్వవద్వైద్యః పాచయేచ్చ ప్రయత్నతః (9) ఏవం వారద్వయం కుర్యాత్సమ్యగౌషధసిద్ధయే । సంనిపాతం జ్వరంఘోరం మన్దాగ్నిత్వమరోచకమ్ (10) ఆమశూలం కటీశూలం హృచ్ఛూలం పంక్తి శూలకం। కాసం శ్వాసం చ యక్ష్మాణం శూలం కుష్ఠమశేషతః (11) గలోత్థాన స్త్రివృద్ధించ తథాఽతీసారమేవ చ । క్లీపదం కఫవాతోత్థం చిరజం కులజం తథా (12) నాడీవ్రణం వ్రణం ఘోరం గుదామయభగన్దరౌ । వాయుం బహువిధం హన్తి ధ్వజభఙ్గం విశేషతః (13) సేవనాదస్య నశ్యన్తి సర్వే రోగా న సంశయః । కరోత్యగ్నిబలం వీర్యం వలీపలితనాశకః (14) విధివత్సేవితో హ్యేష ముమూర్షుమపి జీవయేత్ । స్వేచ్ఛాహారవిహారోఽపి న కదాచిద్విపద్యతే (15) మేధాయుః కాన్తి జనకః కామోద్దీపనకృన్మహాన్ । వృద్ధోఽపి తరుణస్పర్ధః స్త్రీషుచాపి వృషాయతే (16) సేవనాదస్య సమ్రాజో గచ్ఛన్తి ప్రమదాశతమ్ । త్రైలోక్యశుభదం శ్రీమదేతదేవ మహౌషధమ్ (17) మృత్యుఞ్జయో యథాఽభ్యాసాన్మృత్యుం జయతి దేహినామ్ । తథాఽయం సాధకేన్ద్రశ్చ జరామరణనాశకః (18) స్వయంత్రైలోక్యనాథేన త్రైలోక్యహితమిచ్ఛతా। సమర్పితోఽయం సిద్ధేభ్యః కరుణార్ద్రేణ వై యతః (19) అతోఽయం భువనే ఖ్యాతః శ్రీసిద్ధమకరధ్వజః । భాస్వాన్ యథా తమో హన్తి కేసరీ కరిణం యథా । తూలసఙ్ఘం యథా వహ్నిస్తథా రోగానసౌ హరేత్ (20)

అ॥ బహువిధములగు సంస్కారములచే బాగుగ సంస్కరింపబడిన పాదరసము 1 పలము, శు॥ గంధకము 2 ప, శు॥ బంగారము 2 కర్షములు (శ్రేప), ఇటుల వీనిని గ్రహించి కైలాసపర్వతమందు జనించినట్టియు, దృఢముగను దట్టముగను నున్నట్టియు, ఎఱ్ఱనిరంగుతోకూడినట్టియు, రాతితో చేయబడిన ఖల్వమందు అన్నిటినుంచి కలిపి యెనిమిదిజాములు నెడతెగక బాగుగ మర్దించి పిదప ఎఱ్ఱప త్తిపువ్వులు, తెల్లయూడిగ పండ్లు; కలుబంద వీనియొక్క రసములతో ప్రత్యేక ప్రత్యేకముగ మర్దనను భావనను చేసి కాచకుప్పెయందుంచి ఏపి, సరళదేవదారు, చంద్ర, మారేడు, వీనియొక్క శ్రేష్ఠములైనట్టియు, ఎండినట్టియు, కట్టెలతో మంటను వేయవలయును. మొదటి రెండుజాములయందు మందాగ్నిచేతను, పిదప రెండుజాములయందు మధ్యమాగ్ని చేతను, పిదప రెండుజాములయందు మరల తీవ్రాగ్నిచేతను, మిగిలిన రెండుజాముల యందు మరల మందాగ్నిచేతను, వండవలయును. చల్లారినపిదప తీసి మామిడిచిగురుతో సమానవర్ణము కలిగినట్టియు, విరచినచో ఎఱ్ఱగనుండినట్టియు. నూరినచో బానిమ్మ

పువ్వువలె నుండునట్టియు, ఔషధమును గ్రహించి ఖల్వమందుంచి పాదరసమునకు రెట్టింపు శు॥ గంధకమును చేర్చి పూర్వమందువలెనే మర్దనను, భావనను వంటను, సరిగ చేయవలయును. ఔషధము సరిగ సిద్ధించుటకై యిట్లు రెండుసారులు చేయవలయును. దీనిని సేవించినచో, సంన్నిపాతము, ఘోరమైన జ్వరము, అగ్నిమాంద్యము, అరోచకము, ఆమశూల, కటిశూల, హృదయశూల, పరిణామశూల, కాస, శ్వాస, రాజయక్ష్మ, శూల, సమస్తములగు కష్టములు, కంఠవ్యాధులు, అంత్రవృద్ధి, అతిసారము, కఫవాతములవలన జనించినట్టియు, చిరకాలమై జనించినట్టియు, వంశపారంపర్యముగ జనించినట్టియు బోదకాలు, నాడీవ్రణము, ఘోరమైనవ్రణము, గుదవ్యాధి, భగందరము, బహువిధములైన వాతవ్యాధులు, ఇవి నశించును. ధ్వజభంగము ముఖ్యముగ నశించును. దీనిని సేవించినచో సమస్తవ్యాధులు, నిశ్చయముగ నశించును. ఇది జాఠరదీప్తిని, వీర్యవృద్ధిని చేయును. శరీరము ముడతలుపడుటను, వెంట్రుకలు నెరయుటను, నశింపచేయును. విధిప్రకారము సేవించినయెడల చచ్చుటకు సిద్ధముగ నున్నవానినిగూడ జీవింపచేయును. దీనిని సేవించినప్పుడు స్వేచ్ఛాహారవిహారములు కలవాడైనను ఎప్పుడును వికృతిని కలిగింపదు. జ్ఞాపకశక్తిని, ఆయువును, శరీరకాంతిని, మన్మథోద్రేకమును వృద్ధిపొందించును. వృద్ధుడుకూడ పడుచువారలను ధిక్కరించువాడగును. స్త్రీలను అబోతువలె రమించును. అనేకమంది స్త్రీలను రమించు శక్తిగలవాడగును. గొప్పది యగు నీ యౌషధము మూడులోకములయందు మేలును కలిగించును. ఈశ్వర ధ్యానముచే మృత్యువు నశించు విధమున నీయౌషధమును సేవించుటచే ముసలితనమును, మృత్యువును, నశించును. మూడులోకములయొక్క మేలుకోరిన త్రైలోక్యనాథునిచే నీయౌషధము సిద్ధులకొరకు దయతో స్వయముగ చెప్పబడినది. అందుచే నిది సిద్ధమకరధ్వజమని చెప్పబడినది. సూర్యుడు చీకటిని, సింహము ఏనుగును, అగ్ని దూదిపోగును, హరింపచేయువిధమున నీయౌషధము రోగములను హరింపచేయును.

## పంచశరరసము

శ్లో॥ రసాభ్రహేమతారాణి వజ్రమాక్షికభస్మనీ । నాగశుల్బే కాన్తభస్మ సమభాగం చ కారయేత్ (1) కోకిలాక్షస్య బీజాని వ్యోషచూర్ణం తథైవ చ । మర్కటీమూలజద్రావైర్గోక్షీరేణ చ మర్దయేత్ (2) శాల్మలీవృక్షనిర్యాసతాలమూలీభవైర్ద్రవైః । కణాకుఙ్కుమకక్కోలచన్దనానాం కషాయకైః (3) ఏకైకేన త్రిదివసం మర్దయేచ్చ పృథక్పృథక్ । వల్లయుగ్మం ప్రదాతవ్యం సితాజ్యక్షీరసంయుతమ్ (4) అష్టాదశ ప్రమేహాంశ్చ సర్వరోగాన్నిహన్త్యయమ్ । కామం వర్ధయతే నృణాం స్త్రీణామత్యన్తవల్లభః । కథితో పార్వతీభ్యామయం పఞ్చశరో రసః (5)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, బంగారుభస్మ, వెండిభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, సీసభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, గొబ్బివిత్తులచూర్ణము, త్రికటుకములు, వీనిని సమభాగములుగ గ్రహించి దూలగొండివేళ్ళకషాయము, ఆవుపాలు, బూరుగబంక రసము, తాటివేళ్ళరసము, పిప్పళ్ళు, కుంకుమపువ్వు, తక్కోలములు, చందనము వీని యొక్క కషాయములు, వీనిలో నొక్కొక్కదానితో మూడేసిరోజులు ప్రత్యేకముగ మర్దింపవలయును. దీనిని రెండువల్లముల పరిమితిగ పంచదార, నెయ్యి, పాలు, వీనితో నిచ్చినయెడల పదునెనిమిది ప్రమేహములును, సర్వరోగములును హరించును. కామము వృద్ధినొందును. దీని సేవనచే స్త్రీలకు మిక్కిలి ఇష్టుడగును. ఇది పార్వతీపరమేశ్వరులచే చెప్పబడినది. పంచశర రసమని చెప్పబడును.

## సూతికామాత్రలు (3వ రకము)

వ॥ సూతికాభరణము ½ భా, సన్నిపాతభైరవి 1 భా, వాతవిధ్వంసి 1 భా, శు॥ రసకర్పూరము ½ భా, శు॥ ఇంగిలీకము ½ భా, పావుదారు ½ భా, జున్ను ½ భా, గోరోచనము ½ భా, కస్తూరి ¼ భా, వీనిని మిరియాలరసముతోడను, చిత్రమూలరసము తోడను, నూరి మాత్రలు కట్టవలయును.

## (సూతికామాత్రలు (2వ రకము)

వ॥ సూతికాభరణము 1 భా, శు॥ రసకర్పూరము 1 భా, శు॥ నాభిచూర్ణము 1 భా, పావుదారు 1 భా, జున్ను 1 భా, గోరోచనము 1 భా, సంనిపాతభైరవి 1 భా, వాతరాక్షసము 1 భా, వాతవిధ్వంసి 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, కస్తూరి ½ భా, వీనిని ఉప్పిచెక్క, చిత్రమూలము, వరగోగుచెక్క, వీనియొక్కరసములతో మర్దించి మాత్రలు కట్టవలయును.

## సూతికామాత్రలు (1వ రకము)

వ॥ సూతికాభరణము 1 భా, త్రైలోక్యచింతామణి 1 భా, వాతరాక్షసము 1 భా, శు॥ రసకర్పూరము 1 భా, సువర్ణవాతరాక్షసము 1 భా, వాతవిధ్వంసి 1 భా, సంనిపాతభైరవి 1 భా, కాలకూటము 1 భా, పావుదారు 1 భా, జున్ను 1 భా, గోరోచనము 1 భా, కస్తూరి 1 భా, వీనిని మునగచెక్క, వరగోగు, నల్లఉప్పి, తెల్ల ఉప్పి వీనియొక్క రసములతో మర్దించి మాత్రలు కట్టవలయును.

గుణములు :— సూతికాజ్వరములు, వాతదోషములు, దోషజ్వరములు, సంనిపాతజ్వరములు, కాళ్ళుచేతులు చల్లబడుట, శ్లేష్మప్రకోపము, మొదలగు ఘోరవ్యాధులను నశింపచేసి వెంటనే ఉష్ణమును కలిగించును.

## రాజరసాయనము

శ్లో॥ కస్తూరీ హిమరశ్మి కుఙ్కుమసితే జాతీఫలం హాటకమ్। చామ్పేయం వృషహేమబీజవిజయాయష్టీజయ స్త్రీవిషమ్ (1) శ్లో॥ ప్రత్యేకంవల్లమానం ఘృతమధుసహితం లిహ్యమానం దినాన్తే। కిఞ్చిన్మూర్ఛాం భజన్తే హరతి చ సమమే భక్షయేదిక్షుఖణ్డాన్। స్త్రీణాం గర్వాధికారం శమయతి సకలం వీర్యపాతం నయాతి లిఙ్గం వైయాతి వృద్ధిం స్థిరతరవపుషాం స్తమ్భకృద్యోనిభంగమ్ (2) శ్లో॥ సేవనాదస్య కందర్ప రూపో భవతి మానవః। సహస్రంయాతి నారీణాముత్సాహో జాయతేఽధికః (3) నిత్యం స్త్రీసేవనాద్యస్తు క్షీణశుక్లో భవేన్నరః। మహాశుక్లో భవేత్సోఽపి సేవనాదస్య నాన్యథా (4) మహాబలో మహాబుద్ధిర్జాయతే నాత్ర సంశయః। స్థూలానాం కర్షకశ్శ్రేష్ఠః కృశానాం పుష్టికారకః (5) సర్వాఙ్గం సన్ధివాతం బహువిధ వ్రణతాగ్రన్థిలూతాః స్ఫుటన్తి। దుర్గన్ధావిష్టలూతాః స్రవతి చ బహులం తీవ్రదుఃఖేన యుక్తమ్। దాహం మోహం చ తృష్ణాం క్షయకృమి కృశతాం పీనసం పాణ్డురోగమ్। గుల్మాధ్మానే చ శూలం గ్రహణిగుదరుజౌ కుష్ఠరోగం నిహన్తి (6)

అ॥ కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, పంచదార, జాజికాయలు, సువర్ణభస్మ, డొమ్మడోలుగడ్డ, శు॥ ఉమ్మెత్తవిత్తులు, శు॥ గంజాయాకు, అతిమధురము, తెక్కలివిత్తులు, శు॥ నాభి, వీనిని సమభాగములుగ గ్రహించి తేనె, నెయ్యి, వీనితో సాయంకాలమునందు వల్లపరిమాణముగ సేవింపవలయును. కొంచెము మూర్ఛను పొందును. అప్పుడు చెరకుతునకలను భక్షించినయెడల నా మూర్ఛ హరించును. దీనిని సేవించువాడు స్త్రీలయొక్క గర్వాధిక్యమును హరించును. వీర్యస్ఖలనమును పొందడు. లింగవృద్ధియు, దృఢశరీరమును, వీర్యస్తంభనమును, కలవాడగును. స్త్రీలయొక్క మదము నణగించును. దీని సేవనచే మన్మథరూపమును పొందును. చాలమంది స్త్రీలను రమించును. అధికమైన యుత్సాహమును పొందును. స్త్రీల నెల్లప్పుడు రమించుటచే క్షీణించిన శుక్లముకలవాడుకూడ దీని సేవనచేతనే యధికమగు శుక్లము కలవాడగును. అధికమగు బలమును, అధికమగు బుద్ధియు, కలవాడగును. ఇది స్థూలురను కృశింపజేయును. కృశించినవారలకు పుష్టిని కలిగించును. సర్వాంగవాతము, సంధివాతము, బహువిధవ్రణములు, గ్రంథులు, లూతవ్రణములు, దుర్గంధము కలిగినట్టియు అధికమైనట్టియు బాధతోకూడినట్టియు చీమును స్రవించుచున్న లూతవ్రణములు, తాపము, మోహము, దప్పిక, క్షయ, కృమివ్యాధులు, కృశించుట, పీనసము, పాండురోగము,

గుల్మము, కడుపుబ్బరిము, శూల, గ్రహణి, గుదస్థానమందలి బాధ, కష్టము, వీనిని హరించును.

## మహాకామసంజీవనరసము

శ్లో॥ సూతం హేమభాగైకం ద్విభాగం శుద్ధమాక్షికమ్ । త్రిభాగం రజతం చైవ వైక్రాన్తం వేదభాగకమ్ (1) పఞ్చభాగం కాన్తభస్మషడ్భాగం తామ్రభస్మకమ్ । నాగవఙ్గే సప్తభాగే హ్యభ్రకం వసుభాగకమ్ (2) మౌక్తికం బ్రహ్మభాగం చ విద్రుమం దశభాగకమ్ । సిన్దూరంరుద్రభాగం చాప్యేకాదశ చతీక్ష్ణకమ్ (3) ఖల్వమధ్యే వినిక్షిప్యమర్దయేల్లుఙ్గవారిణా । శాల్మలీ కోకిలాక్షాభ్యాం గాన్ధార్యా చ విమర్దయేత్ (4) కణాలవఙ్గతక్కోలగోక్షీరేణ చ మర్దయేత్ । వాశావిదారీ వారాహిగోక్షురేక్షురకైస్తథా (5) ఏతైశ్చ భావితవ్యాని త్రిస్త్రిర్భావ్యం పృథక్పృథక్ । కాచకూప్యాం పాచయిత్వా దినమేకం క్రమాగ్నినా (6) స్వాఙ్గశీతలముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । అఫేనం చాస్య పాదాంశం లవఙ్గం జాతిపత్రకం (7) కస్తూరీం చన్ద్రికం చైవ దాపయేచ్చ యథావిధి । ధత్తూరబీజతైలేన గాన్ధార్యా చ విమర్దయేత్ । (8) కదల్యాః ఫలసారేణ జాతీక్వాథైః పునఃపునః । ద్రాక్షాదాడిమ ఖర్జూరైః పన్నీరేణ చ మర్దయేత్ (9) శతపత్రరసేనైవ కుఙ్కుమస్య కషాయకైః । ఏతైశ్చభావయేచ్చాపి యామంయామంపృథక్పృథక్ (10) వల్లద్వయమితం ఖాదేత్కదలీఫలమధ్యతః । జాతీఫలం జాతిపత్రం శ్రీగన్ధం చ వరాఙ్గకమ్ । (11) ఏలాకణైభిస్సంయుక్తం సితాక్షౌద్రేణ సంయుతం । అశ్వస్యదణ్డద్ప్యాయాత్ స్వదణ్డమనివారితమ్ । (12) మన్మథోద్రేకయుక్తస్తు మహామదగజేన్ద్రవత్ । నిరన్తమహాగాఢరతిక్రీడాసమర్థకః (13) యామత్రయేశతం స్త్రీణాం రత్యుద్యోగే జనో జయేత్ । ముహుర్ముహుః పిబేత్ క్షీరం శర్కరేణ చ సంయుతమ్ (14) నారికేల జలం పీత్వాతతః శీతోపచారితః । కర్పూరాన్వితతామ్బూలం కుర్యాన్నిత్యమనర్గలమ్ (15) వృద్ధస్య స్తమ్భనకరం నష్టలిఙ్గం చ షణ్డతామ్ । లిఙ్గరోగం పృష్ఠరోగం వ్రణాన్ సర్వాన్నివారయేత్ । (16) జమ్బీరఫల సారం వా మహాపఞ్చఫలాని వా । స్థాపయేత్ క్షణమాత్రేణ

తదుద్రేకం వినాశయేత్ (17) సర్వేషామపి రోగాణాం మనుష్యాణాం విశేషతః। ఏత దౌషధరాజంతు న ప్రమత్తః ప్రయోజయేత్ (18) క్షయమేకా దశవిధం మేహవింశతికం జయేత్ । మన్దాగ్నిం గ్రహణీం చైవ హ్యజీర్ణ త్రయమేవ చ । కామసఞ్జీవనం నామ్నా సర్వవ్యాధివినాశకమ్ (19)

అ॥ సువర్ణభస్మ 1 భా, శు॥ మాక్షీకము 2 భా, రజితభస్మ, 3 భా. వైక్రాంత భస్మ 4 భా, కాంతభస్మ 5 భా, తామ్రభస్మ 6 భా, సీసభస్మ 7 భా, వంగభస్మ 7 భా అభ్రకభస్మ 3 భా, ముత్యభస్మ 9 భా, పగడభస్మ 10 భా, రససిందూరము 11 భా, ఖడ్గలోహభస్మ 11 భా, వీనిని ఖల్వమందుంచి మాదిఫలము, బూరుగబంక, గొబ్బివిత్తులు గంజాయాకు, పిప్పళ్ళు, లవంగములు, తక్కోలములు, అడ్డసరము, నేలగుమ్మిడి, నేల తాడి, పల్లేరు, గొలిమిడి, వీనియొక్క రసములతోడను ఆవుపాలతోడను మూడేసి రోజులు ప్రత్యేకముగ మర్దనను, భావనను, చేసి కాచకుప్పెయందుంచి వాలుకా యంత్రమందు క్రమాగ్నులచే నొకరోజువండి సాంగశీతలమున తీసి ఖల్వమందుంచి ఈ మందుకు 4వ వంతు శు॥ నల్లమందును కలిపి లవంగములు, జాపత్రి, కస్తూరి, పచ్చ కర్పూరము, వీనిని తగురీతిని కలిపి ఉమ్మెత్తవిత్తుల తైలము, గంజాయాకురసము, అరటి పండ్లరసము, జాజికాయలకషాయము, ద్రాక్షపండ్లరసము, దానిమ్మపండ్లరసము, ఖర్జూ రపుకాయలరసము, పన్నీరు, పద్మములరసము, కుంకుమపువ్వుకషాయము, వీనితో ప్రత్యేకముగ నొక్కొకజాము మర్దనను, భావనను, చేయవలెను. దీనిని రెండు వల్ల ముల పరిమితిగ జాజికాయలు, జాపత్రి, చందనము, లవంగములు, ఏలకులు, పిప్పళ్ళు, పంచదార, తేనె, వీనితోకూడ అరటిపండుమధ్యయందుంచి పుచ్చుకొనిన యెడల గుర్రపుదండమువలె అనివార్యమైన దండముకలవాడై మన్మథోద్రేకముతో మదించిన గొప్పఏనుగువలె ఎల్లప్పుడును మహాగాఢమైనరతినిచేయుటయందు సామర్థ్యముకలవాడై మూడుజాములలో నూరుగురుస్త్రీలను రమించి జయించును. పంచదారవేయుబడిన పాలను తరుచుగ త్రాగవలయును. కొబ్బరికాయనీళ్ళనుత్రాగి పిదప శీతోపచార ములు చేసికొనవలయును. పచ్చకర్పూరముతోకూడిన తాంబూలమును ఎల్లప్పుడు సేవింపవలయును. ఈ ఔషధము వృద్ధునికిగూడ వీర్యస్తంభనమును చేయును. మరియు లింగము కృశించుట, నపుంసకత్వము, లింగదోషములు, నడుమునొప్పి, సమస్త మైనవ్రణములు, వీనిని నశింపజేయును. నిమ్మకాయలరసమునుగాని ఫలపంచామ్లరస మునుగాని నోటియందుంచికొనినచో క్షణకాలములో నా మందుయొక్క ఉద్రేకము నశించును. విశేషమైన జాగరూకతకలవాడై సమస్తమైన వ్యాధులకు నీయౌషధ మును ప్రయోగింపవలయును. ఇది ఏకాదశక్షయలు, వింశతి మేహములు, అగ్ని మాంద్యము, గ్రహణీరోగము, మూడువిధములైన అజీర్ణము, వీనిని హరింపజేయును. కామసంజీవరసమని చెప్పబడును. సర్వవ్యాధులను నశింపజేయును.

## సువర్ణపర్పటీరసము

శ్లో॥ శుద్ధసూతం పలమితం తుర్యాంశస్వర్ణసంయుతమ్ । మర్దయేజ్జమ్భనీరేణ యావదేకత్వమాప్నుయాత్ (1) ప్రక్షాల్యోష్ణామ్బునా పశ్చాత్పలమాత్రే తు గన్ధకే । ద్రుతే లోహమయే పాత్రే బదరానల యోగతః (2) ప్రక్షిప్య చాలయేల్లోహే మన్దం లోహశలాకయా । తతః పాకం విదిత్వాతు రమ్భాపత్రే శనైః క్షిపేత్ (3) గోమయస్థే తతశ్చైవ రమ్భాపత్రేణ యన్త్రియేత్ । శీతం తు చూర్ణితం గుఞ్జాక్రమ వృద్ధం నిషేవయేత్ (4) మాషమాత్రం భవే ద్యావత్తతో మాత్రం న వర్ధయేత్ । సక్షౌద్రేణోషణేనైవ లేహయేద్భిషగుత్తమః (5) గ్రహణీం హన్తి శోషం చ సువర్ణరస పర్పటీ । సద్యోబలకరీ శుక్రవర్ధనీ వహ్నిదీపనీ । క్షయకాసశ్వాసమేహశూలాతీసారపాణ్డునుత్ (6)

అ॥ శు॥ రసము 1 పలము, శు॥ సువర్ణము $\frac{1}{4}$ పలము, వీనిని నిమ్మకాయరసముతో బాగుగా కలియువరకు నూరి వేడినీటితో కడిగి పిదప ఒక పలముపరిమితిగల శుద్ధగంధకమును ఇనుపపాత్రయందు రేగుకట్టెలమంటచే కరగించి యందు వేసి ఇనుప గరిటతో మెల్లగ కలియత్రిప్పి పాకమువచ్చినపిదప ఆవుపేడను కుండువలె చేసి యందుపై అరటియాకునుంచి యందుపై నీ మందునుపోసి పైన మరల అరటిఆకును కప్పి చల్లారిన పిదప చూర్ణము చేయవలయును. దీనిని ఒక్కొక్క గురివిందగింజ పరిమితి చెప్పున హెచ్చుచేయుచు నొకమాషపరిమితియగువరకు పరిమితిని హెచ్చు చేయవలయును. పిదప పరిమితిని హెచ్చుచేయరాదు. తేనె, పిప్పళ్ళచూర్ణము, వీనితో పుచ్చుకొనవలయును. ఇట్లు సేవించినయెడల గ్రహణీరోగము, శోష, వీనిని హరించును. ఇది సువర్ణరసపర్పటియని చెప్పబడును. వెంటనే బలమును చేయును. శుక్రమును వృద్ధినొందించును. అగ్నిదీప్తిని చేయును. క్షయ. కాస, శ్వాస, మేహములు, శూల, అతిసారము, పాండువు, వీనిని హరించును.

## సువర్ణపర్పటీరసము (ప్రకారాంతరము)

శ్లో॥ శుద్ధంసువర్ణదలమష్టగుణేన శుద్ధసూతేన పిణ్డితమథో వసు భాగ భాజి । గన్ధేద్రుతే బదరవహ్నిషు లోహపాత్రే దత్వావలోడ్య లఘులోహశలాకయా తత్ (1) మన్దం నిరస్య సురభీమలమణ్డలస్థే రమ్భాదలే తదుపరి ప్రణిధాయ చాన్యత్ । రమ్భాదలం లఘు నియన్త్ర్య తదా దదీత శీతం

సువర్ణరసపర్పటికాభిధానమ్ (2) పిత్తోల్బణే ససితయా తుగయాఽథ వాత శ్లేష్మోల్బణే కిల తుగామధుపిప్పలీభిః । క్షీణేవిరేకిణి చ శోషిణి మన్దవహ్నౌ పాణ్డౌ ప్రమేహిణి చిరజ్వరిణి గ్రహణ్యామ్ । వృద్ధేశిశౌ సుఖిని రాజ్ఞి తథైవ నార్యాం భైషజ్య మేతదుదితం హిత మామయఘ్నమ్ (3)

అ॥ శు॥ కుందనపురేకులు 1 భా, శు॥ రసము 8 భా, వీనిని కలియనూరి 8 భాగములు శు॥ గంధకమును రేగుకట్టెలమంటయందు ఇనుపపాత్రలో కరగించి యందు పోసి చిన్న ఇనుపగరిటెతో కలియత్రిప్పి ఆవుపేడ పరుగునందు అరటియాకు వేసి యందు మెల్లగపోసి పైన చిన్న అరటిఆకును కప్పి చల్లారినపిదప దీయవలయును. ఇది సువర్ణపర్పటీరసమని చెప్పబడును. దీనిని పిత్తప్రధానవ్యాధులయందు పంచదార, తవాక్షీరి వీనితోడను, వాతశ్లేషప్రధానవ్యాధులయందు తవాక్షీరి, తేనె, పిప్పళ్ళు, వీనితోడను, ఇయ్యవలయును. క్షీణించుట, విరేచనములగుచుండుట, శోష, అగ్నిమాంద్యము, పాండువు, ప్రమేహము, జీర్ణజ్వరము, గ్రహణి, వీనియందియ్యవలయును. వృద్ధులు, శిశువు, సుకుమారుడు, రాజస్త్రీ, వీరలకు హితకరమైనది. సమస్తవ్యాధులను నశింపచేయును.

## శూలనికృంతనము

శ్లో॥ శుద్ధసూతం తథా తామ్రం శిలా మాక్షికతాలకే । రజతం గన్ధ వఙ్గేచ లోహమభ్రం చ నాగకమ్ (2) చూర్ణయేత్పఞ్చలవణం దేయం సర్వై శ్చతుల్యకమ్ । సువర్ణం మిశ్రయేత్పశ్చాద్రసైరేతైర్విభావయేత్ (2) శుణ్ఠీ జయ న్తీవిజయా మహారాష్ట్రీకధూర్తజైః ఖాదేదేరణ్డశుణ్ఠీభ్యాం మాషమాత్రం దినే దినే (3) కఫవాతామయం హన్తిచానుపానం వదామ్యహమ్ । వ్యోషం సౌవర్చలం హిఙ్గు కారఞ్జం బీజమేన చ (4) పిబేతు ష్ణామ్బునా నామ్నా సర్వశూలనికృన్తనమ్ । అజీర్ణం గ్రహణీదోషంచామ శూలం తథాహరేత్ । అధ్మానముదరం గుల్మ మతీసారాగ్ని మాన్ద్య కే (5)

అ॥ శు॥ రసము, తామ్రభస్మ, శు॥ మణిశిల, మాక్షికభస్మ, శు॥ తాళకము, రజతభస్మ, శు॥ గంధకము, వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి వీనియన్నిటికిని సమానమగు పంచలవణములను కలిపి పిదప సువర్ణభస్మ 1 భా, కలిపి శుంఠి, చెక్కలి, గంజాయాకు, మరాటీమొగ్గలు, ఉమ్మెత్త, వీనియొక్క రసములతో భావనచేయవలయును. దీనిని ఆముదము, శుంఠి, వీనితో నొకమాషపరిమితిగ ప్రతిదినమందు సేవించినయెడల కఫవాతములచే జనించిన

వ్యాధులు నశించును. త్రికటుకములు, సౌవర్చలవణము, శు॥ ఇంగువ, కానుగవిత్తులు, వీనితోఁచేర్చి పుచ్చుకొని వేడినీటిని త్రాగవలయును. సర్వశూలనికృన్తనరసమని చెప్పఁబడును. ఇది అజీర్ణము, గ్రహణీదోషము, ఆమము, శూల, కడుపుబ్బరము, ఉదరవ్యాధి, గుల్మము, అతిసారము, అగ్నిమాంద్యము, వీనిని హరించును.

## చంద్రశీతరసము

శ్లో॥ రసగన్ధక వైక్రాన్తాః తారం హేమ తథైకతః। త్రిభాగం లోహకాన్తేఽభ్రం త్రిఫలేన విమర్దయేత్ (1) శతావర్యారసేనైవ మత్స్యాక్షీమేఘనాదయోః। మేహారిపుష్పతోయేన నారికేలామ్బునాతథా (2) మర్దయేత్త్రిదినం చైవ హ్రీబేరం దాడిమం ఫలమ్। ముస్తకం చన్దనం చైభిః సప్తథా పరిభావయేత్ (3) ఏకగుఞ్జామితం సేవ్యం ద్రాక్షాఖర్జూర మాక్షికైః స్త్రీణాం ప్రదరరోగం చ సర్వమేహాన్వినాశయేత్ (4) యోనిదోషంలిఙ్గ దోషం తృష్ణాం తాపం చ నాశయేత్। గర్భస్యవృద్ధిం పుష్టిం చ శీతం వీర్యం చ వర్ధయేత్ (5) అనుపానవిశేషేణ వాతపిత్తహరః పరమ్। పుష్టి తేజోబల కరః క్షయిణామమృతం తథా। చన్ద్రశీతరసో నామ శ్రేష్ఠశ్చన్ద్రవినిర్మితః(6)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, వైక్రాంతభస్మ 1 భా, రజతభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, లోహభస్మ 3 భా, కాంతభస్మ 3 భా, అభ్రకభస్మ, 3 భా, వీనిని త్రిఫలములు, పిల్లిపీచర, పొన్నగంటికూర, చిత్రికూర, తంగేడు పువ్వులు, వీనియొక్క రసములతోఁడను కొబ్బరికాయనీటితోఁడను మూడేసిరోజులు మర్దించి వట్టివేళ్ళు, దానిమ్మపండ్లు, తుంగగడ్డలు, మంచిగంధము, వీనియొక్క రసములతో ఏడేసి భావనలను చేయవలయును. దీనిని ద్రాక్షపండ్లరసము, ఖర్జూరపుకాయల రసము, తేనె, వీనితో నొక గురివిందగింజపరిమితిగ సేవించినయెడల స్త్రీలయొక్క ప్రదరవ్యాధి, సమస్తమైన మేహములు, యోనిదోషములు, లింగదోషములు, దప్పిక, శరీరతాపము, ఇవి నశించును. ఇది గర్భవృద్ధిని, గర్భపుష్టిని, చలువను, వీర్యవృద్ధిని, చేయును. అనుపానభేదముచే వాతపైత్యములను హరించును. శరీరపుష్టి, తేజస్సు, బలము, వీనిని చేయును. క్షయరోగులకు అమృతముతో సమానమైనది. చంద్రశీతరసమని చెప్పబడుచున్నది. చంద్రునిచే చెప్పబడినది.

## ఆమకులాంతకము

శ్లో॥ పారదం గన్ధకం చాభ్రం లోహం చాపి వరాటకమ్। రౌప్యం చాతివిషం చైవ కర్షభాగం ప్రకల్పయేత్ (1) ధాన్యశుణ్ఠీ కృతక్వాథైర్భావ

యేచ్చ పృథక్పృథక్। గుఞ్జాప్రమాణవంటికాం కారయేత్కుశలో భిషక్ (2) భక్షయేత్ ప్రాతరుత్థాయ గురుదేవద్విజార్చకః। గగ్ధబిల్వం గుడంచైవ కుర్యాత్తదనుపానకమ్ (3) అజాదుగ్ధేన వా పేయః జమ్బూత్వక్ శృతకేన వా। అతిసారే జ్వరే ఘోరే గ్రహణ్యామరుచౌ తథా (4) ఆమే శూలే భ్రమే చైవ పిచ్ఛారక్తస్రుతౌ తథా। శోఫే రక్తాతిసారే చ సంగ్రహగ్రహణీషు చ (5)

అ॥ శు॥ రసము, గంధకము, అభ్రకభస్మ, లోహభస్మ, గవ్వలభస్మ, రజతభస్మ, అతివస, వీని నొక్కొకకర్ష పరిమితిగ గ్రహించి, ధనియాలు, శుంఠి, వీనియొక్క కషాయములతో ప్రత్యేకముగ భావనచేసి యొక గురివిందగింజపరిమితిగల మాత్రలను చేయవలయును. ఉదయమున లేచి గురువులను, దేవతలను, బ్రాహ్మణులను, పూజించి యొక మాత్రను మారేడుకాయలమసి, బెల్లము, వీనితోగాని మేకపాలతోగాని నేరేడు చెక్కకషాయముతో గాని సేవించినయెడల అతిసారము, తీవ్రమైన జ్వరము, గ్రహణి, అరుచి, అమదోషము, శూల, భ్రమ, జిగురుపడుట, రక్తస్రావము, నంజు, రక్తాతిసారము, సంగ్రహగ్రహణి, ఇవి నశించును.

## కామవిలాసరసము

శ్లో॥ రసం చాభ్రం హేమ తారం వఙ్గం మాక్షికభస్మకమ్। నాగం శుల్బం మృతం కాన్తం సమభాగం చ కారయేత్ (1) మర్కటీశురబీజాని శుద్ధం చైవాహిఫేనకమ్। ఏతదేకీకృతం సర్వం గోక్షీరేణ చ మర్దయేత్ (2) శాల్మలీరసకేనైవ తాలమూల్యా రసేన చ। కణాకుఙ్కుమకక్కోలచన్దనైశ్చ విభావయేత్ (3) వల్లయుగ్మం చ దాతవ్యం క్షీరాజ్యమధుసంయుతమ్। వింశతించ ప్రమేహాంశ్చ సర్వరోగాన్నిహన్తి చ (4) వీర్యస్తమ్భం కరోత్యేవ కామోద్దీపన కృన్మహాన్। సహర్షమనసా నిత్యం రమతే యోషితాం శతమ్। అయం కామవిలాసాఖ్యో రసో దేవవినిర్మితః (5)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, రజతభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, సీసభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, దూలగొండివిత్తులు, గొబ్బివిత్తులు, శు॥ నల్లమందు, వీనిని సమభాగములుగ గ్రహించి ఆవుపాలతోడను బూరుగబంక, తాటివేళ్ళు, పిప్పళ్ళు, కుంకుమపువ్వు, తక్కోలములు, చందనము, వీనియొక్క రసములతోడను మర్దనను, భావనను, చేయవలయును. దీనిని రెండువల్లముల పరిమితిగ పాలు, నెయ్యి, తేనె, వీనితో సేవించినయెడల ఇరువదిప్రమేహములును, సర్వరోగములును హరించును. ఇది వీర్యస్తంభనమును, అధికమగు కామోద్రేకమును, చేయును. దీనిని

సేవించువారు సంతోషముతోఁగూడిన మనస్సుతో ననేకస్త్రీలను రమించుదురు. ఈ కామవిలాసరసము దేవతలచే చెప్పబడినది.

## సూర్యప్రభారసము

సీ॥ కాంతవిద్రుమశంఖగంధక మాక్షికటంకణరోచన కుంకుమములు। కటుకరోహిణి చిత్రకము జున్ను రొయిపీత పావుదారులును పిప్పలిమరీచి। కపురంబు కస్తూరి కమఠనక్రంబులచేదు లొక్కొకపాలుచెలువుగాను। రసభస్మ గరళతామ్రములు నభ్రకము లోహమును రెండేసిభాగములు నల్ల। మందును నాభియు సిందూరములు నాలుగేసి భాగంబులువేసి పిదప। త్రికటుకటుకవహ్ని త్రిఫలకషాయంబు ఝషబర్హిగౌధికఛాగపిత్త। ములలికుచదత్తూరముల హంస పాదిస్వరసముల మూఁడహోరాత్రములను। మర్దించి సర్షప సమానమాత్రలుచేసి సేవింప ననుపానచిత్రమెరిగి। సర్వరోగప్రపంచంబు సమయజేసి। భాసిలుచు నుండు సూర్యప్రభారసంబు। సూర్యనారాయణజగత్పతి సుకృతబుద్ధి। నవని నిర్మించె ప్రఖ్యాతి నమృతముగను॥

అ॥ కాంతభస్మ 1 భా, పగడభస్మ 1 భా, శంఖభస్మ 1 భా, శు॥ గంధకము 1భా, హేమమాక్షికభస్మ 1 భా, శు॥ టంకణము 1భా, గోరోచనము 1 భా, కుంకుమ పువ్వు 1 భా, కటుకరోహిణి 1 భా, చిత్రమూలము 1 భా, జున్ను 1భా, రొయ్యిపీత 1 భా, పావుదారు 1 భా, పిప్పళ్లు 1 భా, మిరియాలు 1 భా, పచ్చకర్పూరము 1 భా, కస్తూరి 1 భా, మొసలిచేదు 1భా, తాబేలుచేదు 1భా, రసభస్మ 2భా, గరళము2భా, తామ్రభస్మ 2 భా, అభ్రకభస్మ 2 భా, లోహభస్మ 2 భా, శు॥ నల్లమందు 4 భా, శు॥ నాభి 4 భా, రససిందూరము 4 భా, వీనిని త్రికటుకములు, కటుకరోహిణి, చిత్ర మూలము, త్రిఫలములు, వీనియొక్క రసముతోఁడను చేప, నెమలి, ఉడుము, మేక వీనియొక్క పిత్తములతోఁడను నిమ్మకాయ, ఉమ్మెత్త, హంసపాది, వీనియొక్క రస ములతోఁడను మూఁడహోరాత్రములు మర్దించి ఆవాలంత మాత్రలు చేయవలయును. వీని ననుపానభేదములతో సేవించినయెడల సమస్తవ్యాధులు నశించును. సూర్యప్రభా రసంబనబడు దీనిని సూర్యనారాయణజగత్పతి భూమియందమృతమగునట్లుగ చెప్పెను.

## సీలకంఠరసము

శ్లో॥ వజ్రసూతేఽభ్రహేమ్నార్కం తీక్ష్ణం ముణ్డం క్రమోత్తరమ్। మారితాని విమర్ద్యామ్లవర్గేణ దినసత్రయమ్ (1) త్రిక్షారం పఞ్చలవణం మర్ది

తస్య సమం సమం తథా । దత్వా నిర్గుణ్డికాద్రావైర్మర్దయేద్దివసత్రయమ్ (2) శుష్కమేతద్విచూర్ణ్యాథ విషం స్యాదష్టమాంశతః । టఙ్కణం విష తుల్యాంశం దత్వా జమ్బీరజద్రవైః (3) భావయేద్దినమేకం తు రసోఽయం నీలకణ్ఠకః । దాతవ్యస్సర్వరోగేషు సంనిపాతే విశేషతః (4) ద్విగుఞ్జామార్ద్రి కద్రావైర్ఘృతైర్వావాతరోగిణామ్ । నిర్గుణ్డీమూలచూర్ణం తు మాహిషాఖ్యం చ గుగ్గులమ్ (5) సమాంశం మర్దయేదాజ్యే తద్వటీకర్ష సంమితా । అను యోజ్యా ఘృతైర్నిత్యం స్నిగ్ధముష్ణం చ భోజనమ్ (6) మణ్డలాన్నాశ యేత్సర్వాన్వాతరోగాన్న సంశయః । సంనిపాతే పిబేచ్చాను రవిమూల కషాయకమ్ । ధాన్యశుణ్ఠీకషాయేణ త్వజీర్ణకులనాశకః (7)

అ॥ వజ్రభస్మ 1 భా, రసభస్మ 2 భా, అభ్రకభస్మ 3 భా, సువర్ణభస్మ 4 భా, తామ్రభస్మ 5 భా, తీక్ష్ణలోహభస్మ 6 భా, ముండలోహభస్మ 7 భా, వీనిని ఆమ్లవర్గ ద్రవ్యరసములతో మూడురోజులు మర్దించి వీనియన్నిటికిని సమానమగు మూడు క్షార ములను, పంచలవణములను, కలిపి వావిలిరసముతో మూడురోజులు మర్దించి ఎండిన పిదప నూరి యీ మందుకు నెనిదవ వంతు శు॥ నాభిని, నాభితో సమానమగు శు॥ టంకణమును, కలిపి నిమ్మకాయరసముతో నొకరోజు భావనచేయవలయును. ఇది నీల కంఠరసమని చెప్పబడును. దీనిని అల్లపురసముతో రెండు గురివిందగింజల పరిమితిగ సమస్త వ్యాధులయందును, ప్రధానముగ సంనిపాతమందును ఇయ్యవలయును. వాత రోగులకు నేతితోకూడ నీయవచ్చును. వావిలివేళ్లచూర్ణమును, శు॥ మహిసాక్షిగుగ్గ లును, సమభాగములుగ గ్రహించి నేతితో నూరి కర్షప్రమాణముకల మాత్రలనుచేసి నేతితోకూడ నీ మాత్రను మందుసేవించినవెంటనే పుచ్చుకొనుచు స్నిగ్ధగుణమును ఉష్ణ వీర్యమును కల ఆహారమును భుజించుచుండినయెడల నొకమండలము దినములకు సమస్త వాతవ్యాధులును నిశ్చయముగ నశించును. సంనిపాతమందు జిల్లేడువేళ్ల కషా యముతోడను, అజీర్ణమందు ధనియాలు శుంఠి వీనియొక్క కషాయముతోడను ఇవ్వ వలయును.

## లఘుబాలసూర్యోదయము

శ్లో॥ హరవీర్యం త్రిభాగం చ నిశరాజం చ గన్ధకమ్ । శుద్ధామృతం ద్వాదశం చ తీక్ష్ణం చ ద్విజరాజకమ్ (1) వరాటం తు చతుర్భాగంబాణ భాగం తథాఽభ్రకమ్ । మరిచం సూతతుల్యం తు గన్ధతుల్యం తు తామ్రకమ్ । (2) హరవీర్యార్ధకిట్టం తు శరభాగం తు విద్రుమమ్ । మర్దయే దార్ద్రికస్యైవ

జమ్బీరరసేన చ (3) గులికాన్బదరీబీజాన్వ్రజమూషే వినిక్షిపేత్ । యన్త్రేణ వాలుకాఖ్యేన పాచయేత్ రుద్రయామకమ్ (4) సాఙ్గశీతలముద్ధృత్య దాతవ్య శ్చానుపానకైః అన్తర్జ్వర శ్వాసకాసఛర్దిపాణ్డుషుశ్లేష్మకే (5) మూత్ర కృచ్ఛ్రేఽతిసారే చ సర్వరోగే హిత స్తథా । బాలసూర్యోదయో నామ ప్రసిద్ధో దేహవృద్ధిదః (6)

అ॥ శు॥ రసము, 3 భా, శు॥ గంధకము 1 భా, శు॥ నాభి 12 భా, ఖడ్గలోహ భస్మ 1 భా, గవ్వలభస్మ 4 భా, అభ్రకభస్మ 5 భా, మిరియాలు 3 భా, తామ్రభస్మ 1 భా, మాండూరభస్మ 1½ భా, పగడభస్మ 5 భా, వీనిని అల్లపురసముతోడను, నిమ్మ కాయలరసముతోడను, మర్దించి రేగుగింజలంత మాత్రలను చేసి వజ్రమూసయందుంచి వాలుకాయంత్రమందు పదునొకండుజాములు వండి సాంగశీతలమున తీయవలయును. దీనిని తగు ననుపానములతో అంతర్గతజ్వరము, శ్వాస, కాస, వాంతి, పాండువు, శ్లేష్మ వ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, మూత్రాతిసారము, వీనియందును సర్వరోగములందును ఇయ్యవలయును. ఇది బాలసూర్యోదయమని చెప్పబడును. దేహవృద్ధిని చేయును.

## వంటబాలసూర్యోదయము

శ్లో॥ సూతం స్యాద్దశధా చ హాటకమిదం చైకం మృతం వారిజం । భాగం ద్వాదశ గన్ధకస్య సకలం ద్రవ్యం కృతం నిర్మలమ్ । కన్యాహంసపదీర సైశ్చ సుచిరం పిష్ట్వాకృతం గోలకమ్ । క్షిప్త్వాకాచ ఘటోదరే పటవృతే కుమ్భే చ సికతాయుతే (1) పక్త్వాతు త్రిదినం క్రమాగ్నిసహితం సాఙ్గం సశీ తోద్భవం । చోద్యద్భాస్కరతుల్యరాగ సహితం భిత్వా తు దివ్యౌషధమ్ । తత్పాదాంశకమభ్రభస్మ సహితం కాన్తం తదర్ధాన్వితం । రౌప్యం తత్తులితం నిధాయ చ మృతం నాగం తదర్ధం క్షిపేత్ (2) కస్తూరీఘనసారకుఙ్కుమర జోజాతీఫలం త్ర్యూషణం । ప్రత్యేకం భుజగాంశపాదసహితం క్షిప్తం చ ఖల్వోదరే । మర్ద్యం పూర్వరసేన యోజితమిదం వల్లం సదా ఖాదయేత్ । పాణ్డుంశోఫహలీమకోదరగదాన్యక్ష్మాణి మేహం జయేత్ (3) కాసశ్వాసగలా మయాశ్మరిరుజం మూత్రేషుమేహాదికాన్ । హిక్కారోచకముగ్రరక్తప్రదరం ప్లీహానమున్మాదకమ్ । నానారోగహితానుపానసహితం నానామయ ధ్వంస

కం। సర్వం సౌఖ్యకరం రసాయనమిదం శ్రీనిత్యనాథోదితమ్ । యద్వైభ షజ్యగణస్య భూషణమిదం శ్రీబాలసూర్యోదయమ్ (4)

అ॥ శు॥ రసము 10 భా, సువర్ణభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, శు॥ గంధకము 12 భా, వీనిని కలుబంద, హంసపాది, వీనియొక్క రసములతో మర్దించి మాత్రలుచేసి మట్టిపూసిన గుడ్డలతో చుట్టబడిన కాసకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే మూడురోజులు వండి స్వాంగశీతలమున తీసి ఉదయించుచున్న సూర్యునివలె ఎర్రగనుండు ఆ మందును గ్రహించి యీ మందుకు నాలుగవ వంతు అభ్రకభస్మను, అభ్రకభస్మలో సగము కాంతభస్మను, కాంతభస్మతో సమానము వెండిభస్మను, వెండి భస్మలో సగము సీసభస్మను, సీసభస్మలో ప్రత్యేకముగ నాల్గవ వంతు చొప్పున కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, జాజికాయలు త్రికటుకములు వీనిని కలిపి ఖల్వమందుంచి హంసపాది, కలుబంద, వీనియొక్క రసములతో మర్దింపవలయును. దీనిని వల్లపరిమితిగ సేవించినయెడల పాండువు, నంజు, హాలీమకము, ఉదరరోగము, రాజయక్ష్మ, మేహము, కాస, శ్వాస, కంఠవ్యాధులు, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, ఇక్షుమేహము మొదలగు వ్యాధులు, ఎక్కిళ్లు, అరోచకము, తీవ్రమైన రక్తప్రదరము, ప్లీహవ్యాధి, ఉన్మాదము, ఇవి నశించును. ఆయా రోగములకు తగిన యనుపానములతో నిది సమస్త వ్యాధులును హరించును. సౌఖ్యమును కలిగించును. రసాయనము నిత్యనాథునిచే చెప్పబడినది. సమస్తౌషధములలోను శ్రేష్ఠమైనది. బాలసూర్యోదయమని చెప్పబడును.

## బాలసూర్యోదయము

శ్లో॥ సూతం త్రైగుణ్యగన్ధం పరిమితమమృతం భానుతీక్ష్ణం చ నేత్రం। బాలూథం తచ్చతుర్థం గగనశరయుతం మారిచం సర్వతుల్యమ్। ఏతద్ద్వ్యాన్ని హన్తి జ్వరవనదహనం శ్వాసకాసం చ ఛర్దిం। పాణ్డుం ప్లీహప్రమేహౌ క్షయ గుదజరుజా లిఙ్గదోషం చ పుంసామ్ (1) నారీణాంయోనిదోషం బహువిధ ప్రదరాన్మూత్రకృచ్ఛ్రం చ సర్వం। నామ్నాయం బాలసూర్యోదయ ఇతి కథితో రోగహారీ మునీన్ద్రైః (2)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 3 భా, శు॥ నాభి 3 భా, తామ్రభస్మ 2 భా, ఖడ్గలోహభస్మ 2 భా, శు॥ ఇంగువ ½ భా, అభ్రకభస్మ 5 భా, మిరియాలు 16½ భా, ఇట్లు వీనిని గ్రహించి సేవించినయెడల జ్వరము, శ్వాస, కాస, వాంతి, పాండువు, ప్లీహవ్యాధి, ప్రమేహము, క్షయ, అర్శస్సు పురుషులయొక్క లింగ

దోషము, స్త్రీల యొక్క యోనిదోషము, సమస్తమైన ప్రదరములు, సమస్తమైన మూత్రకృచ్ఛ్రములు, ఇవి నశించును. ఇది బాలసూర్యోదయమని చెప్పబడును. సమస్త వ్యాధులను హరించును. మునీశ్వరులచే చెప్పబడినది.

## మహాబాలసూర్యోదయము

శ్లో॥ సూతం త్రైగుణ్యగన్ధం పరిమితమమృతం భానుతీక్ష్ణం చ నేత్రం చారూఢం తచ్చతుర్థం గగనశరయుతం కాన్తతారే చ తుల్యే। మారీచం చైక యుక్తం త్రిచతురసహితం నాగవఙ్గం క్రమేణ । తే రమ్యం సూక్ష్మమర్ద్యం మునిరసమథితం చాటరూనిఘరాభ్యామ్ (1) ఏతద్ద ద్యాన్నిహన్తి జ్వరకుల విపినం శ్వాసకాసం చ ఛర్దిం। పాణ్డుం శూలప్రమేహాన్జయతి గుదరుజాః ప్లీహగుల్మానశేషాన్ । వాతవ్యాదేః కుఠారః క్షయజకఫరుజో రాజయక్ష్మాది రోగాన్ । నామ్నాఽయం బాలసూర్యోదయ ఇతి కథితో విష్టపేఽయం ప్రసిద్ధః (2)

ఆ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 3 భా, శు॥ నాభి 3 భా, తామ్రభస్మ 2 భా, తీక్ష్ణలోహభస్మ, 2 భా, శు॥ ఇంగువ ¼ భా, అభ్రకభస్మ 5 భా, కాంతభస్మ 5 భా, వెండిభస్మ 5 భా, మిరియాలు 1 భా, సీసభస్మ 3 భా, వంగభస్మ 4 భా, వీనిని మెత్తగ నూరి అవిసియాకు, అడ్డసరము, గొబ్బి, వీనియొక్క రసములతో మర్దింపవలయును. దీనిని సేవించినయెడల జ్వరములు, శ్వాస, కాస, వాంతి, పాండువు, శూల, ప్రమేహములు, మూలవ్యాధి, ప్లీహవ్యాధి, గుల్మము, వాతవ్యాధులు, క్షయవలన జనించిన కఫవ్యాధులు, రాజయక్ష్మ మొదలగు వ్యాధులు, ఇవి నశించును. ఇది బాలసూర్యోదయమనబడును. లోకమందు ప్రసిద్ధమైనది.

## వంటమహాబాలసూర్యోదయము

శ్లో॥ దశభాగం శుద్ధసూతం గన్ధంద్వాదశభాగకమ్ । ద్విభాగే చ శిలా తాలే తాలార్ధం శుద్ధస్వర్ణకమ్ (1) తారం తామ్రం నాగవఙ్గే స్వర్ణపాదాంశ కాని చ । కుమారీదాడిమద్రావైశ్చిత్రమూలద్రవేణ చ (2) త్రిదినం మర్దయే త్సమ్యక్కాచకూప్యన్తరే క్షిపేత్ । సమ్యగావేష్టయేత్పూర్వాద్వస్త్రఖణ్డైస్సమృత్తికైః (3) గోలకం తం క్షిపేద్భాణ్డే వాలుకాసహితే భిషక్ । త్రిదినం పాచ యేచ్చుల్ల్యాం మన్దమధ్యోత్తమైః క్రమాత్ (4) స్వాఙ్గశీతలముద్ధృత్య సిన్దూరం

రక్తవర్ణకమ్ । సిద్ధం చై తదితి జ్ఞాత్వాసర్వరోగేషు యోజయేత్ (5) సంనిపాత జ్వరం ఘోరం చైకాదశక్షయం హరేత్ । ఉదరాణి చ సర్వాణి వాతరోగాన్విశేషతః (6) సన్తతోచ్ఛ్వాసకాసౌ చ వలీపలితనాశకః । దుష్టాద్వయం ప్రదాతవ్యం తత్తద్రోగానుపానతః (7) నాశయేదితి తత్సర్వం శివేన పరిభాషితః । బాలసూర్యోదయో నామ విషగాశ్చర్యకారకః (8)

అ॥ శు॥ రసము 10 భా, శు॥ గంధకము 12 భా, శు॥ మణిశిల 2 భా, శు॥ తాళకము 2 భా, శు॥ బంగారము 1 భా, వెండిభస్మ ¼ భా, తామ్రభస్మ ¼ భా, సీసభస్మ ¼ భా, వంగభస్మ ¼ భా, వీనిని కలుబంద, దానిమ్మ, చిత్రమూలము, వీని యొక్క రసములతో మూడురోజులు బాగుగ మర్దించి కాచకుప్పెయందుంచి పైన మట్టిపూసినగుడ్డలతో బాగుగచుట్టి దానిని ఇసుకతోకూడిన కుండయందుంచి పొయ్యి మీదనుంచి మందమధ్యమతీవ్రాగ్నులచే మూడురోజులు వండి సాంగశీతలమున తీసి ఎఱ్ఱగ సిందూరించుటచే తయారైనదానిని గ్రహింపవలయును. దీనిని సర్వరోగముల యందు నియ్యవలయును. ఇది ఘోరమైన సంనిపాతజ్వరము, ఏకాదశక్షయలు, సమస్తమైన ఉదరరోగములు, వాతవ్యాధులు, ఎల్లప్పుడు ఎగరొప్పుట, దగ్గు, శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, వీనిని హరింపజేయును. రెండుగురివింద గింజలపరిమితిగ నాయా యనుపానములతో నిచ్చినయెడల సమస్తరోగములను నశింపజేయునని ఈశ్వరునిచే చెప్పబడెను. బాలసూర్యోదయమని చెప్పబడును. గుణములచే వైద్యుల కాశ్చర్యమును కలిగించును.

## సు వ ర్ణ బా ల సూ ర్యో ద య ము

శ్లో॥ సువర్ణంరజతం కాంస్యం తామ్రభస్మ తథైవ చ । మృతసూతం తథా గన్ధం నాగం వఙ్గంచ లోహకమ్ (1) పునర్నవాకుమారీభ్యాం ద్విదినం చ విమర్దయేత్ । గులికాన్కారయేచ్చైవ హ్యాతపే చైవశోషితాన్ (2) కాచకూప్యాం నివేశ్యాథ వాలుకాయన్త్రయోగతః । త్రివిధాగ్నిక్రమేణైవ పాచయేత్పఙ్చయామకమ్ (3) స్వాఙ్గశీతలముద్ధృత్య దినమేకం విమర్దయేత్। త్రిఫలాక్వాథకేనైవ చణ్డాల్యార్ద్రరసైస్తథా (4) మత్స్యాక్ష్యాశ్చ రసేనైవ నాగవల్లీరసేన చ । అనుపానవిశేషేణ నానారోగనివారణమ్ । బాలసూర్యోదయో నామ సీతానాథప్రకల్పితః (5)

అ॥ బంగారుభస్మ, వెండిభస్మ, కంచుభస్మ, తామ్రభస్మ, రసభస్మ, శు॥ గంధకము, నాగభస్మ, వంగభస్మ, లోహభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి గలిజేరు,

కలుబంద, వీనియొక్క రసములతో రెండురోజులు మర్దించి గులికలుచేసి ఎండయందు ఎండించి కాచకప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడువిధములైన యగ్నులచే క్రమముగ నైదుజాములు వండి సాంగశీతలమున తీసి త్రిఫలాకషాయముతోడను నీలియాకు, అల్లము, పొన్నగంటికూర, తమలపాకులు, వీనియొక్క రసములతోడను ఒక్కొక్క దినము మర్దించవలయును. దీనిని అనుపానవిశేషములతో నిచ్చినయెడల సమస్త వ్యాధులు నశించును. బాలసూర్యోదయమని చెప్పబడును. సీతానాథునిచే చెప్పబడినది,

## సువర్ణమహాబాలసూర్యోదయము

శ్లో॥ శుద్ధసూతం గృహీత్వాదౌ పలద్వితయసమ్మితమ్ శుద్ధగన్ధం చ తత్సామ్యం హేమరౌప్యే చ కర్షకే (1) కాన్తాభ్రే తామ్రతీక్ష్ణే చ నాగవఙ్గే చ మాక్షికమ్ । వైక్రాన్తం చ తథా సర్వం కర్షార్ధం చ నిదాపయేత్ (2) హంసపాదీకుమారీభ్యామీశ్వరీమూలచిత్రకైః । సంమర్ద్య కజ్జలీం కృత్వా కాచకూప్యాం నివేశయేత్ (3) వాలుకాయన్త్రిభాణ్డస్థం న్యసేచ్చుల్ల్యాం ప్రయత్నతః । దినత్రయం త్వహోరాత్రే క్రమవహ్నిం చ దీపయేత్ (4) సాఙ్గశీతలతాయాంతు సమాకృష్య రసోత్తమమ్। ఇన్ద్రగోపసమం చైవ తేజసా యోజయేద్బుధః (5) ఏతత్సర్వం నిధాయాథ పునః ఖల్వేశుభేఽహని । ద్వినిష్కం మృగనాభిం చ దేవపుష్పం చ తత్సమమ్ (6) నిష్కమాత్రం చ కర్పూరం సమ్యఙ్మేలయ యత్నతః దృఢం మర్ద్యం జలేనైవ గులికాన్కాలయేత్సుధీః(7) యోజ్యం సర్వేషు రోగేషు గుఞ్జాద్వయమితం రసమ్ । అశీతివాతజాన్రోగాన్హన్తిశూలత్రయం తథా (8) వింశతిశ్లేష్మరోగాంశ్చ చతుర్వింశతి పైత్తికాన్ । తత్తద్రోగానుపానేన నిహన్తి సకలామయాన్ (9) క్షయ మేకాదశవిధం గ్రహణీం పాణ్డుకామలే । కుమ్భకామలకాం చైవహృద్యదా వర్తం మహోదరమ్ (10) దీపనం పరమం ప్రోక్తం సర్వనాశకరః పరమ్ । బాలానాం పరమం పథ్యం వృష్యశ్చాయుర్వివర్ధకః (11) బహునాత్రకిముక్తేన సర్వరోగహరః పరమ్ । బాలసూర్యసమాభశ్చ బాలసూర్యోదయో రసః (12)

అ॥ శు॥ రసము 2 పలములు, శు॥ గంధకము 2 ప, సువర్ణభస్మ 1 కర్షము, వెండిభస్మ 1 క, కాంతభస్మ ½ క, అభ్రకభస్మ ½ క, తామ్రభస్మ ½ క, ఖడ్గలోహభస్మ ½ క, సీసభస్మ, ½ క, వంగభస్మ, ½ క, మాక్షికభస్మ ½ క, వైక్రాంతభస్మ

½ క, ఇట్లు వీనిని గ్రహించి హంసపాది, కలుబంద, ఈశ్వరివేరు, చిత్రమూలము, వీని యొక్క రసములతో కాటుకవలె మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్ర మందు మూడురోజులు అహోరాత్రములందు క్రమాగ్నులచే వండి సాంగశీతలమైనపిదప ఆరుద్రపురుగుతో సమానకాంతిగల రసమును (సిందూరము) గ్రహించి యామందును అన్నిటిని తిరిగి ఖల్వమందుంచి కస్తూరి 2 నిష్కములు, లవంగములు 2 ని, పచ్చకర్పూరము 1 ని, వీనిని కూడ కలిపి ఉదకముతో దృఢముగ మర్దించి గులికలను (కుప్పెలను) చేయవలయును. దీనిని రెండుగురివిందగింజల పరిమితిగ సమస్త రోగములం దియ్యవలయును. ఇది ఎనుబది వాతవ్యాధులను మూడువిధములగు శూలలను, ఇరువది శ్లేష్మవ్యాధులను, ఇరువదినాలుగు పైత్యవ్యాధులను హరించును. ఆయారోగములకు తగిన యనుపానములతో సమస్త రోగములను హరించును. ఏకాదశక్షయలు, గ్రహణి, పాండువు, కామిర్లు, కుమ్భకామల, ఉదావర్తము, మహోదరము, వీనిని సమస్త వ్యాధులను నశింపజేయును. అగ్నిదీప్తినిచేయును. బాలురకు మిక్కిలి హితకరమైనది. శుక్రమును, ఆయువును వృద్ధినొందించును. సమస్త రోగములను హరించునని విశేషముగ చెప్పనవసరములేదు. ఇది బాలసూర్యునితో సమానమైన కాంతికలదిగ నుండును. బాలసూర్యోదయమని చెప్పబడును.

## కనకబాలసూర్యోదయము

శ్లో॥ సూతాత్త్రిగుణ్యగన్ధం విషకనకయుతం భానుతీక్ష్ణం చ నేత్రం। చారూఢం తచ్చతుర్ధరం గగనశరయుతం కాన్తభూతిం చ తుల్యామ్। మారీచం సూతభాగం త్రయమపి రజతం విద్రుమం శుక్తిజాతం। సిన్దూరం నాగవఙ్గం త్రయమపి సకలం ఖల్వమధ్యే తు మర్ద్యమ్ (1) గోక్షీరం గోక్షురం వై శత పదిసహితం గోపివాశేఖరాశ్చ। భూకూష్మాణ్డస్యకన్దం ముసలికదలికాశాల్మలీ మూలమేతైః। ఏనం దద్యాన్నిహన్తి జ్వరవనదహనం శ్వాసకాసం చ ఛర్దిం। పాణ్డుం శూలప్రమేహాన్స్మరతి గుదరుజా లిఙ్గదోషం చ పుంసామ్ (2) యోషాణాం యోనిదోషం బహువిధప్రదరాన్నాజయక్ష్మాతిసారాన్। నామ్నాయం బాలసూర్యోదయ ఇతి కథితో రోగహారీ మునీన్ద్రైః (3)

అ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 3 భా, శు॥ నాభి 2 భా, బంగారు భస్మ 2 భా, తామ్రభస్మ 2 భా, లోహభస్మ 2 భా, గవ్వలభస్మ ½ భా, అభ్రకభస్మ 5 భా, కాంతభస్మ 5 భా, మిరియాలు 1 భా, వెండిభస్మ 1 భా, పగడభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, రససింధూరము 1 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, వీని నన్నిటిని ఖల్వమందుంచి ఆవుపాలతోడను పల్లేరు, పిల్లిపీచర, పాలసుగంధి, అడ్డసరము, గొబ్బి, నేలగుమ్మడిదుంప, నేలతాడి, అరటిదుంప, బూరుగవేళ్ళు,

వీనియొక్క రసములతోడను మర్దించవలయును. దీని నిచ్చినయెడల జ్వరము, శ్వాస, కాస, వాంతి, పాండువు, శూల, ప్రమేహములు, అర్శస్సు, పురుషులయొక్క లింగ దోషము, స్త్రీలయొక్క యోనిదోషము, అనేకవిధములైన ప్రదరములు, రాజయక్ష్మ, అతిసారము, ఇవి హరించును. ఇది బాలసూర్యోదయమని చెప్పబడును. సమస్త వ్యాధులను హరించును. మునీశ్వరులచే చెప్పబడినది.

## కామేశ్వరరసము

శ్లో॥ మృతసూతాభ్రకే స్వర్ణం కాన్తం తీక్ష్ణం మృతం తథా। ప్రవాలం మౌక్తికం వఙ్గం శోధితం చ శిలాజతు (1) రమ్భా గోక్షురశాల్మల్యా విక్షుర్వాశాశతావరీ। బీజానీక్షురకస్యైవ మర్కటీ జీరకంబలా (2) అశ్వగన్ధా విదారి చ తథా భూశర్కరాపివై। మృణాలం వాలకం కుష్ఠం చైలా చన్దనముత్పలమ్ (3) జాతీపత్రం జాతిఫలం కూష్మాణ్డః కదలీఫలమ్। ద్రాక్షా ఖర్జూర విజయే చార్ద్రకం తు తథైవ చ (4) కుఙ్కుమం చ లవఙ్గం చ రసై రేషాం విమర్దయేత్। ప్రత్యేకం యామమాత్రం తు గోక్షీరేణ తు భావయేత్ (5) ఘనసారం మిశ్రయేచ్చ హ్యౌషధస్యద శాంశకమ్। ఏతద్రసాయనం సర్వం పన్నీరేణ చ భావయేత్ (6) గులికాన్ ఛాయయా శుష్కాన్ వంశనాలే వినిక్షిపేత్। చతుర్గుఞ్జాప్రమాణేన శర్కరాక్షీరసంయుతమ్ (7) పూర్వయామే తథా గ్రాహ్యం చాపరాహ్ణే తదర్ధకమ్। రాత్రౌ గోక్షీరసితయా త్వభ్యాసేన మహౌషధమ్ (8) వలీపలితనాశం చ వృద్ధోఽపి తరుణాయతే। వన్ధ్యోఽపి లభతేపుత్రం వీర్యవృద్ధికరం నృణామ్ (9) స్తమ్భనం మోహనం చైవ కాన్తిదం పుష్టివర్ధనమ్। లాలామేహం వసామేహం హారిద్రం శుక్లమేహకమ్ (10) మధుమేహం చేక్షుమేహం బహుమూత్రం చ తన్తుకమ్। రక్తమేహం మూత్రకృచ్ఛ్రమశ్మరీం పిష్టమేహకమ్ (11) కదలికాకవన్ధ్యాత్వం స్త్రీణాం రోగాన్ని వారయేత్। రక్తపిత్తం చామ్లపిత్తం నారీణాం ప్రదరం తథా (12) ఛర్దింహిక్కా మపస్మారమున్మాదం మూర్ఛరోగకమ్। అఙ్గదాహం లిఙ్గదాహం నష్టవీర్యం ప్రపూర్ణకమ్ (13) గుల్మోదరప్రశమనం చాష్టశూలనివారణమ్। తత్తద్రోగానుపానేన సర్వరోగనివా

రణమ్ (14) శ్రేష్ఠం రసాయనం చైవ మదనోద్రేకకారణమ్ । కామేశ్వర రసో నామ హ్యశ్వినీదేవనిర్మితః (15)

ఆ॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, తీక్ష్ణలోహభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, వంగభస్మ. శు॥ శిలాజితు, వీనిని సమభాగములుగ గ్రహించి అరటిదుంప, పల్లేరు, బూరుగ, చెరకు, అడ్డసరము, పిల్లిపీచర, గోబ్బివిత్తులు, దూలగొండివిత్తులు, జీలకఱ్ఱ, ముత్తవపులగము, పెన్నేరు, నేలగుమ్మడి, భూశర్కర, తామరతూండ్లు, కురువేరు, చెంగల్వకోష్టు, ఏలకులు, మంచిగంధము, నల్లకలువ, జాపత్రి, జాజికాయ. బూడిదగుమ్మడికాయ, అరటిపండు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయ, గంజాయాకు, అల్లము, కుంకుమపువ్వు, లవంగములు, వీనియొక్క రసముఁతో నొక్కొక జాము మర్దించి ఆవుపాలతో భావనచేసి ఈ యౌషధమునకు పదియవ వంతు పచ్చకర్పూరమును కలిపి దీనినంతను పన్నీరుతో భావనచేసి కుప్పెలుకట్టి నీడ నెండించి వెదురుగొట్టమందుంచవలయును. దీనిని ఉదయమందు నాలుగు గురువిందగింజల పరిమితిగను, మధ్యాహ్నమందు నాలుగు గురివిందగింజల పరిమితిగను, రాత్రి యందు రెండు గురివిందగింజల పరిమితిగను, పంచదార, పాలు వీనితో సేవించిన యెడల శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, ఇవి నశించును. దీని సేవనచే ముసలివాడు కూడ యౌవనవంతుడగును. సంతానము లేనివాడుకూడ పుత్ర సంతానమును పొందును. వీర్యవృద్ధి, వీర్యస్తంభనము, మోహము, శరీరకాంతి, శరీర పుష్టి ఇవి కలుగును. లాలామేహము, వశామేహము, హరిద్రామేహము, శుక్లమేహము, మధుమేహము, ఇక్షుమేహము, బహుమూత్రము, తంతుమేహము, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, పిష్టమేహము, కదలివంధ్యాత్వము, కాకవంధ్యాత్వము స్త్రీలకు కలుగు వ్యాధులు, రక్తపిత్తము, అమ్లపిత్తము, స్త్రీలయొక్క ప్రదరము, వాంతి, ఎక్కిళ్లు, అపస్మారము, ఉన్మాదము, మూర్ఛ, శరీరతాపము, లింగమందలి మంట, వీర్యము నశించుట, గుల్మము, ఉదరము, ఎనిమిదివిధములగు శూలలు ఇవి నశించును. ఆయా రోగములకు తగు అనుపానముతో సమస్త రోగములును హరించును. ఇది శ్రేష్ఠమైన రసాయనము. మన్మథోద్రేకమును కలిగించును. కామేశ్వరరసమని చెప్పబడును. అశ్వనీదేవతలచే చెప్పబడినది.

## కృశామృత రసము

శ్లో॥ రసభస్మ ద్విభాగం చ భాగైకం హేమభస్మకమ్ । గుడూచీ సత్వకం తుల్యం ఖల్వే సంమర్దయేద్దినమ్ (1) సితయా మధుసర్పిర్భ్యాం మాషైకం భక్షితం సదా । అశ్వగన్ధాపలార్ధం చ గవాం క్షీరైః పిబేదను (2) కృశానాం కురుతేపుష్టింకృశామృతరసః స్మృతః । కృశానాంబృంహణం దేయం

సర్వం పానాన్నభేషజమ్ । నిద్రాం చైవ దివారాత్రౌ ఛాగమాంసాశనం సదా (3)

అ॥ రసభస్మ 2 భా, సువర్ణభస్మ 1 భా, తిప్పసత్తు 3 భా, వీనిని ఖల్వమందుంచి యొకరోజు నూరి పంచదార, తేనె, నెయ్యి, వీనితో నొకమాషపరిమితిగ పుచ్చుకొని వెంటనే అర్ధపలము పరిమితిగల పెన్నేరుచూర్ణమును ఆవుపాలతో పుచ్చుకొనిన యెడల కృశించినవారలకు శరీరపుష్టి కలుగును. ఇది కృశామృతరసమని చెప్ప బడును. కృశించినవారలకు పుష్టికరములైన ఔషధాన్నపానముల నియ్యవలయును. రాత్రింబగళ్లయందు నిద్రను కలిగింపవలయును. మేకమాంసమును తినిపించవలయును.

## సు వ ర్ణ లో హ ర సా య న ము

శ్లో॥ సువర్ణం పారదం గన్ధం క్రమోత్తరగుణం భవేత్ । రసతుల్యం తీక్ష్ణలోహం సర్వమేకత్ర మర్దయేత్ (1) జమ్బీరతులసీవాశా నిర్గుణ్డీచిత్ర మూలకైః । క్షిప్త్వా కాచఘటే పక్త్వా సికతాయన్త్రయోగతః (2) శీతాగ్ని కం చ సంగృహ్య పూర్వైర్ద్రవైరేవ చ మర్దయేత్ । కృత్వా చ గులికాన్సమ్యక్ త్రిగుఞ్జాం భక్షయేత్తతః (3) కాసం శ్వాసంతథాఽజీర్ణం కామలాంక్షయశో ఫకౌ । వాతవ్యాధీన్ తథాశీఘ్రం కఫవ్యాధీ నశేషతః । సర్వరోగాన్హరత్యేవ స్వర్ణలోహరసాయనమ్ (4)

అ॥ సువర్ణభస్మ 1 భా, శు॥ రసము 2 భా, శు॥ గంధకము 3 భా, ఖడ్గలోహ భస్మ 2 భా, వీనినన్నిటిని కలిపి నిమ్మకాయలు, తులసి, అడ్డసరము, వావిలి, చిత్ర మూలము, వీనియొక్క రసములతో మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్ర మందు వండి చల్లారినపిదప తీసి పూర్వపురసములతోడనే మర్దించి కప్పెలను కట్ట వలయును. దీనిని మూడు గురివిందగింజల పరిమితిగ సేవించినయెడల, దగ్గు, వగర్పు, అజీర్ణము కామిర్లు, క్షయ, నంజు, వాతవ్యాధులు, కఫవ్యాధులు ఇవి వెంటనే హరించును. ఈ స్వర్ణలోహ రసాయనము సమస్త వ్యాధులను హరించును.

## సూ తి కా రి ర స ము

శ్లో॥ తాలం గన్ధకపారదం త్రికటుకం జాతీఫలం సైన్ధవమ్ । నాగం వఙ్గకలోహకాభ్రకమిదం తామ్రం శిలా తుత్థకమ్ (1) నేపాలం విషటఙ్కణం

చ యవజక్షారామృతే వై తథా । తారం తాలకహిఙ్గులం చ సకలం చైకైక భాగాన్వితమ్ (2) జమ్బీరార్ద్రిక మేఘనాదసహితంచిత్రం చ గౌరీదలమ్ । ఏకైకం దివసం విమర్దయ రసై ర్మాషప్రమాణావటీ । రోగం సౌతికమేవ హన్తి నిఖిలం తాపం చ ఛర్దిం తథా (3) శ్లో॥ జీర్ణజ్వరం తథా శోఫం గ్రహణీప్లీహకాసకాః । గుల్మం మహోదరం హన్తి కఫవాతం హరేత్తథా । సూతికారిరసో నామ సోమనాథోదితోఽగదః (4)

అ॥ శు॥ తాళకము, శు॥ గంధకము, శు॥ రసము, త్రికటుకములు, జాజికాయలు, సైంధవలవణము, సీసభస్మ, వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, శు॥ మణిశిల శు॥ మైలతుత్థము, శు॥ నేపాళము, శు॥ నాభి, శు॥ వెలిగారము, యవక్షారము, గరళము, రజితభస్మ, శు॥ పిండతాళకము, శు॥ ఇంగిలీకము, వీని నొక్కొక్క భాగముగ గ్రహించి నిమ్మకాయలు, అల్లము, చిరికూర, చిత్రమూలము, తులసియాకు, వీనియొక్క రసములతో నొక్కొకరోజు మర్దించి మినపగింజపరిమితిగ మాత్రలను చేసి సేవించిన యెడల సమస్తమైన సూతికారోగములు, తాపము, వాంతి, జీర్ణజ్వరము, నంజు, గ్రహణి, ప్లీహవ్యాధి, దగ్గు, గుల్మము, మహోదరము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, ఇవి హరించును. ఇది సూతికారిరస మనబడును. సోమనాథునిచే చెప్పబడినది.

## సువర్ణతిలకరసము

శ్లో॥ తోలం హేమ చ రౌప్యకం ద్విగుణితం లోహత్త్రియః పారదాత్ । చత్వారో నియతం తు వఙ్గయుగలం చైకీకృతం మర్దయేత్ । ముక్తా విద్రుమయో రసేన సమతా గోక్షీరవాసేక్షుభిః । మర్ద్యం వన్యకరీషకైశ్చ సుదృఢం తప్తం పుటే శీతలమ్ (1) కస్తూరీ ఘనసారమర్దితరసః పశ్చాత్సుసిద్ధో భవేత్ । కాసశ్వాస సపిత్తవాత కఫజిత్ప్రాణక్షయాదీన్హరేత్ । శూలార్తి గ్రహణిం విషాదిరుజకం మేహాశ్మరిం వింశతిం । హృద్రోగాదిహరం జ్వరాదిశమకం వృష్యంవయోవర్ధకమ్ । శ్రేష్ఠం పుష్టికరం సువర్ణతిలకం మృత్యుఞ్జయేనోదితమ్ (2)

అ॥ సువర్ణభస్మ 1 తు, రజితభస్మ 2 తు, లోహభస్మ 3 తు, రసభస్మ 4 తు, వంగభస్మ 2 తు, ముత్యభస్మ 4 తు, పగడభస్మ 4 తు, వీనిని ఆవుపాలతోడను అడ్డసరము, చెఱకు, వీనియొక్క రసములతోడను మర్దించి ఏరుపిడకలతో గొప్పపుటము వేసి చల్లారినపదప తీసి కస్తూరిని, పచ్చకర్పూరమును, కలిపి మర్దించినయెడల

తయారగును. ఇది కాస, శ్వాస, పైత్యవ్యాధులు, వాతవ్యాధులు, కఫవ్యాధులు, పాండువు, క్షయ మొదలగునవి, శూల, గ్రహణి, విషాదులచే జనించిన వ్యాధులు, ఇరువది మేహములు, అశ్మరి, వీనిని హరించును. హృద్రోగము మొదలగు వ్యాధులను, జ్వరాదులను, నశింపజేయును. శుక్రవృద్ధిని, ఆయుర్వృద్ధిని, పుష్టిని, చేయును. శ్రేష్ఠమైనది. సువర్ణతిలక మనబడును. మృత్యుంజయునిచే చెప్పబడినది.

## తామ్రలోహరసాయనము

శ్లో॥ పారదం గన్ధకం శుద్ధం ద్విభాగం పరికల్పయేత్ । తామ్రభస్మ త్వయోభస్మ చైకభాగం పృథక్పృథక్ (1) నిర్గుణ్డీ బృహతీ వాశారవిదుగ్ధక చిత్రకైః । మరీచశృఙ్గవేరాభ్యాం మర్దయేచ్చ పృథక్పృథక్ (2) కాచకూప్యన్తరే క్షిప్త్వా వాలుకాయన్త్రకే పచేత్ । తత ఉద్ధృత్య తత్సర్వం మర్దయేల్లికుచద్రవైః (3) గులికాన్ ఛాయయాశుష్కా ననుపానవిశేషతః । కఫరోగే ప్రయోక్తవ్యం ద్విగుఞ్జాపరిమాణతః (4) తిమిరం వాతశూలే చ కాసం శ్వాసం హరేత్జ్వరమ్ । క్షయం కుష్ఠం తథాఽజీర్ణం శోఫం పాణ్డ్వామయం హరేత్ । ప్రసిద్ధం భువనే నిత్యం తామ్రలోహరసాయనమ్ (5)

అ॥ శు॥ రసము 2 భా, శు॥ గంధకము 2 భా, తామ్రభస్మ 1 భా, లోహభస్మ 1 భా, వీనిని వావిలి, నేలములగ అడ్డసరము, చిత్రమూలము, మిరియాలు, అల్లము, వీనియొక్క రసములతోడను జిల్లేడుపాలతోడను వేరువేరుగ మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి తీసి యామందునంతను నిమ్మకాయల రసముతో నూరి కుప్పెలను కట్టి నీడను ఎండింపవలయును. దీనిని రెండుగురివింద గింజల పరిమితిగ ననుపానవిశేషములతో కఫవ్యాధులయం దియ్యవలయును. మరియు నిది తిమ్మిర్లు, వాత్యవ్యాధులు, శూల, దగ్గు వగర్పు, క్షయ, కుష్ఠు , అజీర్ణము, నంజు, పాండువు, వీనిని హరించును. ఈ తామ్రలోహరసాయనము లోకము నందెల్లప్పుడును ప్రసిద్ధమైది.

## కాసశ్వాసాంకుశరసము

శ్లో॥ విషం చతుర్గుణం దద్యాత్తదర్ధం తీక్ష్ణకం రీతథా । విద్రుమం మౌక్తికం శఙ్ఖం కాన్తం వ్యోమరసం తథా (1) కమఛాగమాయూర మకరీ పిత్తకాని చ । హరీతకీం గన్ధమేతాన్యేకైకం మరిచం తథా (2) సర్వమేతత్తు సంమిశ్ర్యఖల్వమధ్యే వినిక్షిపేత్।నిర్గుణ్డిచిత్రక రసైర్మర్ధయేద్దివసత్రయమ్(3)

గుఞ్జామాత్రప్రమాణేన దాపయే ద్భిషగుత్తమః । పాణ్డుశూలప్రమేహాంశ్చ కాసశ్వాసాగ్నిమాన్ద్యకాన్ (4) వాతాదీన్ సంనిపాతాంశ్చ జ్వరం శ్లైష్మికమాహరేత్ । కాసశ్వాసాఙ్కుశఖ్యాతోఽశ్వినీదేవనిర్మితః (5)

అ॥ శు॥ నాభి 4 భా. తీక్ష్ణలోహభస్మ 2 భా, పగడభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, శంఖభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, రసభస్మ 1 భా, తాశేలుచేదు 1 భా, మేకచేగు 1 భా, నెమలిచేదు 1 భా, మొసలిచేదు 1 భా, కరక్కాయ 1 భా, శు॥ గంధకము 1 భా, మిరియాలు 1 భా, వీని నన్నిటిని కలిపి ఖల్వమందుంచి వావిలి, చిత్రమూలము, వీనియొక్క రసములతో మూడేసి రోజులు మర్దింపవలయును. దీని నొక గురివిందగింజ పరిమితిగ నిచ్చిన యెడల పాండువు, శూల, ప్రమేహము, కాస, శ్వాస, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, సంనిపాతములు, శ్లేష్మజ్వరము, ఇవి హరించును. ఇది కాసశ్వాసాంకుశమని ప్రసిద్ధమైనది. అశ్వినీదేవతలచే చెప్పబడినది.

## ఆనందరసము

శ్లో॥ వఙ్గభస్మ మృతం స్వర్ణం రసభస్మ విమర్దయేత్ । ద్విగుఞ్జం భక్షయేన్నిత్యం హన్తి మేహం చిరోద్భవమ్ । గుడూచీసత్వకం క్షౌద్రై రనుపానం ప్రశస్యతే (1)

అ॥ వంగభస్మ, సువర్ణభస్మ, రసభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి రెండుగురివిందగింజల పరిమితిగ సేవించి వెంటనే తిప్పసత్తును తేనెతో పుచ్చుకొనిన యెడల చిరకాలముక్రిందట జనించిన ప్రమేహము కూడ నశించును.

## సంనిపాతసూర్యరసము

శ్లో॥ రసేన గన్ధం ద్విగుణం ప్రగృహ్య తత్పాదభాగం రవితార హేమ। భస్మీకృతం యోజయ మర్దయిత్వా దినత్రయం వహ్నిరసేన ఘర్మే (1) విషం చ దత్వాత్ర కలార్ధమానం మత్స్యాజపిత్తైః పరిభావయేచ్చ । కటుత్రయార్ద్రాగ్నిరసప్రయుక్తం వల్లద్వయం చాస్య దదీతవైద్యః । తైలేన చాభ్యఞ్జనమేవ కుర్యాద్స్నానం జలేనాపి చ శీతలేన (2) శ్లో॥ సంనిపాతే మహాఘోరే సర్వేష్వపి జ్వరేషు చ । విషమేషు సమస్తేషు జ్వరేఽజీర్ణేతథైవ చ

(3) అజీర్ణేచాగ్నిమాన్ద్యే చ వాతశ్లేష్మగదేషు చ । సూతికాజ్వరవాతేషు ప్రయోక్తవ్యం రసోత్తమమ్ । విష్ణునానిర్మితస్సంనిపాతసూర్యరసశ్చ వై (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, తామ్రభస్మ ¼ భా, రజత భస్మ ¼ భా, సువర్ణభస్మ ¼ భా, వీనిని చిత్రమూలరసముతో మూడురోజులు ఎండ యందు మర్దించి 8 భాగముల శు॥ నాభి కలిపి చేపయొక్కయు, మేకయొక్కయు, చేదులతో భావనచేయవలయును. దీనిని రెండువల్లముల పరిమితిగ త్రికటుములు, అల్లము, చిత్రమూలము, వీనియొక్క రసముతో నిచ్చితైలాభ్యంగనమును, శీతలజల స్నానమును చేయింపవలయును. మహాఘోరమైన సన్నిపాతము సమస్తమైన జ్వరములు, సమస్తమైన విషజ్వరములు, జీర్ణజ్వరము, అజీర్ణము, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, సూతికాజ్వరము, సూతికావాతము, వీనియందియ్య వలయును. ఈ సంనిపాతసూర్యరసము విష్ణువుచే చెప్పబడినది.

## వృష్యహేతురసము

శ్లో॥ రసభస్మ త్రిభాగం స్యాదష్టభాగం తు గన్ధకమ్ । చతుర్భాగమౌక్తికం హేమద్విభాగం తాలకం శిలామ్ (1) తారమభ్రంలోహకం చ వఙ్గం మాక్షికనాగకే । అయస్కాన్తం ప్రవాలం చేత్యేకభాగం ప్రకల్పయేత్ (2) భావయేత్త్రిశ్చ దుగ్ధేన చోశీరం కేతకీ జయా । బలాశ్వగన్ధామాషాశ్చ దశ భైభిః పృథక్పృథక్ (3) లవఙ్గైఖరజాతీభిః త్వగేలా గోక్షురైస్తథా । శతావరీమౌ చసారమర్కటీ చన్దనోత్పలైః (4) ఏకైక భావనా దేయా పాదాంశం శుద్ధ ఫేనకమ్ । మేలయిత్వా ప్రయత్నేన హ్యనుపానవిశేషకైః (5) మాషమాత్రం ప్రయోక్తవ్యం మధునా సితయా తథా । మైథునే దృఢలిఙ్గశ్చ హ్యఙ్గనానాం శతత్రయమ్ (6) గచ్ఛేదవికృతో నిత్యం భోక్తవ్యం చ యథేప్సితమ్ । ప్రాతరుత్థాయ సేవేత తత్తద్రోగోపశాన్తయే (7) శుక్లమేహం చ మూత్రకృచ్ఛ్రంచ నాశయేత్ కాసం శ్వాసంక్షయం ఛర్దిం సర్వాంశ్చగ్రహణీగదాన్ (8) సర్వాతిసారశోఫౌ చ త్వద్నిమాన్ద్యమజీర్ణకమ్ । వృష్యహేతురసోనామ లోకైక హితకాఙ్క్షయా । ఆరోగ్యరక్షణార్థం చ పూజ్యపాదేన నిర్మితః (9)

అ॥ రసభస్మ 3 భా, శు॥ గంధకము 8 భా, ముత్యభస్మ 4 భా, సువర్ణభస్మ 2 భా, శు॥ తాళకము 1 భా, శు॥ మణిశిల 1 భా, రజతభస్మ 1 భా, అభ్రకభస్మ

1 భా, లోహభస్మ 1 భా, వంగభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, సీసభస్మ 1 భా, అయస్కాంతభస్మ 1 భా, పగడభస్మ 1 భా, వీనిని ఆవుపాలతో మూడుభావనలను, వట్టివేళ్ళు, మొగలిపువ్వులు, చెక్కలి, ముత్తవపులగము, పెన్నేరు, మినుములు, వీని రసములతో పదేసిభావనలను, లవంగములు, గొబ్బివిత్తులు, జాజికాయలు, దాసన చెక్క, ఏలకులు, పల్లేరు, పిల్లిపీచర, బూరుగబంక, దూలగొండి, మంచిగంధము, నల్లకలువ, వీని రసములతో నొక్కొక భావనను చేసి యామందును నాల్గువవంతు శు॥ నల్లమందును కలుపవలయును. దీనిని అనుపానవిశేషములతోడను, తేనెతోడను, పంచదారతోడను, మాషపరిమితిగ సేవించుచు యథేష్టముగ భుజించుచుండినయెడల మైథునమందు దృఢమైన లింగముకలవాడై మూడువందల స్త్రీలను అలసటలేనివాడై రమించును. ఆయా రోగములు నశించుటకై ఉదయమున లేచి సేవించినయెడల ఇంద్రియస్ఖలనము, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, కాస, శ్వాస, క్షయ, వాంతి, సమస్తమైన గ్రహణులు, సమస్తమైన అతిసారములు, నంజు, అగ్నిమాంద్యము, అజీర్ణము, ఇవి శాంతించును. ఇది వృష్యహేతురసమని చెప్పబడును. లోకముయొక్క మేలుకోరి ఆరోగ్యము నిమిత్తము పూజ్యపాదునిచే చెప్పబడినది.

## నేత్రామృతవర్తి

శ్లో॥ తారం తామ్రం రసం తుత్థం ఖర్పరం కటురోహిణీమ్ । రసాఞ్జనం కాంశ్యసఙ్ఖౌ హంసపాద్యా ద్రవైర్దినమ్ । వర్తింకృత్వాఽఞ్జనాద్ధన్తి సమస్తాన్నేత్రజామయాన్ (1)

అ॥ రజతభస్మ, తామ్రభస్మ, రసభస్మ, శు॥ మైలతుత్థము, శు॥ కపరి, కటుకరోహిణి, రసాంజనము, కంచుభస్మ, శంఖభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి హంసపాదిరసముతో నొకరోజు మర్దించి కణికలుచేసి నేత్రములయందు అంజనము వేసినచో సమస్త నేత్రవ్యాధులును హరించును.

## మహానేత్రామృతవర్తి

శ్లో॥ తారం తామ్రం రసం సీసం కర్పూరం ఖర్పరం శిలామ్ । రసాఞ్జనం కాంస్యశఙ్ఖౌ ద్రోణపుష్పీద్రవైర్దినమ్ । వర్తింకృత్వాఽఞ్జనాద్ధన్తి సమస్తాన్నేత్రజామయాన్ (1)

అ॥ రజతభస్మ, తామ్రభస్మ, రసభస్మ, సీసభస్మ, పచ్చకర్పూరము, శు॥ కపరి, శు॥ మైలతుత్థము, రసాంజనము, కంచుభస్మ, శంఖభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి తుమ్మిపువ్వులరసముతో నొకరోజు మర్దించి కణికలుచేసి నేత్రములయందు అంజనము వేసినచో సమస్త నేత్రవ్యాధులు హరించును.

## శృంగారాభ్రక రసము

శ్లో॥ శుద్ధసూతం ద్విభాగం చ భాగైకం శుద్ధగన్ధకమ్ । త్రిభాగం తామ్రజం భస్మ త్రిభాగే నాగవఙ్గకే (1) భాగైకే లోహమణ్డూరే భాగైకం స్వర్ణభస్మకమ్ । మాక్షికం కోశకం లాక్షాం మాంసీం తాలీస పత్రకమ్ (2) కర్పూరం జాతికోశం చ మృగనాభిం చ హిఙ్గులమ్ । మఞ్జిష్ఠాం దేవదారుం చ లవఙ్గం చ మనశ్శిలామ్ (3) ఏతాన్యేకైక భాగాని సర్వస్యార్ధంతథాఽభ్రకమ్ । అభ్రకార్ధాం యవానీమప్యుత్పలం చ తథావిధమ్ (4) ఏకీకృత్యాఽఖిలం మర్ద్యం నాగవల్లీరసైస్త్ర్యహమ్ । శృఙ్గారాభ్రరసో నామ మహాదేవేన నిర్మితః (5) చణమాత్రాం వటింఖాదేల్లవఙ్గస్యానుపానతః । పయశ్శాల్యోదనం పథ్యం ఘృతం మాంసాదిభోజనమ్ (6) శర్కరామధుకం పిష్టమిష్టాన్నం వివిధం తథా । వినాశయేత్సర్వరోగానగ్నిమాన్ద్యమజీర్ణకమ్ (7) వాతవ్యాధ్యతిసారౌ చ గ్రహణీం మూత్రకృచ్ఛ్రకమ్ । పైత్తికం శ్లైష్మికం చైవ వ్యాధిం సర్వప్రమేహకమ్ । హృదిన్ద్రియం చ పుష్ణాతి శతస్త్రీరమణో భవేత్ (8)

అ॥ శు॥ రసము 2 భా, శు॥ గంధకము 1 భా, తామ్రభస్మ 3 భా, సీసభస్మ, 3 భా, వంగభస్మ 3 భా, లోహభస్మ 1 భా, మండూరభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, మరాటీమొగ్గలు 1 భా, లక్క 1 భా, జటామాంసి 1 భా, తాలీసపత్రి 1 భా, పచ్చకర్పూరము 1 భా, జాపత్రి 1 భా, కస్తూరి 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, మంజిష్ఠి 1 భా, దేవదారు 1 భా, లవంగములు 1 భా, శు॥ మణిశిల 1 భా, అభ్రకభస్మ 14 భా, వాము 7 భా, నల్లకలువదుంప 7 భా, వీనిని తమలపాకు రసముతో మూడురోజులు మర్దింపవలయును. ఇది శృంగారాభ్రకరసమని చెప్పబడును. మహాదేవునిచే చెప్పబడినది. దీనిని సెనగగింజంత పరిమితిగ పుచ్చుకొని లవంగముల రసమును అనుపానముగ త్రాగవలయును, పాలు, శాల్యన్నము, నెయ్యి, మాంసము మొదలగువానియొక్క భోజనము, పంచదార, తేనె, పిండివంటలు, ఇష్టములైన వివిధాహారములు, వీనిని సేవింపవలయును. ఇట్లు చేసినచో సమస్త వ్యాధులు, అగ్నిమాంద్యము, అజీర్ణము, వాతవ్యాధులు, అతిసారము, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము, పిత్తవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, సమస్త ప్రమేహములు, ఇవి నశించును. ఇది హృదయమునకును, ఇంద్రియములకును, బలమును చేయును. దీనిని సేవించువాడు నూరుగురు స్త్రీలను సంతోషింపజేయును.

## కా స కు ఠా ర ర స ము

శ్లో॥ రసం గన్ధం సమం తారం శిలాతాలే చతుర్గుణే । వాసాగోక్షుర సారాభ్యాం మర్దయేచ్చ దినద్వయమ్ (1) ద్వియామం వాలుకాయన్త్రే పాచయేచ్చూర్ణయేత్తతః । గుఞ్జాద్వయం నిహన్త్యాశు కాసం శ్వాసం క్షయం తథా (2) రసః కాసకుఠారోఽయమనుపానం చ కథ్యతే । దాడిమం త్రిఫలాం వ్యోషం త్రయాణాం తు సమం గుడమ్ । చూర్ణితం భక్షయేత్కర్షం క్షయకాసాపనుత్తయే (3)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, రజతభస్మ 1 భా, శు॥ మణిశిల 4 భా, శు॥ తాళకము 4 భా, వీనిని అడ్డరసము, పల్లేరు, వీనియొక్క రసములతో రెండురోజులు మర్దించి వాలుకాయంత్రమందు రెండుజాములు వండవలయును. దీనిని చూర్ణించి రెండుగురివిందగింజల పరిమితిగ సేవించినయెడల దగ్గు, వగర్పు, క్షయ ఇవి వెంటనే నశించును. ఇది కాసకుఠారరసమని చెప్పబడును. దానిమ్మ బెరళ్లు, త్రిఫలములు, త్రికటుకములు, వీనిని సమభాగములుగను వీనికి సమానమగు బెల్లమును, గ్రహించి, చూర్ణించి యా చూర్ణమును కర్ష పరిమితిగ ననుపానముగ పుచ్చుకొనవలయును. క్షయ, దగ్గు, నశించును.

## రో గ శో ష ణ ర స ము

శ్లో॥ చతుర్వింశతిభాగశ్చ గన్ధో వఙ్గం తదర్ధకమ్ । వఙ్గభాగద్వవేదర్ధః పారదః కృష్ణమభ్రకమ్ (1) చతుర్దశవిభాగం స్యాన్మృతం తద్గృహ్యతాం పునః । మృతలోహం చాష్టభాగం మృతతామ్రం నవాష్టచ (2) మృతహేమ ద్విభాగం స్యాద్రౌప్యకం సప్తభాగకమ్ । అతిశుద్ధమతిస్థూలం మృతం హీరం త్రయోదశ (3) మాక్షికం తు విశుద్ధం తు గ్రాహ్యం షోడశభాగకమ్ । అష్టాదశమితం గ్రాహ్యం తథా కాసీసకం పునః (4) షడ్భాగం తుత్థకం చైవ శుద్ధం సంగ్రాహ్యమేవ చ । తాలకం చ చతుర్భాగం శిలా యోజ్యా త్రిభాగికా (5) శైలేయం పఞ్చభాగం చ సర్వానేకత్ర సూతనాన్ । మౌక్తికం చైకభాగం స్యాత్సౌభాగ్యం చ ద్విభాకమ్ (6) కుట్టయిత్వా విచూర్ణ్యాథ జమ్బీరస్వరసేన వై । భావయేత్సప్తధా గాఢం గులికాం స్తస్య కారయేత్(7) శరావద్వితయే క్షిప్త్వా ముద్రయేద్ద్వౌశరావకౌ । ఘటమధ్యే నివేశ్యాథ దత్వా పూర్వం చ వాలుకామ్ (8) ఊర్ధ్వం చ తాం పునర్దత్వా వాలుకాం ముద్ర

యేన్మృఖమ్ । అహోరాత్రం దహేదగ్నౌ స్వాఙ్గశీతం సముద్ధరేత్ (9) పకులస్య చ బీజేన కణ్టకారీద్వయేన చ । గుడూచ్యాత్రిఫలావారా భావయేత్సప్తధా పృథక్ (10) గిరికర్ణ్యా రసేనాపి తతో రోహితపిత్తతః । ఏవం సిద్ధో భవేత్సమ్యగ్రసోఽసౌ రోగశోషకః (11) దేవాన్గురూన్సమభ్యర్చ్యయతినో విప్రకాంస్తథా । రక్తికాద్వితయందేయం సంనిపాతే సముచ్ఛ్రయే (12) మరిచేన సమం దేయం తేన జాగర్తిమానవః । శ్లైష్మికే చ గదే దేయం గ్రహణ్యామగ్నిమాన్ద్యకే (13) ప్లీహ్ని పాణ్డౌ ప్రయోక్తవ్యం త్రికటుత్రిఫలామ్భసా । శూలరోగే ప్రయోక్తవ్యం వాతరోగే విశేషతః (14) కుష్ఠే సుదుష్టే దేయోఽయం కాకోదుమ్బరికామ్భసా । క్షయప్రహాసకరశ్చైదో బలవర్ణాగ్నివర్ధకః (15) ధన్వన్తరికృతస్సద్యోరసః పరమదుర్లభః । సర్వరోగేషు యోక్తవ్యో నిస్సందేహం భిషగ్వరైః (16)

అ॥ శు॥ గంధకము 24 భా, వంగభస్మ 12 భా, శు॥ రసము 6 భా, అభ్రకభస్మ 14 భా, లోహభస్మ 8 భా, తామ్రభస్మ 17 భా, సువర్ణభస్మ 2 భా, రజతభస్మ 7 భా, వజ్రభస్మ 13 భా, శు॥ మాక్షికము 16 భా, శు॥ కాసీసము 18 భా, శు॥ మైలతుత్థము 6 భా, శు॥ తాళకము 4 భా, శు॥ మణిశిల 3 భా, శిలాజితు 5 భా, ముత్యభస్మ 1 భా, శు॥ వెలిగారము 2 భా, వీనిని దంచి చూర్ణముచేసి నిమ్మపండ్ల రసముతో నేడుసాదులు బాగుగ భావనచేసి మాత్రలుజేసి రెండుమూకుళ్ళయందుంచి సంధబంధనముచేసి యొకకుండయందు ముందుగ నిసుకబోసి యందుపై నీసంపుటము నుంచి పైన మిగల నిసుకపోసి కుండయొక్క ముఖమును మూసి సంధబంధనము చేసి యొకరాత్రియు బవలును వండి సాంగశీతలమున తీసి పొగడగింజలు, చిననేలములగ, పెదనేలమునగ, తిప్పతీగ, త్రిఫలములు, పెద్దమ్రాను, కొండగు వింద, వీనియొక్క రసములతోడను రోహితకమనెడి చేపయొక్క పిత్తముతోడను ఏడేసి సార్లు భావన చేయవలయును. ఈ ప్రకారముగ బాగుగ తయారైన యీ యౌషధము రోగశోషణరసమని చెప్పబడును. దేవతలు, గురువులు, యతీశ్వరులు, బ్రాహ్మణులు, వీరిని పూజించి దీనిని రెండురక్తికల పరిమితిగ నుద్ధృతమైన సంనిపాతమందు మిరియాల రసముతో నిచ్చినయెడల రోగి వెంటనే స్వాస్థ్యమును పొందును. శ్లేష్మవ్యాధి, గ్రహణి, అగ్నిమాంద్యము, ప్లీహవ్యాధి, పాండువు, శూల, వాతవ్యాధి వీనియందు త్రికటుకములు, త్రిఫలములు, వీనియొక్క రసముతో నియ్యవలయును. దుష్టమైన

కషాయమందు మేడిరసముతో నియ్యవలయును. ఇది క్షయను తగ్గించును. లక్ష్మి, బలము, శరీరకాంతి, జాఠరాగ్ని, వీనిని వృద్ధినొందించును. ధన్వంతరిచే చెప్పబడినది. వ్యాధులను వెంటనే తగ్గించును. మిక్కిలి దుర్లభమైనది. వైద్యులచే సమస్త వ్యాధుల యందును నిస్సందేహముగ ప్రయోగింపదగినది.

## పాశుపతాస్త్రరసము

శ్లో॥ రసభస్మ చ తామ్రం చ గన్ధకం చ మనశ్శిలామ్ । పాషాణ ద్వితయం చాథ భృఙ్గనీరేణ మర్దయేత్ (1) ద్విదినం వాలుకాయన్త్రే చణ్డాగ్నౌ చ ద్వియామకమ్ । పచేద్ద్విగుఞ్జం భక్ష్యం వై చార్ద్రిక స్యానుపానతః । పశు పత్యస్త్రనామాఽయం సర్వాహికజ్వరం హరేత్ (2)

అ॥ రసభస్మ, తామ్రభస్మ, శు॥ గంధకము, శు॥ మణిశిల, శు॥ ఉల్లిపాషాణము, శు॥ గౌరీపాషాణము, వీనిని సమభాగములుగ గ్రహించి గుంటగలగరరసముతో రెండుదినములు మర్దించి వాలుకాయంత్రమందు గాఢాగ్నిచే రెండుజాములు వండ వలయును. దీనిని రెండుగురివిందగింజల పరిమితిగ అల్లపురసానుపానముతో సేవింప వలయును. ఇది పాశుపతాస్త్రమని చెప్పబడును. సమస్తమైన ఆహికజ్వరములను హరించును.

## మహాపాశుపతాస్త్రరసము

శ్లో॥ ద్విభాగం శ్వేతపాషాణం రసం నేపాలమ్లేచ్ఛకే । ప్రత్యేక మేక భాగం తు ఖల్వమధ్యే వినిక్షిపేత్ (1) కృష్ణధత్తూరతోయేన మర్దయేద్యామ మాత్రకమ్ । ముద్గప్రమాణమాత్రశ్చ త్వార్ద్రికస్యాను పానతః । ఐకాహికం ద్వ్యాహికం చ త్ర్యాహికం నాశయేజ్జ్వరమ్ (2)

అ॥ శు॥ ఉల్లిపాషాణము 2 భా, రసభస్మ 1 భా, శు॥ నేపాళములు 1 భా, తామ్రభస్మ 1 భా, వీనిని ఖల్వమందుంచి నల్లఉమ్మెత్తరసముతో నొకజాము మర్దింప వలయును. దీనిని పెసరగింజ పరిమితిగ అల్లపురసానుపానముతో సేవించిన యెడల ఐకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహికజ్వరము, ఇవి నశించును.

## సంనిపాతపాశుపతాస్త్రరసము

శ్లో॥ ద్విపాషాణం ద్వితుత్థం చ నేపాలం తాలకం విషమ్ । సర్వతుల్యం సూత భస్మ త్వర్కక్షీరేణ మర్దయేత్ (1) డోలాయన్త్రే పచేద్యామం తముద్ధృత్య

విచూర్ణయేత్ । భావయేత్ఫణిపిత్తేన గుఞ్జామాత్రం భిషగ్వరః (2) లశునస్య చ తైలేన బ్రహ్మద్వారే విలేపయేత్ । తత్క్షణేన నిహన్త్యాశు సంనిపాతాంస్త్రయోదశ । రసః పాశుపతాస్త్రోఽయం శఙ్కరేణ ప్రకల్పితః (3)

అ॥ శు॥ ఉల్లిపాషాణము, శు॥ గౌరీపాషాణము, శు॥ మైలతుత్థము, శు॥ పాల తుత్థము, శు॥ నేపాళములు, శు॥ తాళకము, శు॥ నాభి, వీనిని సమభాగములుగను రసభస్మను, వీనియన్నిటితో సమానముగను గ్రహించి జిల్లేడుపాలతో మర్దించి డోలాయంత్రమం దొకజాము వండి తీసి చూర్ణించి త్రాచుపాముచేదుతో భావన చేయవలయును. దీనిని ఒక గురివిందగింజ పరిమితిగ వెల్లుల్లితైలముతో బ్రహ్మద్వారమందు లేపనము చేసినయెడల పదమూడు సంనిపాతములు వెంటనే హరించును. ఇది పాశుపతాస్త్రరసమని చెప్పబడును. ఈశ్వరునిచే చెప్పబడినది.

## మాణిక్యరసాయనము

శ్లో॥ సుజాతిగుణమాణిక్యం సమకర్షమితం శుభమ్ । కనకాభ్రకతామ్రాణాం కాన్తస్య భసితం పృథక్ (1) త్రిగుణత్వేన సమ్బద్ధం మర్దయేత్సమగన్ధకైః । పుటేదన్యకరీషైశ్చ పఞ్చవారాణియత్నతః (2) ఏవం శిలాలకాభ్యాం చపుటేన్నీ లాఞ్జనేన చ । తుల్యగన్ధాస్మసూతాభ్యాం విహితాం కజ్జలీంశుభామ్ (3) లోహపాత్రే పరిద్రావ్యం బాదరేణాల్పవహ్నినా । మాణిక్యాదీని భస్మాని క్షిప్త్వా తత్రవిమిశ్రయేత్ (4) అథార్ద్రకరసైస్తాంతు సమ్యఙ్నిర్వాప్య కజ్జలిమ్ । సముత్క్షిప్య విచూర్ణాథక్షిపేద్ద్రవ్యం కరణ్డకే (5) వ్యోషాజ్యసహితం హ్యేతన్మాణిక్యాఖ్యం రసాయనమ్ । వ్యోషాజ్యేన హితం లీఢం షణ్మాసం పథ్యభోజినా (6) నిహన్తి సకలాన్రోగాన్జరాపలితసంయుతాన్ । జీవేద్వర్షశతం చైవ త్రివారకృతభోజనః । క్షయకాసాదికాన్సర్వాన్హన్తి తద్రోగానుపానతః (7)

అ॥ మంచిజాతి కలిగినట్టియు మంచిగుణము గలిగినట్టియు యోగ్యమైనట్టియు మాణిక్యములు 1 కర్షము, సువర్ణభస్మ 3 క, అభ్రకభస్మ 3 క, తామ్రభస్మ 3 క, కాంతభస్మ 3 క, శు॥ గంధకము 13 క, వీనిని మర్దించి కుండయందుంచి అడవియేరు పిడకలతో నైదుసారులు పుటములు వేయవలయును. పిదప 13 కర్షముల శు॥ మణిశిలతో మర్దించి కుండయందుంచి అడవియేరుపిడకలతో నైదుపుటములు వేయవలయును. ఇట్లు 13 కర్షముల శు॥తాళకముతోడను, 13 కర్షముల శు॥ నీలాంజనము

తోడను, ఐదేసి పుటములు వేయవలయును. పిదప 13 క షు॥ గంధకమును, 13 క షు॥ రసమును కజ్జలిచేసి యా కజ్జలిని లోహపాత్రయందు రేగుకట్టెలతో చిన్నమంటయందు కరగించి యందు మాణిక్యము మొదలగువానియొక్క భస్మలనుంచి కలిపి యందు అల్లపురసమునుపోసి చల్లార్చి తీసి చూర్ణించి దానిని భరణి (కొయ్యపాత్ర)యందుంచ వలయును. ఈ మాణిక్యరసాయనమును త్రికటుకములు, నెయ్యి వీనితో నాలు మాసములు సేవించుచు పథ్యాహారమును భుజించుచుండినచో సమస్త వ్యాధులును, ముసలితనమును, వెంట్రుకలు నెరయుటయు, నశించును. దీనిని సేవించువాడు మూడు సారులు భోజనమును చేయుచు ననేకసంవత్సరములు జీవించును. ఇది ఆయా రోగము లకు తగిన అనుపానములతో క్షయ, దగ్గు, మొదలగు వ్యాధులను హరించును.

## మౌ క్తి క ర సా య న ము

శ్లో॥ జయన్తీరసనిష్పిష్టం బర్హిపిఞ్ఛేనమారితమ్। మౌక్తికం ఫల మాత్రం హి ద్విగుణం స్వర్ణభస్మకమ్ (1) త్రిగుణం కాన్తజం భస్మ వ్యోమ భస్మ చతుర్గుణమ్। తత్పాదగన్ధసౌభాగ్యం భృఙ్గసారేణ మర్దయేత్ (2) పుటేద్వింశతివా రాణి విధేయం పటగాలనమ్। సర్వతుల్యేన బలినా రసేన కృతకజ్జలీమ్ (3) విద్రావ్య పూర్వవద్భస్మ ముక్తాదీనాం వినిక్షిపేత్।విమిశ్ర్య నిక్షిపేత్తత్ర క్షీరం భాగీరముద్భవమ్ (4) విశోషితం విచూర్ణ్యాథ కాచకూ ప్యాం వినిక్షిపేత్। పిప్పలీమధునా సార్ధం సేవయేద్వల్లమాత్రయా (5) రసాయనవిధానేన లభతే వత్సరేణవై। వలీపలితనిర్ముక్తో వార్ధకేన వివ ర్జితః (6) నవయౌవనసంపన్నః శతాయశ్చ సుచక్షుషీ। మదహస్తిబలో ద్రేకః రాజీవనయనాన్వితః (7) లీఢం మధ్వాజ్యతైలైస్సకణోపేతాశ్వగ న్ధికైః క్షయరోగం నిహన్త్యాసు మణ్డలార్ధేన నిశ్చయః (8) తత్తద్రోగాను పానైశ్చ నిహన్తి సకలామయాన్। వర్ణ్యం పుత్రప్రదం హ్యేతత్ సూతి కామయ నాశకమ్ (9) బాలానాం పరమం పథ్యం వృష్యమాయుర్వివర్ధకమ్। నాగోదరోపవిష్టా చ హన్తి స్త్రీణాం చ వేగతః (10) హైయఙ్గవీన సంయు క్తం స్థలరాజసమన్వితమ్। గర్భిణీసర్వరోగేషు ప్రశస్తం పరికీర్తితమ్ (11)

ఆ॥ తెక్కలిరసముతో నూరబడినట్టియు నెమలిపింఛముతో భస్మచేయబడి నట్టియు ముత్యభస్మ 1 పలము, సువర్ణభస్మ 2 ప, కాంతభస్మ 3 ప, అభ్రకభస్మ 4 ప, శు॥ గంధకము $\frac{1}{4}$ ప, శు॥ వెలిగారము $\frac{1}{4}$ ప, వీనిని గుంటగలగరరసముతో భావన

చేయుచు ఇరువది పుటములు వేయవలయును. పిదప వస్త్రగాలితము చేయవలయును. శు॥ గంధకము 11 ప, శు॥ రసము 11 ప, వీనిని కజ్జలిచేసి కరగించి యందు పూర్వ మందలి ముత్యభస్మ మొదలగు వానిని వేసి కలిపి యందు మేకపాలను పోయవలయును. ఎండించి పిదప చూర్ణముచేసి సీసాయందుంచవలయును. దీనిని పిప్పళ్ళు, తేనె, వీనితో వల్లపరిమితిగ రసాయనవిధితో నొక సంవత్సరము సేవించిన యెడల శరీరము ముడతలు పడుట, వెండ్రుకలు నెరయుట, ముసలితనము, ఇవి లేనివాడై నూతనమైన యౌవనముతో కూడుకొని నూరుసంవత్సరముల ఆయువును, యోగ్యమైన దృష్టిని, పొందును. మదించిన యేనుగుతో సమానమైన బలమును పద్మములవంటి నేత్రములను కలవాడగును. తేనె, నెయ్యి, నూనె, పిప్పళ్ళు, పెన్నేరు, వీనితో నొకయర్ధమండ లము సేవించినయెడల క్షయరోగము నిశ్చయముగా నశించును. ఆయారోగములకు తగిన అనుపానములతో సేవించినయెడల సమస్తవ్యాధులను హరించును. శరీర కాంతిని, సంతానమును కలిగించును. సూతికావ్యాధులను నశింపజేయును. బాలురకు మిక్కిలి హితకరము, వీర్యవృద్ధిని ఆయురభివృద్ధిని చేయును. స్త్రీలకు కలుగు నాగోదరము నందును ఉపవిష్టకోదరమునందును వెన్నతోడను, గర్భిణీస్త్రీలకు కలుగు సమస్త వ్యాధులయందును కలుబందరసముతోడను, పుచ్చుకొనుట ప్రశస్తముగ నుండును.

## ప్రవాలరసాయనము

శ్లో॥ చతుష్పలం ప్రవాలస్యభస్మ స్యాన్మృతపారదమ్ । తత్సమం భసితం తామ్రం ప్రవాలాదర్ధభాగకమ్ (1) త్రింశద్విభాగకం వజ్రం షోడ శాంశం చ నీలకమ్ । వ్యోమసత్త్వం సమం స్వర్ణైస్తాలకం సర్వతః పరమ్ (2) మర్దయేల్లుఙ్గతోయేన యావద్దినచతుష్టయమ్ । సర్వార్ధ శుద్ధసూతేన తస్మా ద్ద్విగుణ గన్ధకైః (3) విహితాం కజ్జలీం సమ్యక్ద్రావయిత్వా తథాపరమ్ । ప్రవాలాదీని భస్మాని వినిక్షిప్య విమిశ్ర్య చ (4) నిర్వాప్య గోఘృతైస్స మ్యగ్ద్వాదశాబ్దపురాతనైః । శరావసంపుటే రుద్ధ్వా ఘృతాంశం స్వేదయేచ్ఛనైః (5) విచూర్ణ్య భావయేల్లుఙ్గ రసైర్వారాణి సప్త చ । వ్యోషాజ్యసహితం హన్తి సర్వరోగం దినైస్త్రిభిః (6) క్షయం తు మణ్డలార్ధేన గ్రహణీం పాణ్డు కామలే । కుమ్భకామలకా రోగముదావర్తం మహోదరమ్ (7) ప్రమేహం మేదసోవృద్ధిం వాతవ్యాధిం కఫామయమ్ । గుదరోగం చ మన్దాగ్నిం మూత్ర రోగ మశేషకమ్ (8) స్మరమన్దిరరోగాంశ్చ వస్త్యరోగాంస్త్వగామయాన్ ।

వ్యోహార్ద్రిచిత్రతోయైశ్చ సంనిపాతానశేషకాన్ (9) భూయోభూయో విషూచ్యార్తిర్దేహినో యస్య జాయతే । రసోఽయం తస్య దాతవ్యం మణ్డలానాం త్రయం ఖలు । ఆమరోగే చ దాతవ్యో భిషగ్భిర్వత్సరావధి (10)

అ॥ పగడభస్మ 4 పలములు, రసభస్మ 4 ప, తామ్రభస్మ 2 ప, వజ్రభస్మ 30ప, నీలభస్మ 16 ప, అభ్రకసత్వము 16 ప, శు॥ తాళకము 112 ప, వీనిని మాదీ ఫలరసముతో నాలుగుదినములు మర్దింపవలయును. శు॥ పాదరసము 112 ప, శు॥ గంధకము 224 ప, వీనిని బాగుగ కజ్జలిచేసి కరగించి యందు పగడభస్మ మొదలగు వానిని కలిపి పండ్రెండు సంవత్సరములు నిలవయున్న ఆవునేతిని పోసి చల్లార్చి మూకుళ్ళయందుంచి నెయ్యి యిగురువరకు మెల్లగ నుడికించి పిదప చూర్ణించి మాదీఫలరసముతో నేడు సారులు భావనచేయవలయును. దీనిని త్రికటుకములు, నెయ్యి, వీనితో సేవించిన యెడల సమస్తవ్యాధులను మూడురోజులకు హరింపచేయును. క్షయను అర్ధమండలమునకు హరింపజేయును. గ్రహణి, పాండువు, కామిర్లు, కుంభకామల, ఉదావర్తము, మహోదరము, ప్రమేహము, మేదోవృద్ధి, వాతవ్యాధులు, కఫవ్యాధులు, గుదస్థానమందలి రోగము, అగ్నిమాంద్యము, మూత్రరోగము, యోనిరోగములు, వంధ్యారోగములు, చర్మవ్యాధులు, వీనిని హరింపజేయును. త్రికటుకములు, అల్లము, చిత్రమూలము, వీనియొక్క రసములతో సమస్త సంనిపాతములను హరించును. తఱచు విషూచివ్యాధి కలుగువానికి దీనిని మూడుమండలము లియ్యవలయును. ఆమరోగమందొక సంవత్సర మియ్యవలయును.

## తా ర్క్ష్య ర సా య న ము

శ్లో॥ తార్క్ష్యజం భస్మ శాణైకం వజ్రభస్మ తదర్ధకమ్ । భస్మ స్వర్ణార్కకాన్తానాం నిష్కద్వయమితం పృథక్ (1) లోహమేవం తథా సర్వమేకత్ర పరిమర్దయేత్ । పుటేద్వింశతివారాణి పుటైః కుక్కుటసంజ్ఞకైః (2) అమృతామ్బుసమాయుక్తైశ్శిలాగన్ధకతాలకైః । సప్తవారం ద్రవైస్సార్ధం దశభిః పుటయేత్పునః (3) ఏవం సిద్ధప్రచారోహి తార్క్ష్యం నామ రసాయనమ్ । చిత్రార్ద్రియో రసేనైవ రాజికానాం చ సేవితమ్ (4) త్రిదోషజాన్హరేద్రోగాన్కఫవాతోద్భవానపి । అసాధ్యాన్సర్వవైద్యానాం భేషజానాం చ కోటిభిః । కరోతి క్షుధమత్యర్థం జితానలవతాం నృణామ్ (5)

అ॥ గరుడపచ్చరాళ్ళభస్మ 1 శాణము, వజ్రభస్మ ½ శా, సువర్ణభస్మ 2 నిష్కములు, తామ్రభస్మ 2 ని, కాంతిభస్మ 2 ని, లోహభస్మ 2 ని. వీనినన్నిటిని నూరి

ఇరువదిశుక్కుటపుటములు వేయవలయును. పిదప శు॥ మణిశిల, శు॥ గంధకము, శు॥ తాళకము, వీనిని చేర్చి తిప్పతీగరసముతో ఏడురోజులు నూరి పదిపుటములు వేయవలయును. ఇట్లు సిద్ధమైనది తార్క్ష్యరసాయనమని చెప్పబడును. దీనిని చిత్రమూలము, అల్లము, ఆవాలు, వీనియొక్క రసములతో సేవించినయెడల త్రిదోషములవలన కలిగిన వ్యాధులును, కఫవాతములచే కలిగిన వ్యాధులును, సమస్త వైద్యులకును కోట్లసంఖ్య గల మందులచే నశింపని వ్యాధులును, నశించును. ఇది అగ్నిమాంద్యముకలవారలకు అధికమగు ఆకలిని కలిగించును.

## పుష్యరాగరసాయనము

శ్లో॥ పుష్యరాగోద్భవం భస్మ ఫలార్థప్రమితం శుభమ్ । తదర్ధం పీత కాచం చ తదర్ధం తామ్రభస్మకమ్ (1) తామ్రస్యార్ధం చ రజతం జాతరూపం తదర్ధకమ్ । వజ్రభస్మ తదర్ధం చ సర్వైస్తుల్యం మృతాభ్రకమ్ (2) తత్సమం సూర్యకాన్తం చ మారితం బలినా సహ తుల్యేన బలినా సార్ధం దశవారం పుటేత్తలు (3) ఏతత్సిద్ధౌషధం నామ్నా పుష్యరాగరసాయనమ్ । క్షయాది సర్వరోగఘ్నం కుష్ఠవ్యాధిహరం పరమ్ (4) గుదశూలార్తిశమనం సుపూతం వృష్యముత్తమమ్ । క్షిప్రగుల్మహరం ప్రోక్తం రక్తగుల్మం హరేత్ స్త్రియః (5) దీపనం పరమం ప్రోక్తం కామలాపాణ్డునాశనమ్ । బహునాత్రకిముక్తేన సర్వరోగహరం పరమ్ (6)

అ॥ పుష్యరాగభస్మ ½ ప, పచ్చలభస్మ ¼ ప, తామ్రభస్మ ⅛ ప, రజతభస్మ $\frac{1}{16}$ ప, సువర్ణభస్మ $\frac{1}{32}$ ప, వజ్రభస్మ, $\frac{1}{64}$ ప, వీనియన్నిటితో సమానమగు అభ్రకభస్మ, అభ్రకభస్మతో సమానముగు గంధకసంయోగముతో భస్మచేయబడిన సూర్యకాంతపురాళ్ళభస్మ, వీనిని అన్నిటికిని సమానమగు శు॥ గంధకముతో పదిపుటములు వేయవలయును. ఇట్లు తయారైన మందు పుష్యరాగరసాయనమని చెప్పబడును. ఇది క్షయ మొదలగు సమస్త వ్యాధులను, కుష్ఠవ్యాధిని, గుదప్రదేశమందలి శూలను, హరించును. పవిత్రమైనది. వీర్యవృద్ధిని చేయును. గుల్మమును వెంటనే హరించును. స్త్రీలకు కలుగు రక్తగుల్మమును హరించును. జాఠరదీప్తిని కలిగించును కామిర్లను. పాండువును, హరించును. విశేషించి చెప్పనవసరములేదు. సమస్త వ్యాధులను హరించును.

## వ జ్ర ర సా య న ము

శ్లో॥ ఏకకర్షం మృతం వజ్రం తావద్భూనాగసత్వకమ్ । తస్మాచ్చ ద్విగుణం స్వర్ణం స్వర్ణతుల్యాభ్రసత్వకమ్ (1) తావన్మానం చ కాన్తాయసస్య త్వం వారితరీకృతమ్ । రసం చాష్టాంశభాగం తు సర్వేషాం పరికీర్తితమ్ (2) బర్హిపిఞ్ఛం సమం సర్వైర్మర్దయేచ్చణకామ్లకైః । విధాయ గోలకం తత్తు ఛాయాశుష్కం సమాచరేత్ (3) తతో భూనాగధౌతంహి తుల్యగన్ధకసంయుతమ్ । పుటేత్తు శతవారాణి శతవారాణి తాప్యకైః (4) తతో పిష్టం చదుగ్ధైశ్చ వారాణాం వింశతిం తతః । గుఞ్జాటఙ్కణసిద్ధం చ భూనాగానాం రజో మృతమ్ (5) వర్తయిత్వా కృతం గోలం కల్కేనా నేనలేపయేత్ । అర్ధాఙ్గుల దలేనాపి పరిశోష్య ఖరాతపే (6) నిక్షిప్య వాలుకాయన్త్రే ప్రపచేద్దినపఞ్చకమ్ । తతస్త్రికోణగణ్డీర దుగ్ధైర్గన్ధకసంయుతైః (7) మర్దయిత్వా కృతం గోలం పుటే ద్వారాణి వింశతిం । పటచూర్ణం తతః కృత్వాక్షిపేద్దన్తకరణ్డకే (8) గుఞ్జామితం భజే దేనం రమ్యం వజ్ర రసాయనమ్ । జ్ఞాత్వాజ్ఞాతేషు సర్వేషు గదేషు వివిధేషు చ (9) తత్తద్రోగాను పానేన దాతవ్యం భిషజా ఖలు నసోఽస్తి రోగో లోకేఽస్మిన్ యోఽనేనచ నశామ్యతి (10) రసాయన ప్రయోగేణ సేవితం మణ్డలత్రయమ్ । దేహసిద్ధిం కరోత్యేవ విశ్వవిస్మయ కారిణీమ్ । బిల్వమేకం వినాచాన్యత్పథ్యమత్రప్రకీర్తితమ్ (11)

అ॥ వజ్రభస్మ 1 కర్షము, వానపాములయొక్క సత్వము 1 క, సువర్ణభస్మ 2 క, అభ్రకసత్వము 2 క, అయస్కాంతసత్వము 2 క, శు॥ రసము 8 క, నెమలిపింఛము 16 క, వీనిని సెనగపులుసుతో మర్దించి ఉండగచేసి నీడను ఎండించి వానపాముల యొక్క క్షారోదకముతో కడిగి 32 కర్షముల శు॥ గంధకమును కలిపి నూరుసారులు పుటము వేయవలయును. పిదప మాక్షికమును కలిపి నూరుసారులు పుటము వేయవలయును. పిదప పాలతో నూరి ఇరువదిసారులు పుటము వేయవలయును. పిదప ఉండగాచేసి గురివిందగింజలు, వెలిగారము, వీనితో తయారైన వానపాముల యొక్క భస్మ (బూడిద) ను నూరి యీముద్దచే నా ఉండను అరంగుళము దళసరిగ పూసి తీవ్రమైన ఎండయందు ఎండించి వాలుకాయంత్రమందుంచి యైదురోజులు బాగుగ వండవలయును. పిదప శు॥ గంధకమును కలిపి మూడుపలకల జెముడుపాలతో నూరి యుండగజేసి ఇరువదిసారులు పుటము వేయవలయును. పిదప వస్త్రగాలితముచేసి దంతపుభరణి (పాత్ర) యందుంచవలయును. ఈ వజ్రరసాయనమును శ్రేష్ఠమైన

దానినిగ తెలిసికొని గురివిందగింజపరిమితిగ సేవింపవలయును. వైద్యులచే తెలిసిన సమస్తమైన వ్యాధులయందును ఆయా రోగములకు తగిన అనుపానములతో నియ్య తగినది. లోకమునందు దీనిచే శాంతింపని వ్యాధి లేదు. మూడు మండలముల కాలము రసాయనవిధిచే సేవించినయెడల ప్రపంచకమందు ఆశ్చర్యకరమైన దేహసిద్ధిని చేయును. దీనిని సేవించునప్పుడు మారేడునుగాక నితరములను పథ్యములనుగ సేవింపవచ్చును.

## నీలరసాయనము

శ్లో॥ నీలరత్నం పలం స్యాచ్చ పలమాత్రం మనోహరమ్ । స్వర్ణం రౌప్యం చ కాన్తం చ తాప్యం చ నృపకీర్తితమ్ (1) సమాంశం సర్వ మేత త్స్యాత్సర్వ తుల్యం చ శుల్బకమ్ । సర్వమేతన్మృతం గ్రాహ్యం సమగన్ధక సంయుతమ్ (2) మర్దయేత్కన్యకానీతై లైర్యావత్స్యాచ్చ దినాష్టకమ్ । ఊర్ధ్వాధో గన్ధకం దత్వా పుటేద్వారాణి వింశతిమ్ (3) శ్వేతముణ్డీరసైః పశ్చాద్భావయేత్సప్తవారకమ్ । ఇతిసిద్ధంప్రతాపాఢ్యం ఖ్యాతం నీలరసాయనమ్ (4) నిహన్తి సకలాన్ రోగాన్గుఞ్జామాత్రం నిషేవితమ్ । జ్వరం పాణ్డుం క్షయం శోఫం శూలం మూలం చ గుల్మకమ్ (5) ఉదుమ్బరం కుష్ఠరోగం శ్వాసం పఞ్చవిధం తథా । తత్తద్భైషజ్యయోగేన తత్తద్రోగనివారణమ్(6)

అ॥ నీలములభస్మ 1 పలము, సువర్ణభస్మ 1 ప, రజతభస్మ 1 ప, కాంతభస్మ 1 ప, మాక్షికభస్మ 1 ప, తామ్రభస్మ 5 ప, శు॥ గంధకము 10 ప, వీనిని మాల్కంగునీతైలముతో నెనిమిదిరోజులు మర్దించి దీనికి క్రిందను మీదను గంధకముయుంచి ఇరువది పుటములు వేయవలయును. పిదప తెల్లబోడసరరసముతో నేడుసారులు భావన చేయవలయును. ఇట్లు సిద్ధమైన యిది నీలరసాయనమని చెప్పబడును. దీని నొక గురివిందగింజ పరిమితిగ సేవించినయెడల సమస్త వ్యాధులు హరించును. మఱియు జ్వరము, పాండువు, క్షయ, నంజు, శూల, మూలవ్యాధి, గుల్మము, ఉదుంబరకుష్ఠము, కుష్ఠము, అయిదు విధములైన శ్వాసలు, ఇవి నశించును. ఆయా రోగములకు తగిన యౌషధములతో సేవించిన యెడల ఆయా రోగములు నశించును.

## వైడూర్యరసాయనము

శ్లో॥ కాన్తిప్రకృష్టం వైడూర్యం సగన్ధకమృతం శుభమ్ । తథాహి చాష్టభాగం తు తదర్ధం మృతహేమ చ (1) తయోస్సమం తు తీక్ష్ణం చ

వ్యోమాయోరౌప్యకాని చ । మృతం చ విమలం సర్వైస్సమం సర్వం విమర్దయేత్ (2) హిమలోచకసారేణ గోలీకృత్య విశోషయేత్ । వాలుకాయన్త్రిమధ్యస్థం పక్షార్ధం శనకైః పచేత్ (3) స్వాఙ్గశీతం సమాహృత్య కుమారీమూలసారతః । మర్దయిత్వా విశోష్యాథ పీలుమూలజలైస్తథా (4) తథైవచిత్రమూలార్ద్రికన్దాదీనాంచసారతః । చిరిబిల్వత్వచస్తోయైర్విశోష్య చ విచూర్ణయేత్ (5) మృతసఞ్జీవనం హేతద్వైడూర్యక రసాయనమ్ । ఆర్ద్రికద్రవసంయుక్తం గుఞ్జామాత్రం రసాయనమ్ (6) దాతవ్యంచిత్రతోయైర్వా సంనిపాతే విసంజ్ఞికే । దంతబాధేతుసఞ్జాతే ఏతద్రసనిషేవణాత్ (7) పాదయోరూర్ధ్వయన్వాతం తతశ్చేష్టా మవాప్నుయాత్ । ఏతచ్చేష్టాసు సలిలం మూర్ధ్నిం శీతం వినిక్షిపేత్ (8) శతకుమ్భమితం స్వాదుతీవ్రాక్షోజాయతే తతః । యత్కిఞ్చిద్యాచతె చాస్మైత త్తద్దేయమశఙ్కితః (9) ఆయుషో విద్యమానత్వే సుఖం జీవతి మానవః । త్రిదోషజాతరోగేషు దాతవ్యం తణ్డులామ్భసా (10) పలార్ధసితయాయుక్తం సోఽన్యథా హన్తిరోగిణమ్ । ఏకదోషోద్భవే రోగే సంసర్గజనితే తథా । తద్దాతవ్యం హి భిషజా వైడూర్యకరసాయనమ్(11)

అ॥ గంధకముతో భస్మచేయబడిన వైడూర్యభస్మ 8 భా, సువర్ణభస్మ 4 భా, తీక్ష్ణలోహభస్మ 12 భా, అభ్రకభస్మ 12భా, ఇనుపభస్మ 12భా, వెండిభస్మ 12భా, విమలభస్మ 60 భా, వీనిని వట్టివేళ్లు, అరటిదుంప, వీనియొక్క రసముతో మర్దించి యుండలగజేసి ఎండించి వాలుకాయంత్రమందు ఏడున్నరరోజులు మెల్లగవండి స్వాంగశీతలమున తీసి కలబంద, కొండగోగు, చిత్రమూలము, అల్లము, కంద మొదలగునవి, కానుగపట్ట, వీనియొక్క రసములతో నొక్కొక్కదానితో మర్దించుచు నెండించుచు తుదకు చూర్ణము చేయవలయును. ఇది సంజీవినితో తుల్యముగనుండును. వైడూర్యరసాయనమని చెప్పబడును. స్మారకములేని సంనిపాతరోగికి, దీని నొకగురివిందగింజ పరిమితిగ అల్లపురసముతోగాని చిత్రమూలరసముతోగాని యియ్యవలయును. దీనిని సేవించుటచే దంతములయందు బాధకలిగి పాదములనుండి వాతము ఊర్ధ్వగతినొంది ఆయాచేష్టలను కలిగించినయెడల చల్లగను తియ్యగనుండు జలమును అనేకకుంభముల (పాత్రల) పరిమితిగ శిరస్సునందు పోయవలయును. పిదప తీవ్రమైన నేత్రములు కలవాడై ఆయాపదార్థములను కోరినయెడల వానిని నిస్సందేహముగ నియ్యవలయును, ఇట్లుచేసినయెడల ఆయువున్నచో సుఖముగ జీవించును. మూడుదోషముల

వలనను జనించిన వ్యాధులయందు దీనిని అర్ధఫలపరిమితిగల పంచదారతో కలిపి బియ్యపుకడుగుతో నియ్యవలయును, అట్లియ్యనియెడల రోగిని చంపును. ఏకదోషమువలన జనించినట్టియు ద్విదోషములవలన జనించినట్టియు వ్యాధులయందీ వైడూర్యరసాయనము నియ్యవలయును.

## గో మే ద క ర సా య న ము

శ్లో॥ గోమేదం గన్ధయోగేన లికుచద్రావయోగినా । పుటిత్వా దశవారేణ జాతం భస్మపలాన్వితమ్ (1) సువర్ణం రజతం కాన్తం సర్వమేతచ్చ మారితమ్ । గ్రాహయేత్ పాదపాదేన గ్రాసితం చూలికామ్బునా (2) పుటయేత్త్వా ప్యగన్ధర్వతైలేన దశవారకమ్ । నిరుద్ధం జాయతే భస్మవ్యక్తాస్తేషాం గుణాదయః (3) తదర్ధసూతగన్ధాభ్యాం కృతకజ్జలికా ద్రవే । పూర్వభస్మచయంక్షిప్త్వా విమిశ్రచ సమాహరేత్ (4) విచూర్ణ్య ముణ్డికా ద్రావైర్భావయేత్సప్తవారకమ్ । పటచూర్ణం విధాయాథ క్షిపేద్దాశనికేళుభే (5) ఇదం హి పరమం శ్రేష్ఠం గోమేదికరసాయనమ్ । యోజ్యం చ సర్వరోగేషు తత్తద్రోగానుపానతః (6) కరోతి దీపనం తీవ్రం సర్వవ్యాధిభయంకరమ్ । దదాతి పరమాం పుష్టిం బలం వీర్యబలావహమ్ । పరమం వృష్యమాయుష్యం నేత్ర్యం ముఖగదా పహమ్ (7)

అ॥ శు॥ గంధకము చేర్చబడి నిమ్మకాయరసముతో నూరబడి పదిసారులు పుటమువేయబడిన గోమేదకభస్మ 1 పలము, సువర్ణభస్మ 1/16 ప, వెండిభస్మ 1/16ప, కాంతభస్మ 1/16ప, వీనిని గ్రహించి చూలికాక్షారోదకములతో మర్దించి మాక్షికము, ఆముదము, వీనిలో పది పుటములు వేయవలయును. పరిశుద్ధమగు భస్మయగును. శు॥ రసము, 19/64 ప, శు॥ గంధకము 19/64 ప, వీనిని కజ్జలిచేసి కరగించి యందు పూర్వభస్మసముదాయమునుంచి కలిపి తీసి చూర్ణించి బోడసరరసముతో నేడుసారులు భావన చేసి వస్త్రగాలితముచేసి దంతపాత్రయందుంచ వలయును. ఈ గోమేదక రసాయనము మిక్కిలి శ్రేష్ఠమైనది. దీనిని ఆయావ్యాధులకు తగిన యనుపానములతో సమస్త వ్యాధులయందు నీయవలయును. ఇది తీవ్రమైన జాఠరదీప్తిని చేయును. సమస్త వ్యాధులను హరింపజేయును. శరీరపుష్టి, బలము, వీర్యబలము, వీర్యవృద్ధి, ఆయురభివృద్ధి, వీనిని చేయును. నేత్రవ్యాధులు, ముఖవ్యాధులు వీనిని నశింపజేయును.

శ్లో॥ ధృతాని గత్రాని సమర్చితాని దృష్టాని భుక్తాని పరిషుతాని । నిఘ్నన్తి రత్నాన్యఖిలం దురిష్టంకుర్వన్త్యభీష్టం సతతం సదేష్టమ్ (1) హార

స్త్యలక్ష్మీం సతతం సమస్తాన్ దుష్కర్మభిర్నిర్మితసర్వరోగాన్ । ఆయుర్వివృద్ధిం ప్రదదాతి సర్వం రత్నం ప్రశస్తాని రసాయనాని (2)

అ॥ రత్నములను, ధరించినను, ఇచ్చినను, పూజించినను, చూచినను, సేవించినను, స్తోత్రముచేసినను, సమస్తమైన పాపములు నశించును. ఎల్లప్పుడు నభీష్టసిద్ధి కలుగును. అలక్ష్మి నశించును. దుష్టకార్యములచే కలిగిన వ్యాధులను నశించును. ఆయుర్వివృద్ధి కలుగును. ముసలితనమును, వ్యాధులను, నశించును.

## భే ది జ్వ రాం కు శ ర స ము

శ్లో॥ విషం సూతం హిఙ్గులం చ ప్రత్యేకం నిష్కసంమితమ్ । ద్వినిష్కం గన్ధకం చైవ టఙ్కణం చ ద్వినిష్కకమ్ (1) మరిచం పఞ్చనిష్కం స్యాత్ షణ్ణిష్కం దన్తిబీజకమ్ । సింహీఫలరసైర్మర్ద్యం ద్వియామం శ్లక్ష్ణతాం నయేత్ (2) మాషమాత్రా వటీః కృత్వా ఛాయాశుష్కాశ్చ కారయేత్ । ఆర్ద్రికద్రవ యుక్తంచ జ్వరే జీర్ణే ప్రయోజయేత్ । సర్వజ్వరహరశ్చైవ నామ్నా భేదిజ్వరాఙ్కుశః (3)

అ॥ శు॥ నాభి 1 నిష్కము, శు॥ రసము 1 ని, శు॥ ఇంగిలీకము 1 ని, శు॥ గంధకము 2 ని, శు॥ టంకణము 2 ని, మిరియాలు 5 ని, శు॥ నేపాళము 6 ని, వీనిని నేలములగ పండ్లరసముతో రెండుజాములు మెత్తగనూరి మినపగింజల పరిమితిగ మాత్రలను చేసి నీడను ఎండించవలయును. అల్లపురసముతో నిచ్చినయెడల జీర్ణజ్వరమును, సమస్తజ్వరములను, హరించును. ఇది భేదిజ్వరాంకుశమని చెప్పబడును.

## కాం చ న కాం తి ర స ము

శ్లో॥ కాఞ్చనం రససిన్దూరం మౌక్తికం లోహమభ్రకమ్ । విద్రుమం కాన్తతారే చ కస్తూరీం చ మనశ్శిలామ్ (1) ప్రత్యేకమేకభాగం స్యాత్సర్వం సంమర్ద్య యత్నతః । వారిణా వటకాః కార్యా ద్విగుఞ్జాఫలమానతః (2) అనుపానం ప్రయోక్తవ్యం తథా దోషానుసారతః । నానారోగాన్ ప్రశమయేత్సర్వోపద్రవసంయుతాన్ (3) క్షయం హన్తితథా కాసం శ్లేష్మపిత్తహరస్తథా । ప్రమేహం వివిధం చైవ సంనిపాతం జ్వరం తథా (4) కఫజాన్వాత

జాన్రోగాన్నాశయేత్సద్య ఏవహి । బలవృద్ధిం వీర్యవృద్ధిం లిఙ్గదార్ఢ్యం కరోతి చ (5) కాఞ్చనస్య సమాంకాన్తిం మదనస్య సమం వపుః । శ్రీకరః పుష్టి జనకంః నానా రోగనిషూదనః । గ్రహానానన్దనాథోక్తః । రసః కాఞ్చన కాన్తికః (6)

అ॥ సువర్ణభస్మ, రససిందూరము, ముత్యభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, పగడ భస్మ, కాంతభస్మ, రజతభస్మ, కస్తూరి, శు॥ మణిశిల, వీని నొక్కొక్క భాగముచొప్పున గ్రహించి ఉదకముతోనూరి రెండు గురివిందగింజల పరిమితిగ మాత్రలను చేయవల యును. వీనిని దోషానుసారమగు అనుపానములతో నిచ్చినయెడల ఉపద్రవములతో కూడిన సమస్తవ్యాధులు, క్షయ, దగ్గు, శ్లేష్మము, పిత్తము, సమస్తప్రమేహములు, సంనిపాతములు, జ్వరములు, కఫవ్యాధులు, వాతవ్యాధులు, ఇవి వెంటనే హరించును. ఇది బలవృద్ధి, వీర్యవృద్ధి, లింగదార్ఢ్యము, బంగారుతో సమానమైనకాంతి, మన్మథు నితో సమానమైన శరీరము, లక్ష్మి, పుష్టి, వీనిని చేయును. సమస్తవ్యాధులను గ్రహ ములను, నశింపజేయును. ఆనందనాథునిచే చెప్పబడినది. కాంచనకాంతిరసమని చెప్పబడును.

## వి స్ఫో ట నా శ క ర స ము

శ్లో॥ మృతస్వర్ణాభ్రకే శుణ్ఠీం భస్మసూతం త్రిభిస్సమమ్ । అమ్లైర్మ ర్ద్యం తు తద్గోలం పిష్ట్వా తుల్యకగన్ధకైః (1) కటుతైలయుతంపాచ్యం లోహే చ మృదునాగ్నినా । ద్రవేజీర్ణే విమర్ద్యాథ వహ్నిమూల కటుత్రికైః (2) త్వగ్విడఙ్గవిషాన్ తుల్యాన్ త్రిగుణాం త్రిఫలాం విషాత్ । అజా మూత్రే దినం పిష్ట్వా గుఞ్జైకాం భక్షయేద్వటీమ్ (3) నిష్కైకం వాకుచీ తైలం పిబేద్విస్ఫోటకుష్ఠజిత్ । మసూరికాదికహరో రసో విస్ఫోటనాశకః(4)

అ॥ సువర్ణభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా. శుంఠి 1భా, రసభస్మ 3 భా, వీనిని అమ్లవర్గముతో మర్దించి శు॥ గంధకము 6 భా, కలిపి నూరి ఆవనూనె కలిపి ఇనుప పాత్రయందు మందాగ్నిచే తడిపోవువరకు వండి చిత్రమూలము, త్రికటుకములు, వీనితో మర్దించి దాసెనచెక్క 1 భా, వాయువిడంగములు 1 భా, శు॥ నాభి 1 భా, త్రిఫలములు 3 భా, వీనిని కలిపి మేకమూత్రముతో నొకదినము నూరి గురివిందగింజ

పరిమితిగల మాత్రలను చేయవలయును. ఈ మాత్రను సేవించి నిష్కపరిమితిగల బావంచితైలమును త్రాగినయెడల స్ఫోటకము, కుష్ఠము, ఇవి నశించును. మసూచికము మొదలగు వ్యాధులను నశింపజేయును. విస్ఫోటనాశకరసమని చెప్పబడును.

## కందర్పరసము

శ్లో॥ రసభస్మ సువర్ణంచ కాన్తం వైక్రాన్తభస్మకమ్ । మధురత్రయ సంయుక్తం మాషమాత్రం దినేదినే (1) లీఢ్వాఽనుపానం పాతవ్యం మస్తత ప్తం గవాం పయః । త్రిస్సప్తదివసైః క్షీణో భవేదక్షీణధాతుకః (2) ఊర్ధ్వ లిఙ్గస్సదా తిష్ఠేద్ద్రావయేద్వనితాశతమ్ । జ్వరాది రోగనిర్ముక్తో దృఢదీపన పావకః । కామదేవ ఇవ శ్రీమాన్సంసారసుఖ మశ్నుతే (3)

అ॥ రసభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, వైక్రాన్తభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి నెయ్యి, తేనె, పంచదార, వీనితో మాషపరిమితిగ ప్రతిదినము సేవించుచు కొద్దిగ కాచబడిన ఆవుపాలను త్రాగవలయును, ఇట్లు మూడువారములు చేసినయెడల కృశించినవాడు వృద్ధిపొందినధాతువులు కలవాడగును. ఎల్లప్పుడును ఉత్థాపనమైన లింగముకలవాడగును. నూర్గురు స్త్రీలకు సంతోషముకలిగించును. జ్వరము మొదలగు రోగములు లేనివాడై అధికమగు నగ్నిదీప్తి కలవాడగును. లక్ష్మీవంతుడై కామదేవుడు వలె సంసారసుఖమును పొందును.

## క్షారతామ్రరసము

శ్లో॥ పలమితమృతశుల్బం తన్మితం గన్ధచూర్ణం వసుమితపరిమాణం తిన్త్రిణీక్షారచూర్ణమ్ । ప్రయమిదమభిదిష్టం క్షారతామ్రాఖ్య మేతద్ధరతి సకల శూలం పీతముష్ణోదకేన (1)

అ॥ తామ్రభస్మ 1 పలము. శు॥ గంధకము 1 ప, చింతక్షారము 8 ప, వీని నేక ముగ చేర్చినయెడల క్షారతామ్రమని చెప్పబడును. దీని నుష్ణోదకముతో పుచ్చుకొనిన యెడల సమస్త శూలలు హరించును.

## వీరవిక్రమరసము

శ్లో॥ పారదస్య తు భాగాష్టౌ ద్విభాగం మృదుకాఞ్చనమ్ । శిలాతా లక గన్ధానాం చత్వారః షట్చ ద్వాదశ (1) సర్వమేకత్ర సంచూర్ణ్య దాడిమీ

చిత్రకద్రవైః । త్రిదినం మర్దయేత్తత్తు కాచకూప్యాం వినిక్షిపేత్ (2) వాలుకాయన్త్రమధ్యస్థం పాచయేద్దివసత్రయమ్ । స్వాఙ్గశీతలమాదాయ క్షిపేత్సర్వం కరణ్డకే (3) ఆర్ద్రకస్య ద్రవే గుఞ్జాసంనిపాతం మహాజ్వరమ్ । తత్క్షణేన హరేచ్చైవ సర్వరోగగణానపి । వీరవిక్రమనామాఽయం క్షయకాసనికృన్తకః (4)

అ॥ శు॥ పాదరసము 8 భా, కుందనపుబంగారము 2 భా, శు॥ మణిశిల 4 భా, శు॥ తాళకము 6 భా, శు॥ గంధకము 12 భా, వీనినన్నిటిని కలిపి నూరి దానిమ్మ, చిత్రమూలము, వీనియొక్కరసములతో మూడుదినములు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడురోజులు వండి సాంగశీతలమున తీసి డబ్బీలో వేయవలెను. దీనినొక గురివిందగింజపరిమితిగ అల్లపురసముతో సేవించినయెడల గొప్పదియగు సంనిపాతజ్వరమును, సమస్తవ్యాధులను, వెంటనే హరించును. ఇది వీరవిక్రమ రసమని చెప్పబడును. క్షయను, దగ్గును, నశింపజేయును.

## శూలకుఠారరసము

శ్లో॥ టఙ్కణం పారదం గన్ధం త్రిఫలాం వ్యోషతాలకే । విషం తామ్రం చ నేపాలం భృఙ్గకేన విమర్దయేత్ (1) ద్విగుఞ్జాంవటికాం ఖాదేన్మరిచేనార్ద్రకేనవా । కుఠారయతి శూలాని విష్ణుచక్రమివాసురాన్ (2)

అ॥ శు॥ వెలిగారము, శు॥ రసము, శు॥ గంధకము, త్రిఫలములు, త్రికటుకములు, శు॥ తాళకము, శు॥ నాభి, తామ్రభస్మ, శు॥ నేపాళములు, వీనిని సమభాగములుగ గ్రహించి గుంటగలగరరసముతో మర్దించి రెండుగురివిందగింజల పరిమితిగ మాత్రలను చేయవలయును. ఒకమాత్రను మిరియాలరసముతోగాని, అల్లపురసముతోగాని సేవింపవలయును. విష్ణుచక్రము రాక్షసులనువలె నిది శూలలను నశింపజేయును.

## సహస్రకిరణార్కరసము

శ్లో॥ త్రిక్షారం పఞ్చలవణం టఙ్కణం చైకభాగకమ్ । నాగవిద్రుమకాన్తాభ్రరజతానాం చ భస్మకమ్ (1) పాషాణపఞ్చకం వత్సనాభతాప్యమనశ్శిలాః । ద్విభాగమష్టభాగాఖ్యరసగన్ధక సంయుతమ్ (2) చతుర్భాగం లోహతామ్రతాలవైక్రాన్తభస్మకమ్ । ఏతత్సర్వం రసైరేతైః శిగ్రుచిత్రకపీలుజైః

(3) త్రిఫలాకుణ్డలీశ్యామావృశ్చీరక గుడూచిజైః । నైదిగ్ధికాచక్రపర్ణీ వారుణైర్వజ్రవల్లిజైః (4) సంమర్ద్యఖల్వే ప్రత్యేకం యామంయామం ప్రయత్నతః । తత్కాచకూప్యాం నిక్షిప్య మృద్ఘటే సికతాన్తరే (5) యామద్వయం పచేదగ్నిక్రమవి ద్భిషగుత్తమః । స్వాఙ్గశీతం సముద్ధృత్య మాత్స్యమాయూరకౌక్కుటైః (6) ఔష్ట్రివారాహశశక కమఠైణకగౌధికైః । మార్కటైర్భాల్లుకైరాజైః స్థలరామఠపిత్తకైః (7) ఏతైర్గాఢం చాప్రమత్తః భావయేత్పకశటీకృతః । సహస్రకిరణాఖ్యోఽయం రసశ్చారోగ్యవర్ధకః (8) సంనిపాతం మహాఘోరం సర్వాన్దోషజ్వరానపి । అశీతివాతరోగాంశ్చ వింశతి శ్లేష్మ రోగకాన్ । సూతికారోగకాన్హన్తి మహాతాపః ప్రజాయతే (9)

అ॥ మూడుక్షారములు, పంచలవణములు, శు॥ టంకణము, సీసభస్మ, పగడభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, రజతభస్మ, వీనినొక్కొక్క భాగముగను శు॥ ఐదుపాషాణములు, శు॥ నాభి, హేమమాక్షికభస్మ, శు॥ మణిశిల వీనిని రెండేసిభాగములుగను శు॥ రసము, శు॥ గంధకము, వీనిని ఎనిమిదేసిభాగములగను లోహభస్మ, తామ్రభస్మ, శు॥ తాళకము, వైక్రాంతభస్మ, వీనిని నాలుగేసి భాగములుగను గ్రహించి మునగ, చిత్రమూలము, వరగోగు, త్రిఫలములు, ఉప్పి, నల్లతెగడ, గలిజేరు, తిప్పతీగ, వావుడు, తులసి, ఉలిమిరి, నల్లేరు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక్కజాము మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే రెండుజాములు వండి చల్లారినపిదప తీసి చేప, నెమలి, కోడి, ఒంటె, అడవిపంది, చెవులపిల్లి, తాబేలు, లేడి, ఉడుము, కోతి, ఎలుగుబంటి, మేక, మెట్టతాబేలు, వీనియొక్క పిత్తములతో వతిజాగరూకతగ భావనచేయవలయును. ఇది సహస్రకిరణాక్యరసముని చెప్పబడును. ఆరోగ్యముచు వృద్ధినొందించును. మహాఘోరమైన సంనిపాతము, సమస్తదోషజ్వరములు, ఎనుబదివాతవ్యాధులు, ఇరువదిశ్లేష్మవ్యాధులు, సూతికావ్యాధులు, వీనిని నశింపజేయును. అధికమగు వేడిని కలిగించును.

## శ్వాసకుఠారరసము

శ్లో॥ రసం గన్ధం విషం చైవ టఙ్కణం చ మనశ్శిలామ్ । ఏతాని టఙ్క మాత్రాణి మరిచం చాష్టటఙ్కకమ్ (1) ఏకైకం మరిచం దత్త్వాఖల్వే సూక్ష్మం విమర్దయేత్ ॥ వ్యోషం తు టఙ్కషట్కం చ దత్త్వాపశ్చాద్విచూర్ణ

యేత్ (2) సర్వమేకత్ర సంయోజ్య కాచకూప్యాం వినిక్షిపేత్ । శ్వాసే కాసే చ మన్దాగ్నివాతశ్లేష్మామయేషు చ (3) గుఞ్జామాత్రం ప్రదాతవ్యం పర్ణఖణ్డేన ధీమతా । సంనిపాతే చ మూర్ఛాయామపస్మారే తథా పునః (4) అతిమోహత్వమాపన్నే నస్యం దద్యాద్విచక్షణః । రసః శ్వాస కుఠారోఽయం సర్వశ్వాసగదప్రణుత్ (5)

అ॥ శు॥ రసము 1 టంకము, శు॥ గంధకము 1 టం, శు॥ నాభి 1 టం, శు॥ వెలిగారము 1 టం, శు॥ మణిశిల 1 టం, మిరియాలు 8 టం, ఇట్లు గ్రహించి ఖల్వమందు మిరియాలను ఒక్కొకటి చొప్పున వేయుచు మెత్తగనూరి 6 టంకముల త్రికటుకములను కలిపి మెత్తగనూరి సీసాయందుంచవలయును. దీని నొక గురివిందగింజ పరిమితిగ తమలపాకులతో శ్వాస, కాస, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వీనియందియ్యవలయును. సంనిపాతము, మూర్ఛ, అపస్మారము, వీనియందు స్పృహ తప్పినప్పుడు దీనిని నస్యము చేయవలయును. ఇది శ్వాసకుఠారరసమని చెప్పబడును. సమస్త శ్వాసవ్యాధులను నశింపజేయును.

## మహాశ్వాసకుఠారరసము

సీ॥ పారదంబొక్కటి బలిరెండు విసమైదు రసభస్మ మొక్కటిరాగి రెండు । అభ్రకంబొక్కటి హరిదళంబును రెండు తాళకమణిశిలల్ తాళతామ్ర। భాగముల్ టంకనభస్మంబు మూడును కాంతమాసను లోహభస్మ యొకటి । తుత్థమొక్కటి పరిశుద్ధచరదంబాఖు స్థిరతర హేమమాక్షికము నైదు । జెముడుకాడలు నాకుజెముడాకురసముల చంద్రవక్కలనీట నుంద్ర నీట । వాసరసంబున వావిలిరసముప మస్తుపపామార్గధూర్తపత్ర । రసము ం భువి వేమురసమున వాకుడురసమున కసివింద దుంపరాస్న । రసముల రహిముల్క రసము నిరికిచెక్కనీట హరీతకినీటితోడ । నొక్కొకదానిచే నొక్కొకదివసంబు మర్దించి మాత్రలమర్చియార్చి । వాలుకాయంత్రాన మేలుకప్పెను గంధకము జీర్ణమగునట్లుగాను వండి । సర్వంబునకు సమాంశములు పిప్పలి చూరకుక్కుటాండములపై చెక్కభస్మ । కలిపి పూర్వపురసంబుల పదిరోజులు మర్దించి కుప్పెలమర్చి పూట । పూటకు చిన్నంబుపాటిగా గ్రోలిన శ్వాసలు శ్లేష్మముల్ కాసలార్చు । దగ్గునెగరొప్పు లెల్లను దగ్ధపఱుచు ।

పాండుపుల రాజయక్ష్మల భస్మచేయు । సూతికావాతముల నెల్ల నొలయ
జేయు । ధరను శ్వాసకుఠారాఖ్యదనరుచుండు ॥

అ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 2 భా, శు॥ నాభి 5 భా, రస
భస్మ 1 భా, తామ్రభస్మ 2 భా, అభ్రకభస్మ 1 భా, శు॥ అరిదళము 2 భా, శు॥
పత్రతాళకము 2 భా, శు॥ మణిశిల 2 భా, పొ॥ వెలిగారము 3 భా, కాంత
భస్మ 6 భా, లోహభస్మ 1 భా, శు॥ మైలతుత్థము 1 భా, శు॥ ఇంగిలీకము 6 భా,
హేమమాక్షికభస్మ 5 భా, వీనిని జెముడుకాడలు, ఆకుజెముడాకులు, చంద్రచెక్క,
ఉంద్ర, అడ్డసరము, వావిలి, దుష్టపు, ఉత్తరేణి, ఉమ్మెత్త, నేలవేము, వాకుడు,
కసివింద, దుంపరాష్నము, నేలములగ, ఇరికిచెక్క కరకాయలు, వీనియొక్క రస
ములతో ప్రత్యేకముగ నొక్కొక్కరోజు మర్దించి మాత్రలుచేసి ఆరనిచ్చి కాచ
కుప్పెయందుంచి వాలుకాయంత్రమందు గంధకము జీర్ణమగువరకు వండి యీమందుకు
సమానమగు పిప్పళ్ళచూర్ణమును, కోడిగ్రుడ్ల పెంకులబూడిదెను, కలిపి పూర్వపురసము
లతో పదిరోజులు మర్దించి కుప్పెలు కట్టవలయును. దీనిని పూటకు చిన్నము చొప్పున
పుచ్చుకొనినయెడల శ్వాసలు, శ్లేష్మవ్యాధులు, దగ్గులు, దగ్గు యెగరొప్పు,
పాండువు, రాజయక్ష్మ, సూతికావాతములు, ఇవి నశించును. ఇది శ్వాసకుఠారమన
బడును.

## హే మ గ ర్భ పో ట లీ ర స ము

శ్లో॥ శుద్ధసూతం త్రిభాగం చ తత్సమం శుల్బభస్మ చ । భాగైకం
గన్ధకం దత్వా తదర్థం స్వర్ణమేవ చ (1) కజ్జలీం కారయేత్తత్తుఖల్వకే
సప్తవాసరమ్ । అథ నిర్గుణికాద్రావైర్మర్దయేద్దినసప్తకమ్ (2) అథవా
కనకద్రావైర్గుటికాం కారయేత్తతః । కిఞ్చిద్బలిసమాయుక్తేవస్త్రే గోలం
నిధాయ చ (3) బద్ధ్వా యాత్పోటలీం గాఢామేవం చ త్రిపుటం చరేత్ । దృఢ
మృణ్మయపాత్రే తు గన్ధం దత్వాధరోత్తరమ్ (4) తన్మధ్యే పోటలీం న్యస్య
నిర్వాతభవనాన్తరే । వితస్తిప్రమితే గర్తే తం చ సంస్థాప్య ముద్రయేత్ ।
(5) అఙ్గులీమృత్తికాభిశ్చ జ్వాలయేద్దినాని చ । యామేన సిద్ధతాం యాతి
హేమగర్భాఖ్యపోటలీ (6) కాసే శ్వాసే క్షయే వాతే కఫే గ్రహణికాగదే ।
అనుపానానుసారేణ సర్వరోగేషు యోజయేత్ (7)

అ॥ శు॥ రసము 3 భా, తామ్రభస్మ 3 భా, శు॥ గంధకము 1 భా, సువర్ణభస్మ
½ భా, వీనిని ఖల్వమందుంచి యేడురోజులు కాటుకవలె నూరి పిదప వావిలిరసముతో
గాని ఉమ్మెత్తరసముతో గాని ఏడురోజులు మర్దించి ఉండగచేసి యొక బట్టయందు

కొద్దిగ శు॥ గంధకము చల్లి యందు నీయుండనుంచి మూడుమడతలు వచ్చునట్లుగ మూడుసార్లు గట్టిగమూటగట్టి యొక గట్టిపండయందు క్రిందను మీదను శు॥ గంధకమును పోసి యాగంధకముయొక్క మధ్యయందు నామూటనుంచి గాలితగలని ప్రదేశమందు జానెడు లోతుగల గోతిని త్రవ్వి యాగోతియందు నాపండనుంచి పండపైన అంగుళము ఎత్తున మన్నుకప్పి పైన మంటవేసినయెడల నొకజామునకు తయారగును. ఇది హేమగర్భపోటలీరస మనబడును, దీనిని దగ్గు, వగర్పు, క్షయ, వాతవ్యాధులు, కఫవ్యాధులు, గ్రహణీరోగము, వీనియందియ్యవలయును. ఆయా అనుపానములతో సమస్తవ్యాధులయందు నియ్యవలయును.

## చంద్రహాసరసము

శ్లో॥ ద్విభాగం పారదం దద్యామ్ షడ్భాగం శుద్ధగన్ధకత్ । దరదం తు ద్విభాగం చ చతుర్భాగం తు టఙ్కణమ్ (1) అమృతం తు ద్విభాగం చ కునటీం చ ద్విభాగికామ్ । సురక్షారం చతుర్భాగం వ్యోషం షోడశభాగకమ్ (2) త్రీణిత్రీణి లవఙ్గైలాద్వయం జాతీఫలం ద్విధా । దని బీజం ద్విభాగం చ జమ్బీరేణ విమర్దయేత్ (3) భృఙ్గరాజస్య నిర్గుణ్డ్యా నాగవల్ల్యార్ద్రియో స్తథా । త్రిఫలాయా రసైర్మర్ద్యం చతస్రో ఘటికా స్తథా (4) మాష మాత్రాం వటీం కృత్వా హ్యనుపానవిశేషతః । జ్వరమష్టవిధం హన్తి సంనిపాతాం స్త్రయోదశ (5)

అ॥ శు॥ పాదరసము 2 భా, శు॥ గంధకము 6 భా, శు॥ ఇంగిలీకము 2 భా, శు॥ టంకణము 4 భా, శు॥ నాభి 2 భా, శు॥ మణిశిల 2 భా, సూరేకారము 4 భా, త్రికటుకములు 16 భా, లవంగములు 3 భా, చిన్నఏలకులు 3 భా, పెద్దఏలకులు 3 భా, జాజికాయలు 2 భా, శు॥ నేపాళపువిత్తులు 2 భా, వీనిని నిమ్మకాయలు, గుంటగలగర, వావిలి, తమలపాకులు, అల్లము, త్రిఫలములు, వీనియొక్క రసములతో నాలుగేసి ఘడియలు మర్దించి మినపగింజలంత మాత్రలను చేయవలయును. ఒక్కొక్క మాత్రను అనుపానవిశేషములతో సేవించినయెడల ఎనిమిదివిధములగు జ్వరములును, పదమూడు సంనిపాతములును, నశించును.

## కఫకుంజరరసము

శ్లో॥ రసగన్ధౌ సమాంశౌ చ స్నుహ్యర్కపయసః పలమ్ । పలం చ పఞ్చలవణమేకీకృత్యావచూర్ణయేత్ (1) ఆలోడ్య చార్కదుగ్ధేన పూరయే

ష్పృష్ఠ మధ్యతః। పిప్పలీభకణావారిచూర్ణం కృత్వా ప్రలేపయేత్ ॥ 2 ॥
ప్రజ్వాలయే ద్యామమాత్రం సూక్ష్మచూర్ణం తు కారయేత్। కర్పూరనాగ
పత్రైశ్చ దేయో గుఞ్జార్ధమాత్రయా (3) శ్వాసం కాసం చ హృద్రోగం
కఫం పఞ్చవిధం తథా। నాశయేత్సర్వరోగాంశ్చ రసోఽయం కఫకుఞ్జరః(4)

ఆ॥ శు॥ రసము 1 పలము, శు॥ గంధకము 1 ప, జెముడుపాలు ½ ప, జిల్లేడు పాలు ½ ప, పంచలవణములు 1 ప, వీనిని కలిపి నూరి జిల్లేడుపాలు పోసి కలిపి శంఖమునందుంచి పిప్పళ్ళు, గజపిప్పళ్ళు, కరువేరు, వీనిని నూరి (జలములో) శంఖమునకు పూసి యొకజాము మంటవేసి (కుండయందుంచి) పిదప మెత్తగ నూరవలయును. దీనిని గురివిందగింజలో సగము పరిమితిగ హారతికర్పూరము, తమలపాకులు, వీనితో నిచ్చిన యెడల శ్వాస, కాస, హృద్రోగము. ఐదువిధములైన కఫము ఇవి నశించును. ఇది సమస్తవ్యాధులను నశింపజేయును. కఫకుంజరరస మనబడును.

## హంసమండూరము

శ్లో॥ మణ్డూరం చూర్ణితం శ్లక్ష్ణం గోమూత్రేఽష్టగుణే పచేత్।
త్ర్యూషణం త్రిఫలాం ముస్తం విడఙ్గం చవ్యచిత్రకే (1) దార్వీం గ్రన్థిం
దేవదారుం తుల్యం సర్వం విచూర్ణయేత్। చూర్ణం మణ్డూరతుల్యం చ
పాకకాలే వినిక్షిపేత్ (2) భక్షయేత్కర్షమాత్రంచ జీర్ణాన్తే తక్రభోజనమ్।
హలీమకం పాణ్డుశోథావూరుస్తమ్భం చ కామలామ్। అర్శాంసి హన్తి శీఘ్రం
చ హంస మణ్డూరకాహ్వయమ్ (3)

ఆ॥ శు॥ మండూరమును మెత్తగ చూర్ణించి ఎనిమిదిరెట్లు గోమూత్రమునందు పచనము చేయుచు త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తలు, వాయువిడంగములు చవ్యము, చిత్రమూలము, మ్రానుపసుపు, గ్రంధితగరము, దేవదారు, వీనిని సమభాగములుగ చూర్ణించి యా చూర్ణమును పాకసమయమున మండూరమునకు సమాన పరిమితిగ కలపవలయును. దీనినొక కర్ష పరిమితిగ సేవించి యాహారము జీర్ణమైన పిదప మజ్జిగతో కూడినయన్నమును భుజింపవలయును. ఇట్లు చేసినయెడల హలీమకము పాండువు, నంజు, ఊరుస్తంభము, కామిర్లు, మూలవ్యాధి, ఇవి వెంటనే హరించును. ఇది హంసమండూరమనెడి పేరుకలది,

## కస్తూరికారసము

శ్లో॥ లవఙ్గజాతీఫలజాతిపత్రికా స్తథైవ నాగోషణగ్రన్థికాని । కర్ష ప్రమాణాని తథైకశాణం కస్తూరికాకుఙ్కుమయోః ప్రయుఙ్క్తాత్ (1) శ్లో॥ ఆర్ద్రామ్బునాఽథ పిహితా వటికా త్రిగుఞ్జా । చార్ద్రామ్బుసాపి వినిహన్తి కఫక్షయాదీన్ శ్లో॥ కిం శ్వాసకాసం జఠరస్య శూలం నానాను పానైస్సకలామయఘ్నమ్ (2)

అ॥ లవంగములు 1 కర్షము, జాజికాయలు 1 క, జాపత్రి 1 క, శుంఠి 1 క, పిప్పళ్ళు 1 క, గ్రంథితగరము 1 క, కస్తూరి ½ శాణము, కుంకుమపువ్వు ½ శా, వీనిని అల్లపురసముతో నూరి మూడుగురువిందగింజల పరిమితికల మాత్రలను చేసి అల్లపురసముతో సేవించినయెడల కఫవ్యాధులు, క్షయ, మొదలగునవి నశించును. శ్వాస, కాస, ఉదరశూల నశించునని చెప్పనవసరము లేదు. ఆయారోగములకు తగినఅనుపానములతో నిది సమస్తవ్యాధులను హరించును.

## కృచ్ఛ్రహరరసము

శ్లో॥ రసేన్ద్రబలివైక్రాన్తాన్ స్వర్ణం చాపి పృథక్సమమ్ । ఖల్వ మధ్యే వినిక్షిప్య మర్దయేజ్జమ్బుజద్రవైః (1) భూధరాఖ్యపుటే పక్త్వాతత ఉద్ధృత్య చూర్ణయేత్ । మాషైకం సితయా లేహ్యం మూత్రకృచ్ఛ్ర ప్రశాన్తయే । రసః కృచ్ఛ్రహరో నామ్నా సర్వ కృచ్ఛ్రేషు యోజయేత్ (2)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, వైక్రాంతభస్మ, సువర్ణభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమందుంచి నిమ్మకాయరసముతో మర్దించి భూధరపుటము వేసి తీసి చూర్ణించవలయును. దీనిని మాషపరిమితిగ పంచదారతో సేవించిన యెడల మూత్రకృచ్ఛ్రము శాంతించును. ఇది కృచ్ఛ్రహరరసమని చెప్పబడును. దీనిని సమస్త మూత్రకృచ్ఛ్రములయందు నియ్యవలయును.

## లోకేశ్వరపోటలీరసము

శ్లో॥ రసస్య భస్మనో హేమ పాదాంశేన ప్రకల్పయేత్ । ద్విగుణం గన్ధకం దత్వా మర్దయేచ్చిత్రకామ్బునా (1) వరాటకాంశ్చ సంపూర్య

టఙ్కణేన నిరుధ్య చ। భాణ్డే చూర్ణప్రలిప్తేఽధ శీఘ్రం రున్ధ్యాత్తు మృణ్మయే। (2) శోషయిత్వా గజపుటే పుటేద్గర్తేఽపరాహ్ణకే। స్వాఙ్గశీతలముద్ధృత్య చూర్ణయిత్వాథ విన్యసేత్ (3) ఏష లోకేశ్వరో నామ్నా వీర్యపుష్టివివర్ధకః। గుఞ్జాచతుష్టయం ఖాదేత్పిప్పలీమధుసంయుతమ్ (4) భక్షయేత్పరయా భక్త్యాలోకేశ స్సర్వనాశకః। అఙ్గకార్శ్యేఽగ్నిమాన్ద్యే చ కాసే పిత్తే రసస్త్వయమ్ (5) మరీచైర్ఘృత సంయుక్తైః ప్రదాతవ్యో దినత్రయమ్। లవణం వర్జయేత్తత్ర సాజ్యం దధి చ యోజయేత్ (6) ఏకవింశత్యహానీత్థం మరీచం సఘృతంపిబేత్। పథ్యం మృగాఙ్కవత్ జ్ఞేయం శయీతోత్తానపాదతః। (7) శ్లో॥ యే శుష్కా విషమాశనైః క్షయరుజా వ్యాప్తాశ్చ యే కుష్ఠినో। యే పాణ్డుత్వహతాః కువైద్యవిధినా యే శోషిణో దుర్భగాః। యేతప్తా వివిధైర్జ్వరైర్భ్రమదోన్మాదైః ప్రమాదం గతా। స్తేసర్వే విగతామయా హి పరయా స్యుః పోటలీ సేవయా (8)

అ॥ రసభస్మ 1 భా, సువర్ణభస్మ ¼ భా, శు॥ గంధకము 2 భా, వీనిని చిత్రమూలరసముతో మర్దించి గవ్వలయందుంచి వెలిగారముతో గవ్వలయొక్క ముఖములను మూసి మట్టికుండయందుంచి కుండయొక్క మూతి మూసి సంధిబంధనమును చేసి ఎండించి గోతియందు మధ్యాహ్నకాలమున గజపుటమును వేసి చల్లారిన పిదప తీసి చూర్ణముచేసి భద్రపరచుకొనవలయును. ఇది లోకేశ్వరరస మనబడును. ఇది వీర్యమును, శరీరపుష్టిని, వృద్ధిపొందించును. దీనిని పిప్పళ్లు, తేనె, వీనితో నాలుగు గురివింద గింజల పరిమితిగ పరమభక్తితో సేవింపవలయును. ఈ లోకేశ్వరరసము సమస్త వ్యాధులను నశింపజేయును. శరీరము కృశించుట, అగ్నిమాంద్యము, దగ్గు, పైత్యవ్యాధులు, వీనియందు నేతితోకూడిన మిరియాల చూర్ణముతో మూడురోజులు పుచ్చుకొని ఉప్పు కలియనట్టియు, నెయ్యి, పెరుగు వీనితో కూడినట్టియు, ఆహారమును సేవింపవలయును. పిదప ఇరువదియొక్క రోజులవరకు నేతితోకూడిన మిరియాల చూర్ణమును పుచ్చుకొనవలయును. మృగాంకరసమునకు చెప్పిన పథ్యమును చేయవలయును. వెల్లకిలగ పరుండవలయును. విషమాశనముచే శుష్కించినవారును, క్షయవ్యాధికలవారును, కుష్ఠరోగముకలవారును, కుత్సితవైద్యులయొక్క క్రియచే పాండువ్యాధిని పొందినవారును, కఠినమైన శోషవ్యాధికలవారును, వివిధములగు జ్వరములచే బాధింపబడినవారును, భ్రమ మదము ఉన్మాదము వీనిచే ప్రమాదమును పొందినవారును, శ్రేష్ఠమైన యీ పోటలీరసమును సేవించుటచే ఆయా వ్యాధులనుండి విముక్తులగుదురు.

## యోగవాహిరసము

శ్లో॥ శుద్ధసూతం సమం గన్ధం మృతతామ్రాభ్రహాటకమ్ । ప్రత్యేకం సూతతుల్యం స్యాత్సూతార్ధం మృతలోహకమ్ (1) లోహార్ధం మృతవైక్రాన్తం మర్దయేద్భృఙ్గజద్రవైః । పర్పటీరసవత్పాచ్యం చూర్ణితం భావయేత్పృథక్ (2) శిగ్రువాసకనిర్గుణ్డీవచాభృఙ్గాగ్నిముణ్డికైః ద్రాక్షామృతాజయన్తీభిర్మునిబ్రాహ్మి సుతిక్తకైః (3) కన్యాయాశ్చ ద్రవైర్భావ్యం ద్రవైర్ధ్రివైశ్యైత్రిధాత్రిధా । రుద్ధ్వా లఘుపుటే పాచ్యం వాలుకాయన్త్రమధ్యతః (4) యన్త్రం నిరుధ్య యత్నేన స్వాఙ్గశీతం సముద్ధరేత్ । చూర్ణం నవజ్వరే దేయం మాషమాత్రం రసస్యవై (5) కృష్ణాధాన్యసమాయుక్తం ముహూర్తాన్నాశయేజ్జ్వరమ్ । యోగవాహీత్వయం స్యాద్వై రసో యోగస్య వాహకః (6)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, మృతాభ్రమభస్మ, 1 భా, అభ్రకభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, లోహభస్మ ½ భా, వైక్రాన్తభస్మ ¼ భా, వీనిని గుంటగలగరరసముతో మర్దించి పర్పటీరసమువలె తయారుచేసి చూర్ణించి మునగ, అడ్డసరము, వావిలి, వస, గుంటగలగర, చిత్రమూలము, బోడసరము, ద్రాక్షపండ్లు, తిప్పతీగ, తెక్కలి, అవిసి, సరస్వతియాకు, కటుకరోహిణి, కలుబంద, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిసారులు భావనను చేసి వాలుకాయంత్రమందుంచి బాగుగమూసి సంధిబంధనముచేసి లఘుపుటమువేసి స్వాంగశీతలమున తీయవలయును. దీనిని చూర్ణించి, పిప్పళ్లు, ధనియాలు, వీనితోకూడ మాషపరిమితిగ తరుణజ్వరమందిచ్చినయెడల ముహూర్తకాలములో నాజ్వరము నశించును. ఈ యోగవాహిరసమును ఏ యౌషధముతోనైనను చేర్చినయెడల నా యౌషధము యొక్క గుణముభివృద్ధినొందును.

## ఉన్మత్తభైరవరసము

శ్లో॥ పారదం దరదం శుద్ధం గన్ధకం కజ్జలాకృతిమ్ । వత్సనాభం గజకణాం శుణ్ఠీం చోన్మత్తబీజకమ్ (1) జాతీఫలం జాతిపత్రం లవఙ్గం మరిచం తథా । అకారకరభం తుల్యం మర్దయేచ్చ దినత్రయమ్ (2) ఆర్ద్రకస్య రసేనైవ గుటికాం వల్లసంనిభామ్ । చపలామధునా చైవ శ్వాసకాసనిబర్హణః

(3) కఫరోగవినాశయ రస ఉన్మత్తభైరవః । అనుపానవిశేషేణ ధాతు పుష్టికరస్స్మృతః (4)

ఆ॥ శు॥ రసము, శు॥ ఇంగిలీకము, శు॥ గంధకము, శు॥ నాభి, గజపిప్పళ్ళు, శుంఠి, శు॥ ఉమ్మెత్తవిత్తులు, జాజికాయలు, జాపత్రి, లవంగములు, మిరియాలు, అక్కలకర్ర, వీనిని సమభాగములుగ గ్రహించి అల్లపురసముతో మూడురోజులు మర్దించి వల్లపరిమితిగల మాత్రలను చేసి పిప్పళ్ళు, తేనె, వీనితో సేవించిన యెడల శ్వాస, కాస, కఫవ్యాధులు, ఇవి నశించును. ఇది ఉన్మత్తభైరవరసమనబడును. అనుపాన విశేషములతో ధాతుపుష్టిని చేయును.

## హిక్కారిపురసము

శ్లో॥ హేమముక్తార్క కాన్తానాం భస్మ వల్లమితం వరమ్ । బీజ పూర రసక్షౌద్రసౌవర్చల సమన్వితమ్ । హన్తి హిక్కాశతం సత్యమేక మాత్రాప్రయోగతః (1)

ఆ॥ సువర్ణభస్మ, ముత్యభస్మ, తామ్రభస్మ. కాంతభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి వల్లపరిమితిగ మాదీఫలరసము, తేనె, సౌవర్చలలవణము, వీనితో కూడ నిచ్చినయెడల అనేకములగు ఎక్కిళ్లు ఒక మోతాదునకే నిశ్చయముగ హరించును.

## సర్వకాలహితరసము

శ్లో॥ శుద్ధసూతసమం గ్రాహ్యం సువర్ణం గన్ధకం హ్యయః । కజ్జలీ కృత్య యత్నేన ఖల్వపాత్రే భిషగ్వరః (1) రాజికాస్వరసం దత్వాకృష్ణోన్మ త్తస్యవై రసమ్ । దత్వా దత్వా ప్రయత్నేన మర్దయేచ్చ త్రిభిర్దినైః (2) త్రిభిశ్చ సార్షపం తైలం దత్వాకల్కం విమర్దయేత్ । శోషయేద్భానుభిర్భా నోర్జ్వాలం దద్యాచ్ఛనైశ్శనైః (3) వాలుకాయన్త్రి యోగేతు కూపికామధ్య యోగతః । తావజ్జ్వాలం ప్రదాతవ్యం యావత్స్యాదుష్ణవాలుకా (4) స్వాఙ్గశీతల తాం జ్ఞాత్వాకర్షయేత్తం భిషగ్వరః తతో గుఞ్జాప్రమాణేన మాసం మాసార్ధకం పునః (5) జ్ఞాత్వా రోగం శరీరం చ యోజనీయం బుధైస్సదా । ఘృతేన మధునా సార్ధం పాణ్డ్వజీర్ణక్షయాపహః(6) సుస్నిగ్ధం నాతిమధురం భోజనం పక్షిమాంసకమ్ । భక్ష్యం ఛాగాదికం మాంసం యద్వా యస్య తు సాత్మ్య

కమ్ (7) ఏతేనాపి విధానేన ప్రాతః ప్రాతర్నిషేవయేత్ । సాధ్యాసాధ్యేషు రోగేషు వివిధేషు గదేషు చ (8) వలీపలితహన్తాఽయం వార్ధకం చాపి నాశయేత్ । రమతే శతవర్షోఽపి ప్రత్యహం కామినీశతమ్ (9) అస్య సేవా ప్రసాదేన సహస్రం జీవితం భవేత్ ॥ రచితశ్శమ్భునా హ్యేషస్సర్వకాలహితోరసః (10)

ఆ॥ శు॥ రసము, సువర్ణభస్మ, శు॥ గంధకము, లోహభస్మ. వీనిని సమభాగములుగ గ్రహించి రాగిపాత్రయందు మెత్తగనూరి తెల్లఆవాలరసము, నల్లఉమ్మెత్తరసము, ఆవనూనె, వీనిని బాగుగ పోసికొనుచు మూడేసిరోజులు బాగుగ మర్దించి సూర్యకిరణములచే (ఎండయందు) ఎండించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మెల్లగ మంటవేయుచు ఇసుక వేడిగ నగువరకు వండి సాంగశీతలమున తీయవలయును. దీనిని గురివిందగింజపరిమితిగ నలుబదియైదురోజులు రోగమును, శరీరమును, తెలిసికొని తేనె, నెయ్యి, వీనితో నిచ్చినయెడల పాండువు, అజీర్ణము, క్షయ ఇవి నశించును. అధికమగు చమురుకలిగినట్టియు అధికమగు తీపిలేనట్టియు భోజనమును, పక్షిమాంసమును, మేక మొదలగు వానియొక్క మాంసము లేక అభ్యాసమైన మాంసమును పుచ్చుకొనవలయును. ఇట్లు ప్రతి ప్రాతఃకాలమందును ఔషధమును సేవించినయెడల సాధ్యములైనట్టియు, అసాధ్యములైనట్టియు, అనేక విధములగు వ్యాధులు నశించును. ఇది శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, వీనిని నశింపజేయును. ముసలితనమును గూడ నశింపజేయును. దీనిని సేవించుటచే నూరు సంవత్సరములు వయస్సు కలవాడు కూడ ప్రతి దినము నూర్గురు స్త్రీలను రమించును. వెయ్యి సంవత్సరముల ఆయుసు కలుగును. ఈ సర్వకాలహితరసము శివునిచే చెప్పబడినది.

## లఘుచింతామణి

శ్లో ॥ భాగత్రయం స్వర్ణభస్మ ద్విభాగం తారమభ్రకమ్ । లోహాత్పఞ్చ ప్రవాలం చ మౌక్తికత్రయసంయుతమ్ ॥ 1 ॥ సూతభూతేస్సప్తకం చ సర్వం మర్ద్యం తు కన్యయా । ఛాయాశుష్కావటీః కార్యాశ్ఛాగీదుగ్ధానుపానతః ॥ 2 ॥ క్షయం హన్తి తథా కాసం గుల్మం చాపి ప్రమేహకమ్ । జీర్ణజ్వరహరశ్చైవ హ్యున్మాదస్య నికృన్తకః ॥ 3 ॥ సర్వదోషహరశ్చాపి వారిదోషనివారకః । లఘుచిన్తామణిర్నామశివేన పరిభాషితః ॥ 4 ॥

అ॥ సువర్ణభస్మ 3 భా, వెండిభస్మ 2 భా, అభ్రకభస్మ 2 భా, లోహభస్మ 5 భా, పగడభస్మ, 3 భా, ముత్యభస్మ 3 భా, సూతభస్మ 7 భా, వీనినన్నిటిని కలుబందరసముతో మర్దించి మాత్రలనుచేసి నీడనెండించి మేకపాలుయొక్క అనుపానముతో సేవించినయెడల క్షయ, దగ్గు, గుల్మము, ప్రమేహము, జీర్ణజ్వరము ఉన్మాదము, ఇవి హరించును. మరియు సమస్త దోషములును, ఉదకదోషజనితవ్యాధులును, హరించును. ఇది లఘుచింతామణియని చెప్పబడును. శివునిచే చెప్పబడినది.

## లఘుచింతామణి (ప్రకారాంతరము)

శ్లో॥ హాటకం రజతం తాలం ముక్తాగన్ధకపారదాన్ । వ్యోషం కునటీ కాంచైవకస్తూరీం చ పృథక్సమమ్ ॥ 1 ॥ జలేన వటికాః కార్యద్వి గుఞ్జఫల మానతః । చిన్తామణిరసోనామ జ్వరానష్టౌ నికృన్తయేత్ ॥ 2 ॥ కఫజాన్వాతజాం శ్చైవ కాసం శ్వాసం తథైవ చ । సంనిపాతజ్వరం చైవ హరత్యేవ తు నిశ్చయః ॥ 3 ॥

అ॥ సువర్ణభస్మ, వెండిభస్మ, శు॥ తాళకము, ముత్యభస్మ, శు॥ గంధకము, శు॥ రసము, త్రికటుకములు, శు॥ మణిశిల, కస్తూరి, వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకముతో నూరి రెండు గురివిందగింజల పరిమితిగల మాత్రలను చేయవలయును. ఇది చింతామణి యనబడును. ఎనిమిదివిధములగు జ్వరములు, కఫవ్యాధులు, వాతవ్యాధులు, దగ్గు, వగర్పు, సంనిపాతజ్వరము, వీనిని నిశ్చయముగ హరించును.

## చింతామణి

శ్లో॥ రసేన్ద్రవైక్రాన్తకరౌప్యతామ్రం సలోహముక్తాఫలగన్ధహేమ । త్రిర్భావితం చార్ద్రకభృఙ్గవహ్నిరసైరజాగోపయసా తథైవ ॥ 1 ॥ అర్థః క్షయం కాసమరోచకం చ జీర్ణజ్వరం పాణ్డుమపి ప్రమేహాన్ । గుఞ్జా ప్రమాణం మధుమాగధీభ్యాం లిఢం నిహన్యాద్విషమం చ వాతమ్ ॥ 2 ॥ శ్లో॥ చిన్తామణిరితిఖ్యాతః పార్వత్యా నిర్మితస్స్వయమ్ ॥

అ॥ శు॥ రసము, వైక్రాంతభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ లోహభస్మ. ముత్యభస్మ, శు॥ గంధకము. బంగారుభస్మ, వీనిని అల్లము, గుంటగలగర, చిత్రమూలము, వీనియొక్క రసములతోడను. మేకపాలతోడను, ఆవుపాలతోడను. మూడేసి భావనలను చేయవలయును. దీనిని తేనె, పిప్పళ్ళు, వీనితో గురివిందగింజ పరిమితిగ సేవించిన

యెడల అర్శస్సు, క్షయ. దగ్గు, అరోచకము. జీర్ణజ్వరము, పాండువు, ప్రమేహములు, విషమజ్వరములు, వాతవ్యాధులు, ఇవి నశించును. చింతామణియని ప్రసిద్ధమైనది. పార్వతీదేవిచే స్వయముగ చెప్పబడినది.

## త్రైలోక్యచింతామణి

శ్లో॥ రసం వజ్రం హేమ తారం తామ్రం తీక్ష్ణాభ్రకే మృతమ్ । గన్ధకం మౌక్తికం శఙ్ఖం ప్రవాలం తాలకం శిలామ్ (1) శోధితం చ సమం సర్వం సప్తాహం భావయేద్దృఢమ్ । చిత్రమూలకషాయేణ భానుదుగ్ధైర్దినత్రయమ్ (2) నిర్గుణ్డీసూరణద్రావైః వజ్రీదుగ్ధైర్దినత్రయమ్ । అనేన పూరయేత్సమ్యక్ పీతవర్ణాన్వరాటకాన్ (3) టఙ్కణం రవిదుగ్ధేన పిష్ట్వా తేషాం ముఖం లిపేత్। రుద్ధ్వా భాణ్డే పుటేత్పశ్చాత్స్వాఙ్గశీతం విచూర్ణయేత్ (4) చూర్ణతుల్యం మృతం సూతం వైక్రాన్తం సూతపాదకమ్। శిగ్రుమూలద్రవైస్సర్వం సప్తవారం విభావయేత్ (5) చిత్రమూలకషాయేణ భావనాశ్చైకవింశతిః । ఆర్ద్రికస్యరసే నైవ భావనాస్సప్త ఏవ చ (6) జమ్బీరైర్మాతులుఙ్గైర్వా సప్తవారం విభావయేత్ । సూక్ష్మచూర్ణం తతః కృత్వాచూర్ణపాదాం శటఙ్కణమ్ (7) టఙ్కణాంశం వత్సనాభం తత్సమం మరిచం క్షిపేత్ । లవఙ్గం నాగరం పథ్యా కణా జాతీఫలం పృథక్ (8) ప్రత్యేకం వత్సనాభస్య పాదాంశం చూర్ణితం క్షిపేత్ । మాతులుఙ్గస్యార్ద్రికస్య రసేనైతద్విలోడయేత్(9) చతుర్గుఞ్జామితం ఖాదేత్కణాక్షౌద్రం లిహేదను । క్షౌద్రైర్వాచార్ద్రికద్రావైశ్శుణ్ఠ్యావాథ గుడైర్యుతమ్ । అనుపానైస్సమాయోజ్య స్సర్వరోగోపశాన్తయే (10) శ్లో॥ వహ్నిం దీపయతే బలం చ కురుతే తేజోమహద్వర్ధతే । వీర్యం వర్ధయతే విషం చ హరతే దార్ఢ్యంవిధత్తే తనోః । అభ్యాసేన నిహన్తి మృత్యుపలితం పుష్టిం ప్రదత్తేనృణాం । కాసం సూదయతే క్షయం క్షపయతే శ్వాసంచ నిర్నాశయేత్ (11) వాతం విద్రధిపాణ్డుశూలగ్రహణీరక్తాతిసారాన్ జయే । స్మేహప్లీహజలోదరాశ్మరితృషాశోఫం హలీమోదరమ్ । లూతాకృచ్ఛ్ర భగన్దరం జ్వరగణం చార్శాంసి కుష్ఠం జయే। త్సాధ్యాసాధ్యరుజో నిహన్తి చ రసస్త్రైలోక్యచిన్తామణి (12)

అ॥ శు॥ రసము, వజ్రభస్మ, సువర్ణభస్మ. రజతభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, శు॥ గంధకము, ముత్యభస్మ, శంఖభస్మ, పగడభస్మ, శు॥ తాలకము, శు॥ మణిశిల, వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి చిత్రమూలకషాయముతో ఏడు రోజులును జిల్లేడుపాలు, వావిలిరసము, అడవికందరసము, జెముడుపాలు, వీనితో ప్రత్యేకముగ మూడేసిరోజులును భావనచేసి పచ్చగవ్వలయందుంచి జిల్లేడుపాలతో టంకణమును నూరి ఆగవ్వలముఖములకు పూసి కుండయందుంచి సంధిబంధనము చేసి పుటమువేసి చల్లారినపిదప తీసి చూర్ణముచేసి యీ చూర్ణముతో సమానమగు సూత భస్మను, సూతభస్మలో నాల్గవవంతు వైక్రాంతభస్మను, కలిపి మునగవేళ్ళరసముతో ఏడుసార్లును, చిత్రమూలకషాయముతో ఇరువదియొక్కసార్లును, అల్లపురసముతో ఏడుసార్లును, నిమ్మకాయలరసముతోగాని మాదీఫలరసముతోగాని ఏడుసార్లును, భావనచేసి మెత్తగా చూర్ణముచేసి శు॥ టంకణము, శు॥ నాభి, మిరియాలు, వీనిని ప్రత్యేకముగ నా చూర్ణమునకు నాల్గవవంతు చొప్పున కలిపి లవంగములు, శొంఠి, కరక్కాయ, పిప్పళ్ళు, జాజికాయ, వీనిని ప్రత్యేకముగ నాభికి నాల్గవవంతు చొప్పున కలిపి మాదీఫలరసముతోడను, అల్లపురసముతోడను, కలియత్రిప్పవలయును. దీనిని నాలుగు గురివిందగింజల పరిమితిగ సేవించి వెంటనే పిప్పళ్ల చూర్ణమును, తేనెను, పుచ్చుకొనవలయును. తేనెతో గాని, అల్లపురసముతోగాని, శొంఠితో గాని, బెల్లముతో గాని, సేవించినయెడల సమస్త వ్యాధులును నశించును. ఇది అగ్నిదీప్తిని, బలమును, తేజస్సును, వీర్యమును, వృద్ధినొందించును. విషమును హరించును. శరీర దార్ఢ్యమును కలుగజేయును. కొంతకాలము సేవించినచో మృత్యువును, ముసలి తనమును, పోగొట్టును. పుష్టిని చేయును. దగ్గు, క్షయ, శ్వాస, వాతవ్యాధులు, విద్రధి, పాండువు, శూల, గ్రహణి, రక్తాతిసారము, మేహములు, ప్లీహవ్యాధి, జలోదరము, అశ్మరి, దప్పిక, నంజు, హాలీమకము, ఉదరవ్యాధి, లూతవ్రణము, మూత్రకృచ్ఛ్రము, భగందరము, సమస్తమైన జ్వరములు, అశస్సు, కుష్ఠము, వీనిని నశింపజేయును. సాధ్యములైనట్టియు అసాధ్యములైనట్టియు వ్యాధులను నశింప జేయును. ఇది త్రైలోక్య చింతామణియని చెప్పబడును.

## త్రైలోక్య చింతామణి (ప్రకారాంతరము)

శ్లో॥ సూతాభ్రస్వర్ణతారారుణభిదురశిలాతాప్యగన్ధప్రవాలా। యోముక్తా శఙ్ఖతాలం సమమి దమనలక్వాథతస్సప్తభావ్యమ్ । నిర్గుణ్డీసూ రణామ్బుః పవిర విషయసా త్రిః పృథగ్భావయిత్వా । చాపూర్యైతైర్వరాటానథ మిహి రపయష్టఙ్కణాలిప్తవక్త్రాన్ (!) కృత్వాభాణ్డే చ రుద్ధ్వా గజపుటజఠరే యుక్తి కస్తత్తుపక్వోవ । ధ్రుత్యైతన్మర్దయిత్వా తదఖిల తులితం సూతభస్మ ప్రద ద్యాత్ । వైక్రాన్తంసూతతుర్యాంశకమథ మిలితం సప్తశశ్చిగ్రుమూలా ।

త్వగ్భావ్యం తేన తుల్యం విషమనలవరం టఙ్కణం చోషణం చ (2) పథ్యాం జాతీఫలం చామర కుసుమకణానాగరం వత్సనాభా । త్తుర్యాంశం మేలయిత్వా పృథగథ దివసంమర్దయే ల్లుఙ్గతోయైః । ఏత త్త్రైలోక్యచిన్తామణి రఖిలగద ధ్వాన్తవి ధ్వంస హంస । స్తత్తద్రోగానుపానై రుషసి కవలితస్సార్ధవల్ల ప్రమాణః (3) వాతవ్యా ధ్యామవాతజ్వరజఠరకృమిశ్వాసశూలాస్రవాతా । సృక్పిత్తక్షైణ్య కాసక్షయక ఫజగదోరః క్షతాజీర్ణమేహే । కుష్ఠాతీసార పాణ్డు గ్రహణిషు తమ కేఽథ వ్రణాశః ప్రకృష్టే । ఖాఞ్జ్యే ఖఞ్జాఢ్య వాత శ్రుతిభగజగదే సర్వథైవ ప్రశస్తః (4)

అ॥ శు॥ రసము, అభ్రకభస్మ, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, వజ్ర భస్మ, శు॥ మణిశిల, హేమమాక్షికభస్మ, శు॥ గంధకము, పగడభస్మ, లోహభస్మ, ముత్యభస్మ, శంఖభస్మ, శు॥ తాళకము, వీనిని సమభాగములుగ గ్రహించి చిత్రమూలకషాయముతో ఏడుసార్లు భావనచేసి పిదప వావిలిరసము, అడవికందరసము, నల్లేరురసము, జిల్లేడుపాలు, వీనితో ప్రత్యేకముగ మూడుసార్లు చొప్పున భావనచేసి పచ్చగవ్వలయందుంచి జిల్లేడుపాలతో నూరబడిన టంకణముచే గవ్వలముఖములను మూసి ఆ గవ్వలను కుండయందుంచి కుండయొక్క ముఖమును మూసి గజపుటమునందు పక్వముచేసి చల్లారినపిదప తీసి నూరి యా చూర్ణమునకు సమానమగు పాదరస భస్మను, పాదరసభస్మకు నాల్గవవంతు వైక్రాంతభస్మను, కలిపి మునగ వేళ్లరసముతో ఏడుసార్లు భావనచేసి శు॥ నాభి, చిత్రమూలము, శు॥ టంకణము, మిరియాలు, వీనిని ప్రత్యేకముగ వైక్రాంతభస్మకు సమానముగను కరక్కాయలు, జాజికాయలు, లవంగములు, తిప్పుళ్ళు, శుంఠి, వీనిని ప్రత్యేకముగ నాభికి నాల్గవవంతు చొప్పునను కలిపి మాదీఫలరసముతో ఒకరోజు మర్దింపవలయును. ఇది త్రైలోక్యచింతామణి యని చెప్పబడును. దీనిని ఒకటిన్నరవల్లపరిమితిగ ఆయా రోగములకు తగిన అనుపానములతో ఉదయమున సేవించినచో సమస్తమైన వ్యాధులును నశించును. వాతవ్యాధి, ఆమవాతము, జ్వరము, ఉదరరోగము, క్రిమిరోగములు, శ్వాస, శూల, వాతరక్తము, రక్తపిత్తము, కృశించుట, దగ్గు, క్షయ, కఫరోగములు, ఉరఃక్షతము, అజీర్ణము, మేహము, కుష్ఠము, అతిసారము, పాండువు, గ్రహణి, తమకశ్వాస, వ్రణము, అర్శస్సు, పంగువాతము, ఆఢ్యవాతము, కర్ణరోగములు, యోనిరోగములు, వీని యందిది మిక్కిలి ప్రశస్తమైనది.

## దివ్యచింతామణి

శ్లో॥ సువర్ణం కాన్తలోహే చ నాగవఙ్గే తథాభ్రకమ్ । మౌక్తికం చ ప్రవాలం చ హ్యేతేషాం శుద్ధభస్మకమ్ (1) గన్ధకం సూతదరదే శుద్ధాన్యే

తాని యోజయేత్ । సర్వైస్సమం వత్సనాభం ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) అశ్వగన్ధారసే నైవ దృఢం చైవ హి మర్దయేత్ । మాషమాత్రాం వటీం కృత్వా ఖాదయే త్పుఋచ్ఛపాణ్డుజిత్ (3) ప్రమేహవాతరోగఘ్న స్సర్వరోగ వినాశకః । దివ్యచిన్తా మణిర్నామ గౌరీనాథప్రకల్పితః (4)

అ॥ సువర్ణభస్మ, కాంతభస్మ, లోహభస్మ, సీసభస్మ, వంగభస్మ, అభ్రకభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, శు॥ గంధకము, శు॥ రసము, శు॥ ఇంగిలీకము, వీనిని సమభాగములుగను శు॥ నాభిని, వీని అన్నిటితో సమానముగను గ్రహించి ఖల్వమందుంచి పెన్నేరురసముతో దృఢముగా మర్దింపవలయును. దీనిని మినపగింజ పరిమితిగ మాత్రలనుచేసి సేవించినచో అయిదువిధములైన పాండువ్యాధులు, ప్రమేహములు, వాతరోగములు, సర్వరోగములు, వీనిని నశింపజేయును. ఇది గౌరీనాథునిచే కల్పింపబడినది. దివ్యచింతామణి యని చెప్పబడును.

## శ్లేష్మచింతామణి

శ్లో॥ రసం గన్ధం విషం చైవ త్రికటు త్రిఫలాం తథా । శిలాహ్వాం రౌప్యకం స్వర్ణం మౌక్తికం తాలకం సమమ్ (1) మృగకస్తూరికాయాశ్చ క్షిపేత్ షణ్మాషకం భిషక్ । భృఙ్గరాజరసేనైవ తులస్యాస్స్వరసేన చ (2) అర్ద్రకస్య రసేనైవ వటీం కుర్యాత్ ద్విగుఞ్జికామ్ । చిన్తామణిరసో హ్యేష సర్వరోగకులాన్తకః (3) సంనిపాతజ్వరం హన్తి కఫరోగం వినాశయేత్ । ఏకజం ద్వన్ద్వజం చైవ వివిధం విషమజ్వరమ్ (4) అగ్నిమాన్ద్యం శిరశ్శూలం విద్రధిం చ భగన్దరమ్ । ఏతాన్యేవ నిహన్త్యాశు భాస్కర స్తిమిరం యథా (5)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము శు॥ నాభి, త్రికటుకములు, త్రిఫలములు, శు॥ మణిశిల, వెండిభస్మ, సువర్ణభస్మ, ముత్యభస్మ, శు॥ తాళకము, వీనిని సమభాగములుగను, కస్తూరిని ఆరుమినపగింజల ప్రమాణముగను గ్రహించి గుంటగలగర, తులసి, అల్లము, వీనియొక్క రసములతో మర్దింపవలయును. రెండు గురివిందగింజల పరిమితిగల మాత్రలను చేయవలయును. ఇది చింతామణి యని చెప్పబడును. సమస్త వ్యాధులను నశింపజేయును. మరియు సంనిపాతజ్వరము, కఫరోగములు, ఏకదోషజజ్వరము, ద్వంద్వజజ్వరము, సమస్తమైన విషమజ్వరములు, అగ్నిమాంద్యము, శిరశ్శూల, విద్రధి, భగందరము. వీనిని సూర్యుడు చీకటినివలె పోగొట్టును.

## రాజచింతామణి

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం కాన్తం తీక్ష్ణాభ్రకే సమమ్। మనశ్శిలాయా ద్వౌ భాగౌ తాలం భాగత్రయం పృథక్ (1) చతుర్భాగం శుద్ధసూతం తత్సమం శుద్ధగన్ధకమ్ ఖర్పరం టఙ్కణం చైవ భాగార్ధం స్యాత్పృథక్పృథక్ (2) ద్విభాగాం వజ్రభూతిం చ తత్సమం మృతమౌక్తికమ్। విద్రుమం గారుడం భస్మ మౌక్తికేన సమం భవేత్ (3) దరదం తాలతులితం ఖల్వమధ్యే వినిక్షిపేత్। రక్తకల్హారకన్దోత్థరసే నైవ విభావయేత్ (4) హంసపాదీరసేనైవ నిర్గుణ్డీస్వరసేన చ। అశ్వగన్ధారసేనైవ ద్వౌ ద్వౌ యామౌ విమర్దయేత్ (5) రక్తకార్పాసకుసుమైర్మర్దితం తదనన్తరమ్। తామ్రపాత్రోదరే క్షిప్త్వా వాలుకా యన్త్రమధ్యతః (6) మృద్వగ్నినా పచేద్ధీమానహోరాత్రం సమాహితః। స్వాఙ్గశీతం సమాదాయ మధునా వా ఘృతేన వా (7) వ్రీహిమానం ప్రదాతవ్యం సర్వదోషనివారకమ్। యోనిదోషం రజోదోషం సంతాపం చ వినాశయేత్ (8) వాతపిత్తకఫోద్భూతజ్వరదోషవినాశకమ్। మనఃప్రసాద కరణం తేజోవీర్యవివర్ధకమ్ (9) అనుపానవిశేషేణ సర్వరోగనివారకమ్। చిన్తామణీనాం సర్వేషాం రాజా భవతి నిశ్చయః (10)

అ॥ సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, లోహభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, శు॥ మణిశిల 2 భా, శు॥ తాళకము 3 భా, శు॥ రసము 4 భా, శు॥ గంధకము 4 భా, శు॥ కపరి ½ భా, శు॥ టంకణము ½ భా, వజ్రభస్మ 2 భా, ముత్యభస్మ 2 భా, పగడభస్మ 2 భా, పచ్చలభస్మ 2 భా, శు॥ ఇంగిలీకము 3 భా, వీనిని ఖల్వమునుంచి ఎఱ్ఱకలువదుంప॥ హంసపాది, వావిలి, పెన్నేరు, పైడిపత్తిపువ్వులు, వీనియొక్క రసములతో రెండేసిజాములు మర్దించి తామ్రపాత్రయందుంచి, వాలుకాయంత్రమందు మందాగ్నిచే ఒక రాత్రింబగలు వండి స్వాంగశీతలమున తీయవలయును. దీనినొక వడ్లగింజపరిమితిగ తేనెతోగాని, నేతితోగాని సేవించినయెడల సమస్తదోషములు నశించును. మఱియు యోనిదోషము, రజోదోషము, తాపము, వాతపిత్తకఫములచే జనించిన జ్వరములు, నశించును. ఇది మనోనైర్మల్యమును, తేజస్సును, వీర్యవృద్ధిని చేయును. అనుపాన విశేషములతో సమస్త వ్యాధులను నశింపజేయును. సమస్తమైన చింతామణులలోను ప్రశస్తమైనది.

## రసచింతామణి

శ్లో॥ సూతం సర్ణం తారతామ్రే వైక్రాన్తం లోహమభ్రకమ్ । కాన్తం
ప్యం చ సౌభాగ్యం గన్ధకం దరదం శిలామ్ (1) శిఖిగ్రీవం క్షీరతుత్థం
మౌక్తికం చ ప్రవాలకమ్ । ఏకైకం చ సమాంశం తు సప్తాహం మర్దయే
పృథక్ (2) చిత్రమూలకషాయేణ భానుదుగ్ధైర్దినత్రయమ్ । కాచకూప్యన్తరే
క్త్వా వాలుకాయన్త్రకే పచేత్ (3) దినత్రయం పచేత్తీవ్రం స్వాఙ్గశీతలము
రేత్ । ఆదాయ తద్గతం భాగం మృతసూతం ద్విభాగకమ్ (4) హంసపాదీ
సైః కన్యాకటుభద్రరసైస్తథా । మర్కటీమూలస్వరసైర్మర్దయేచ్చ పృథ
నమ్ (5) ఆతపే శోషయిత్వాథ తత్తుల్యం వత్సనాభకమ్ । తత్తుల్యం మరి
ం చైవ హ్యార్ద్రకస్వరసైస్తథా (6) పఞ్చకోలకషాయేణ నాగవల్లీరసై
స్తథా । వయస్థాస్వరసైశ్చైవ ప్రత్యేకం మర్దయేద్దినమ్ (7) శోష్యం
పేష్యం చ మర్ద్యం చ వటీం కుర్యాత్ ప్రయత్నతః । ఆతపే శోషయి
త్వాథ లవఙ్గకణయా సహ (8) చతుర్గుఞ్జామితం ఖాదేదార్ద్రక స్వరసేన వా ।
ఞ్చకోలకషాయస్య మాక్షికస్యానుపానతః (9) సర్వవ్యాధి వినాశం చ
ర్యాచ్చైవాగ్ని దీప్తికమ్ । వీర్యం తేజో బుద్ధిబలం కృశానాం పుష్టిమేవ చ
(10) పురాణజ్వరనాశం చ సర్వజ్వరవినాశనమ్ । సంనిపాతజ్వరఘ్నం చ
హ్యాకాదశ తథా క్షయాన్ (11) పఞ్చహిక్కాః పాణ్డుశోఫా వాతరోగ
సమేహకాన్ । తథా గ్రహణ్యతీసార మూత్రకృచ్ఛ్రాశ్మరీర్హరేత్ । రస
న్తామణిర్నామ ధన్వన్తరివినిర్మితః (12)

తా॥ శు॥ రసము, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, వైక్రాంతభస్మ, లోహ
స్మ, అభ్రకభస్మ, కాంతభస్మ, హేమమాక్షికభస్మ శు॥ గంధకము, శు॥ ఇంగిలీకము,
॥ మణిశిల, శు॥ మైలతుత్థము, శు॥ పాలతుత్థము, ముత్యభస్మ, పగడభస్మ, వీనిని
భాగములుగ ఖల్వమందుంచి చిత్రమూలకషాయముతో ఏడురోజులు బాగుగ
ర్దించి జిల్లేడుపాలతో మూడురోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకా
ంత్రమునందు మూడురోజులు తీవ్రముగా వండి స్వాంగశీతలమున తీసి దానికి రెండు
ట్ల రసభస్మను కలిపి హంసపాది, కలబంద, అల్లము, దూలగొండివేళ్లు, వీని రసము
తో ప్రత్యేకముగ ఒక్కొక్కరోజు చొప్పున మర్దించి ఎండలో ఎండించి రసభస్మతో
మానమగు శు॥ నాభిని, నాభితో సమానముగు మిరియాలను కలిపి అల్లము, పంచ
లములు, తమలపాకులు, తిప్పతీగ, వీని రసములతో ప్రత్యేకముగ ఒక్కొక్క

దినము మర్దించి ఎండించి నూరి నుఱుల మర్దించి, కపప్పెలుకట్టి ఎండయుం పెం..ంప వలయును. దీనిని నాలుగుగురివిందగింజల పరిమితిగ లవంగములు, పిప్పళ్లు, అల్లపురసము, పంచకోలకషాయము, తేనె, వీనిలో దేనితోనైనను సేవించినచో సమస్త వ్యాధులును నశించును. ఇది అగ్నిదీప్తిని, వీర్యవృద్ధిని, కాంతిని, బుద్ధిబలమును, కృశించినవారలకు పుష్టిని కలుగజేయును. మఱియు, పురాణజ్వరము, సమస్త జ్వరములు, సన్నిపాత జ్వరములు, ఏకాదశక్షయలు, అయిదు శ్వాసలు, అయిదు కాసలు, అయిదు ఎక్కిళ్లు, పాండువు, నంజు, వాతరోగములు, ప్రమేహములు, గ్రహణి, అతిసారము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, వీనిని పోగొట్టును. ధన్వంతరిచే కల్పింపబడినది. రసచింతామణి యని చెప్పబడును.

## పాషాణచింతామణి

శ్లో॥ రసం గన్ధం విషం తాలముల్లిపాషాణగౌరికే । తీక్ష్ణం వఙ్గాహితాభ్రమాణి రౌప్యం తుత్థం చ మాక్షికమ్ (1) సువర్ణవజ్రముక్తాశ్చ ప్రవాలం పుష్యరాగకమ్ । నీలం వైక్రాన్తసంయుక్తం సమంఖల్వే వినిక్షిపేత్ (2) జమ్బీరమాతులుఙ్గార్ద్రద్రవైర్మర్ద్యం దినత్రయమ్ । కృష్ణసర్పస్యపిత్తేన దినమేకం విభావయేత్ (3) మాయూరమాత్స్యవారాహచ్ఛాగమాహిషపిత్తకైః । దినత్రయం చ సంమర్ద్య చూర్ణయేద్భిషగుత్తమః (4) రసమేనం ప్రయుఞ్జీత త్రివల్లపరిమాత్రయా । సంనిపాతం హరేత్సర్వం శీఘ్రం సర్వజ్వరాపహః (5) ఆర్ద్రకైశ్చ ప్రయోక్తవ్యస్తత్తద్రోగానుపానతః । సర్వరోగాన్ హరేచ్ఛీఘ్రం భాస్కర స్తిమిరం యథా । చిన్తామణిరితి ఖ్యాతో పాషాణపదపూర్వకః (6)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ నాభి, శు॥ తాళకము, శు॥ ఉల్లిపాషాణము, శు॥ గౌరీపాషాణము, లోహభస్మ, వంగభస్మ, సీసభస్మ, తామ్రభస్మ, వెండిభస్మ, శు॥ మైలతుత్థము, మాక్షికభస్మ, సువర్ణభస్మ, వజ్రభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, పుష్యరాగభస్మ, నీలభస్మ, వైక్రాంతభస్మ, వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి నిమ్మకాయలు, మాదీఫలము, అల్లము, వీని రసములతో మూడురోజులు మర్దించి, నల్లత్రాచుపాము యొక్క పిత్తముతో ఒకరోజు భావనజేసి నెమలి, చేప, అడవిపంది, మేక, దున్నపోతు, వీని పిత్తములతో మూడురోజులు మర్దించి చూర్ణము చేయవలయును. దీనిని మూడువల్లముల పరిమితిగ సేవించినచో సర్వసన్నిపాతములను,

సర్వ జ్వరములను వెంటనే హరింపజేయును. అల్లపురసముతోగాని, ఆయా రోగములకు తగిన యనుపానములతోగాని పుచ్చుకొనినచో సర్వరోగములను వెంటనే సూర్యుడు చీకటిని నశింపజేయు రీతిని నశింపజేయును. ఇది పాషాణచింతామణి యని ప్రసిద్ధికెక్కినది.

## లఘుపాషాణచింతామణి

శు॥ శు॥ ఉల్లిపాషాణము, శు॥ గౌరీపాషాణము, శు॥ శంఖపాషాణము, శు॥ తాళకము, శు॥ మణిశిల, వీనిని సమభాగములుగ గ్రహించి చిట్టాముదముతో మర్దించి బిళ్ళచేసి, ఒక కుండలో నుంచి ఆ బిళ్లపై ఒక రాగిగిన్నెను బోర్లించి, ఆ గిన్నెకు, కుండకు శీలమన్నునిచ్చి, గిన్నెపైన ఇసుకపోసి గాఢాగ్నిచే వండినయెడల ఎగిరి పువ్వు మాదిరిగా గిన్నెకు పట్టుకొనును. చల్లారిన పిదప గిన్నెనున్న పువ్వును తీసి, మాత్రలు చేసి రోగియొక్కయు, రోగముయొక్కయు బలము ననుసరించి వాడినచో సన్నిపాతజ్వరములు, శ్లేష్మవ్యాధులు, సవాయి వ్యాధులు, క్రూరమైన వాతవ్యాధులు, కఠిన వ్రణములు మొదలగునవి నశించును.

## మహాత్రైలోక్యచింతామణి

శ్లో॥ హేమాష్టసప్తతారం చ ప్రయోభాగాశ్చమిశ్రజమ్ । చతుష్కమర్క లోహం చ పూతిలోహం త్రయోదశ (1) ధాతుజాని చ లోహాని హ్యేకైకం చ చతుర్దశ । మౌక్తికం గారుడం వజ్రం ప్రత్యేకం చ చతుర్గుణమ్ (2) కురువిన్దాష్టభాగం చ విద్రుమం చ తథాష్టకమ్ । గోమేదకం పుష్యరాగం నవభాగం పృథక్పృథక్ (3) వైడూర్యం శక్రనీలం చ దశ భాగం పృథక్పృథక్ । మాక్షికం సప్తభాగం చ పఞ్చపాషాణషోడశ (4) భాగైకం శుద్ధసౌవీరమఞ్జనాని త్రయోదశ । శతభాగం శుద్ధరసం ద్విశతం బలమేవ చ (5) నవసారం షష్టిభాగం సర్వ చూర్ణాని పేషయేత్ । కాచ కూప్యన్తరేక్షిప్త్వా చతురగ్ని నిదాపయేత్ (6) చతుర్వింశతి వారాణి సికతాయన్త్రికేపచేత్ । చతుస్సహస్రవిప్రాంశ్చ భోజనమ్ కారయేద్దినమ్ (7) నవగ్రహజపం కుర్యాదష్టదిక్పాలకార్చనమ్ । భూసురేభ్యః ప్రదేయాని దానాన్యేవ చ షోడశ (8) సతీపయశ్చ కాశ్మీరమనుపానం ప్రకథ్యతే । సర్వరోగకులఘ్నోఽయం భూతప్రేతనివారకః (9) సర్వప్రయోగశమనస్సర్వ

పాపవినాశకః । ఆయుర్వర్ధయతే నృణామశ్విభ్యాం నిర్మితః పురా । మహో త్రైలోక్యవిఖ్యాతశ్చిన్తామణిరయం మతః (10)

అ॥ సువర్ణభస్మ 8 భా, వెండిభస్మ 7 భా, ఇత్తడిభస్మ 1 భా, కంచుభస్మ 1 భా, వర్తలోహభస్మ 1 భా, తామ్రభస్మ 4 భా. తగరభస్మ 6½ భా, సీసభస్మ 6½ భా, ఇనుపభస్మ 14 భా, ఉక్కుభస్మ 14 భా, మాండూరభస్మ 14 భా, కాంతభస్మ 14 భా, ముత్యభస్మ 4 భా, పచ్చలభస్మ 4 భా, వజ్రభస్మ 4 భా, కెంపులభస్మ 8 భా, పగడభస్మ 8 భా, గోమేదకభస్మ 9 భా, పుష్యరాగభస్మ 9 భా, వైడూర్యభస్మ 10 భా, ఇంద్రనీలభస్మ 10 భా, హేమమాక్షికభస్మ 7 భా, శు॥ ఉల్లిపాషాణము, వెల్లిపాషాణము, శంఖపాషాణము దొడ్డిపాషాణము గౌరీపాషాణము ఇవి 16 భా, శు॥ సౌవీరపాషాణము 1 భా, శు॥ పుష్పాంజనము స్రోతోఽంజనము నీలాంజనము రసాంజనము సౌవీరాంజనము ఇవి 13 భా, శు॥ రసము 100 భా, శు॥ గంధకము 200 భా, నవాసారము 60 భా, వీనిని ఖల్వములో నూరి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు దీపాగ్ని, కమలాగ్ని, మందాగ్ని, గాఢాగ్ని, వీనిచే 10 రోజులు వండి సాంగశీతలమున తీయవలయును. నాలుగువేల బ్రాహ్మణులకు అన్నదానమును, నవగ్రహజపమును, అష్టదిక్పాలకార్చనను, బ్రాహ్మణులకు పదునారు దానములను చేసి, ఈ మందును చనుబాలు, కుంకుమపువ్వు, వీని అనుపానముతో సేవించినచో సమస్త రోగములును, భూతములును, ప్రేతములును, సర్వప్రయోగములును, సమస్త పాపములును, నశించును. ఆయువు అభివృద్ధి నొందును. ఈ మహాత్రైలోక్య చింతామణి పూర్వకాలమునందు అశ్వినీదేవతలచే చెప్పబడెను.

## ప్రతాపలంకేశ్వరము

శ్లో॥ ఏకేన్దుచన్ద్రాగ్నిలవార్ధిదన్తికలైకభాగం క్రమశో విమిశ్రమ్ । సూతాభ్రగన్ధోషణలోహశఙ్ఖవన్యోత్పలాభస్మ విషంచ పిష్టమ్ (1) ప్రసూతి వాతేఽనిలదన్తబాధే సార్ద్రామ్బునా వల్లమముష్య దద్యాత్ । వాతామయే శ్లేష్మగదేఽర్శసి స్యాత్పురామృతాద్రద్రాతిఫలాయుతోఽయమ్ (2) సశృఙ్గి వేరద్రవ ఏష హన్తి ససంనిపాతం జ్వరముగ్రరూపమ్ । నిజానుపానైర్నిజపథ్యయుక్తస్సర్వాతిసారాన్ గ్రహణీవికారాన్ । ప్రతాపలఙ్కేశ్వరనామధేయోరసః ప్రయుక్తోగిరి రాజపుత్ర్యా (3)

అ॥ శు॥ రసము 1 భా, అభ్రకభస్మ 1 భా, శు॥ గంధకము 1 భా, పిప్పళ్ళు 3 భా, లోహభస్మ 4 భా, శంఖభస్మ 8 భా, అడవిపిడకలభస్మ 1/16 భా, శు॥ నాభి

1 భా, వీనిని నూరవలయును. దీనిని అల్లపురసముతో వల్లప్రమాణముగ సేవించిన యెడల సూతికావాతమును, వాతముచే పుట్టిన దంతములతీపును, నశించును. వాత వ్యాధులు, శ్లేష్మవ్యాధులు, అశోస్సు, వీనియందు గుగ్గులు, తిప్పతీగ, అల్లము, త్రిఫలములు, వీనితోడను సంనిపాతజ్వరము, కఠినజ్వరములు, వీనియందు శొంఠిరసము తోడను సమస్తమైన అతిసారములు, గ్రహణిదోషములు, వీనియందు వానికి తగిన అనుపానములతోడను పథ్యములతోడను సేవింపవలయును. ఈ ప్రతాపలంకేశ్వరము పార్వతీదేవిచే చెప్పబడినది.

## లఘుప్రతాపలంకేశ్వరము

వ॥ శు॥ నాభి, శిలాజతుభస్మ, శు॥ తాళకము, శు॥ పాదరసము, శు॥ గంధకము, పొ॥ వెలిగారము, తామ్రభస్మ, ఉక్కుభస్మ, పిప్పళ్ళు, వీనిని సమభాగములుగ గ్రహించి చిత్రమూలము, అల్లము, వీనియొక్క రసములతో మర్దించి కప్పెలు కట్ట వలయును. దీనిని రెండు గురువిందగింజల పరిమితిగ అనుపానవిశేషములతో సేవించినచో సూతికావాతము, సూతికాజ్వరము, వాతవ్యాధులు, క్షయ, పాండువు, సంనిపాతములు, శ్లేష్మవ్యాధులు, మొదలగునవి నశించును.

## మహాప్రతాపలంకేశ్వరము

శ్లో॥ మృతసూతం మృతం తామ్రం మృతం వజ్రం సువర్ణకమ్। ప్రవాల ముక్తాదరదం మాక్షికం చ మనశ్శిలా (1) గన్ధకం తాలకం తారం కాన్తం తీక్ష్ణం చ ముణ్డకమ్। లోహాభ్రేనాగవఙ్గే చ కాంస్యం రీతిస్సమం సమమ్ (2) మర్దయేచ్చిత్రకద్రావైర్ద్వినం చ నిరన్తరమ్। హంసపాదీర సైః పశ్చాద్దినమేకం విమర్దయేత్ (3) ఉన్మత్తముణ్డిజ ద్రావైర్దినం తద్గోలకీ కృతం। తద్గోలం సంపుటే రుద్ధ్వా పచేల్లఘుపుటే తథా (4) స్వాఙ్గశీతం విచూ ర్ణ్యాథ తత్సమం వత్సనాభకమ్। దత్వాచూర్ణీకృతం సర్వమేషాం ద్రావైశ్చ భావయేత్ (5) నిర్గుణ్డీ భృఙ్గ రాజశ్చమహావృక్షాగ్ని ముణ్డికాః। దుత్తూరాద్రకా ద్రవైస్త్రైవ దినమేకం పృథక్పృథక్ (6) మర్దయేచ్ఛోషయేచ్చాథ తామ్రపా త్రాన్తరే క్షిపేత్। యామార్ధం వాలుకాయన్త్రే పాచయేత్స్వాఙ్గశీతలమ్(7)ఖల్వ మధ్యే వినిక్షిప్య చూర్ణీకృత్య తు పూర్వవత్। హాలాహలం సమం యోజ్యం శృఙ్గవేరరసేన తు (8) పునస్సమ్మర్ద్య తద్భావ్యం పఞ్చపిత్తైర్భిషగ్వరః।

సూతస్య చ సమం దేయం గరళం కృష్ణసర్పజమ్ (౮) ఏకీకృత్య తు తత్స ర్వం శ్లక్ష్ణం ఖల్వే విమర్దయేత్ । గుఞ్జైకమనుపానేన శృఙ్గవేరరసేన తు (10) సంనిపాతే మహాఘోరే సర్వత్రైవ ప్రదాపయేత్ । దేశకాలవయోఽవస్థా చతురో భిషగుత్తమః (11) ద్రాక్షాదాడిమఖర్జూరఫలం దేయం చ ఖాదయేత్ । రసస్యాస్య ప్రభావేణ హ్యపమృత్యుర్భవేద్ధ్రువమ్ (12) రసః ప్రతాపల ఙ్కేశో శ్రీధన్వన్తర్యుదా హృతః । దేవాసురమహాయుద్ధే సంనిపాతేన పీడితాః (13) తేషాం సంజీవనార్థాయ ప్రయుక్తశ్చ మహర్షిభిః । అచిన్త్య మహిమా హ్యేష ఉపచారేణ మానవైః । తస్మాత్సర్వప్రయత్నేన కర్త వ్యోఽయం మహారసః (14)

అ॥ రసభస్మ, తామ్రభస్మ, వజ్రభస్మ, సువర్ణభస్మ, పగడభస్మ, ముత్యాభస్మ, శు॥ ఇంగిలీకము, మాక్షికభస్మ, శు॥ మణిశిల, శు॥ గంధకము, శు॥ తాళకము, వెండి భస్మ, కాంతభస్మ, తీక్ష్ణలోహభస్మ, ముండలోహభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ, వంగభస్మ, కంచుభస్మ, ఇత్తడిభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి చిత్రమూలరసముతో రెండురోజులు నిరంతరము మర్దించి హంసపాది, ఉమ్మెత్త, బోడసరము, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ ఒక్కొక్కరోజు మర్దించి మాత్రలు చేసి ఆ మాత్రలను మూకళ్ళయందుంచి సంధిబంధనముచేసి లఘుపుటమువేసి సాంగశీతలమున తీసి మార్దించి దీనితో సమానమగు శు॥ నాభిని కలిపి నూరి వావిలి, గుంటగలగర, జెముడు, చిత్రమూలము, బోడతరము, ఉమ్మెత్త, అల్లము, వీనితో ప్రత్యేకముగా ఒక్కొక్క దినము చొప్పున భావనచేసి నూరి ఎండించి తామ్రపాత్ర యందుంచి వాలుకాయంత్రమునందు అరజాము వండి సాంగశీతలమున తీసి ఖల్వమందు నూరి దీనికి సమానమగు శు॥ నాభిని కలిపి శొంఠిరసముతో మర్దించి పాము, నెమలి, తాబేలు, దున్నపోతు, మేక, వీనియొక్క చేదులతో భావనచేసి నల్లత్రాచు పాముయొక్క గరళమును రసభస్మముతో సమానముగ కలిపి మెత్తగ నూరవలయును. దేశము, కాలము, వయస్సు వ్యాధ్యవస్థ, వీనిని గుర్తెరిగిన వైద్యుడు దీనిని ఒక గురివింద గింజ పరిమితిగ శుంఠిరసానుపానముతో మహాఘోరమైన సంనిపాతమునందును సర్వ వ్యాధులయందును ఇయ్యవలయును. దీనిని సేవించునప్పుడు ద్రాక్షపండ్లను దానిమ్మ పండ్లను ఖర్జూరపండ్లను పుచ్చుకొనవలయును. దీనియొక్క ప్రభావముచే మృత్యువు నశించును. ఈ ప్రతాపలంకేశ్వరము ధన్వంతరిచే చెప్పబడినది. దేవరాక్షసయుద్ధము నందు సంనిపాతముచే బాధింపబడినవారిని జీవింపజేయుటకు మునీశ్వరులచే ప్రయోగింప బడినది. గొప్ప మహిమ కలది. కావున దీనిని మనుజులు సర్వప్రయత్నములచేతను చేయవలయును.

## పాషాణప్రతాపలంకేశ్వరము

వ॥ రసభస్మ, సువర్ణభస్మ, సీసభస్మ, వంగభస్మ, సత్తుభస్మ, లోహభస్మ, త్రాడ్డిభస్మ, ఇత్తడిభస్మ, శు॥ ఉల్లిపాషాణము, నెల్లిపాషాణము, గౌరీపాషాణము, దొను పాషాణము, శంఖపాషాణము, వీనిని సమభాగములుగను శు॥ గంధకమును వీని అన్నిటికి రెట్టింపుగను గ్రహించి ఖల్వమునందుంచి కలుబందరసముతో ఏడురోజులు నూరి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు గాఢాగ్నిచే ఈమందు కరుగు వఱకు వండి సాంగశీతలమున తీసి సాంబ్రాణియాకు, వావిలియాకు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులును కాకరాకు, తమలపాకు తొడిమెలు, వీని రసములతో ప్రత్యేకముగ మూడేసిజాములును తులసియాకురసముతో ఒకజామును మర్దించి మాత్రలుచేసి నీడను ఎండించవలయును. దీనిని అనుపానవిశేషములతో పాతిక ఎత్తు చొప్పున సేవించినచో సూతికావాతములు, సూతికాజ్వరములు, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, క్షయ, భగందరము, అసాధ్యవ్రణము, సంనిపాతములు, దోషజ్వరములు, సవాయివ్యాధులు, మొదలగు అసాధ్యవ్యాధులు నశించును. ఈ పాషాణప్రతాపలంకేశ్వరము నుపయోగించునప్పుడు కఠినపథ్యము చేయవలయును.

## నవరత్నచింతామణి

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం కాన్తం లోహం చ మాక్షికమ్ । పారదం గన్ధకం నీలం రాజావర్తం తురుష్కరమ్ (1) వైక్రాన్తం వజ్ర వైడూర్యే నాగం వఙ్గం వరాటకమ్ । గోమేదకం పుష్యరాగం ప్రవాలం మౌక్తికం శిలా (2) మాణిక్యం గారుడం శఙ్ఖం హరితాలం చ టఙ్కణమ్ । సర్వైస్సమం సూతభస్మ మర్దయేద్వింశతేర్ద్రవ్యయమ్ (3) చిత్రమూలకషాయేణ భావయేదాతపే పుటేత్ । కోలమాత్రాంవటీం చైవఛాయాశుష్కాంచ కారయేత్ (4) కాచకూప్యాం నివేశ్యాథ యన్త్రే విద్యాధరే పచేత్ । దీపాగ్నా పాచయేద్యామ మష్టసఙ్ఖ్యం చ శీతలమ్ (5) తద్రసం ఖల్వమధ్యే తు మర్దయేత్పూర్వవత్క్రమాత్ । ఏకధా సూతసిన్దూరం తత్సమం హాటకం తథా (6) తత్సమంటఙ్కణం చూర్ణం సూక్ష్మచూర్ణం విమర్దయేత్ బాహ్లీకం మృగనాభిం చ వరాలం జాతికాఫలమ్ (7) ప్రత్యేకం పాదభాగం చ మర్దయేద్భావనావిధిః । చిత్రమూలకషాయేణ కేసరామ్లేన వింశతిః (8) మర్దయేద్భావనా త్పూర్వం యథాలాభం నియోజయేత్ । తద్రసం గులికాన్కృత్వా మేదినీ

పుటమాచరేత్ (9) మాసద్వయ గతం చైవ తత్తం సేవయేత్క్రమాత్ । మధుపిప్పలి సంయుక్తమనుపానవిశేషతః (10) తత్తద్రోగానుపానైశ్చ జీవేద్వర్షశతం సుఖీ । క్షయరోగాన్ హరత్యేష సప్తధాతుగతాన్ హరేత్ (11) నాశయేత్ శ్లేష్మరోగాంశ్చ మూత్రకృచ్ఛ్రాంశ్చ నాశయేత్ । ప్రమేహాన్వింశతిం చైవ పైత్యరోగాంశ్చ నాశయేత్ (12) పాండుశోఫోదరానాహ గుల్మప్లీహాతిసారజిత్ । అమ్లపిత్తం గ్రహణికామజ్గదాహం చ నాశయేత్ (13) మూత్రబన్ధాతిసారౌ చ లిజ్గశూలాక్షిరోగజిత్ । శోధకస్సర్వ రోగాణాం శోషయేద్భ్రమరోగకాన్ (14) ఉన్మాదాంశ్చ హరత్యేష శిరోభ్రమణకమ్పనే, సూతికాజ్వరవాతఘ్నో జ్వరం నానావిధం హరేత్ (15) వ్రణానాం వింశతిం చైవ వన్ధ్యారోగనివారకః । కామలాత్రితయం చైవ సంనిపాతం చ దారుణమ్ (16) సుసన్తానకరో వృష్యస్తేజోబుద్ధిబలప్రదః । అయం చ సర్వరోగాంశ్చ నాశయేన్నాత్రసంశయః (17) సర్వలోకహితార్థాయ చాత్రేయ మునిభాషితః । చిన్తామణిం నవరత్నం సర్వరోగేషు యోజయేత్ (18)

అ॥ సువర్ణభస్మ, రజతభస్మ. తామ్రభస్మ, కాంతభస్మ, లోహభస్మ, మాక్షికభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, నీలభస్మ, రాజావర్తభస్మ, తురుష్కరభస్మ, వైక్రాంతభస్మ, వజ్రభస్మ, వైడూర్యభస్మ, సీసభస్మ, వంగభస్మ, గవ్వలభస్మ, గోమేదకభస్మ, పుష్యరాగభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, శు॥ మణిశిల, మాణిక్యభస్మ, గారుడభస్మ, శంఖభస్మ, శు॥ తాళకము, పొం॥ వెలిగారము, వీనిని ఒక్కొక్క భాగముగను రసభస్మను వీని అన్నిటికిని సమభాగముగను గ్రహించి చిత్రమూలకషాయముతో నలుబదిరోజులు మర్దించి భావనచేసి సూర్యపుటమువేసి రేగుపండు పరిమితి మాత్రలుచేసి నీడను ఎండించి కాచకుప్పెయందుంచి విద్యాధరయంత్రమునందు దీపాగ్నిచే నెనిమిదిజాములు వండి చల్లారిన పిదప తీసి ఖల్వమందుంచి చిత్రమూలకషాయముతో పూర్వమందువలెనే మర్దించి భావనచేసి రససిందూరము 1 భా, సువర్ణభస్మ 1 భా, పొం॥ టంకణము 1 భా, వీనిని కలిపి మెత్తగనూరి కుంకుమపువ్వు $\frac{1}{4}$ భా, కస్తూరి $\frac{1}{4}$ భా, లవంగములు $\frac{1}{4}$ భా, జాజికాయలు $\frac{1}{4}$ భా, వీనిని కలిపి చిత్రమూలకషాయముతోడను, మాదీఫలరసముతోడను ఇరువదిరోజులు మర్దనను, భావనను చేసి మాత్రలుచేసి మూకళ్లయందుంచి భూమిలో పాతిపెట్టి రెండు మాసములైన పిదప తీయువలయును. దీనిని తేనె, పిప్పళ్లు, వీనితోగాని, ఆయా రోగములకు తగిన అనుపానవిశేషములతోగాని సేవించినచో సుఖముకలవాడై నూరు సంవత్సరములు జీవించును. క్షయరోగ

ములు, సప్తధాతుగతవ్యాధులు, శ్లేష్మరోగములు, మూత్రకృచ్ఛ్రములు, ఇరువది ప్రమేహములు, పైత్యరోగములు, పాండువు, నంజు, ఉదరవ్యాధి, కడుపుబ్బరము, గుల్మము, ప్లీహ, అతిసారము, ఆమ్లపిత్తము, గ్రహణి, శరీరతాపము, మూత్రబంధము, మూత్రాతిసారము, మేహశూల, నేత్రరోగములు, వీనిని నశింపజేయును. సర్వ రోగములను శోధింపజేసి, నశింపజేయును. భ్రమరోగము, ఉన్మాదము, శిరోభ్రమణము, శిరఃకంపము. సూతికాజ్వరము, సూతికావాతము, సమస్త జ్వరములు, ఇరువది ప్రదరములు, వంధ్యారోగము, మూడుకామిర్లు, దారుణమైన సంనిపాతము, వీనిని నశింపజేయును. సుసంతానము, వీర్యవృద్ధి, తేజస్సు, బుద్ధి, బలము, వీనిని కలుగ జేయును. సర్వరోగములను తప్పక నశింపజేయును. సర్వలోకముల యొక్క మేలు కొఱకు ఈ నవరత్న చింతామణి ఆత్రేయమునిచే చెప్పబడినది. దీనిని సమస్త వ్యాధుల యందును సేవింపవలయును.

## నవరత్న చింతామణి

శ్లో॥ మాణిక్యం గారుడం వజ్రం నీలం వైడూర్యమౌక్తికే। గోమేదకం పుష్యరాగం ప్రవాలం తీక్ష్ణతామ్రకే (1) సువర్ణం రజతం వఙ్గం కాన్తం తాలం మనశ్శిలా। గన్ధకం దరదం శఙ్ఖం ప్రత్యేకం కబలగ్రహామ్ (2) ఖల్వోదరే వినిక్షిప్య రసభస్మ సమాంశకమ్। మర్దయేత్పఞ్చరాత్రేణ పఞ్చకోలకషాయకైః (3) భృఙ్గరాజరసైశ్చైవ వజ్రవల్లీరసైస్తథా। నిర్గుణ్డ్యాశ్చ రసేనైవ వనశిగ్రురసైస్తథా (4) వాలుకోత్థద్రవేణార్ద్రనిమ్బుసీరైర్దినత్రయమ్। స్నుహిక్షీరేణ భావ్యం చ ఛాయాశుష్కం చ కారయేత్ (5) అనన్తరం కాచకూప్యాం యన్త్రే విద్యాధరేక్షిపేత్। త్రిదినం పాచయేచ్చైవ లఘుమధ్యోత్తమాగ్నిభిః (6) స్వాఙ్గశీతలమాదాయ చాఘోరేణ ప్రపూజయేత్। మాతులుఙ్గరసైశ్చైవ హ్యార్ద్రజైర్వేల్లజైరసైః (7) త్రిదినం మర్దితం కుర్యాద్గులికాన్నిష్కమాత్రకాన్। ధూపం దీపంచ నైవేద్యం తామ్బూలాద్యర్చనావిధిః (8) దేవబ్రాహ్మణ పూజాం చ ధన్వంతరిసమర్చనమ్। తులసీబిల్వపత్రైశ్చ కమలైః కరవీరకైః (9) ద్వికాలం సేవయేన్నిత్యం చతుర్గుఞ్జం హితాశనః। మాక్షికం మాగధీచూర్ణం లవఙ్గం జీరకం తథా (10) కటుత్రికం చార్ద్రకం చ హ్యజమోదాఽనుపానతః। రాజయక్ష్మహరశ్చైవ రక్తక్షయహరస్తథా (11) శ్లేష్మక్షయహరశ్చాశు వాతమేహా చ నాశ

యేత్ । అసాధ్యరోగే విఖ్యాతః కుక్షిరోగహర స్తథా (12) వాతపిత్తకఫో ద్భూతాన్ సర్వాన్రోగాన్వి నాశయేత్ । నానారోగవినిర్ముక్తో జీవేద్వర్ష శతం నరః । చిన్తామణిః కాశ్యపోక్తో నవరత్నప్రపూర్వకః (13)

అ॥ మాణిక్యములు, పచ్చలు, వజ్రము, నీలము, వైడూర్యము, ముత్యములు, గోమేధకము, పుష్యరాగములు, పగడములు, ఖడ్గలోహము, తామ్రము, సువర్ణము, రజితము, వంగము, కాంతము, వీనిభస్మలు, శు॥ తాళకము, శు॥ మణిశిల, శు॥ గంధకము, శు॥ ఇంగిలీకము, శంఖభస్మ, వీనిని ప్రత్యేకముగ కర్ష ప్రమాణముగను, రసభస్మను వీని యన్నిటికిని సమానముగను గ్రహించి ఖల్వమందుంచి పంచకోలములు, గుంటగలగర, నల్లేరు, వాకిలి, అడవిమునగ, వీని రసములతో ఐదురోజులు మర్దించి కొతురుబుడమ, అల్లము, వేప - వీని రసములతో మూడురోజులు మర్దించి జెముడు పాలతో భావనచేసి నీడను ఎండించి కాచకుప్పెయందుంచి విద్యాధరయంత్రమునందు లఘు మధ్యమ ఉత్తమ అగ్నులచే మూడురోజులు వండి సాంగశీతలమున తీసి అఘోర మంత్రముచే పూజించి మాదీఫలము, అల్లము, వాయువిడంగములు. వీని రసములతో మూడురోజులు మర్దించి నిష్క ప్రమాణముగ కుప్పెలు కట్టవలయును. ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము మొదలగు అర్చనము, దేవతలను, బ్రాహ్మణులను పూజించుట, తులమాశేసు, కమలములు, గన్నేరు వీని పత్రములతో ధన్వంతరిని పూజించుట వీనిని చేసి తేనె, పిప్పళ్లచూర్ణము, లవంగములు, జీలకర్ర, త్రికటుక ములు, అల్లము, వాము, వీనియొక్క అనుపానముతో నాలుగు గురివిందగింజల పరిమితిగ ఉదయమునందును, సాయంకాలమునందును, సేవించి హితాహారమును భుజించినచో రాజయక్ష్మ, రక్తక్షయ, శ్లేష్మక్షయ, వాతవ్యాధులు, మేహవ్యాధులు, అసాధ్యవ్యాధులు, ఉదరరోగములు, వాతపిత్తకఫములచే జనించిన సమస్త వ్యాధులు, ఇవి నశించును. దీనిని సేవించువాడు ఏ విధమైన వ్యాధియు లేనివాడై నూరు సంవత్సర ములు జీవించును. ఈ నవరత్నచింతామణి కాశ్యపమునిచే చెప్పబడినది.

## నవరత్నచింతామణి (ప్రకారాంతరము)

వ॥ మాణిక్యభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, తార్క్ష్యభస్మ, పుష్యరాగభస్మ, వజ్రభస్మ, నీలభస్మ, గోమేధకభస్మ, వైడూర్యభస్మ, విమలభస్మ, వైక్రాంతభస్మ, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, ఖడ్గలోహభస్మ, ఇనుపభస్మ, కంచుభస్మ కాంతలోహభస్మ, వర్తలోహభస్మ, శు॥ కపరి, ఇత్తడిభస్మ, సత్తుభస్మ, శు॥ మైల తుత్థము, శు॥ పాలతుత్థము, సీసభస్మ, వంగభస్మ, శు॥ మణిశిల శు॥ పంచాంజనములు,

పాండువు, నంజు, అపస్మారము, క్షతక్షయ, రక్తశ్వాస, ఇవి హరించును. ఇది పంచలోహరసాయనమని చెప్పబడును.

## పంచలోహరసాయనము (వంటయోగము)

శ్లో॥ స్వర్ణమభ్రం త్రపుః కాన్తం సీసకం రజతం తథా । భస్మ లబ్ధ్వా చ సర్వేషాం షడ్భాగౌ రసగన్ధకౌ (1) వాలుకాయన్త్రికే పాచ్యం మన్ద మధ్యోత్తమాగ్నిభిః । పాతయేద్యామషట్కేణ పఞ్చలోహరసాయనమ్ (2) పువర్ణ వాముణ్డీశిగ్రువాసాఛిన్నాగ్నిభి స్తథా । మర్దయేద్దినమేకైకం భవే న్మేహ హరం తథా (3) ఏకాదశ క్షయన్పాణ్డూన్కామలాన్సర్వశూలకాన్ । విశంతిశ్లేష్మకాన్రోగాన్వాతాశీతిం చ నాశయేత్ (4)

అ॥ సువర్ణభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, వంగభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, సీసభస్మ 1 భా, వెండిభస్మ 1 భా, శు॥ రసము 6 భా, శు॥ గంధకము 6 భా, వీనిని వాలుకాయంత్రమందు మందమధ్యమోత్తమాగ్నులచే ఆరు జాములు వండి గలిజేరు, బోడసరము, మునగ, అడ్డసరము, తిప్పతీగ, చిత్రమూలము, వీనియొక్క రసములతో నొక్కొకరోజు మర్దింపవలయును. ఇది పంచలోహరసాయన మనబడును. సమస్త మేహములు, ఏకాదశక్షయలు, పాండువ్యాధులు, కామిర్లు, సమస్తశూలలు, ఇరువది శ్లేష్మవ్యాధులు, ఎనుబది వాతవ్యాధులు, వీనిని నశింపజేయును.

## నవలోహచింతామణి

శ్లో॥ సువర్ణం రజతం తామ్రమయో నాగం చ వఙ్గకమ్ । రీతిః కాంస్యం చ వర్తం చ నవైతేషాం రజాంసి వై (1) శుదీకృతానాం సర్వే షాం సమభాగాని యోజయేత్ । తతో ద్విభాగం దరదం నవభాగం తు తాల కమ్ (2) సంయోజ్య ఖల్వే నిక్షిప్య కుమారీస్వరసేన చ । ఏవం సర్వం మర్దయిత్వా తచ్చరావేషు నిక్షిపేత్ (3) మృద్వస్త్రలేపనం కృత్వా పుటేచ్చ ద్విశతోత్పలైః । స్వాఙ్గశీతలమాదాయ చిత్రకేణార్ద్రికేణ చ (4) వాసాకుమా రీస్వరసైర్మర్దయేద్భిషగుత్తమః । అనుపానవిశేషేణ ద్విగుఞ్జామాత్రభక్ష ణాత్ (5) ఏకాదశక్షయాంశ్చైవ సంనిపాతాంస్త్రయోదశ । కాసం శ్వాసం చ శూలం చ కుష్ఠరోగం తథైవ చ (6) శ్లేష్మజాన్వివిధాంశ్చైవ వాతాశీతిం చ నాశయేత్ । చిన్తామణిస్సర్వహరో నవలోహ ప్రపూర్వకః (7)

అ॥ సువర్ణభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, ఖడ్గలోహభస్మ, సీసభస్మ, వంగభస్మ, ఇత్తడిభస్మ, కంచుభస్మ, వర్తలోహభస్మ, వీనిని సమభాగములుగను శు॥ ఇంగిలీకమును 2 భాగములుగను శు॥ తాళకమును 9 భాగములుగను గ్రహించి ఖల్వమందుంచి కలుబందరసముతో మర్దించి మూకుళ్లయందుంచి మట్టిపూసినగుడ్డలతో సంధిబంధనము జేసి రెండువందల పిడకలతో పుటమువేసి స్వాంగశీతలమున తీసి చిత్రమూలము, అల్లము, ఆడ్డసరము, కలుబంద, వీని రసములతో మర్దింపవలయును. దీనిని అనుపాన విశేషముతో రెండుగురివిందగింజల పరిమితిగ సేవించినచో ఏకాదశక్షయలు, త్రయోదశసంనిపాతములు, కాస, శ్వాస, శూల, కుష్ఠము, సమస్త శ్లేష్మవ్యాధులు, ఎనుబది వాతవ్యాధులు, వీనిని నశింపజేయును. ఈ నవలోహచింతామణి సర్వరోగములను హరింపజేయును.

గద్య. ఇతీ శ్రీగోదావరీమణ్డలమణ్డనాయమానకోనసీమా న్తర్వర్తిమో
దేకుఱ్ఱుగ్రామవాసినా భూసురాగ్రగణ్యేన శ్రీపాదోపనామ్నా
కౌశికసగోత్రపవిత్రేణ వేఙ్కటేశ్వర పౌత్రేణ సోమయాజి
పుత్రేణ సుబ్బమామ్బాగర్భశుక్తిముక్తాఫలాయమా
నేన సద్గురుసేవాసమాసాదితసాహితీశబ్దశాస్త్రాయు
ర్వేదాదివిద్యానిధానేన భిషగ్వరాయుర్వేద
భూషణాదిబిరుదావళీవిరాజమానేన విద్వ
త్ప్రభుసభాస్థానసమ్మాననభ్రాజమానేన
సకలసజ్జనవిధేయేన కృష్ణమూర్తి
శాస్త్రిణా ప్రణీతే ఆయుర్వే
దౌషధరత్నాకరే ద్వితీయ
గుచ్ఛస్సమాప్తః.



ఓమ్

శ్రీరస్తు

ఆరోగ్యమస్తు

ఆంధ్ర తాత్పర్య సహిత

# ఆయుర్వేదౌషధరత్నాకరము

## తృతీయ గుచ్ఛము

---

### చూడామణిరసము

శ్లో॥ మృతం సూతం ప్రవాలం చ స్వర్ణం తారం చ వఙ్గకమ్ । ముక్తాశుల్బం తీక్ష్ణమభ్రం సర్వమేకత్ర యోజయేత్ (1) అమృతార్ద్రికకై రాత ముస్తచిత్రకనిమ్బకైః । ఏతైశ్చ పిష్ట్వావటికా కార్యావల్లప్రమాణతః (2) ధాతుస్థం సంనిపాతోత్థం జ్వరం విషమసంభవమ్ । కామశోకసముద్భూతం త్రిదోషజనితం తథా (3) కాసం శ్వాసం చ వివిధం శూలం సర్వాఙ్గసంభవమ్ । శిరోరోగం కర్ణశూలం దన్తశూలం గలగ్రహమ్ (4) వాతపిత్తసముద్భూతం గ్రహణీం సర్వసంభవామ్ । ఆమవాతం కటీశూలం వహ్నిమాన్ద్యం విషూచికామ్ (5) అశాంసి కామలాం మేహం మూత్రకృచ్ఛ్రాది కంజయేత్ । తత్సర్వం నాశయత్యాశు విష్ణుచక్రమివాసురాన్ । చూడామణి రసో హ్యేష శివేన పరికీర్తితః (6)

ఆ॥ రసభస్మ, పగడభస్మ, సువర్ణభస్మ, రజతభస్మ, వంగభస్మ, ముత్యభస్మ, తామ్రభస్మ, తీక్ష్ణలోహభస్మ, అభ్రకభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి తిప్పతీగ, అల్లము, నేలవేము, తుంగగడ్డలు, చిత్రమూలము, వేపచెక్క, వీనియొక్క రసములతో నూరి వల్లపరిమితిగ మాత్రలు చేయవలయును. దీనిని సేవించినచో ధాతుగతజ్వరము, సంనిపాతజ్వరము, విషమజ్వరము కామజనితజ్వరము, శోకజనిత జ్వరము, త్రిదోషజనితజ్వరము, దగ్గు, ఆయాసము, సర్వశరీరమునందు పుట్టిన శూల,

శిరోరోగము, కర్ణశూల, దంతశూల, కంఠము పట్టుకొనిపోవుట, వాతపిత్తమువలన పుట్టిన గ్రహణి, త్రిదోషజనిత గ్రహణి, ఆమవాతము, కటిశూల, అగ్నిమాంద్యము, విషూచి, మూలవ్యాధి, కామిర్లు, మేహము, మూత్రకృచ్ఛ్రము, మొదలగు వ్యాధులను విష్ణుచక్రము రాక్షసులనువలె ఖండించును. ఈ మూడామణిరసము ఈశ్వరునిచే చెప్పబడెను.

## గ్రహణీమాతంగకంఠీరవము

శ్లో॥ గన్ధం పారదమభ్రకం చ దరదం లోహం చ జాతీఫలం। బిల్వం మోచరసము విషం ప్రతివిషాం వ్యోషం తథా ధాతకీమ్ । భృఙ్గామప్యభయాం కపిత్థజలదౌ దీప్యానలౌ దాడిమం । టఙ్కాఽద్భస్మ కలిఙ్గకాఙ్కా కనకజం బీజం చ పక్షేక్షణమ్ (1) ఏతత్పాదమఫేనమేతదఖిలం సంమర్ద్య సంచూర్ణయేత్ । ధత్తూరచ్ఛదజై రసైశ్చ మతిమాన్ కుర్యాన్మరీచాకృతిమ్ । దత్తాసా గ్రహణీ గదం సరుధిరం సామం సశూలం చిరా । తీసారం విని హాన్తి జ్వాత్తిసహితం తీవ్రాం విషూచీమపి । దుస్సాధ్యామపి బిమ్బసీం పరిహరేదుత్తాసు పానైరయం । నామ్నా తు గ్రహణీమతఙ్గజమదధ్వంసీ చ కణ్ఠీరవః (2)

ఆ॥ శు॥ గంధకము, శు॥ పాదరసము, అభ్రకభస్మ, శు॥ ఇంగిలీకము, లోహభస్మ, జాజికాయ, మారేడు, బూరుగబంక, శు॥ నాభి, అతివస, త్రికటుకములు, ఆరెపువ్వు, శు॥ గంజాయి, కరక్కాయ, వెలగ, తుంగగడ్డలు, జీలకర్ర, చిత్రమూలము, దానిమ్మబెరడు, వెలిగారభస్మ, కొడిశపాలవిత్తులు, శు॥ ఉమ్మెత్తవిత్తులు, ఈ ఇరువదిరెండింటిని సమభాగములుగను శు॥ నల్లమందును వీనియన్నిటికి నాల్గవ వంతుగను గ్రహించి ఉమ్మెత్తాకుల రసముతో మర్దించి మిరియాలవలె మాత్రలను చేయవలయును. దీనిని ఆయా అనుపానములతో సేవించినయెడల రక్తముతోడను, ఆముముతోడను, కడుపునొప్పితోడను కూడిన గ్రహణీరోగము, బాధతో కూడిన చిరకాలమునుండియున్న అతిసారము, కఠినమైన విషూచి, దుస్సాధ్యమైన విలంబిక, వీనిని నశింపజేయును. ఇది గ్రహణీమాతంగకంఠీరవమని చెప్పబడును.

## జీవదరసము

శ్లో॥ సూతభూతిం తామ్రమతారే ముణ్డం తీక్ష్ణలమాక్షికాన్ । వహ్నిటఙ్కణకౌ వ్యోషం సమం సమ్మర్ధయేద్దినమ్ (1) పాఠానిర్గుణ్డికా చిత్రబిల్వ

మూలార్ద్రికై స్తథా । తతో మూషాగతం రుద్ధ్వావిపచేద్భూధరే పుటే (2) మాషైకం కృష్ణశుణ్ఠీభ్యాం పాయయేచ్చ విచక్షణః । మన్దమగ్నిం కరోత్యాశు కాలాగ్నిసమతేజసమ్ (3) పర్వతా అపి జీర్యన్తి ప్రాశనాదస్య దేహినః । దుర్నామపాణ్డుశ్వయథుకుష్ఠప్లీహోదరాపహః (4) అఞ్జనేనాథవా నస్యాత్ సన్నిపాతం జయేత్ ధ్రువమ్ । జీవదాఖ్యరసశ్చాయం జీవం దాస్యతి దేహినః (5)

అ॥ రసభస్మ, తామ్రభస్మ, రజతభస్మ, ముండలోహభస్మ, తీక్ష్ణలోహభస్మ, శు॥ తాళకము, మాక్షికభస్మ, చిత్రమూలము, శు॥ వెలిగారము, త్రికటుకములు, వీనిని సమభాగములుగ గ్రహించి చిరుబొద్ది, వావిలి, చిత్రమూలము, మారేడువేళ్లు, అల్లము, వీనియొక్క రసములతో నొక్కొక్కరోజు మర్దించి మూసయందుంచి సంధి బంధనముచేసి భూధరపుటము వేయవలయును. దీనిని మిరియాలు, శుంఠి, వీనితో మాషపరిమితిగ నిచ్చినయెడల మందగించిన జాఠరాగ్నిని ప్రళయకాలాగ్నితో సమానమైన దానినిగ చేయును. ఈ యౌషధమును సేవించినవానికి పర్వతములు కూడ జీర్ణమగును. ఇది అర్శస్సు, పాండువు, నంజు, కుష్ఠము, ప్లీహోదరము, వీనిని నశింప చేయును. కంటియందు కలికముగ గాని ముక్కునందు నస్యముగ గాని ఉపయోగించి నచో సంనిపాతము నిశ్చయముగ నశించును. ఇది జీవదరసమనబడును. ప్రాణులకు జీవము నిచ్చును.

## పుష్పహాసరసము

శ్లో॥ సువర్ణమభ్రకం ముక్తాం తామ్రం నాగం చ వఙ్గకమ్ । పారదం గన్ధకం చైలాం కుఙ్కుమం చన్దనం తథా (1) కేసరం జాతికోశం చ లవఙ్గం మృగనాభికామ్ । పిప్పలీం మరిచం పథ్యాం కర్పూరం సమభాగకమ్ (2) నీలోత్పలస్య నీరేణ మర్దయేత్ప్రహరద్వయమ్ । వటికా గుఞ్జమాత్రేణ కరోతి వివిధాన్ గుణాన్ (3) మధుమేహం చేక్షుమేహం సికతామేహమేవ చ । బహుమూత్రం మూత్రకృచ్ఛ్రం ప్రమేహాన్ వింశతిం జయేత్ (4) వీర్యవృద్ధి కరం పుంసాం శుక్రస్తమ్భకరం పరమ్ । ఉత్సాహం జనయేత్పుంసాం నారీణాం చ తథైవ చ। పుష్పహాసరసో నామ్నా పార్వతీపతి భాషితః (5)

అ॥ సువర్ణభస్మ, అభ్రకభస్మ, ముత్యభస్మ, తామ్రభస్మ, సీసభస్మ, వంగభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, ఏలకులు, కుంకుమపువ్వు, మంచిగంధము, నాగకేసర

ములు, జాపత్రి, లవంగిములు, కస్తూరి, పిప్పళ్లు, మిరియాలు, కరక్కాయలు, పచ్చ కర్పూరము, వీనిని సమభాగములుగ గ్రహించి నల్లకలువరసముతో రెండుజాములు మర్దించి గురివిందగింజపరిమితిగల మాత్రలను చేయవలయును. దీనిని సేవించినయెడల అనేకములైన మంచి గుణములను చేయును. మధుమేహము, ఇక్షుమేహము, సికతా మేహము, బహుమూత్రము, మూత్రకృచ్ఛ్రము, ఇరువదిప్రమేహములు, వీనిని నశింపజేయును. వీర్యవృద్ధిని, శుక్రస్తంభనమును చేయును. పురుషులకును, స్త్రీలకును, ఉత్సాహమును కలిగించును. పుష్పహాసరస మనబడును. ఈశ్వరునిచే చెప్పబడినది.

## జ్వరగణాంతకరసము

శ్లో॥ సంభూతం దరదాత్సూతం గన్ధకం టఙ్కణం తథా । తామ్రం వఙ్గం మాక్షికం చ సైన్ధవం మరిచం తథా (1) సమం సర్వం సమాహృత్య ద్విగుణం స్వర్ణభస్మకమ్ । తదర్ధం కాన్తలోహం చ రౌప్యభస్మాపి తత్సమమ్ (2) ఏతత్సర్వం విచూర్ణ్యాథ భావయేత్కనకద్రవైః । శేఫాలీదలజైశ్చాపి దశమూలరసేన చ (3) కిరాతతిక్తకక్వాథైస్త్రివారం భావయేత్సుధీః । భావయిత్వా తతః కుర్యాద్గుఞ్జాద్వయ మితాం వటీమ్ (4) అనుపానం ప్రయోక్తవ్యం జీరకం మధుసంయుతమ్ । జీర్ణజ్వరం మహాఘోరం చిరకాలసముద్భవమ్ (5) జ్వరమష్టవిధంహన్తి సాధ్యాసాధ్యమథాపి వా । పృథగ్దోషాంశ్చ వివిధాః సమస్తాన్విషమజ్వరాః (6) మేదోమాంసగతం చైవ హ్యాస్థిమజ్జగతం తథా । అన్తర్గతం మహాఘోరం బహిస్థం చ విశేషతః (7) నానాదోషోద్భవం చైవ జ్వరం శుక్రగతం తథా । నిఖిలజ్వరనామాపి హన్తి శ్రీశివశాసనాత్ । జ్వరౌఘాన్తకనామాఽయం రసశ్శ్రీశివనిర్మితః (8)

అ॥ ఇంగిలీకమునుండి తీయబడిన పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ టంకణము 1 భా, తామ్రభస్మ 1 భా, వంగభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, సైంధవలవణము 1 భా, మిరియాలు 1 భా, సువర్ణభస్మ 2 భా, కాంతభస్మ 1 భా, రజతభస్మ 1 భా, వీనినన్నిటిని నూరి ఉమ్మెత్త, వావిలాకు, దశమూలములు, నేలవేము, వీనియొక్క రసములతో మూడేసిసార్లు భావనచేసి రెండుగురివిందగింజల పరిమితిగల మాత్రలను చేయవలయును. దీనిని జీలకర్ర, తేనె, వీనియొక్క అనుపానముతో సేవించినయెడల మహాఘోరమైనట్టియు, చిరకాలమై జనించినట్టియు, జీర్ణజ్వరము, సాధ్యములైనట్టియు, అసాధ్యములైనట్టియు ఎనిమిదివిధములైన జ్వరములు, సమస్త

దోషములు సమస్తములైన విషమజ్వరములు, మేదోగతజ్వరము, మాంసగతజ్వరము, అస్థిగతజ్వరము, మజ్జగతజ్వరము, అంతర్గతజ్వరము, ఘోరమైనజ్వరము, బహిర్గతి జ్వరము, అనేక దోషములవలన జనించిన జ్వరము, శుక్రగతజ్వరము, ఇవి హరించును. ఇది ఈశ్వరాజ్ఞచే జ్వరమనే పేరును కూడ హరించును. జ్వరగజాంతకరస మనెడి పేరు కలది. ఈశ్వరునిచే చెప్పబడినది.

## గ్రహణీగజకేసరరసము

శ్లో॥ సూతం గన్ధకమభ్రం చ తారం లోహం చ టఙ్కణమ్ । రసాఞ్జనం మాక్షికం చ శాణమేకం పృథక్పృథక్ (1) లవఙ్గం చన్దనం ముస్తం పాఠాం జీరకధాన్యకే । సమఙ్గాతివిషే లోధ్రం కుటజేన్ద్రియవ త్వచౌ (2) జాతీఫలం విశ్వబిల్వౌ కనకం దాడిమీత్వచమ్ । వరాఙ్గం ధాతకీం కుష్ఠం ప్రత్యేకం రససమ్మితమ్ (3) భావయేత్సర్వమేకత్ర కేశరాజరసైః పునః । చణాభా వటికాః కార్యాశ్ఛాగీదుగ్ధేన పేషితమ్ (4) అనుపానం ప్రదాతవ్యం దగ్ధబిల్వం సమం గుడైః । హన్తి సర్వా నతీసారాన్ గ్రహణీం చిరజామపి (5) ఆమసంపాచకస్సమ్యగ్వహ్ని వృద్ధికర స్తథా । గ్రహణీరోగనాశేన గ్రహణీగజకేసరీ (6)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, అభ్రకభస్మ, రజతభస్మ, లోహభస్మ, శు॥ వెలిగారము, రసాంజనము, మాక్షికభస్మ, లవంగములు, మంచిగంధము, తుంగగడ్డలు, చిరుబొద్ది, జీలకర్ర, ధనియాలు, మంజిష్ఠ, అతివస, లొద్దుగ, కొడిశపాలవిత్తులు, కొడిశపాల పండ్లచెక్క, జాజికాయ, శుంఠి, మారేడు, ఉమ్మెత్తవిత్తులు, దానిమ్మబెరడు, దాసినచెక్క, ఆరెపువ్వు చెంగల్వకోష్టు, వీని నొక్కొక్క శాణపరిమితిగ గ్రహించి గుంటగలగరరసముతో భావనచేసి మేకపాలతో నూరి సెనగగింజల పరిమితిగ మాత్రలను చేయవలయును. దీనిని మారేడుపండు బెల్లము కలిపి యనుపానముతో సేవించినచో సమస్తాతిసారములను, చిరకాలగత గ్రహణీరోగమును, నశింపజేయును. ఆమమును పక్వము చేయును. అగ్నిదీప్తిని జేయును. ఇది గ్రహణీరోగములను నివారింపజేయును. కావున గ్రహణీగజకేసరియని చెప్పబడుచున్నది.

## కనకసుందరరసము

శ్లో॥ రసభస్మ చతుర్థాంశం హేమభస్మ ప్రకల్పయేత్ । తాలకం రసకం తుల్యం మాక్షికం గన్ధకం శిలామ్ (1) రసమానాని యుఞ్జీత సూతపాదం

చ టఙ్కణమ్ ॥ పృథగ్దినం క్రమేణైవ తత్సర్వం మర్దయేద్దృఢమ్ (2) అర్కక్షీరం జయన్తీ చ భృఙ్గో వాసా చ లాఙ్గలీ। అగస్తిశ్చిత్రకః పాఠా మర్ద్యం తేషాంద్రవైః పృథక్ (3) ద్విగుఞ్జం భక్షయేన్నిత్యమనుపానం మృగాఙ్కవత్ । క్షయం హన్తి మహాతీవ్రం రసః కనకసున్దరః (4)

అ॥ రసభస్మ 1 భా॰, సువర్ణభస్మ ¼ భా॰, శు॥ తాళకము 1 భా॰, పాలతుత్థము 1 భా॰ మాక్షికభస్మ 1 భా॰, శు॥ గంధకము 1 భా॰, శు॥ మణిశిల 1 భా॰, పొం॥ వెలిగారము ¼ భా॰, వీనిని గ్రహించి జిల్లేడుపాలు, టెక్కలి, గుంటగలగర, అడ్డసరము, చెన్నచెర్లగడ్డ, అవిసి, చిత్రమూలము, చిరుబొద్ది, వీనియొక్క రసములతో నొక్కొక్కరోజు దృఢముగ మర్దింపవలయును. ఈ కనకసుందరరసమును మృగాంక రసమునకు చెప్పబడిన అనుపానములతో రెండు గురివిందగింజల పరిమితిగ సేవించిన యెడల మంచి తీవ్రమైన క్షయ నశించును.

## మహాకనకసుందరరసము

శ్లో॥ రసస్య తుల్యభాగేన హేమభస్మ ప్రయోజయేత్ । మనశ్శిలాం గన్ధకం చ తుత్థం మాక్షికతాలకే (1) విషం టఙ్కణం సర్వంరసతుల్యం ప్రదాపయేత్ । మర్దయేత్సర్వమేకత్ర ఖల్వపాత్రే చ నిర్మలే (2) భృఙ్గరాజ జయన్త్యోశ్చ పాఠాయా వాసకస్య చ । అగస్తిలాఙ్గలాగ్నీనాం సర్వసైశ్చ పృథక్పృథక్ (3) భావయిత్వా విశోష్యాథ పునశ్చార్ద్రకవారిణా । సప్తధా భావనాచ్చైవరసః కనకసున్దరః (4) గుఞ్జాద్వయం త్రయం వ్యాస రాజ యక్ష్మ ప్రశాన్తయే మధునా పిప్పలీభిర్వా మరిచైర్వా ఘృతాన్వితమ్ (5) సంనిపాతే ప్రదాతవ్యమార్ద్రకస్య రసేన వై । జయపాలరజోభిస్తు గుల్మినే శూలరోగిణే (6) అమ్లవర్జ్యం చరేత్పథ్యం బల్యం హృద్యం రసాయనమ్ । వర్జయేల్లవణం హిఙ్గు తక్రం దధి విదాహి యత్ (7)

అ॥ రసభస్మ, సువర్ణభస్మ, శు॥ మణిశిల, శు॥ గంధకము, శు॥ మైలతుత్థము, మాక్షికభస్మ, శు॥ తాళకము, శు॥ నాభి, శు॥ వెలిగారము, వీనిని సమభాగములుగ గ్రహించి శుభ్రమైన ఖల్వమందుంచి నూరి గుంటగలగర, టెక్కలి చిరుబొద్ది, అడ్డసరము, అవిసె, చెన్నచెర్లగడ్డ, చిత్రమూలము, వీనియొక్క రసములతో వేరువేరుగ భావనచేసి ఎండించి మరల అల్లపురసముతో ఏడుసార్లు భావనచేయవలయును. ఇది

కనకసుందరరసమని చెప్పబడును. దీనిని రెండు లేక మూడు గురివిందగింజల పరిమితిగ తేనె, పిప్పళ్ళచూర్ణము వీనితోగాని మిరియాల చూర్ణము, నెయ్యి, వీనితోగాని సేవించినయెడల క్షయవ్యాధి నశించును. అల్లపురసముతో సేవించినయెడల సంనిపాతము నశించును. శు॥ నేపాళచూర్ణముతో సేవించినయెడల గుల్మము, శూల ఇవి నశించును. దీనిని సేవించినప్పుడు పులుపుపదార్థములు, ఉప్పు, ఇంగువ, మజ్జిగ, పెరుగు, వేడిచేయు వస్తువులు, వీనిని సేవింపరాదు. బలకరములును, హితములును, రసాయనములును, అగు పదార్థములను సేవింపవలయును.

## లఘుకనకసుందరరసము

శ్లో॥ మరీచబలిహిఙ్గులైర్గరలపిప్పలీటఙ్కణైస్సువర్ణ భవబీజకైస్స మలవైర్ద్ధి నార్ధావధి। జయారసవిమర్దితైః కనకసున్దరస్సున్దరి స్మృతో గ్రహణికాజ్వరాతి సృతివహ్నిమాన్ద్యాపహః (1)

అ॥ మిరియాలు, శు॥ గంధకము, శు॥ ఇంగిలీకము, శు॥ నాభి, పిప్పళ్లు, శు॥ టంకణము, శు॥ ఉమ్మెత్తవిత్తులు, లవంగములు, వీనిని సమభాగములుగ గ్రహించి యొకపూట గంజాయియాకు యొక్క రసముతో మర్దింపవలయును. ఇది కనకసుందర రసము అని చెప్పబడును. గ్రహణి, జ్వరము, అతిసారము, అగ్నిమాంద్యము, వీనిని పోగొట్టును.

## మహాసువర్ణకనకసుందరరసము

శ్లో॥ రసగన్ధకనాగాని రసకం మాక్షికాభ్రకే। కాన్తవిద్రుమ ముక్తాశ్చ వజ్రం చైవ చ తారకమ్ (1) భస్మ కృత్వా ప్రయత్నేన ప్రత్యేకం కర్షసం మితమ్। సర్వతుల్యం శుద్ధహేమ భస్మ కృత్వాప్రయోజయేత్ (2) మర్ద యేత్ త్రిదినం సర్వం హంసపాదీరసైర్భిషక్। తతో వై గోలకాన్కృత్వా కాచ కూప్యాం వినిక్షిపేత్ (3) రుద్ధ్వాతత్కాచకూపీం చ సప్తవస్త్రేణ వేష్టితామ్। తతోవై సికతాయన్త్రే త్రిదినం ప్రోక్తవహ్నినా (4) పాచితం స్వాఙ్గశీతం చ పూర్వోక్తరసమర్దితమ్। వినిక్షిప్య కరణ్డేఽథ సంపూజ్య రస రాజకమ్ (5) రాజయక్ష్మ హరశ్చైవ మహాకనకసున్దరః। పాణ్డురోగం శ్వాసకాసౌ కామలాగ్రహణీగదాన్ (6) క్రిమిశోఫోదరావర్తగుల్మ మేహ గుదాఙ్కురాన్। మన్దాగ్నిం ఛర్దిమరుచిం ఛామశూలహలీమకాన్ (7)

జ్వరాన్ద్వన్ద్వాదిజాన్ సర్వాన్ సంనిపాతాంస్త్రయోదశ । పైత్యరోగమపస్మారం వాతరోగాన్విశేషతః (8) రక్తపిత్తప్రమేహాంశ్చ స్త్రీణాం చైవ ప్రసవాం స్తథా । వింశతిశ్లేష్మరోగాంశ్చ మూత్రరోగాన్నిహన్త్యసౌ (9) హేమవర్ణ్యశ్చ బల్యశ్చాప్యాయుశ్శుక్ర వివర్ధకః । సేవనీయో రసశ్చాయం కాశ్యపేన వినిర్మితః (10)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, సీసభస్మ, శు॥ పాలతుత్థము, మాక్షికభస్మ, అభ్రకభస్మ, కాంతభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, వంగభస్మ, రజితభస్మ, వీని నొక్కొక్క కర్ష పరిమితిగను సువర్ణభస్మను వీని అన్నిటికిని సమానముగను గ్రహించి ఖల్వమందుంచి హంసపాదిరసముతో మూడురోజులు మర్దించి మాత్రలు చేసి కాచకుప్పెయందుంచి మూతిని మూసి మట్టిపూసిన వస్త్రములను కుప్పెకు ఏడుసార్లు చుట్టి వాలుకాయంత్రమునందు మూడురోజులు క్రమాగ్నులచే వండి చల్లారినపిదప తీసి హంసపాదిరసముతో మరల నూరి భరణియందుంచి రసరాజును పూజింపవలయును. ఈ మహాకనకసుందరరసమును సేవించినచో రాజయక్ష్మ, పాండువు, శ్వాస, కాస, కామిర్లు, గ్రహణి, క్రిమివ్యాధులు, నంజు, ఉదరరోగము, ఉదావర్తము, గుల్మము, మేహములు, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, వాంతి, అరుచి, ఆమము, శూల, హాలీమకము, ద్వంద్వజ్వరము, మొదలగు సమస్త జ్వరములు, పదమూడుసంనిపాతములు, పైత్యవ్యాధులు, అపస్మారము, వాతవ్యాధులు, రక్తపిత్తము, ప్రమేహములు, శ్వేతప్రదరము, రక్తప్రదరము, ఇరువది శ్లేష్మవ్యాధులు, మూత్రరోగములు ఇవి నశించును. బంగారపుకాంతి, బలము, ఆయువు, శుక్రవృద్ధి, ఇవి కలుగును. సేవింపతగిన ఈ మహాకనకసుందరరసము కాశ్యపునిచే చెప్పబడినది.

## నవరత్నకనకసుందరరసము

శ్లో॥ శుద్ధసూతం చతుస్తోలం వినిక్షిప్య ప్రయత్నతః । హాటకత్రపుతారాణాం రజస్తోలం పృథక్పృథక్ (1) మాక్షికం తోలకం చైవ నవరత్నంచ తోలకమ్ । ఏతేషాం గన్ధకం చైవ ద్విగుణంచ వినిక్షిపేత్ (2) నవసారం చతుస్తోలం నిక్షేప్తవ్యం ప్రయత్నతః । సర్వం ఖల్వతలే క్షిప్త్వా మర్ద్యం చూర్ణంచ కారయేత్ (3) కాచకూప్యాం వినిక్షిప్య పాతాలాఖ్యే చ యన్త్రికే । త్రియామంచ పచేదగ్నౌ స్వాఙ్గశీతలముద్ధరేత్ (4) అనుపానవిశేషేణ దేయం గుఞ్జాచతుష్కకమ్ । క్షయం పాణ్డుం శ్వాసకాసౌ పైత్యా

పస్మారరోగకాన్ (5) రక్తపిత్తం ప్రమేహాంశ్చ ద్వివిధం ప్రదరం తథా ।
సీతానాథేన కథితో రసః కనకసున్దరః (6)

అ॥ శు॥ రసము 4 తులములు, శు॥ బంగారపురజను 1 తు, శు॥ వంగరజను 1 తు, శు॥ వెండిరజను 1 తు, శు॥ హేమమాక్షికము 1 తు, శు॥ నవరత్నములు 1 తు, శు॥ గంధకము 18 తు, నవాసారము 4 తు, వీనిని గ్రహించి ఖల్వమందుంచి మర్దించి చూర్ణముచేసి కాచకుప్పెయందుంచి పాతాలయంత్రమునందు మూడుజాములు వండి సాంగశీతలమున తీయవలయును. దీనిని అనుపానవిశేషముతో నాలుగు గురివిందగింజల పరిమితిగ సేవించినయెడల క్షయ, పాండువు, శ్వాస, కాస, పైత్యవ్యాధులు, అప స్మారము, రక్తపిత్తము, ప్రమేహములు, శ్వేతప్రదరము, రక్తప్రదరము, వీనిని నశింప జేయును. ఈ కనకసుందరరసము సీతానాధునిచే చెప్పబడినది.

## శూలకులకంటకరసము

శ్లో॥ లోహమభ్రం తామ్రభస్మ రసగన్ధే చ తారకమ్ । ఏతానిపలమాత్రాణి కారయేచ్ఛ పృథక్తతః (1) జాతీఫలలవఙ్గాబ్దత్వగేలా టఙ్కరామఠమ్, జీరకం పత్రకం చైవ హ్యాజాజీవిశ్వసైన్ధవమ్ (2) మరిచం త్రివృతం క్షారం ప్రత్యేకం ద్విపలోన్మితమ్ । ధాత్రీరసే వటీం కుర్యాచ్చతుర్గుఞ్జాప్రమాణతః (3) హన్తిశూలం తథా గుల్మం చామవాతం సుదారుణమ్ । హృచ్ఛూలం పార్శ్వశూలం చ చక్షుశ్శూలం హలీమకమ్ (4) శిరశ్శూలం కటీశూలం హ్యానాహం చాష్టశూలకమ్ । క్రిమిరోగోదరవ్యాధీ వాతరక్తం భగన్దరమ్ (5) ఉపదంశమతీసారం గ్రహణ్యర్శః ప్రవాహికాః । శూలకణ్టకనామాఽయం మహేశేన ప్రకాశితః (6)

అ॥ లోహభస్మ 1 పలము, అభ్రకభస్మ 1 ప, తామ్రభస్మ 1 ప, శు॥ రసము 1 ప, శు॥ గంధకము 1 ప, రజతభస్మ 1 ప, జాజికాయలు 2 ప, లవంగములు 2 ప, తుంగగడ్డలు 2 ప, దాసెనచెక్క 2 ప, ఏలకులు 2 ప, శు॥ టంకణము 2 ప, శు॥ ఇంగువ 2 ప, జీలకర్ర 2 ప, ఆకుపత్రి 2 ప, వాము 2 ప, శుంఠి 2 ప, సైంధవలవణము 2 ప, మిరియాలు 2 ప, తెగడ 2 ప, యవక్షారము 2 ప, వీనిని ఉసిరిపండ్ల రసముతో నూరవలయును. దీనిని నాలుగు గురివిందగింజల పరిమితిగ మాత్రలుచేసి సేవించినయెడల శూల, గుల్మము, ఆమవాతము, హృదయశూల, పార్శ్వశూల, నేత్ర

శూల, హాలీమకము, శిరశ్శూల, కటిశూల, ఆనాహము, ఎనిమిది విధములగు శూలలు క్రిమిరోగములు, ఉదరవ్యాధి, వాతరక్తము, భగందరము, ఉపదంశము, అతిసారము, గ్రహణి, అర్శస్సు, జిగటవిరేచనములు, ఇవి హరించును. ఇది శూలకులకంటకము మనబడును. మహేశునిచే చెప్పబడినది.

## అర్ధనారీశ్వరము

శ్లో॥ సువర్ణం పారదో మ్లేచ్ఛం మాక్షికశ్చ మనశ్శిలా । ఏతాని సమ భాగాని మర్దయేత్ ఖల్వమధ్యకే (1) సితఘాసరసే భాణ్డే స్థాప్యంయామద్వ యం తథా । డోలాయన్త్రే పచేత్సమ్యక్ తచ్ఛేషరసభావితమ్ (2) మేషీ క్షీరానుపానేన సర్వజ్వరనివారణమ్ । దక్షిణస్తన్యపానేన తత్పార్శ్వజ్వర నాశనమ్ (3) వామస్తన్యానుపానేన వామపార్శ్వజ్వరం హరేత్ । అర్ధనారీ శ్వరో నామ రసోఽయం సర్వరోగజిత్ (4)

అ॥ సువర్ణభస్మ, శు॥ రసము, శు॥ ఇంగిలీకము, మాక్షికభస్మ, శు॥ మణిశిల, వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి నూరి డోలాయంత్రమందు తెల్లగరికరసముతో రెండుజాములు వండి మిగిలిన (యంత్రమందున్న) రసముతో భావన చేయవలయును. ఇది మేకపాలయొక్క అనుపానముతో సమస్త జ్వరములను హరించును. కుడివైపు పాలతోనిచ్చినయెడల కుడిపార్శ్వమందలి జ్వరమును, ఎడమవైపు పాలతో నిచ్చిన యెడల ఎడమపార్శ్వమందలి జ్వరమును, హరించును. అర్ధనారీశ్వరమనబడును. సమస్త వ్యాధులను హరించును.

## ప్రమేహగజకేసరిరసము

శ్లో॥ సంజాతాం హిఙ్గులాత్సూతం చాఖునా మర్దయేద్బలిమ్ । తయో ర్ద్విగుణితం కాన్తం కన్యయా తు విమర్దయేత్ (1) అభ్రకం వఙ్గకం రౌప్యం ఖర్పరం మాక్షికం తథా । సమం సర్వం సువర్ణం తు ప్రత్యేకం చ రసార్ధకమ్ (2) తత్సర్వం కన్యకాద్రావైర్మర్దయేద్భావయేత్తతః । భేకపర్ణీ రసేనైవ గుఞ్జాద్వయవటీం తతః (3) సితయా భక్షయేచ్చాపి సోమరోగ నివృత్తయే । ప్రమేహాన్వింశతిం హన్తిబహుమూత్రం చ దారుణమ్ (4) బహుదోషం బహువిధం ప్రమేహం మధుసంజ్ఞకమ్ । అస్థిమేహశ్చమేహౌ

చ లాలామేహం వినాశయేత్ (5) వాతికం పైత్తికం చైవ శ్లైష్మికం సోమ రోగకమ్ । నాశయేత్సర్వరోగాంశ్చ ప్రమేహగజకేసరీ (6)

అ॥ ఇంగిలీకమునుండి తీయబడిన పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, వీనిని ఎలుకచెవికూర రసముతో మర్దించి 4 భాగముల కాంతభస్మను కలిపి కలుబంద రసముతో మర్దించి అభ్రకభస్మ 4 భా, వంగభస్మ 4 భా, రజతభస్మ 4 భా, శు॥ కపురి 4 భా, మాక్షికభస్మ 4 భా, సువర్ణభస్మ ½ భా, వీనిని కలిపి కలుబందరసముతో మర్దించి సరస్వతీయాకు రసముతో భావనచేయవలయును. దీనిని రెండుగురివిందగింజల పరిమితిగల మాత్రలనుచేసి పంచదారతో సేవించినయెడల సోమరోగము, ఇరువది ప్రమేహములు, కఠినమైన బహుమూత్రము, బహుదోషములు గలిగినట్టియు అనేక విధములైనట్టియు మధుమేహము, అస్థిమేహము, ఇక్షుమేహము, లాలామేహము, వాతిక పైత్తిక శ్లేష్మిక సోమరోగములు, ఇవి హరించును. మరియు సమస్తవ్యాధులు, హరించును. ఇది ప్రమేహగజకేసరి యనబడును.

## కఫకుఠారరసము

వ॥ శు॥ వెండి 1 తులము, శు॥ రాగి 1 తు, వీనిని ప్రత్యేకముగ గొట్టములు చేయించవలయును. శు॥ రసము 1 తు, శు॥ గంధకము 1 తు, వీనిని నూరి వెండిగొట్టములో పోసి అదిమి రాగిగొట్టమును బోర్లించి యీ వెండిగొట్టమునకు తొడిగి గోధుమ పిండితో మూడుపర్యాయములు కవచమిచ్చి (పైనపూసి) ఆరినపిదప మెత్తని మన్నుతో శీలనిచ్చి బాగుగ ఆరినపిదప క్రొత్తకుండలో నుంచి పైన ఇసుకపోసి పొయిమీదనుంచి దీప్తాగ్నిచే నాలుగుజాములు వండి పిదప ఆ యిసుకమీద గడ్డిపరకలు వేసినయెడల కాలిపోవును. అప్పుడు ఔషధమును తయారైనదానినిగ గ్రహించి మంటను చల్లారినపిదప పైనయిచ్చిన కవచములను చక్కగ తీసివేసి వెండి గొట్టమును, రాగిగొట్టమును, కలిపి నూరినచో భస్మయగును. దీనిని వీసమెత్తు ఇచ్చిన యెడల శ్లేష్మములు, దగ్గు, వగర్పు, వాతవ్యాధులు శ్లేష్మవ్యాధులు మొదలగునవి నశించును.

## శ్లేష్మాంతకరసము

శ్లో॥ మృతసూతాభ్రకే చైవ హేమార్కే తీక్ష్ణభస్మకమ్ । మాక్షికం తాలకం గన్ధం మర్దయేత్తుల్యభాగకమ్ (1) వజ్రవల్లీరసేనైవ తులసీచిత్రకా మ్బునా। వటకాన్ ఛాయయా శుష్కాననుపానవిశేషతః (2) త్రిగుఞ్జాం దాప యేద్వైద్యశ్శ్లేష్మకోపే విశేషతః శ్వాసేషు చ సమస్తేషు కాసరోగే తథైవ

చ (3) క్షయే పాణ్డౌ తథా శూలే పాతశ్లేష్మదదేషు చ । శ్లేష్మాన్తకరసో నామ్నా సూర్యవాక్యాన్సర్యభాషితః (4)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, తామ్రభస్మ, ఖడ్గలోహభస్మ, మాక్షికభస్మ, శు॥ తాళకము, శు॥ గంధకము, వీనిని సమభాగములుగ గ్రహించి నల్లేరు, తులసి, చిత్రమూలము, వీనియొక్క రసములతో మూడుగురివిందగింజల పరిమితిగ శ్లేష్మప్రకోపము, సమస్తశ్వాసలు, కాస, క్షయ, పాండువు, శూల, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వీనియం దియ్యవలయును. ఇది శ్లేష్మాంతకరస మనబడును. సూర్యునిచే చెప్పబడినది.

## బ డ బా న ల ర స ము

సీ॥ రసకాంతహాటకాభ్రక హేమమాక్షికతామ్రభస్మంబులు తాళకమును । నీలాంజనము శుద్ధనీరధిఫేనముల్ లవణపంచకమును లాలితముగ । సమభాగములు బొమ్మజెముడుపాలను నూరి దినము భూధరయంత్రమునను వండి । తీసి యల్లపురసమువేసి నూరిన నది బడబానలంబని ప్రణుతికెక్కు । దుర్వారమైనట్టి సర్వరోగంబుల నిర్మూలనముజేసి నెగడుచుండు । ముదముతో పిప్పలీమూలజలంబున పిప్పలితోనైన ప్రేమమలర । మాషమాత్రంపు సేవ నిశ్శేషముగను । కఠినమౌ శృంఖవాతముల్ కఠినదండ । వాతముల్ బహు కటి గుల్ఫవాతములను । పక్షజానుధనుర్వాత ప్రతతులడచు ॥

అ॥ శు॥ రసము, కాంతభస్మ, సువర్ణభస్మ, అభ్రకభస్మ, హేమమాక్షికభస్మ, తామ్రభస్మ, శు॥ తాళకము, నీలాంజనము, శు॥ సముద్రపునురుగు, పంచలవణములు, వీనిని సమభాగములుగ గ్రహించి బొమ్మజెముడుపాలతో నూరి భూధరయంత్రమందు ఒకరోజు వండి తీసి అల్లపురసముతో నూరవలయును. మహాబడబానల మనబడును. ఇది సమస్త వ్యాధులను పోగొట్టును. మోడికషాయముతో గాని పిప్పళ్లకషాయముతో గాని మాషపరిమితిగ సేవించినయెడల కఠినమైన శృంఖలావాతము, కఠినమైనదండవాతము, బాహువాతము, కటివాతము, గుల్ఫవాతము, పక్షవాతము, జానువాతము, ధనుర్వాతము, ఇవి నశించును.

## మ హా బ ఢ బా న ల ర స ము

శ్లో॥ కాన్తం చ సూతం హరితాలగన్ధే సముద్రఫేనం లవణానిపఞ్చ । నీలాఞ్జనం తుత్థకమేవ రౌప్యభస్మ ప్రవాలాని వరాటకం చ (1) వైక్రాన్త

శమ్యాకసముద్రశుక్తయస్సర్వాణి చైతాని సమాని కుర్యాత్ । సూతం భవే ద్ద్వాదశకం చసమ్యక్ స్నుహ్యర్కదుగ్ధేన విమర్దయేచ్చ (2) దినత్రయం వహ్నిరసైస్తతశ్చ నివేశయేత్తామ్రజసంపుటే తత్ । మృదా చ సంలిప్య రసం పుటేత్త ద్రసస్తతస్స్యాద్బడబానలాఖ్యః (3) తత్పాదభాగేన విషం నియోజ్య కృశానుతోయేన దినం విమర్ద్యమ్ । వాతప్రధానే చ కఫప్రధానే నియోజ యేత్ త్ర్యూషణచిత్రయుక్తమ్ । దోషత్రయోత్థేఽపి చ సంనిపాతే వాతాధికత్వాదిహ సూతకోక్తిః (4) శ్లో॥ అగ్నిమాన్ద్యమజీర్ణం చ హ్యతీసారం చ శూలకమ్ । ఆధ్మానం గ్రహణీమామం కుక్షిశూలం మహోదరమ్ । నాశ యేన్నాత్ర సందేహస్సర్వ వ్యాధివినాశకః (5)

అ॥ కాంతభస్మ 1 భా, శు॥ రసము 1 భా, శు॥ తాళకము 1 భా, శు॥ గంధకము 1 భా, సముద్రపునురుగు 1 భా, పంచలవణములు 1 భా, నీలాంజనము 1 భా, శు॥ మైలతుత్థము 1 భా, వెండిభస్మ 1 భా, పగడభస్మ 1 భా, గవ్వలభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, నత్తగుల్లలభస్మ 1 భా, ముత్యపుచిప్పలభస్మ 1 భా, శు॥ రసము 12 భా, వీనిని జెముడుపాలు, జిల్లేడుపాలు, చిత్రమూలరసము, వీనితో ప్రత్యేకముగ మూడేసిరోజులు మర్దించి తామ్రపాత్ర సంపుటమునందుంచి పైన మట్టిపూసి పుటము పెట్టి తీసి దానికి నాల్గవవంతు శు॥ నాభిని కలిపి చిత్రమూలరసముతో ఒకరోజు మర్దింపవలయును. ఇది బడబానలరసమని చెప్పబడును. దీనిని త్రికటుకములు, చిత్రమూలము, వీనితో వాతప్రధానమైనట్టియు, కఫప్రధానమైనట్టియు, సంనిపాతముల యందు సేవింపవలయును. మూడు దోషములవలన పుట్టిన సంనిపాతమునందుకూడ సేవింపవలయును. సంనిపాతము మూడుదోషములవలన పుట్టినను వానిలో వాతము అధికముగా నుండును గావున దీనిని సేవింపవచ్చును. అగ్నిమాంద్యము, అజీర్ణము, అతిసారము, శూల, కడుపుబ్బరము, గ్రహణి, ఆమము, కడుపునొప్పి, మహోదరము, వీనిని ఇది తప్పక నశింపజేయును. సమస్తవ్యాధులనుకూడ నశింపజేయును.

### శూలవిధ్వంసకరసము

శ్లో॥ టఙ్కణం జారితం స్వర్ణం శుల్బం శేషం మృతం రసమ్ । ద్వంద్వై వార్ద్రకద్రావైర్మర్ద్యం రుద్ధ్వా పుటే పచేత్ (1) శూలవిధ్వంసకో నామ్నా

హ్యసాధ్యం స్వయథుం జయేత్ । శూలం గుల్మమథా శాంసి నాశయత్వాశు దేహినామ్ (2)

అ॥ టీ॥ వెలిగారము, సువర్ణభస్మ, తామ్రభస్మ, శంఖభస్మ, రసభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి అల్లపురసముతో ఒకరోజుమర్దించి మూకళ్ళయందుంచి పుటము వేయవలయును. ఇది శూలవిధ్వంసకరస మనబడును. దీనిని సేవించినచో అసాధ్యమైన నంజు, శూల, గుల్మము, మూలవ్యాధి, ఇవి నశించును.

## శంఖచూడరసము

శ్లో॥ రసాభ్రహేమభస్మాని వైక్రాన్తం సర్వతుల్యకమ్ । సర్వపఞ్చగుణం శఙ్ఖచూర్ణం శుష్కం విమర్దయేత్ (1) లేహయేన్మధునా మాషచతుష్కం సానుపానకమ్ । హిక్కాం పఞ్చవిధాం హన్తి ముమూర్షోరపి తత్ క్షణాత్ (2)

అ॥ రసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, వైక్రాన్తభస్మ 3 భా, శంఖభస్మ 3) భా, వీనిని పొడిగ నూరవలయును. దీనిని నాలుగు మాషముల పరిమితిగ తేనెతో కలిపి నాకినయెడల మృతినొందుటకు సిద్ధముగనున్న వాని యొక్కయు ఐదువిధములైన ఎక్కిళ్ళు వెంటనే హరించును.

## పంచామృతరసము

శ్లో॥ భస్మీభూతసువర్ణ తారదినకృత్కృష్ణాభ్రసూతైః క్రమా దేతేషాం ఖలు భాగవృద్ధిరపి తత్కృత్వా శుభాం కజ్జలీమ్ । నిర్గుణ్డీవశ మూలవహ్నిరజనీ వ్యోషార్ద్రకాకైర్భావితం । గోలీకృత్య విశోష్యతన్నిగదితః పఞ్చామృతస్యాద్రసః (1) శ్లో॥ అనేన సదృశః కోఽపినాస్త్యేవ భువనత్రయే । నిహన్తి సకలాన్రోగాన్నవరోగమిహాచ్యుతః । అయం పఞ్చామృతో నృణాం త్రిదశానామివామృతమ్ (2)

అ॥ సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 2 భా, తామ్రభస్మ 3 భా, అభ్రకభస్మ 4 భా, రసభస్మ 5 భా, వీనిని మెత్తగనూరి వావిలి, దశమూలములు, చిత్రమూలము, పసుపు, త్రికటుకములు, అల్లము, వీనియొక్క రసములతో భావనచేసి కప్పెలనుకట్టి ఆరనియ్యవలయును. ఇది పంచామృతరసమని చెప్పబడును. దీనితో సమానమైన మందు

మూడులోకములయందును లేదు. విష్ణువు సంసారమనెడి రోగమును హరించు రీతి నిది సకలవ్యాధులను హరించును. దేవతలకు అమృతమువలె మనుజులకు నీ పంచామృత రసముపకరించును.

## కుష్ఠప్రళయరసము

శ్లో॥ మృతం సూతం గన్ధకం చ చూర్ణం కుర్యాచ్చ కజ్జలీమ్ । కజ్జల్యాశ్చైవ భాగస్య షోడాశాంశం చ తామ్రకమ్ (1) ఖల్వమధ్యే వినిక్షిప్య మర్ద్యం చామృతవారిణా । పుటం దేయం సూర్యవర్ణం చన్ద్రవర్ణం చ జాయతే (2) ఉదుమ్బరేణ సంయుక్తం కుష్ఠమష్టాదశం జయేత్ । అనుపాన విశేషేణ సర్వరోగవినాశకః (3)

అ॥ రసభస్మ 1 భా, శు॥ గంధకము 1 భా, వీనిని ఖల్వమందుంచి మెత్తగ నూరి తామ్రభస్మ ౹ భా, కలిపి తిప్పతీగరసముతో మర్దించి పుటము వేసినయెడల సూర్యచంద్రవర్ణతుల్యంబుగ నుండును. దీనిని మేడిచూర్ణముతో పుచ్చుకొనినయెడల పదునెనిమిదికుష్ఠములు హరించును. అనుపానవిశేషములతో పుచ్చుకొనినయెడల సమస్తవ్యాధులు హరించును.

## కుష్ఠకుఠారరసము

శ్లో॥ శుల్బస్య గగనస్యాపి హేమధాతోరథాపి వై । సమాంశం పిష్ఠకం కృత్వా హ్యన్ధమూషానివేశితమ్ (1) నిమ్బపఞ్చాఙ్గసంయుక్తం కుష్ఠాన్ సర్వాన్ వినాశయేత్ । నామ్నా కుష్ఠకుఠారోఽయం శమ్భునాపరికీర్తితః (2)

అ॥ తామ్రభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, వీనిని నూరి అంధమూషయందుంచి పుటము వేయవలయును. దీనిని పంచనింబములతో సేవించిన యెడల సమస్తకుష్ఠములును నశించును. ఈ కుష్ఠకుఠారరసము శివునిచే చెప్పబడెను.

## శూలకుఠారము

శ్లో॥ రసభూతిశ్చాభ్రలోహే కాన్తం నాగం చ వఙ్గకమ్ । ప్రవాలం రజతం తామ్రం వరాటం శఙ్ఖశృఙ్గకే (1) విషం చ పారదం గన్ధం దరదం తాలకం శిలా । సర్వాణి సమం వినిక్షిప్య వహ్నిమూలరసేన చ (2) జమ్బీరార్ద్రరసేనైవ పృథగ్యై మర్దయేద్దినమ్ । ధూమానిర్గమనం చైవ దృఢ

మృద్వస్త్ర లేపనాత్ (3) ద్వియామం డోలకాయన్త్రే పాచ్యం వహ్నికషాయకైః । సాఙ్గశీతలమాదాయ ఖల్వమధ్యే వినిక్షిపేత్ (4) వజ్రవల్ల్యార్ద్రచిత్రైశ్చ త్రిదినం మర్దయేద్దృఢమ్ । గులికాన్కారయేచ్చైవ ఛాయాశుష్కాంశ్చ కారయేత్ (5) గోఘృతస్యానుపానేన ద్విగుఞ్జం భక్షయేత్సుధీః । అజీర్ణం చారుచిం వాన్తిం గ్రహణీమమ్లపిత్తకమ్ (6) కాసం శ్వాసం కఫం చైవ వాతవ్యాధీనశేషతః । అనుపానవిశేషేణ సర్వశూలాన్నివారయేత్ (7) తైలం సర్షపమమ్లం చ తక్రమిత్యాది వర్జయేత్ । నామ్నా శూలకుఠారోఽయం రాధానాథ ప్రకల్పితః (8)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, కాంతభస్మ, సీసభస్మ, వంగభస్మ, పగడభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, గవ్వలభస్మ, శంఖభస్మ, శృంగభస్మ, శు॥ నాభి శు॥ రసము, శు॥ గంధకము, శు॥ ఇంగిలీకము, శు॥ తాళకము, శు॥ మణిశిల, వీనిని సమభాగములుగ గ్రహించి చిత్రమూలము, నిమ్మకాయలు, అల్లము, వీనియొక్క రసములతో నొక్కొక్కరోజు మర్దించి పాగపోకుండునట్లుగ మట్టిగుడ్డలతో దృఢముగ చుట్టబడిన డోలాయంత్రమందు చిత్రమూలకషాయముతో రెండుజాములు వండి సాంగశీతలమున తీసి ఖల్వమందుంచి నల్లేరు, అల్లము, చిత్రమూలము, వీనియొక్క రసములతో మూడురోజులు దృఢముగ మర్దించి బుడ్డలను కట్టి నీడను ఎండింపవలయును. దీనిని ఆవు నేతితో రెండుగురివింద గింజలపరిమితిగ సేవించినయెడల అజీర్ణము, అరుచి, వాంతి, గ్రహణి, ఆమ్లపిత్తము, దగ్గు, ఉబ్బసము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, ఇవి హరించును. అనుపానవిశేషములతో సేవించినయెడల సమస్తశూలలు హరించును. దీనిని సేవించునప్పుడు నూనె, ఆవ, పులుసు, మజ్జిగ మొదలగు వానిని వర్జింపవలయును. ఇది శూలకుఠార మనబడును. కృష్ణునిచే చెప్పబడినది.

## సూ తి కా భ ర ణ ము

సీ॥ తాళకంబును నాభి తామ్రము మణిశిల పార్వతీంద్రియమును పారదమును । నమృతవంగము లోహమభ్రనాగంబును హేమటంకణ కాంత హింగులములు । శుంఠిపిప్పలిమరిచ శుద్ధనేపాళముల్ తారభస్మము నీలితప్పిటమును । శంఖతుత్థక్షారజాతీఫలంబులు మత్స్య కూర్మమయూరమహిషమకరి । ఛాగశార్దూలంబు శశగోధికలచేదు సమభాగములు గూర్చి సంఖ్యతోను। ఖల్వంబులోనుంచి ఘనమేఘనాదంబు చిత్రార్ద్రజంబీరశ్రీతులసిని । నయిదు

దినములు మర్దింప నమృతమౌను । మాషమాత్రప్రమాణంబు మా
గొన్నిన । సూతికావాతసర్వాంగశుష్కవాత । పక్షవాతంబులన్నియు ప్రాపి
సూతికాభరణమిదియు శుభము నిచ్చు॥

అ॥ శు॥ తాళకము, శు॥ నాభి, తామ్రభస్మ, శు॥ మణిశిల, శు॥ గంధకము,
రసము, శు॥ గరళము, వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ, సువర్ణభ
శు॥ వెలిగారము, కాంతభస్మ, శు॥ ఇంగిలీకము, శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు,
నేపాళములు, రజతభస్మ, నీలిమందు, శంఖభస్మ, శు॥ మైలతుత్థము, యవక్షారవ
జాజికాయలు, చేపచేదు, తాబేలుచేదు, నెమలిచేదు, దున్నపోతుచేదు, మొసలిచే
మేకచేదు, పులిచేదు, పావురపిల్లిచేదు, ఉడుముచేదు, వీనిని సమభాగములుగ గ్రహిం
ఖల్వమందుంచి తుంగగడ్డలు, చిట్టికూర, చిత్రమూలము, అల్లము, నిమ్మకాయ
తులసి, వీనియొక్క రసములతో నైదేసిరోజులు మర్దింపవలయును. ఇది అమృతతు
ముగ నుండును. దీనిని మాషపరిమితిగ నిచ్చినయెడల సూతికావాతములు, సర్వాం
వాతము, శుష్కవాతము, పక్షవాతము, ఇవి నశించును. ఇది సూతికాభరణ మ
బడును. శుభమును చేయును.

సూ తి కా భ ర ణ ము (వంటయోగము)

శ్లో॥ మృతాభ్రం హేమ వైక్రాన్తం తీక్ష్ణం తామ్రామృతేసమమ్
పారదం గన్ధకం రౌప్యం నాగం వఙ్గం సమం సమమ్ (1) సర్వం నిర్గుణ్డి
ద్రావైర్మర్దయేత్ఖల్వకే తతః । భృఙ్గీపునర్నవా పాఠాచిత్రకం వాసకామృ
(2) తులసీ చార్కదుత్తూరే ముణ్డీ జమ్భశ్చలాఙ్గలీ కుమారీ కారవల్లీ చ ద్రవై
రేషాం విమర్దయేత్ (3) కాచకూప్యన్తరే క్షిప్త్వాలిప్త్వావైవస్త్రమృత్తికామ్
దినం చ వాలుకాయన్త్రే పచేన్నిత్వాథ చూర్ణయేత్ (4) మత్స్యస్యచ వ
హస్య కమఠ్యా మహిషస్య చ । మయూరస్య ఫణేశ్చాపి కుక్కుటచ్ఛా
దన్తినామ్ (5) గోధికాశ్వకపోతానాం మకరస్య చ పిత్తకైః । భావయేతూ
దికాగ్రేణ భక్షయేత్సూతికాగదే (6) ప్లీహగుల్మోదరం పైత్యం గ్రహణీవ
తిసారకమ్ । ధనుర్వాతం కమ్పవాతం హిక్కాబధిరమూకతాః (7) కాస
శ్వాసమపస్మారం విభ్రమం సంనిపాతకాన్ । తత్క్షణేన నిహన్త్యేతానిచా
పథ్యం ప్రదాపయేత్ (8) నారికేళోదకం దాహేదధ్యన్నంచ ప్రదాపయేత్

తృష్ణార్తేశీతలం నీరమిక్షుఖణ్డాని భక్షయేత్ । సూతికాభరణం నామ రసోఽయం సర్వరోగజిత్ (9)

అ॥ అభ్రకభస్మ, సువర్ణభస్మ, వైక్రాంతభస్మ, ఖడ్గలోహభస్మ, తామ్రభస్మ, శు॥ నాభి, శు॥ పాదరసము, శు॥ గంధకము, రజతభస్మ, సీసభస్మ, వంగభస్మ, వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి వాకిలి, గంటగలగర, గలిజేరు, చిరుబొద్ది, చిత్రమూలము, అడ్డసరము, తిప్పతీగ, తులసి, జిల్లేడు, ఉమ్మెత్త, బోడరసము, నిమ్మకాయలు, చెన్నచెర్లదుంప, కలుబంద, కాకరాకు, వీనియొక్క రసములతో మర్దించి కాచకుప్పెయందుంచి మట్టిచేపూయబడిన వస్త్రముతో చుట్టి వాలుకాయంత్రమందు ఒకరోజు వండి తీసి చూర్ణముచేసి చేప, ఆడవిపంది, తాబేలు, దున్నపోతు, నెమలి, త్రాచుపాము, కోడి, మేక, ఏనుగు, ఉడుము, గుఱ్ఱము, పావురము, ముసలి, వీనియొక్క పిత్తములతో భావనచేయవలయును. దీనిని సూదికొనకువచ్చినంత యిచ్చినయెడల సూతికావ్యాధులు, ప్లీహవ్యాధి, గుల్మము, ఉదరవ్యాధి, పైత్యవ్యాధులు, గ్రహణి, అతిసారము, ధనుర్వాతము, కంపవాతములు, ఎక్కిళ్ళు, చెముడు, మూగ, దగ్గు, వగర్పు, అపస్మారము, భ్రమ, సంనిపాతములు, ఇవి వెంటనే నశించును. దీనినిచ్చునప్పుడు ఇచ్ఛాపథ్యమును చేయింపవలయును. దీని సేవనచే తాపము కలిగినయెడల కొబ్బరికాయనీటిని, పెరుగుతోకూడిన యన్నమును ఇయ్యవలయును. దప్పిక కలిగినయెడల చల్లనినీటిని, చెరుకుముక్కలను, ఇవ్వవలయును. ఇది సూతికాభరణమనబడును. సమస్తరోగములను నశింపజేయును.

## లఘుసూతికాభరణము

వ॥ రసభస్మ, గరళము, శు॥ నాభి, తామ్రభస్మ, శు॥ మైలతుత్థము, వీనిని చిత్రమూలరసముతో నూరి చేపచేదుతో భావనచేసి సూదికొనకువచ్చినంత యిచ్చినయెడల సూతికావాతములు, సూతికాజ్వరములు, సంనిపాతములు, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, ఇవి నశించును.

## సువర్ణాదిసూతికాభరణము

సీ॥ కనకాభ్రకంబులు గంధకలోహముల్ నాభియు తామ్రంబునాగ భస్మ । వంగవైక్రాంతముల్ వరపారదంబును సమభాగములుగాను సంతరించి । నిర్గుండి కాకర నింబ పునర్నవ వరభృంగరాజంబు వహ్నితులసి । యర్కంబు కలుబంద యనువైన మూండియు పొలుపుగా చిరుబొద్ది పొత్తి

దుంప । తిప్ప తీగయు వీని యొప్పైన రసముల గడుశ్రద్ధతోనూరి కాచ కుప్పె । లందు నిడి వండి తీసియు పొందుగాను । చూర్ణమును జేసి కుక్కుటసూకరముల । మహిష శిఖిసర్పసైంధవమనుజచేదు । లరయ జేర్చిన సూతికాభరణ మయ్యె॥

అ॥ సువర్ణభస్మ, అభ్రకభస్మ, శు। గంధకము, లోహభస్మ, శు। నాభి, తామ్ర భస్మ, సీసభస్మ, వంగభస్మ, వైక్రాంతభస్మ, శు॥ రసము, వీనిని సమభాగములుగ గ్రహించి వావిలి, కాకర, నిమ్మకాయలు, గలిజేరు, గుంటగలగర, చిత్రమూలము, తులసి, జిల్లేడు, కలుబంద, బోడసరము, చిరుబొద్ది, పొత్తిదుంప, తిప్పతీగ వీనియొక్క రసములతో మర్దించి కాచకుప్పెయందుంచి వండి తీసి చూర్ణముచేసి కోడి, అడవిపంది, దున్నపోతు, నెమలి, పాము, గుఱ్ఱము, మనుజుడు, వీనియొక్క చేదులతో నూరిన యెడల సూతికాభరణ మనబడును.

## అమృతసూతికాభరణము

శ్లో॥ సూతం వజ్రం చ తారం బలికనకయుతం నాగవజ్రంసమాంశం! భాగం తచ్చాహిఫేనం విషగరళయుతం ధూర్తతోయేన భావ్యః । పిత్తైర్మాయూరమత్స్యాజమహిషజనితైర్దైవికే మానుషేవా । నామ్నా సూత్యాశ్చ భరణం మునికథితయుతం ప్రాణినాం జీవితార్థమ్ (1) శ్లో॥ అనుపానవిశేషణ దేయం గుఞ్జాప్రమాణతః । సౌతికం శూలగుల్మౌ చ తిమిరం పక్షకమ్పకౌ (2) శ్లైష్మికం వాతికం వ్యాధిం నాశయేదగదోత్తమః విషజ్వరం సంనిపాతం నానాదోషనివారకః (3)

అ॥ శు। రసము, వంగభస్మ, రజతభస్మ, శు॥ గంధకము, సువర్ణభస్మ, సీసభస్మ, వజ్రభస్మ, శు॥ నల్లమందు, శు। నాభి, గరళము, వీనినిసమభాగములుగ గ్రహించి ఉమ్మెత్తరసముతో భావనచేసి నెమలి, చేప, మేక, దున్నపోతు, వీనియొక్క పిత్తములతో భావన చేయవలయును. ఈ సూతికాభరణము ప్రాణులయొక్క జీవన మునిమిత్తము మునీశ్వరులచే చెప్పబడెను. దీనిని అనుపానవిశేషముతో గురివిందగింజ పరమితిగ సేవించినయెడల సూతికావ్యాధులు, శూల, గుల్మము, తిమిరవాతము, పక్షవాతము, కంపవాతము, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, విషజ్వరము, సంనిపాతము, సమస్తదోషములు, ఇవి నశించును.

## విషసూతికాభరణము

శ్లో॥ పారదాభ్రతారతామ్రగన్ధతాలకం శిలాహ్వకప్రవాల హేమమాక్షికం చ మౌక్తికం । తీక్ష్ణలోహమశ్మసారకాన్తలోహకమ్బు వైక్రాన్తతుత్థనాభకం రసాఞ్జనం సమాంశకమ్ (1) మర్ద్యమేవ నిత్యనాథవేదితం త్ర్యహాః పరం మాషబీజమాత్రకైశ్చ కాచకూపిపూరితమ్ । వాలుకాను యన్త్రికేణపాచితం దినత్రయం స్వాఙ్గశీతమౌషధం సతుల్యవత్సనాభకమ్ (2) మర్దయేచ్చ కూర్మ బర్హిమకర సర్పపిత్తకైశ్ఛాగమహిషఘృష్టిగోధికుక్కుటాఖ్యపిత్తకైః । దన్తిబీజ చిత్రమూలవారిణా చ భావయేత్ సిన్ధువారభృఙ్గజైశ్చ నిమ్బనీరపేషితమ్ (3) వల్లమాత్రమౌషధం చ సర్వరోగశాన్తయే । సూతికాదివాత రోగశ్లేష్మరోగ శాన్తయే । సూతికాభరణమేవ మన్త్రిజేన భాషితమ్ (4)

అ॥ శు॥ రసము, అభ్రకభస్మ, రజతభస్మ, తామ్రభస్మ శు॥ గంధకము, శు॥ తాళకము, శు॥ మణిశిల, సువర్ణభస్మ, పగడభస్మ, హేమమాక్షికభస్మ, మౌక్తికభస్మ, ఖడ్గలోహభస్మ, ఇనుపభస్మ, కాంతభస్మ, శంఖభస్మ, వైక్రాంతభస్మ, శు॥ మైలతుత్థము, శు॥ నాభి, రసాంజనము, వీనిని సమభాగములుగ గ్రహించి మూడురోజులు మర్దించి మినపగింజలపరిమితిగ మాత్రలు చేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు మూడురోజులు వండి చల్లారినపిదప తీసి దానికి సమానమగు శు॥ నాభిని కలపి నూరి తాబేలు, నెమలి, మొసలి, త్రాచుపాము, మేక, దున్నపోతు, అడవిపంది ఉడుము, కోడి, వీనియొక్క పిత్తములతోడను శు॥ నేపాళపుగింజలు, చిత్రమూలము, వీనియొక్క రసములతోడను భావన చేసి వావిలి, గుంటగలగర, వేపచెక్క, వీనిరసములతో మర్దింపవలయును. దీనిని వల్లపరిమితిగ సేవించినచో సమస్తరోగములు, సూతికావాతము మొదలగు వాతవ్యాధులు, శ్లేష్మరోగములు, ఇవి నశించును. ఈసూతికాభరణము మంత్రిజునిచే చెప్పబడెను.

## పాషాణసూతికాభరణము

శ్లో॥ రసం హిఙ్గులతాలే చ కాన్తం కనకమభ్రకే । మాక్షికం రసటీం గన్ధం తామ్రం నేపాలతుత్థకే (1) సైన్ధవం చాఖుపాషాణం పిప్పలీం మరిచటఙ్కణే । సర్వైస్సమాంశమమృతం మర్దయేచ్చిత్రకామ్బునా (2) వటికాశ్చ

షుటే రుద్ధ్వా పక్త్వాయామచతుష్టయమ్ । స్వాఙ్గశీతలముద్ధృత్య పాదాంశం మరిచామృతే (3) గరలం చ యథా లాభం మర్ద్యం మాహిషపిత్తకై ః । సూచికాగ్రప్రవృత్తం తు జిహ్వామధ్యే ప్రదాపయేత్ (4) సంనిపాతం మహాఘోరం శీఘ్రం జయతి నిశ్చయమ్ । సర్వాఙ్గవ్యాపకం వాతం సూతికా రోగమేవ చ (5) ఏతజ్జనితతాపే తు స్నాతవ్యం స్వేచ్ఛయా జలైః । నారికేలజలం దద్యాత్ శీతం చన్దనలేపనమ్ (6) ఇక్షుఖణ్డఫలైర్భక్ష్యం తక్రి భక్తం యథేప్సితమ్ । బ్రహ్మాస్త్రరసవిఖ్యాతం సూతికాభరణనామకమ్ (7)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ తాళకము 1 భా, కాంతభస్మ, 1 భా, సువర్ణభస్మ, 1 భా, అభ్రకభస్మ, 1 భా, మాక్షికభస్మ, 1 భా, శు॥ మణిశిల 1 భా శు॥ గంధకము 1 భా, తామ్రభస్మ, 1 భా, శు॥ నేపాళము 1 భా, శు॥ మైలతుత్థము 1 భా, సైంధవలవణము 2 భా, శు॥ ఉల్లిపాషాణము 1 భా, పిప్పళ్ళు 1 భా, మిరియాలు 2 భా శు॥ టంకణము 1 భా శు॥ నాభి 17 భా, వీనిని చిత్రమూలరసముతో మర్దించి మాత్రలు చేసి కుండయందుంచి పైన మూకుడుమూసి సంధిబంధనమును చేసి నాలుగుజాములు వండి చల్లారినపిదప తీసి మిరియాలు, శు॥ నాభి, వీని నామందుకు నాల్గవవంతుగను గరళమును తగురీతిగను కలిపి గేదెపిత్తముతో మర్దింపవలయును. దీనిని సూదికొనకు వచ్చినంత గ్రహించి నాలుకమధ్య యందుంచిన యెడల మహాఘోరమైన సంనిపాతము, సర్వాంగవాతము, సూతికారోగములు, ఇవి వెంటనే హరించును. దీని సేవనచే తాపముకల్గినయెడల జలముతో ఇష్టానుసారముగ స్నానము చేయింపవలయును. చల్లనికొబ్బరికాయనీటిని ఇవ్వవలయును. మంచి గంధమును పూయవలయును. చెరకుముక్కలను, ద్రాక్షపండ్లు మొదలగు పండ్లను మజ్జిగతో కూడిన అన్నమును, ఇష్టానుసారముగ నియ్యవలయును. ఈసూతికాభరణమునకు బ్రహ్మాస్త్రరసమనెడి పేరుకూడ కలదు.

## రసామృతరసము

ఉ॥ నాగము తారతామ్రములు నాభియు మాక్షికదంతిబీజముల్ । బాగుగ నింగిలీకమును వంగబలీరసముల్ సమానముల్ । గాగని శృంగబేర మున గట్టిగ నూరియు సేవజేసినన్ । వేగమె సంనిపాతములు వెండియు

వాతములన్నిటిఀ మహా। రోగములఀ హరించు నిదియాఢి రసామృత మందు రచ్యుతా॥

ఆ॥ సీసభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, శు॥ నాభి, మాక్షికభస్మ, శు॥ నేపాలపు విత్తులు, శు॥ ఇంగిలీకము, వంగభస్మ, శు॥ గంధకము, శు॥ రసము, వీనిని సమభాగములుగ గ్రహించి అల్లపురసముతో ధృఢముగ మర్దింపవలయును. దీనిని సేవించిన యెడల సంనిపాతములు, వాతవ్యాధులు, మహారోగములు, ఇవి వెంటనే యాఢిగ హరించును. ఇది రసామృత మనబడును.

## ప్లీహాంతకరసము

శ్లో॥ హతశుల్బం చ తారం చ గగనాయసమౌక్తికమ్। దరదం శఙ్ఖకం సూతం గన్ధకం నవమం తథా (1) గుగ్గులుర్వ్యోషరాస్నే వై చేన్ద్రవారుణకం తథా। త్రిఫలా కటుకా దన్తీ దేవదారు చ సైన్ధవమ్ (2) త్రివృతం చ యవక్షారం వాతారీతైలమర్దితమ్। అష్టోదరాణి పాణ్డుత్వమానాహం విషమజ్వరమ్ (3) అజీర్ణమమ్లపిత్తం చ కఫం వై సర్వశూలకమ్। కాసం శ్వాసం చ శోఫం చ సర్వమాశు వ్యపోహతి (4) ప్లీహాన్తకరసో నామ ప్లీహోదరవినాశకః। యకృద్వ్యాధిం హరేచ్చైవ మలబన్ధం తథైవ చ (5)

ఆ॥ తామ్రభస్మ, రజతభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, ముత్యభస్మ, శు॥ ఇంగిలీకము, శంఖభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, శు॥ మహిసాక్షిగుగ్గులు, త్రికటుకములు, సన్నరాష్ట్రము, చేదుపుచ్చకాయ, త్రిఫలములు, కటుకరోహిణి, శు॥ నేపాళములు, దేవదారు, సైంధవలవణము, తెగడ, యవక్షారము, వీనిని సమభాగములుగ గ్రహించి ఆముదముతో మర్దింపవలయును. దీనిని సేవించిన యెడల ఎనిమిదివిధములగు ఉదరములు, పాండువు, ఆనాహము, విషజ్వరము, అజీర్ణము, అమ్లపిత్తము, కఫవ్యాధులు, సమస్తశూలలు, కాస, శ్వాస, నంజు, ప్లీహోదరము, యకృద్వ్యాధులు, విరేచనబద్ధకము, ఇవి వెంటనే హరించును. ఇది ప్లీహాంతకరస మనబడును.

## గ్రహణీకుఠారరసము

శ్లో॥ రసగన్ధకయోశ్చాపి కర్షమేకం సుశోధితమ్। ద్వయోః కజ్జలీం కృత్వా హాటకం షోడశాంశకమ్ (1) లవఙ్గం నిమ్బపత్త్రం చ జాతీకోశ

ఫలే తథా । ఏతేషాం కర్షచూర్ణేన సూక్ష్మైలాం చైవ మేలయేత్ (2) ముక్తా గృహే చ సంస్థాప్య పుటపాకేన సాధయేత్ । గుఞ్జాపఞ్చప్రమాణేన ప్రత్యహం భక్షయేన్నరః (3) సూతికాగ్రహణీరోగం హరత్యేష సునిశ్చితః । దుర్వారం గ్రహణీరోగం చామశూలం చ నాశయేత్ (4) అర్శోఘ్నో దీపకశ్చైవ బలపుష్టిప్రసాదకః । కాసశ్వాసాతిసారఘ్నో వీర్యవృద్ధికరః । పరమ్ । సంసార లోకరక్షార్థమేవం రుద్రేణ భాషితః (5)

అ॥ రసము 1 కర్షము, శు॥ గంధకము 1 క, వీనిని కజ్జలిచేసి సువర్ణభస్మ 1/16 క, లవంగములు 1 క, వేపాకు 1 క, జాపత్రి 1 క, జాజికాయలు 1 క, చిన్న ఏలకులు 1 క, వీనిని కలిపి ముత్యపుచిప్పలయందుంచి పుటపాకము చేయవలయును. దీనిని అయిదు గురివిందగింజల పరిమితిగ ప్రతిదినమందును సేవించిన యెడల సూతికా స్త్రీయొక్క గ్రహణీరోగము, కఠినమైన గ్రహిణీరోగము ఆమశూల, అర్శస్సు, కాస, శ్వాస, అతిసారము ఇవి హరించును. ఇది అగ్నిదీప్తి, బలము, శరీరపుష్టి, వీర్యవృద్ధి, వీనిని చేయును. సంసారములను రక్షించు నిమిత్తము ఈశ్వరునిచే చెప్పబడినది.

## శూలాంతకరసము

శ్లో॥ టఙ్కణం హారిణం శృఙ్గం స్వర్ణం గన్ధం మృతం రసమ్ । దినైకమార్ద్రకద్రావైర్మర్ద్యం రుద్ధ్వా పుటే పచేత్ (1) శూలాన్తకరసో హ్యస్య మాషైకం మధుసర్పిషా । సైన్ధవం జీరకం హిఙ్గుమధ్వాజ్యం చ లిహేదను (2) సర్వశూలహరః ఖ్యాతో యామమాత్రాన్న సంశయః । అజీర్ణం పాకశూలం చ వాతశూలం హరేత్తథా । ఆమాతిసారం గ్రహణీమగ్నిమాన్ద్యమరోచకమ్ (3)

అ॥ శు॥ వెలిగారము, లేడికొమ్ముభస్మ, సువర్ణభస్మ, శు॥ గంధకము, రసభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి అల్లపురసము నొకరోజు మర్దించి మూకుళ్ళయందుంచి సంధిబంధనము చేసి పుటము చేయవలయును. ఇది శూలాంతకరసమని చెప్పబడును. దీనిని తేనె, నెయ్యి, వీనితో మాషపరిమితిగ సేవించి వెంటనే సైంధవలవణము, జీలకర్ర, శు॥ ఇంగువ, తేనె, నెయ్యి, వీనిని పుచ్చుకొనినయెడల సమస్తశూలలును ఒక జాములో నిశ్చయముగ హరించును. అజీర్ణము, పరిణామశూల, వాతశూల, ఆమము, అతిసారము, గ్రహణి, అగ్నిమాంద్యము, అరుచి, ఇవికూడ హరించును,

## మహాశూలాంతకరసము

శ్లో॥ టఙ్కణం శృఙ్గకం గన్ధం సువర్ణం తామ్రకం పృథక్ । ఏక ద్విత్రి చతుఃపఞ్చ క్రమాద్వై భస్మసూతకమ్ (1) చాఙ్గేర్యాశ్చ ద్రవైర్మర్ద్యం దినైకం గోలకీకృతమ్ । గన్ధకం తామ్రపర్ణ్యాథ గోలకాంశం ప్రమర్దయేత్ (2) గోలకం లేపయేత్తేన తతో వస్త్రేణ వేష్టయేత్ । వాలుకాపూరితే భాణ్డేక్షిప్త్వా పాచ్యంమృగాఙ్కవత్ (3) ఉద్ధృత్య చూర్ణయేత్ శ్లక్ష్ణం శూలాన్తక రసోత్తమః । మృగాఙ్కవత్ క్షయం హన్తి తద్వన్మాత్రానుసారతః (4) మహాశూలాన్తరే చైవ శూలౌ వాతజపాకజౌ । ఆమజోదరజౌ శూలౌ సర్వవ్యాధి హరస్తథా (5)

అ॥ శు॥ వెలిగారము 1 భా, శృంగభస్మ 2 భా, శు, గంధకము 3 భా, సువర్ణభస్మ 4 భా, తామ్రభస్మ 5 భా, రసభస్మ 6 భా, వీనిని పులిచింతరసముతో నొకగోజు మర్దించి ఉండచేసి ఆయుండతో సమానముగు శు॥ గంధకమును తామ్రపర్ణీరసముతో మర్దించి ఉండకు పూసి బట్టతోచుట్టి ఇసుకతో నింపబడిన కుండయందుంచి మృగాంక రసమునువలెవండి తీసి మెత్తగ చూర్ణము చేయవలయును. ఇది శూలాంతిక రసమని చెప్పబడును. మృగాంక రసమువలె నిది క్షయను హరించును. మాత్రాభేదముచే మహాశూలలు, వాతశూల, పరిణామశూల, ఆమశూల, ఉదరశూల, సమస్తవ్యాధులు, వీనిని హరింపజేయును.

## గ్రహణీరిపురసము

శ్లో॥ ముక్తా సువర్ణం రసగన్ధటఙ్కణాశ్చాభ్రకం కపర్దోఽమృతమేవ తుల్యాః । సర్వైస్సమం శఙ్ఖక చూర్ణమంత్ర ఖల్వే చ భావ్యోఽతి విషాద్రవేణ (1) గోలం చ కృత్వా మృదుకర్పటస్థం సంపాచ్య భాణ్డే దివసార్ధకం చ । సర్వాఙ్గశీతో రస ఏష భావ్యో ధత్తూరవారాహి శిఖిద్రవైశ్చ (2) లోహస్య పాత్రే పరిభావితం చ సిద్ధో భవేత్సం గ్రహణీకవాటః । వాతోత్తరాయాం మరిచాజ్యయుక్తః పిత్తోత్తరాయాం మధుపిప్పలీభిః (3) కఫోత్తరాయాం విజయారసేన కటుత్రయేణాజ్యయుతో గ్రహణ్యామ్ । క్షయే జ్వరే చాశఽసి షడ్భగన్ధరేచా మాతిసారారుచిపీనసేషు । మేహే చ కృచ్ఛ్రే గతధాతువర్ధనే గుఞ్జాద్వయం చాస్య మహౌషధమ్ (4)

అ॥ ముత్యభస్మ, 1 భా, సువర్ణభస్మ, 1 భా, శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, టంకణము 1 భా, అభ్రకభస్మ, 1 భా, గవ్వలభస్మ, 1 భా, శు॥ నాభి 1 భా, శంఖభస్మ, 8 భా, వీనిని ఖల్వమందుంచి అతివసకషాయముతో భావనచేసి ఉండగజేసి పలుచని మూకుడునందుంచి కుండయందుంచి ఒకటిన్నరరోజు వండి సాంగ శీతలమున తీసి ఉమ్మెత్త, నేలతాడి, చిత్రమూలము, వీనియొక్క రసములతో లోహ పాత్రయందు భావన చేసినయెడల తయారగు. దీనిని వాతప్రధానమైన గ్రహణీ వ్యాధియందు మిరియాలు నెయ్యి వీనితోడను, పిత్తప్రధానమైన గ్రహణీవ్యాధియందు తేనె, పిప్పళ్లు వీనితోడను, కఫప్రధానమైన గ్రహణీవ్యాధియందు గంజాయాకు రసము, త్రికటుకములు, నెయ్యి, వీనితోడను, సేవింపవలయును. క్షయ, జ్వరము అర్శస్సు, ఆరువిధములగు భగందరములు, ఆమదోషము, అతిసారము, అరుచి, జలుబు ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, వీర్యనష్టము, వీనియందు రెండుగురివిందగింజలపరి మితిగ నియ్యవలయును. ఇది గొప్పవ్యాధులను కూడ నశింపజేయును.

### ర సా య న ర స ము

శ్లో॥ రసం భస్మీకృతం తోలం గన్ధకం శోధితం సమమ్ । లోహం కర్షద్వయం తామ్రమర్ధతోలకసంయుతమ్ (1) సువర్ణం జారితం దద్యాచ్ఛా ణార్ధం సువిచక్షణః । అభ్రం కర్షద్వయం దద్యాచ్ఛాణార్ధం చన్ద్రచూర్ణకమ్ (2) శ్యామాబీజం వరీం చైవ బలామతిబలాం తథా। ఏలాం చ దేవపుష్పం చ శాణమానం వినిక్షిపేత్ (3) జలేన వటకాన్కృత్వా గుఞ్జామాత్రం ప్రదా పయేత్ । సేవనాదస్య కన్దర్పరూపో భవతి మానవః (4) సహస్రం యాతి నారీణాముత్సాహో జాయతేఽధికః । నిత్యం స్త్రీసేవనాద్యస్తు క్షీణశుక్లో భవే న్నరః (5) మహాశుక్లో భవేత్సోఽపి సేవనాదస్య నాన్యథా । మహాబలో మహాబుద్ధిర్జాయతే నాత్ర సంశయః (6) కార్శ్యకారశ్చ స్థూలానాం కృశా నాం పుష్టికారకః । రసో వినాశయేత్సర్వా రుజస్సప్తాహభక్షణాత్ । రసాయన రసోనామ శ్రేష్ఠం చైవ రసాయనమ్ (7)

అ॥ రసభస్మ, 1 తు, శు॥ గంధకము 1 తు, లోహభస్మ, 2 కర్షములు, తామ్రభస్మ, ½ తులము, సువర్ణభస్మ ½ శాణము, అభ్రకభస్మ 2 కర్షములు, పచ్చ కర్పూరము ½ శాణము, దూలగొండివిత్తులు 1శా, పిల్లిపీచర 1 శా, చిన్నముత్తవపుల గము 1 శా, పెద్దముత్తవపులగము 1 శా, ఏలకులు 1 శా లవంగములు 1 శా, వీనిని

జలముతో నూరి దప్పెలు కట్టవలయును. దీనిని గురివిందగింజపరిమితిగ సేవించిన యెడల మన్మథరూపముకలవాడై వెయ్యిమంది స్త్రీలను రమించును. అధికమగు ఉత్సాహము కలవాడగును. నిత్యము స్త్రీలను రమించుటచే క్షీణించిన శుక్రముకల వాడుకూడ దీనిని సేవించుటచేతనే అధికమగు శుక్రముకలవాడగును. దీనిని సేవించు టచే అధికమగు బలమును జ్ఞానమును, కలుగును. ఇది స్థూలురను కృశింపజేయును. కృశించినవారిని పుష్టివంతులుగ చేయును. దీనిని ఏడురోజులు సేవించిన యెడల సమస్తవ్యాధులు నశించును. ఇది రసాయనరస మనబడును. శ్రేష్ఠమైన రసాయనము.

## మేహఖండనరసము

శ్లో॥ మృతసూతాభ్రకే నాగం స్వర్ణం తుల్యం ప్రకల్పయేత్ । మహా నిమ్బస్యచూర్ణం తు చతుర్భిస్సమమాహరేత్ (1) మధునా లేహయేన్మాషం లాలామేహప్రశాన్తయే । సక్షౌద్రరజనీచూర్ణం లేహ్యం నిష్కద్వయం తథా । అసాధ్యం నాశయేన్మేహం మేహఖణ్డనకో రసః (2)

అ॥ రసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, సీసభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, పంచనింబచూర్ణము 4 భా, వీనిని తేనెతో మాషపరిమితిగ పుచ్చుకొని వెంటనే రెండునిష్కముల పరిమితికల పసుపు చూర్ణమును తేనెతో పుచ్చుకొనినయెడల లాలా మేహము నశించును. ఈ మేహఖండనరసము అసాధ్యములైన మేహవ్యాధులనుకూడ నశింపజేయును.

## మూత్రకృచ్ఛ్రాంతకరసము

శ్లో॥ పారదాభ్రక వైక్రాన్తహేమకాన్తాని గన్ధకమ్ । మౌక్తికం విద్రుమం చైవ ప్రత్యేకం స్యాత్సమం సమమ్ (1) జమ్బీరద్రవేణ సంమ ర్దయేత్ మూషాయాం సంనిరోధయేత్ । పఞ్చవింశతిసంఖ్యాకైః పుటందత్వా విచూర్ణయేత్ (2) మాషమాత్రం రసం దద్యాన్నవనీతసితాయుతమ్ । మూత్ర కృచ్ఛ్రాశ్మరీమేహవాతపిత్తకఫామయాన్ । క్షయానఖిలరోగాంశ్చ నాశయేన్నాత్ర సంశయః (4)

అ॥ శు॥ రసము, అభ్రకభస్మ, వైక్రాంతభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, శు॥ గంధకము, ముత్యభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి నిమ్మకాయలరసముతో

మర్దించి మూసయందుంచి సంధిబంధనముచేసి యిరువదియైదు పిడకలతో పుటము వేసి తీసి చూర్ణము చేయవలయును. దీనిని వెన్న, పంచదార, వీనితో మాషపరిమితిగ నిచ్చినయెడల మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, మేహవ్యాధి, వాతవ్యాధులు, పిత్తవ్యాధులు కఫవ్యాధులు, క్షయ, సమస్తవ్యాధులు, ఇవి నిశ్చయముగ నశించును.

## కాలకూటరసము

శ్లో॥ రుద్రసంఖ్యామృతం చైవ త్రిభాగం సూతమేవ చ । గన్ధకం పఞ్చభాగం చ శిలాయా ఋతుభాగకమ్ (1) తామ్రభస్మ చతుర్భాగమృషి భాగం చ టఙ్కణమ్ । తాలకం నవభాగం చ వహ్నిమూలం తథైవ చ (2) త్రిఫలా చ త్రికటుకం దశ ద్వాదశకం తథా । హిఙ్గుభాగైకసంఖ్యాకముగ్ర గన్ధా తథైవ చ (3) ఏవం ఖల్వేచ సంస్థాప్య హ్యార్ద్రకం వహ్నిమూల కమ్ । జమ్బీరం లశునం చైవ శాఙ్గీ శిగ్ర్వర్కమూలకమ్ (4) లాఙ్గలీ హంసపాదీ చ సిన్దువార్నాగదలాని చ । అజోక్షలశిగ్రుమూలాని చైభిర్భావ్యం పృథక్పృథక్ (5) పఞ్చకోలకషాయేణ పఞ్చమూలేన మర్దయేత్ । గుఞ్జా మాత్రాం వటీం లబ్ధ్వా శృఙ్గవేరం పిబేదను (6) అసాధ్యం సంనిపాతం చ సర్వ జ్వరహరం పరమ్ । సంనిపాతకులం చైవ సప్తదోషాన్వినాశయేత్ (7) స్నానం కుర్యాత్ప్రియత్నేన శ్రీగన్ధం లేపమాచరేత్ । పథ్యం దధ్యో దనం చైవ ఖర్జూరాది ఫలాన్యపి (8) తామ్బూలచర్వణం కుర్యాత్క్షీ మేకైవం సమాచరేత్ । కాలకూటరసో నామ్నా శఙ్కరేణైవ భాషితః । భిష గ్వరైః కృతశ్చైవ రోగాణాం కులనాశకృత్ (9)

అ॥ శు॥ నాభి 11 భా, శు॥ పాదరసము 3 భా శు॥ గంధకము 5 భా, శు॥ మణిశిల 6 భా, తామ్రభస్మ 4 భా, శు॥ టంకణము 7 భా, శు॥ తాళకము 9 భా, చిత్రమూలము 9 భా, త్రిఫలములు 10 భా, త్రికటుకములు 12 భా. శు॥ ఇంగువ 1 భా, వస 1 భా, వీనిని ఖల్వమునందుంచి అల్లము, చిత్రమూలము, నిమ్మకాయలు, వెల్లుల్లి, బండిగురివింద, కాయమునగ, జిల్లేడు వేళ్ళు, చెన్నచెర్లగడ్డ, హంసపాది, వావిలి తమలపాకులు, ఊడుగ, మునగ వేళ్ళు, వీనియొక్క రసములతోడను పంచకోలకషాయ ముతోడను పంచమూలకషాయముతోడను ఒక్కొక్కజాము మర్దింపవలయును, దీనిని గురివిందగింజపరిమితిగల మాత్రను చేసి అల్లపురసముతో సేవించినయెడల అసాధ్య మైన సంనిపాతము, సమస్తజ్వరములు, సంనిపాతసముదాయములు, సప్తదోషములు,

రోగము హరించును. దీనిని సేవించినప్పుడు స్నానము, చందనలేపనము, పెరుగుతో కూడిన అన్నమును భుజించుట, ఖర్జూరపుపండ్లు మొదలగు పండ్లను భుజించుట, తాంబూలమును వేసికొనుట, వీని నాచరింపవలయును. ఇది కాలకూటరసమనబడును. ఈశ్వరుడు నాకే చెప్పియుండెను. దీనిని వైద్యులుచేసి యుపయోగించినయెడల సమస్తవ్యాధులు నశించును.

## అమృతకాలకూటరసము

శ్లో॥ సూతం సర్వవిషం హేమ తారం తామ్రం చ పిత్తలమ్ । నాగవఙ్గే మృతం కాన్తం మాక్షికం మౌక్తికం శిలా (1) పాషాణ త్రితయం చైవ గన్ధకం హ్లేచ్ఛటఙ్కణౌ । కాంస్యం తీక్ష్ణం చ వైక్రాన్తం తుత్థకం సుభూషణమ్ (2) ఏతాని సమభాగాని సూక్ష్మ చూర్ణాని కారయేత్ ॥ సర్వస్యార్థం వత్సనాభం నిక్షిపేన్మతిమాన్భిషక్ (3) మత్స్యమాహిషమాయూరవారాహచ్ఛాగసమ్భవైః । ఇత్యేవం పఞ్చపిత్తైశ్చదినైకైకం విమర్దయేత్ (4) అర్క త్రిగుకసారేణ వహ్నిదుత్తూరలాఙ్గలీ । నిర్గుణ్డీ భృఙ్గముణ్డ్యౌ చ త్రిపాదీ నాగవల్లికా (5) మాతులుఙ్గామృతే చైవ మాలూరశ్చతురఙ్గులః । కరవీరాగ్నిమన్థే చ రావణో బహుపుత్రికా (6) ఏతైశ్చ క్రమమర్ద్యం చ మర్దితం త్వథ శోషితమ్ । ఫణిపిత్తైః పునర్భావ్యం ముద్గద్వయ ప్రమాణకమ్ (7) ఆర్ద్రకస్య రసేనైవ సంనిపాతం నిహన్తి చ శ్లేష్మజాన్వివిధాన్వ్యాధీన్వాతవ్యాధిం స్తథైవ చ (8) తత్క్షణేన నివర్తన్తే రసస్యాస్య ప్రభావతః । రసతాపే తు కర్తవ్యం భోజనం తదనన్తరమ్ (9) ఉశీరవ్యజనైర్వాయుర్దేయశ్చోదకశీతలైః । కాలకూటరసో నామ విష్ణునా నిర్మితః పురా (10)

శు॥ రసము 1 భా, గరళము 1 భా, సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, ఇత్తడిభస్మ 1 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ గౌరిపాషాణము శు॥ వాడ్డిపాషాణము శు॥ తెల్లిపాషాణము ఇవి 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ టంకణము 1 భా, కంచుభస్మ 1 భా, లోహభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, శు॥ మైలతుత్థము 1 భా, శు॥ తాళకము 1 భా, శు॥ నాభి 10½ భా, వీనిని మెత్తగనూరి చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, వీనియొక్క పిత్తములతో నొక్కొకరోజు మర్దించి జిల్లేడు, మునగవేళ్లు, చిత్ర

మూలము, ఉమ్మెత్త, లాంగలి (పొత్తి) దుంప, వావిలి, గుంటగలగర, బోడసరము, హంసపాది, తమలపాకులు, మాదీఫలము, తిప్పతీగ, మారేడు, శేల, గన్నేరు, నెల్లి, పెద్దముష్టి, వాసను, వీనియొక్క రసములతో క్రమముగ మర్దించి ఎండించి పాము పిత్తముతో మరల భావనచేయవలయును. దీనిని అల్లపురసముతో రెండు పెసరగింజల పరిమితిగ నిచ్చినయెడల సంనిపాతము, సమస్తశ్లేష్మవ్యాధులు, సమస్తవాతవ్యాధులు, ఇవి దీనియొక్క ప్రభావమువలన వెంటనే హరించును. ఇది తాపమును కలిగించినయెడల భోజనమును పెట్టి పిదప నీళ్లు చల్లబడి చల్లగనున్న వట్టివేళ్ల విసనకర్రలచే విసరవలయును. ఈ కాలకూటరసము విష్ణువుచే పూర్వమందు చెప్పబడినది.

## మహాకాలకూటరసము

శ్లో॥ తాలకం గన్ధకం సూతం శిలా టఙ్కణమాక్షికే । దరదం లోహభూతిశ్చ మౌక్తికం చ ఫణేర్విషమ్ (1) హిరణ్యం తారతామ్రే చ సర్వస్మాద్ద్విగుణం విషమ్ । మాతులుఙ్గరసైర్మర్ద్యం జమ్బీరస్వరసేన చ (2) కాలాహిపిత్తైస్సంభావ్యం దినాని త్రీణి మర్దయేత్ । గుఞ్జామాత్రప్రమాణేన హ్యనుపానవిశేషతః (3) దోషజ్వరం విషం హన్తి దాహతాపనివారకః । కాలకూటరసోనామ సోమనాథవినిర్మితః (4)

అ॥ శు॥ తాళకము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ రసము 1 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ టంకణము 1 భా, మాక్షికభస్మ 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, లోహభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, త్రాచుపాముపిషము 1 భా, సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, శు॥ నాభి 26 భా, వీనిని మాదీఫలము, నిమ్మకాయ, వీనియొక్క రసములతో మర్దించి నల్లత్రాచుపాముయొక్క పిత్తముతో భావనచేసి మూడుదినములు మర్దింపవలయును, దీనిని అనుపానవిశేషములతో నొక గురివిందగింజపరిమితిగ నిచ్చినయెడల దోషజ్వరము, విషజ్వరము, శరీరము మంట, తాపము, ఇవి నశించును. ఈ కాలకూటరసము సోమనాథునిచే చెప్పబడినది.

## మౌక్తికాదికాలకూటరసము

శ్లో॥ మౌక్తికం చ రసం చైవ శిలా గన్ధకతాలకే । టఙ్కణం చ విషం హేమ కృష్ణసర్పవిషం సమమ్ (1) తీక్ష్ణం తారం చ తామ్రం చ నాగభస్మ

సమన్వితమ్ । ఏతత్సమాంశం మతిమానర్కక్షీరేణ పేషయేత్ (2) మత్స్య మాహిషమాయూరవారాహచ్ఛాగపన్నగాః । పిత్తైర్భావిత మేతేషాం దినమేకం పృథక్ పృథక్ (3) కాలకూటరసోనామ ముద్గమాత్రం ప్రయోజయేత్ । దారుణేసంనిపాతే చ తరుణ జ్వరనాశకః । అనుపానవిశేషేణ సర్వరోగ హరః పరమ్ (4)

అ॥ ముత్యభస్మ, రసభస్మ, శు॥ మణిశిల, శు॥ గంధకము, శు॥ తాళకము, కంకుష్ఠము. శు॥ నాభి, సువర్ణభస్మ, నల్లత్రాచుపాముషిషము, ఖడ్గలోహభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, సీసభస్మ. వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడుపాలతో నూరి చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, పాము, వీనియొక్క పిత్తములతో నొక్కొక రోజు భావనచేయవలయును. ఈ కాలకూటరసమును పెసరగింజ పరిమితిగ నిచ్చిన యెడల దారుణమైన సంనిపాతము, తరుణజ్వరము, ఇవి హరించును. అనుపాన విశేషములతో నిది సర్వరోగములను హరించును.

## పా షా ణ కా ల కూ ట ర స ము

శ్లో॥ సువర్ణం పారదం చైవ హ్యష్టలోహం చ గన్ధకమ్ । సర్వైశ్చాపి సమాయుక్తం హ్యష్టభాగం హాలాహలమ్ (1) మనశ్శిలా ద్వాదశ వై గరలం సూతతుల్యకమ్ । తాలకం రసకం చైవ పాషాణ త్రితయం తథా (2) హింగుళం చ ద్వాదశ వై తత్తుల్యం మాక్షికం తథా । శిగ్ర్వగ్నివరుణైశ్చైవ న్యగ్రోధాదిగణేన చ (3) దశమూల కషాయేణ మర్ద్యం మర్ద్యం పునః పునః । కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాయాం చ యామకమ్ (4) పక్త్వా శీతల ముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । జమ్బీరవారుణైర్నీల్యా కారవేల్లేన భావితమ్ (5) మత్స్యమాహిషమాయూరవారాహచ్ఛాగపన్నగాః । పారావతక పోతౌ చ గృధ్రమార్జాలకచ్ఛపాః (6) ఏతేషాం పిత్తకైర్భావ్యం యామం యామం పృథక్పృథక్ । ముద్గమాత్రప్రమాణేన హ్యనుపానవిశేషతః (7) సంనిపాతాన్మహాఘోరాన్ శ్లేష్మవ్యాధీంస్తథైవ చ । వాతవ్యాధీంస్తథా హన్యాన్నాత్ర కార్యావిచారణా (8) రసతాపేతు కర్తవ్యం భోజనం తదనన్తరమ్ । ఉశీరవ్య జనైర్వాయుర్దేయశ్చోదకశీతలైః (9) కాలకూట రసో నామ కాలకూటప్రకాశితః । ఉమాశఙ్కరసంవాదే విష్ణునా కథితః పురా (10)

అ॥ సువర్ణభస్మ 1 భా, శు॥ పాదరసము 1 భా, రజతభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, లోహభస్మ, 1 భా, కాంతభస్మ 1 భా, ఇత్తడిభస్మ 1 భా, కంచుభస్మ 1 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ నాభి 8 భా, శు॥ మణి శిల 12 భా, గరళము 1 భా, శు॥ తాళకము 1 భా, శు॥ కఘరి 1 భా, శు॥ గౌరీ పాషాణము శు॥ ఉల్లిపాషాణము శు॥ దొడ్డిపాషాణము ఇవి 1 భా, శు॥ ఇంగిలీకము 12 భా, మాక్షికభస్మ 12భా, వీనిని మునగ, చిత్రమూలము, ఉప్పి, న్యగ్రోధాది గణము, దశమూలములు, వీనియొక్క కషాయములతో బాగుగ మర్దించి కాచపప్పె యందుంచి వాలుకాయంత్రమందు ఒకజాము వండి చల్లారినపిదప తీసి ఖల్వమందుంచి నిమ్మకాయలు, ఉలిమిరి, నీలి, కాకరాకు, వీనియొక్క రసములతో భావనచేసి చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, పాము, పావురము, గువ్వ, గద్ద, పిల్లి, తాబేలు, వీనియొక్క చేదులతో నొక్కొకజాము భావన చేయవలయును, దీనిని అనుపానవిశేషములతో పెసరగింజపరిమితిగ నిచ్చినయెడల మహాఘోరమైన సంని పాతములు, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, ఇవి నిశ్చయముగ హరించును. ఈఔ షధము తాపమును కలిగించినయెడల భోజనము నివ్వవలయును. పిదప చల్లనినీళ్లు చల్లబడిన వట్టివేళ్ళ విసనకర్రలతో విసరవలయును. ఈ కాలకూటరసము పూర్వ మందు పార్వతీపరమేశ్వర సంవాదమందు విష్ణుదేవునిచే చెప్పబడి కాలకూటునిచే ప్రకాశింపచేయబడినది.

## మేహకేసరిరసము

శ్లో॥ మృతం వజ్రం సువర్ణం చ కాన్తలోహం చ పారదమ్ । ముక్తాం పుష్పం త్వచం చైవ సూక్ష్మైలాపత్రకేసరాః (1) సమభాగం విచూర్ణ్యాథ కన్యానీరేణ భావయేత్ । ద్విమాషాం వటికాం ఖాదేద్దుగ్ధాన్నం ప్రపిబేత్తతః (2) ప్రమేహం నాశయత్యాశు కేసరీ కరిణం యథా । శుక్రప్రమేహం శమ యేత్త్రిరాత్రాన్నాత్ర సంశయః । చిరజాతం ప్రమేహం చ మధుమేహం చ నాశయేత్ (3)

అ॥ వంగభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, శు॥ రసము, ముత్యభస్మ, లవంగములు దాసినచెక్క, చిన్నఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి కలుబందరసముతో భావనచేసి రెండు మినపగింజల పరిమితిగ మాత్రను సేవించి పాలతో కూడిన అన్నమును భుజించినయెడల నిది, సింహము ఏనుగును వలె ప్రమేహమును హరింపజేయును. శుక్రమేహమును మూడురోజులలో

నిశ్చయముగ నశింపజేయును. చిరకాలమై జనించిన ప్రమేహమును, మధుమేహమును, నశింపజేయును.

## శ్లేష్మాంతకరసము

శ్లో॥ పారదం గన్ధకం తాలం తాప్యం తామ్రం మనశ్శిలామ్ । కృష్ణాక్వాథైః స్నుహీక్షీరైర్దినైకం మర్దయేత్సుధీః (1) ద్విగుఞ్జః శ్లైష్మికం రోగం హన్తి యుక్తానుపానతః । శ్లేష్మాన్తకరసో నామఛాగీదుగ్ధం పిబేదను (2)

అ॥ శు॥ రసము శు॥ గంధకము, శు॥ తాళకము, మాక్షికభస్మ, తామ్రభస్మ, శు॥ మణిశిల, వీనిని పిప్పళ్లకషాయముతోడను, జెముడుపాలతోడను, ఒకరోజు మర్దింపవలయును. దీనిని తగిన యనుపానములతో రెండు గురివిందగింజలపరిమితిగ సేవించిన వారికల శ్లేష్మసంబంధమగు వ్యాధి నశించును. శ్లేష్మాంతకరసమని చెప్పబడును. దీనిని వాడుచున్నప్పుడు మేకపాలను త్రాగవలయును.

## జ్వరాతిసారగ్రహణీరిపురసము

శ్లో॥ కపర్దికాశఙ్ఖకమౌక్తికానాం భస్మాభ్రగన్ధాతివిషా విషం చ । అఫేన సూతం కనకం సకాన్తం సటఙ్కణం సర్వసమానభాగమ్ (1) జమ్బీరనీరేణ దినం విమర్ద్యం భావ్యం జయోన్మత్తకశృఙ్గవేరైః । మాషప్రమాణం మధునా లిహ్యేనం జ్వరాతిసారగ్రహణీగదేషు (2)

అ। గవ్వలభస్మ, శంఖభస్మ, ముత్యభస్మ, అభ్రకభస్మ. శు॥ గంధకము, అతివస, శు। నాభి, నల్లమందు, శు॥ రసము, సువర్ణభస్మ, కాంతభస్మ, శు॥ వెలిగారము, వీనిని సమభాగములుగ గ్రహించి నిమ్మకాయలరసముతో నొకరోజు మర్దించి తెక్కలి, ఉమ్మెత్త, అల్లము, వీనియొక్క రసముతో భావన చేయవలయును. దీనిని తేనెతో మాషపరిమితిగ జ్వరము, అతిసారము, గ్రహణి, వీనియందు సేవింపవలయును.

## గ్రహణీకవాటరసము

శ్లో॥ తారమౌక్తికహేమాని సారశ్చైకైకభాగకాః । ద్విభాగో గన్ధకస్సూత్రస్త్రిభాగో మర్దయేదిమాన్ (1) కపిత్థస్వరసైర్గాఢం మృగశృఙ్గే తతః క్షిపేత్ । పుటేన్మధ్యపుటేనైవ తత ఉద్ధృత్య మర్దయేత్ (2) బలారసైస్సప్త

వేలమపామార్గరసైస్త్రిధా । లోధ్రప్రతివిషాముస్తా ధాతకీన్ద్రియవామృతా (3) ప్రత్యేకమేతత్స్వరసైర్భావనా స్యాత్త్రిధా త్రిధా । మాషమాత్రం రసం దేయో మధునా మరిచైస్తథా (4) హన్యాత్సర్వానతీసారాన్గ్రహణీం సర్వ జామపి । కవాటో గ్రహణీరోగే రసోఽయం వహ్నిదీపకః (5)

అ॥ రజతభస్మ, 1 భా ముత్యభస్మ, 1 భా, సువర్ణభస్మ, 1 భా హేమమాక్షిక భస్మ, 1 భా, శు॥ గంధకము 2 భా, శు, రసము 3 భా, వీనిని వెలగరసముతో దృఢముగ మర్దించి లేడికొమ్మునందుంచి మధ్యమపుటము వేసి తీసి ముత్తవ పులగ రసముతో యేడురోజులును, ఉత్తరేణిరసముతో మూడురోజులును, మర్దనను చే లొద్దుగ, అతివస, తుంగగడ్డలు, ఆరెపువ్వు, కొడిశపాలవిత్తులు, తిప్పతీగ, వీ యొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిసారులు భావనను చేయవలయును దీనిని తేనె, మిరియాలు, వీనితో మాషపరిమితిగ నిచ్చినయెడల సమస్తమైన అతిసా ములును, త్రిదోషజనితగ్రహణియు, నశించును. ఇది గ్రహణీరోగమును అడ్డుప చును. అగ్నిదీప్తిని చేయును.

## చ ం ద్ర ర స ము

శ్లో॥ రసభస్మ త్రిభాగం చ భాగైకం తారభస్మకమ్ । మృతమభ్రం చ కాన్తం చ కాసీసం తు శిలాజితు (1) ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్ । నిర్గుణ్డీముసలీవాసాజయాజైత్రరగ్నిమన్థజైః (2) అభయార్ద్రక జైర్మర్ద్యం సప్తాహం చ పృథక్పృథక్ । తద్గోలం కూపికాయన్త్రే షడా మం తు తుషాగ్నినా (3) పచేద్ద్విగుఞ్జస్సేవ్యోఽహి సర్వమేహప్రశాన్తయే నిమ్బబీజ కషాయం చ మధుయుక్తంపిబేదను । అయం చన్ద్రరసో నామ్నా సర్వమేహ కులాన్తకః (4)

అ॥ రసభస్మ 3 భా, రజతభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, కాంతభస్మ 1 భా కాసీసభస్మ 1 భా, శిలాజతుభస్మ 1 భా, వీనిని ఖల్వమందుంచి వావిలి, నేలతాడి అడ్డసరము, తెక్కలి, నెల్లి, కరక్కాయ, అల్లము, వీనియొక్క రసములతో ప్రత్యే ముగ నేడేసిరోజులు మర్దించి ఉండగ చేసి కూపికాయంత్రమందు ఊకనిప్పుతో ఆర జాములు వండవలయును. దీనిని రెండుగురివిందగింజల పరిమితిగ సేవించి తేనెవే

బడిన వేపగింజల కషాయమును త్రాగినయెడల సమస్త మేహములును శాంతించును. ఇది చంద్రరసమన బడును. సమస్త మేహసముదాయమును అంతమొందించును.

## ప్రదరాంతకరసము

శ్లో॥ శుద్ధసూతం తథా గన్ధం వఙ్గభస్మ చ రౌప్యకమ్ । ఖర్పరం చ ప్రవాలం చ శాణమానం పృథక్పృథక్ (1) తృతీయం తోలకల గ్రాహ్యం కాన్తభస్మక్షిపేత్సుధీః । కన్యానీరేణ సంమర్ద్యం దినమేకం భిషగ్వరైః । అసాధ్యం ప్రదరం హన్తి భక్షణాన్నాత్ర సంశయః (2)

అ॥ శు॥ రసము 1 శాణము, శు॥ గంధకము 1 శా, వంగభస్మ 1 శా, రజతభస్మ 1 శా, శు॥ కపరి 1 శా, పగడభస్మ 1 శా, కాంతభస్మ 1/3 తులము, వీనిని ఖల్వమం దుంచి కలుబందరసముతో నొకరోజు మర్దింపవలయును. దీనిని సేవించినయెడల ప్రద రము నిశ్చయముగ నశించును.

## వాతమారకరసము

శ్లో॥ వజ్రం మృతాభ్రం హేమార్కౌ తీక్ష్ణం ముణ్డం క్రమోత్తరమ్ । మరిచైర్మర్దయేదమ్లవర్గేణ దివసత్రయమ్ (1) ద్విక్షారం పఞ్చలవణం మర్ది తం స్యాత్సమం సమమ్ ॥ తతో నిర్గుణ్డికాద్రావైర్మర్దయేద్దివసత్రయమ్ (2) శుష్కమేతద్విసుర్ణ్యాథ విషం చాస్యాష్టమాంశకమ్ । టఙ్కణం విషతుల్యాం శం దత్వా జమ్బీరజద్రవైః (3) భావయేద్దినమేకం తు రసోఽయం వాత మారకః । దాతవ్యో వాతరోగేషు సంనిపాతే విశేషతః (4) ద్విగుఞ్జమార్ద్రిక ద్రావైర్ఘృతైర్వా వాతరోగిణే । నిర్గుణ్డీమూలచూర్ణం తు మహిషాక్షం చ గగ్గులుమ్ (5) సమాంశం మర్దయేదాజ్యే తద్వటీ కర్షసంమితా । అను యోజ్యా ఘృతైర్నిత్యం స్నిగ్ధముష్ణం చ భోజనమ్ (6) మణ్డలాన్నాశ యేద్రోగాన్వాతరోగాన్విశేషతః ॥ సంనిపాతే పిబేచ్చాను తాలమూలకషాయ కమ్ (7)

అ॥ వజ్రభస్మ 1 భా, అభ్రకభస్మ 2 భా, సువర్ణభస్మ 3 భా, తామ్రభస్మ 4 భా, తీక్ష్ణలోహభస్మ 5 భా, ముండభస్మ 6 భా, వీనిని మిరియాలు, అమ్లవర్గము, వీని యొక్క రసములతో మూడురోజులు మర్దించి క్షారద్వయము, పంచలవణములు వీని

నొకొక్కటికి భాగముగ కలిపి వావిలిరసముతో మూడురోజులు మర్దించి ఎండించి యీ మందుకు ఎనిమిదవ భాగము శు॥ నాభిని నాభితో సమానమగు శు॥ టంకమును, కలిపి నిమ్మకాయలరసముతో నొకరోజు భావన చేయవలయును. ఇది వాతమారకరసమన బడును. దీనిని వాతవ్యాధులయందు నివ్వవలయును. సన్నిపాతములయందు తరుచు ఇయ్యవలయును. వాతరోగికి అల్లపురసముతోగాని నేతితోగాని రెండుగురివిందగింజల పరిమితిగ నియ్యవలయును. వావిలివేళ్ళ చూర్ణము, శు॥ మహిషాక్షీగుగ్గులు, వీనిని సమ భాగములుగ గ్రహించి నేతితో మర్దించి కర్ష పరిమితిగల మాత్రలనుచేసి మందు సేవించిన వెంటనే ఈ మాత్రను నేతితో సేవించి స్నిగ్ధగుణమును ఉష్ణవీర్యమునుగల ఆహారమును సేవించినయెడల నలుబదిరోజులకు సమస్తవ్యాధులు నశించును. వాత వ్యాధులు ముఖ్యముగ నశించును. సంనిపాతమందిచ్చినప్పుడు తాటివేళ్ళకషాయమును అనుపానముగ నియ్యవలయును.

## ముఖారిరసము

శ్లో॥ మృతసూతం మృతం స్వర్ణం ద్వాభ్యాం తుల్యాం మనశ్శిలామ్। విమర్దయేచ్చ తైలేన చాతసీసంభవేన చ (1) తద్గోలం వాససా బద్ధ్వా లేప యేచ్చ సమన్తతః । అతసీఫలకల్కేన దోలాయన్త్రే త్ర్యహం పచేత్ । ఉద్ధృ త్యధారయేద్వక్త్రే జిహ్వాదన్తాస్యరోగజిత్ (2)

అ॥ రసభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, శు॥ మణిశిల 2 భా, వీనిని అవిసె నూనెతో మర్దించి ఉండగచేసి బట్టయందు కట్టి పైన అంతటను అవిసికాయల కల్క ముతో పూసి దోలాయంత్రమందు మూడురోజులు వండవలయును. దీనిని నోటియం దుంచుకొనినచో జిహ్వారోగములు, దంతరోగములు ముఖ (నోటి) వ్యాధులు, ఇవి నశించును.

## వాతనాశకరసము

శ్లో॥ సూతం హాటకవజ్రే చ తామ్రం లోహం మాక్షికమ్ । తాలం నీలాఞ్జనం తుత్థం సిన్ధుఫేనం సమాంశకమ్ (1) పఞ్చానాం లవణానాం చ భాగమేకం విమర్దయేత్ । వజ్రీక్షీరస్యైర్దినైకం తు రుద్ధ్వా తం భూధరే పచేత్ (2) మాషైకమార్ద్రకద్రావైర్లిహ్యాద్వాతవినాశనమ్ । పిప్పలీమూలజక్వాథం సకృష్ణ మనుపాయయేత్ (3) సర్వాన్వాతవికారాంశ్చ నిహన్త్యాక్షేపకాది కాన్ । వాతనాశక నామా చ రసోఽయం యోగ్యమౌషధమ్ (4)

అ॥ శు॥ రసము, సువర్ణభస్మ, వజ్రభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, మాక్షిక భస్మ, శు॥ తాళకము, నీలాంజనము, శు॥ మైలతుత్థము, సముద్రఫేనము, పంచలవణములు, వీని నొక్కొక భాగముగ గ్రహించి నల్లేరురసముతో నొకరోజు మర్దించి మూషళ్ళయందుంచి సంథిబంధనము చేసి భూధరపుటము వేయవలయును. దీనిని అల్లపురసముతో మాషపరిమితిగ సేవించినయెడల వాతము నశించును. దీనిని సేవించి పిప్పళ్ళతోకూడిన మోడికసాయమును త్రాగినయెడల ఆక్షేపక వాతము మొదలగు సమస్తవాతవ్యాధులును నశించును. ఇది వాతనాశకరసమని చెప్పబడును. యోగ్యమైన యౌషధము.

## చతుర్ముఖరసము

శ్లో॥ రసగన్ధకలోహాభ్రం సమం సూతాఙ్ఘ్రి హేమ చ। సర్వం ఖల్వతలే క్షిప్త్వా కన్యయా చ విమర్దయేత్ (1) ఏరణ్డపత్రైరావేష్ట్య ధాన్యరాశౌ దినత్రయమ్। సంస్థాప్య చ తదుద్ధృత్య సర్వరోగేషు యోజయేత్ (2) ఏతద్రసాయనశ్రేష్ఠం త్రిఫలాం మధుసంయుతామ్। తద్యథాగ్నిబలం ఖాదేద్వలీపలిత నాశనమ్ (3) క్షయమేకాదశవిధం కాసం పఞ్చవిధం తథా। కుష్ఠమష్టాదశవిధం పాణ్డురోగం ప్రమేహకాన్ (4) శూలం శ్వాసం చ హిక్కాం చ మన్దాగ్నిం చామ్లపిత్తకమ్। వ్రణాన్సర్వానాఢ్యవాతంవిసర్పం విద్రధిం తథా(5) అపస్మారం మహోన్మాదం సర్వార్శాంసి త్వగామయాన్। క్రమేణ సేవితో హన్తి వృక్షమిన్ద్రాశనిర్యథా (6) పుష్టిదం వృష్యమాయుష్యం పుత్రప్రసవ కారణమ్। జగతాం చ హితార్థాయ చతుర్ముఖముఖోదితః। రసశ్చతుర్ముఖో నామ చతుర్ముఖ ఇవాపరః (7)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, లోహభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, సువర్ణభస్మ ¼ భా, వీనిని ఖల్వమందుంచి కలబందరసముతో మర్దించి ఆముదపాకులతో చుట్టి ధాన్యరాశియందు మూడురోజులుంచి పిదప తీయవలయును. ఈ రసాయనశ్రేష్ఠమును త్రిఫలములు, తేనె, వీనితో అగ్నిబలానుసారముగ సమస్త వ్యాధులయందు నియ్యవలయును. క్రమముగ సేవించినచో నిది శరీరము ముడతలు పడుట, వెంట్రుకలు నెరయుట, ఏకాదశక్షయలు, పంచవిధకాసలు, అష్టాదశకుష్ఠములు, పాండురోగము, ప్రమేహములు, శూల, శ్వాస, ఎక్కిళ్ళు, అగ్నిమాంద్యము, ఆమ్లపిత్తము, సమస్త వ్రణములు, ఆఢ్యవాతము, విసర్పము, విద్రధి, అపస్మారము,

ఉన్మాదము, సమస్త మూలవ్యాధులు, చర్మవ్యాధులు, వీనిని పిడుగు వృక్షమునువలె నశింపజేయును. శరీరపుష్టి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, పుత్రసంతానప్రాప్తి, వీనిని చేయును. లోకములయొక్క మేలుకొరకు బ్రహ్మదేవునిచే చెప్పబడినది. చతుర్ముఖ రసమని చెప్పబడును. బ్రహ్మదేవునివంటిది.

## సర్వవాతహరరసము

శ్లో॥ హేమార్క కాన్తలోహాభ్రం సూతభూతిం చ గన్ధకమ్ । వైక్రాన్తం విద్రుమం చైవ తారం తాలసమన్వితమ్ (1) సుముహూర్తే ఖల్వమధ్యే చిత్రమూలస్య చ ద్రవైః । చతుర్యామం చ సంమర్ద్యం ఛాయా శుష్కం చ కారయేత్ (2) కుక్కుటాఖ్యపుటే పక్త్వా స్వాఙ్గశీతలముద్ధరేత్ । ఇదం చ చూర్ణయేత్ శ్లక్ష్ణం తదర్ధం సూతభస్మకమ్ (3) సూతతుల్యం మృతం తాలం సర్వం ఖల్వే విమర్దయేత్ । చిత్రకార్ద్రకసిరేణ నిర్గుణ్డీవారుణ ద్రవైః (4) వాసానిమ్బరసైర్భావ్యం సప్తధా చ పృథక్పృథక్ । గుఞ్జా మాత్రప్రయోగేణ కణామధ్వాజ్య సంయుతమ్ (5) సుప్తివాతం వాతశూలం లేదనావాతమేవ చ । స్నాయు కమ్పం గాత్రభఙ్గం పక్షవాతం హ్యాసు గ్రహమ్ (6) వాతమూర్ఛాం చ తిమిరం వాతాశీతిం చ నాశయేత్ । వన్ధ్యా చ లభతే పుత్రం నష్టవీర్యే ప్రశస్యతే (7) సర్వవాతహరో నామ సర్వరోగ నివారకః । లోకానాముపకారాయ హ్యశ్వినీదేవనిర్మితః (8)

అ॥ సువర్ణభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, రసభస్మ, శు॥ గంధకము, వైక్రాంతభస్మ, పగడభస్మ, రజతభస్మ, శు॥ తాళకము, వీనిని సుము హూర్తమందు ఖల్వమందుంచి చిత్రమూలరసముతో నాలుగుజాములు మర్దించి నీడను ఎండించి కుక్కుటపుటమువేసి చల్లారినపిదప తీసి మెత్తగనూరి యీయంసునకు సగము రసభస్మను, రసభస్మతో సమానము తాళకభస్మను కలిపి నూరి చిత్రమూలము, అల్లము, వావిలి, ఉప్పి, అడ్డసరము, వేప, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నేడేసి రోజులు భావన చేయవలయును. దీనిని పిప్పళ్ళు, నెయ్యి, తేనె, వీనితో నొక గురి వింద గింజపరిమితిగ నిచ్చినయెడల సుప్తివాతము, వాతశూల, బాధతోకూడిన వాతము, స్నాయుకంపము, శరీరము చితుకకొట్టినట్లుండుట, పక్షవాతము, చెక్కిళ్ళు, పట్టుకొనిపోవుట, వాతమూర్ఛ, తిమిరవాతము, ఎనుబదివాతవ్యాధులు, ఇవి నశించును.

దీనిసేవనచే వంధ్యాస్త్రీ సంతానమును పొందును. ఇంద్రియనష్టమునకు ప్రశస్తమైనది సర్వాంగవాతరోగములను నశింపజేయును. సమస్తవ్యాధులను నశింపజేయును. లోకోపకారార్థము నిమిత్తము అశ్వనీదేవతలచే చెప్పబడినది.

## వాతకులాంతకరసము

సీ॥ గాఙ్గేయతామ్రముల్ కాన్తభస్మము లోహతారంబు వైక్రాన్త తాలకంబు । బలిరసభస్మముల్ పగడచూర్ణంబును నేకాంశలన్నియు జోక మరియు । వావిలిజిల్లేడునరిహంసపాదియు వాసభృఙ్గంబుల వరరసంబు । వేపచెక్కరసంబు వెస నిమ్మపులుసును గలిజేరుసారముల్ కలియనూరి । వజ్రమూసనునిచి వరుస నొక్కజాము వాలుకాయన్త్రిన వండి తుప్పె । వెలికిదీసి పునర్నవ పేడ్కనూరి । పరగ గుటికలుకావించి పరకయెత్తు సేవ చేసిన జనులకు సేమమగును । సర్వరోగసమూహముల్ సమసిపోను । నరయ నిదియును వాతకులాన్తకంబు॥

తా॥ సువర్ణభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, లోహభస్మ, రజతభస్మ, వైక్రాంతభస్మ, శు॥ తాళకము, గంధకము, రసభస్మ, పగడభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి వావిలి, జిల్లేడు, పిల్లితేగలు, హంసపాది, అడ్డసరము, గుంటగలగర, వేపచెక్క, నిమ్మకాయలు, గలిజేరు, వీనియొక్క రసములతో నూరి వజ్రమూసయందుంచి వాలుకాయన్త్రమందు మందమధ్యమతీవ్రాగ్నులచే నొక్కొకజాము వండి మూసను విదల్చి మందును తీసి గలిజేరురసముతో బాగుగ నూరి మాత్రలు జేయవలయును. దీనిని పూటకు పరకయెత్తు చొప్పున సేవించినయెడల సమస్తవ్యాధులు నశించును. క్షేమము కలుగును. దీనిని వాతకులాంతకమందురు.

## సత్వవాతకులాంతకరసము

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం వైక్రాన్తం కాన్తమభ్రకమ్ । నిరుద్ధ లోహధాతుశ్చ సర్వాణి చ సమాంశకమ్ (1) గన్ధకాద్ద్విగుణం తాలం తాలాద్ద్విగుణకాం శిలామ్ । శిలాయా ద్విగుణం తాప్యం పాదాంశం రసభస్మకమ్ (2) ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయేద్దినద్వయమ్ । సర్వస్యాష్టమభాగేన మేలయేచ్చ హాలాహలమ్ (3) విషతిన్దుకదైర్ద్రావైః పిష్ట్వా గోలకమాచరేత్ । కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాయన్త్రకే పచేత్ (4) సాఙ్గ

శీతలముద్ధృత్య శుద్ధం హిఙ్గుష్టమాంశకమ్ । భావయేద్బీజపూరేణ సప్తయామం విభావయేత్ (5) చిత్రమూలకషాయేణ సర్వవాతకులాన్తకమ్ । ఘృతేన సహితం పేయం వల్లద్వయ ప్రమాణకమ్ (6) నిహన్త్యశీతిం వాతానాం గుల్మాని వివిధాని చ । చతుర్విధం చ మాన్ద్యాగ్నిం శూలచ్ఛర్ద్యుదరక్రిమీన్ (7) ఆధ్మానం చ తథా హిక్కామతిసారమరోచకమ్ । ఏకాదశక్షయాన్హన్తి సర్వవాతకులాన్తకః (8)

అ॥ సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, లోహభస్మ 1 భా, శు। గంధకము 1 భా, శు॥ తాళకము 2భా, శు॥ మణిశిల 4భా, హేమమాక్షికభస్మ 8 భా, రసభస్మ 2 భా, వీనిని ఖల్వమందుంచి రెండురోజులు నూరి 3 భాగముల శు॥ నాభిని కలిపి విషముష్టికషాయముతో నూరి మాత్రలు చేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి సాంగశీతలమున తీసి యామందునకు ఎనిమిదవవంతు శు॥ ఇంగువను కలిపి మాదీఫలరసము, చిత్రమూలకషాయము, వీనితో నేడేసిరఘామములు భావన చేయవలయును. ఈ సర్వవాతకులాంతకమును నేతితో రెండువల్లములపరిమితిగ పుచ్చుకొనినయెడల ఎనుబదివాతములు, ఎనుబది గుల్మములు, నాలుగు అగ్నిమాంద్యములు, శూల, వాంతి, ఉదరవ్యాధులు, క్రిమివ్యాధులు, కడుపుబ్బరము, ఎక్కిళ్ళు, అతిసారము, అరోచకము, పదునొకండు క్షయలు, ఇవి హరించును. ఇది సర్వవాతకులాంతక మనబడును.

## వసంతకుసుమాకరము

శ్లో॥ పృథగ్ద్వౌ హాటకం చన్ద్రం త్రయో వఙ్గాహికాన్తజమ్ । చత్వారః పారదోఽభ్రం చ ప్రవాలం మౌక్తికం తథా (1) గవ్యదుగ్ధేక్షువాసాశ్రీద్విజలైర్నిశయా తథా । మోచకన్దరసైస్సప్తక్రమాద్భావ్యం పృథక్పృథక్ (2) శతపత్రరసేనైవ మాలత్యాః కుసుమైస్తథా । పశ్చాన్మృగమదైర్భావ్యస్సుసిద్ధో రసరాడ్భవేత్ (3) కుసుమాకరవిఖ్యాతో వసన్తపదపూర్వకః । వల్లద్వయమిత స్సేవ్యస్సితాజ్యమధుసంయుతః (4) వలీపలితహృన్మేధ్యః కామదస్సుఖదస్సదా । మేహఘ్నః పుష్టిదశ్శ్రేష్ఠః పరం వృష్యోరసాయనమ్ (5) ఆయుర్వృద్ధికరః పుంసాం ప్రజాజనకఉత్తమః । క్షయకాసతృషో

న్మూఢార్శ్యాసరక్తవిషార్తిజిత్ (6) సితాచన్దనసంయుక్తశ్చామ్లపిత్తాదిరోగజిత్। హన్తి పాణ్డ్వామయాన్ శూలాన్మూత్రాఘాతాశ్మరీర్జయేత్ (7) సుసాత్మ్య మిష్టం భుఞ్జానో రమయేత్ప్రమదాశతమ్। యోగవాహీ త్వయం సేవ్యః కాన్తిశ్రీబలవర్ధనః (8) శ్లో॥ మదనం మదయేన్మదముజ్జ్వలయన్ ప్రమదాని వహన్నతివిహ్వలయన్। సురతైస్సుఖదైర్గతివివ్యచనైర్భవసారజుషామయమేవ సుహృత్ (9)

అ॥ సువర్ణభస్మ 2 భా, రజతభస్మ 2 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 3 భా, కాంతలోహభస్మ 3 భా, సూత (పాదరస) భస్మ 4 భా, అభ్రకభస్మ 4 భా, పగడ భస్మ 4 భా, ముత్యభస్మ 4 భా, వీనిని ఆవుపాలతోడను చెఱకు, అడ్డరసము, చందనము, వట్టివేళ్ళు, కురువేరు, పసుపు, ఆరటిదుంప, కమలములు, మాలతీపుష్పములు, వీనియొక్క రసములతోడను ప్రత్యేకముగ నేడేసిసారులు భావన చేసి పిదప కస్తూరితో భావన చేసినయెడల శ్రేష్ఠమైన యౌషధముగ బాగుగ తయారగును. ఇది వసంతకుసుమాకరమని చెప్పబడును. దీనిని పంచదార, నెయ్యి, తేనె, వీనితో రెండు కల్లనుల పరిమితిగ సేవింపవలయును. ఇది శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, వీనిని హరింపజేయును. బుద్ధిబలము, కామము సుఖము, వీనిని కలిగించును. మేహములను నశింపజేయును. శరీరపుష్టి, వీర్యవృద్ధి, వీనిని కలిగించును. ముసలితనమును, వ్యాధులను, పోగొట్టును. ఆయుర్వృద్ధి, సంతానము, వీనిని కలిగించును. క్షయ, దగ్గు, దప్పిక, ఉన్మాదము, ఆయాసము, రక్తదోషము, విషదోషము వీనిని నశింపజేయును. పంచదార, చందనము, వీనితో సేవించినయెడల ఆమ్లపిత్తము మొదలగు వ్యాధులు నశించును. పాండువ్యాధులు, శూలలు, మూత్రాఘాతము, అశ్మరి, వీనిని నశింపజేయును. అనుపాన భేదములతో సమస్తవ్యాధులను నశింపజేయును. శరీరకాంతి, లక్ష్మి, బలము, వీనిని వృద్ధినొందించును. దీనిని సేవించుచు అభ్యాసమును, ఇష్టమును, అయిన ఆహారమును భుజించుచుండినయెడల అధికమగు కామోద్రేకము కలవాడై సుఖకరములైనట్టియు, అనేకవిధములైనట్టియు, సురతములచే స్త్రీసముదాయములను భయకంపితులనుగ జేయుచు ననేకమంది స్త్రీలను రమించును. సంసారసుఖమును పొందువారలకు దీనితో సమానమగు మందు వేరొకటి లేదు.

## వసంతకుసుమాకరము (ప్రకారాంతరము)

శ్లో॥ మృతసూతాభ్రకే స్వర్ణం రౌప్యం కాన్తం చ తీక్ష్ణకమ్। ప్రవాల ముక్తాభసితే భసితే నాగవఙ్గయోః (1) సూతార్ధం భస్మవైక్రాన్తం గవ్య

దుగ్ధేన మర్దయేత్ । జాతీపుష్పసముద్భూతై రసైశ్చ దివసత్రయమ్ (2) శాల్మలీకదలీద్రాక్షాద్రవై ర్గాన్ధారికాద్రవైః । ఏతై స్తు సప్తధా భావ్యం సమ్యక్కస్తూరికాయుతమ్ (3) శతపత్రరసేనైవ కుఙ్కుమాగ రుజద్రవైః । వల్లద్వయ మితస్సేవ్యస్సితాజ్యక్షీరసంయుతః (4) ప్రదరాణి ప్రమేహాణి యక్ష్మకృచ్ఛ్రాదికాన్హరేత్ । బహుమూత్రం ఖణ్డమూత్రం రక్తస్రావప్రవాహికే (5) తత్తద్రోగానుపానేన సర్వరోగనివారకః । సర్వపైత్త్యాన్హరేచ్చైవ వసన్తకుసుమాకరః (6)

అ॥ రసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, ఖడ్గలోహభస్మ 1 భా, పగడభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, వైక్రాంతభస్మ ½ భా వీనిని ఆవుపాలతోడను, జాజిపువ్వుల రసముతోడను, మూడేసిరోజులు మర్దించి కస్తూరిని కలిపి బూరుగచెక్క అరటిదుంప, ద్రాక్షపండ్లు, గంజాయాకు, పద్మములు, కుంకుమపువ్వు, కృష్ణాగరుచెక్క వీనియొక్క రసములతో ఏడేసిసారులు భావన చేయవలయును. దీనిని పంచదార, నెయ్యి, పాలు వీనితో రెండువల్లముల పరిమితిగ సేవించినయెడల ప్రదరము, ప్రమేహములు, రాజయక్ష్మ, మూత్రకృచ్ఛ్రము మొదలగువ్యాధులు, అతిమూత్రము, మూత్రము ఆగిఆగిపడుట, రక్తస్రావము, జిగటవిరేచనములు, ఇవి హరించును. ఆయా రోగములకు తగిన అనుపానములతో నిచ్చినయెడల సమస్తవ్యాధులు హరించును. ఇది సమస్తపైత్యవ్యాధులను హరింపజేయును. వసంతకుసుమాకరమని చెప్పబడును.

## వసంతకుసుమాకరము (వంటయోగము)

శ్లో॥ ఏకభాగం రుద్రవీర్యం గన్ధకం చ ద్విభాగకమ్ । హేమరౌప్యం ప్రవాలం చ మౌక్తికం హేమమాక్షికమ్ (1) కాన్తం గగన వైక్రాన్తే త్రిభాగం చ పృథక్పృథక్ । పఞ్చభాగం భుజఙ్గం చ వఙ్గకం పఞ్చభాగకమ్ (2) ఖల్వమధ్యే తు సర్వాణి నిక్షిప్య లికుచద్రవైః । ద్రాక్షాఖర్జూరవిజయాగోక్షురార్ద్రకక్షీరకైః (3) మర్దనం త్రిదినం కృత్వా కాచకుమ్భే వినిక్షిపేత్ । క్రమాగ్నౌ వాలుకాయన్త్రే పాచయేదష్టయామకమ్ (4) స్వాఙ్గశీతలముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కస్తూరికాం చ కాశ్మీరం కర్పూరం జాతికాఫలమ్(5) ప్రత్యేకమేకభాగం చ సమాయుఞ్జ్యాద్భిషగ్వరైః । కాన్తారం చన్దనం రమ్భాఖిదారీ ముసలీ వరీ (6) శాల్మలీపుష్పజలజే మాలతీకుసుమం తథా । ఇన్ద్రీ

ఫలం చ మన్దారం పన్నీరం చ తథా భవేత్ (7) సర్వైరేతై ర్విభావ్యం తు త్రిదినం చ పృథక్పృథక్ । వల్లమాత్రప్రమాణేన హ్యనుపానవిశేషతః (8) సేవితః ప్రాతరుత్థాయ మేహవింశతినాశకః చతుర్వింశతిపైత్యాని పాణ్డుం వహ్నిం క్షయం హరేత్ (9) శ్వాసకాసగదాన్హన్తి హారిద్రాశుక్రమేహకే । మధుమేహం చేక్షుమేహం బహుమూత్రం చ తన్తుకామ్ (10) లాలామేహం వసామేహం మూత్రకృచ్ఛ్రాశ్మరీం తథా । రక్తపిత్తం చామ్లపిత్తం నారీణాం ప్రదరం తథా (11) అఙ్గదాహం లిఙ్గదాహం వృద్ధోఽపి తరుణో భవేత్ । భవేద్వన్ధ్యా పుత్రవతీ పుంస్త్వమేతి నపుంసకః (12) కుసుమాకర నామాఽయం వసన్తపదపూర్వకః । సర్వరోగాన్నిహన్త్యాశు శమ్భునా పరికల్పితః (13)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, సువర్ణభస్మ 3 భా, రజతభస్మ 3 భా, పగడభస్మ 3 భా, ముత్యభస్మ 3 భా, హేమమాక్షికభస్మ 3 భా, కాంతభస్మ 3 భా, అభ్రకభస్మ 3 భా, వైక్రాంతభస్మ 3 భా, సీసభస్మ 5 భా, వంగభస్మ 5 భా, వీనిని ఖల్వమందుంచి నిమ్మకాయలు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయలు, గంజాయి, పల్లేరు, అల్లము, వీనియొక్క రసములతోడను ఆవుపాలతోడను ప్రత్యేకముగ మూడేసిరోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు క్రమాగ్నిలచే ఎనిమిదిజాములు వండి సాంగశీతలమున తీసి ఖల్వమునందుంచి కస్తూరి 1 భా, కుంకుమపువ్వు 1 భా, పచ్చకర్పూరము 1 భా, జాజికాయలు 1 భా, ఇట్లు వీనిని కలిపి చెఱకు, చందనము, అరటి, నేలగుమ్మడి, నేలతాడి, పిల్లిపీచర, బూరుగపుష్పములు, కురువేరు, మాలతీపుష్పములు, నల్లకలువ, మందారపుష్పములు, వీనియొక్క రసములతోడను పన్నీరుతోడను ప్రత్యేకముగ మూడేసిరోజులు భావన చేయవలయును. దీనిని అనుపాన విశేషములతో వల్లపరిమితిగ ఉదయమున లేచి సేవించినచో ఇరువది మేహములు, ఇరువదినాలుగుపైత్యములు, పాండువు, వాంతి, క్షయ, శ్వాస, కాస, హారిద్రామేహము శుక్లనష్టము, మధుమేహము, ఇక్షుమేహము, బహుమూత్రము, తంతుమేహము, లాలామేహము, వసామేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, రక్తపిత్తము, ఆమ్లపిత్తము, ప్రదరవ్యాధులు, శరీరతాపము, లింగతాపము, ఇవి నశించును. దీనిని సేవించుటవలన వృద్ధుడుకూడ యౌవనవంతుడగును. గొడ్డురాలు సంతానవంతురాలగును. నపుంసకుడు పుంస్త్వమును పొందును. సమస్తరోగములు వెంటనే నశించును. ఈ వసంతకుసుమాకరము శివునిచే చెప్పబడెను.

## వసంతకుసుమాకరము (కజ్జలి)

శ్లో॥ హేమతారప్రవాలాని వజ్రం వైడూర్యమౌక్తికే। అభ్రకం మృతలోహం చ ద్విభాగం సూతభస్మకమ్ (1) వఙ్గం నీలం చ వైక్రాన్తం నాగభస్మ సమాంశకమ్। సర్వాణి చ సమాదాయ హ్యాశ్వగన్ధావిదారిభిః (2) రమ్భాగోక్షురమోచాభిర్వరీవాసేక్షుభిస్తథా। మృణాలచన్దనోశీరజాతిపుష్పైశ్చ వారిణా (3) ద్రాక్షాఖర్జూరకూష్మాణ్డైః కదళ్యార్ద్రకసారిబైః। మర్దయిత్వా పృథక్త్రీణి దినాని భిషగుత్తమః (5) ఘనసారం మృగమదం ప్రత్యేకం చైకభాగకమ్। మేలయిత్వా లవఙ్గేణ కుఙ్కుమస్య ద్రవేణ చ (5) మాలతీజాతి పుష్పైశ్చ హరిద్రాగరు వారిజైః। సమస్తపుష్పజాత్యా చ పన్నీరేణ చ భావయేత్ (6) కుసుమాకరవిఖ్యాతో వసన్తపదపూర్వకః। అనుపానవిశేషైశ్చ వల్లమాత్రనిషేవణాత్ (7) మధుమేహం చేక్షుమేహం బహుమూత్రం చ తన్తుకామ్। రక్తమేహం మూత్రకృచ్ఛ్రం చాశ్మరీం పిష్టమేహకమ్ (8) లాలామేహం వసామేహం హరిద్రాశుక్లమేహకమ్। వివిధాంశ్చ ప్రమేహాంశ్చ నాశయేన్నాత్ర సంశయః (9) రక్తపిత్తం చామ్లపిత్తం నారీణాం ప్రదరం తథా। క్షయశోషారుచిశ్వాసకాసపాణ్డ్వామయాన్హరేత్ (10) ఛర్దిం హిక్కామపస్మారం చోన్మాదం మూర్ఛరోగకమ్। అఙ్గదాహం లిఙ్గదాహం వృద్ధోఽపితరుణాయతే (11) భవేద్వన్ధ్యా పుత్రవతీ పుంస్త్వమేతి నపుంసకః। సర్వరోగాన్హరత్యేష వృష్యశ్చైవ రసాయనమ్। ఆయుర్మేధాబలకరో నవనాథేన భాషితః (12)

అ॥ సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, పగడభస్మ 1 భా, వజ్రభస్మ 1 భా, వైడూర్యభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, లోహభస్మ 1 భా, రసభస్మ 2 భా, వంగభస్మ 1 భా, నీలభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, సీసభస్మ 1 భా, వీనిని ఖల్వమందుంచి పెన్నేరు, నేలగుమ్మడి, అరటిదుంప, పల్లేరు, బూరుగ, పిల్లిపీచర, అడ్డసరము, చెఱుకు, తామరతూండ్లు, మంచిగంధము, వట్టివేరు, జాజి పువ్వులు, కురువేరు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయలు, బూడిదగుమ్మడికాయ, అరటి స్తంభము, అల్లము, పాలసుగంధి, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసి రోజులు మర్దించి పచ్చకర్పూరము 1 భా, కస్తూరి 1 భా, కలిపి లవంగములు, కుంకుమ పువ్వు, మాలతీపుష్పములు, జాజిపుష్పములు, పసుపు, అగరుచెక్క, పద్మములు,

[illegible] రసములతోడను సమస్తవిధములగు పుష్పజాతులయొక్క రసములతోడను, [illegible]తోడను భావన చేయవలయును. ఇది వసంతకుసుమాకర మనబడును. దీనిని [illegible]ములతో వల్లపరిమితిగ సేవించినయెడల మధుమేహము, ఇక్షుమేహము, [illegible], [illegible]మేహము, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, పిష్ట మేహము, లాలామేహము, వసామేహము, హరిద్రామేహము, శుక్లమేహము, అన్ని విధములైన ప్రమేహములు, నశించును. ఎంతమాత్రమును సందేహములేదు. రక్త పిత్తము, అమ్లపిత్తము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, క్షయ, నంజు, అరుచి, శ్వాస, కాస, పాండువ్యాధి, వాంతులు, ఎక్కిళ్లు, అపస్మారము, ఉన్మాదము, మూర్ఛ రోగము, దేహతాపము, లింగతాపము, ఇవికూడ నశించును. దీనిని సేవించుటవలన వృద్ధుడు యౌవనవంతుడుగను, గొడ్డురాలు సంతానవంతురాలుగను, నపుంసకుడు పుంస్త్వముకలవాడుగను, అగును. సమస్తమైనరోగములు పోవును. వీర్యవృద్ధి, ఆయు ర్వృద్ధి, బుద్ధిబలము, ఇవి కలుగును. ఇది రసాయనము. నవనాథునిచే చెప్పబడెను.

## మ హా వ సం త కు సు మా క ర ము (వంటయోగము)

శ్లో॥ సువర్ణం తామ్రకిట్టే చ వైక్రాన్తం తీక్ష్ణమాయసమ్ । ముక్తాఫలం విద్రుమం చ పారదం గన్ధకం తథా (1) ప్రత్యేకం చైకభాగం చ నాగం వఙ్గం చ కాన్తకమ్ । అభ్రకం చ శిలాచూర్ణం చన్ద్రిం వజ్రం చ టఙ్కణమ్ (2) ప్రత్యేకం వేదభాగం చ హ్యుత్పలద్రవమర్దితమ్ । వాసా విదారీకూష్మాణ్డచన్దనో శీరవాలకైః (3) మర్దితం త్రిదినం గాఢం కాచ కూప్యాం తు నిక్షిపేత్ । పాచితం తు క్రమేణైవ చైకరాత్రమతన్ద్రితః (4) స్వాఙ్గశీతలముద్ధృత్య పునః ఖల్వే వినిక్షిపేత్ । గుడూచీసత్వసిన్దూరే ప్రత్యేకం వేదభాగకే (5) ఘనసారం మృగమదం ప్రత్యేకం చైకభాగకమ్ । ఖల్వమధ్యే వినిక్షిప్య సర్వం సంమిశ్రితం తథా (6) అష్టధా గవ్యదుగ్ధేన శతపత్రరసేన చ । ముసలీక్షుగణేనాష్ట వాలుకోశీరకైస్తథా (7) భావయేదష్ట రాత్రాణి హరిద్రాద్వయజీరకైః । రమ్భాకాణ్డరసేనైవ భావయేదష్టరాత్రకమ్ (8) ఇన్దీవరవరీభ్యాం చ చన్దనద్వయ జాతిభిః । సమస్త పుష్పజాత్యా చ భావయేదష్టవారకమ్ (9) కుసుమాకర నామాఽయం వసన్తపదపూర్వకః । ద్విగవల్లం వాఽథవల్లం వా హ్యనుపాననిషేవితమ్ (10) నానామేహప్రశమకం మూత్రకృచ్ఛ్రం తథాఽశ్మరీమ్ । క్షయం పాణ్డుం చ పిత్తం చ దేహ

దాహం నిహన్తి చ (11) కరపాదాక్షిదాహం చ శూలం చాపి శిరోరుజమ్ ।
మధుమేహం చాతిమూత్రం శ్వాసం కాసాశ్మరీ తథా (12) ప్రదరం యోని
శూలం చ వన్ధ్యాదోషం చ యోషితామ్ । వృష్యం రసాయనం శ్రేష్ఠం
బుద్ధీంద్రియబలప్రదమ్ (13)

అ॥ సువర్ణభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, మాండూరభస్మ 1 భా, వైక్రాంత భస్మ 1 భా, తీక్ష్ణలోహభస్మ 1 భా, ఇనుపభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, పగడ భస్మ 1 భా, శు॥ పాదరసము 1 భా, గంధకము 1 భా. సీసభస్మ 4 భా, వంగభస్మ 4 భా, కాంతభస్మ 4 భా, అభ్రకభస్మ 4 భా, శిలాజతుభస్మ 4 భా, వెండిభస్మ 4 భా, వజ్రభస్మ 4 భా, టంకణభస్మ 4 భా, వీనిని గ్రహించి నల్లకలువ, అడ్డసరము, నేల గుమ్మడి, బూడిదగుమ్మడి, మంచిగంధము, వట్టివేళ్ళు, కురువేరు, వీనిరసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు క్రమాగ్నులచే ఒకరోజు వండి స్వాంగశీతలమున తీసి ఖల్వమందుంచి తిప్పసత్తు 4 భా, రససిందూరము 4 భా, పచ్చకర్పూరము 1 భా, కస్తూరి 1 భా, కలిపి ఆవుపాలతోడను పద్మములు, నేలతాడి, ఇక్షుగణము, కురువేరు, వట్టివేరు, పసుపు, మ్రానుపసుపు, జీలకఱ్ఱ, అరటిస్తంభము, నల్లకలువ, పిల్లిపీచర, మంచిగంధము, ఎఱ్ఱచందనము, జాజిపువ్వులు, అన్నిరకముల పువ్వులు, వీనియొక్క రసములతోడను ప్రత్యేకముగ ఎనిమిదేసిరోజులు భావన చేయవలయును. ఇది మహావసంతకుసుమాకర మనబడును. దీనిని అనుపానవిశేషములతో రెండువల్లములపరిమితిగ గాని వల్లపరిమితిగ గాని సేవించినచో సమస్త ప్రమేహములు, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, క్షయ పాండువు, పైత్యవ్యాధులు, శరీరతాపము, చేతులమంటలు, కాళ్ళమంటలు, కళ్ళమంటలు, శూల, తలనొప్పి, మధుమేహము అతిమూత్రము, శ్వాస, కాస, మూలశంక, శ్వేతప్రదరము, రక్తప్రదరము, యోనిశూల, వంధ్యాదోషము, ఇవి నశించును. ముసలితనమును, రోగములును పోవును. వీర్యవృద్ధియు, బుద్ధిబలమును, ఇంద్రియబలమును, కలుగును.

వసంతకుసుమాకరము (వంటయోగము) (ప్రకారాంతరము)

సీ॥ హాటకరౌప్యకాంతాభ్రకభస్మముల్ రసగంధకంబు లింపెసగ
సమము। గూరిచి లెస్సగా గోక్షీరముల నూరి గుళికలు గావించి కుప్పెనుంచి।
త్రివిధాగ్నులం దొక్కదినము వాలుకాయంత్రమున వండి యౌషధమునకు

మము । పగడము త్తియసీసతగరభస్మంబులు రసభూతి రససిందురమును యు । కస్తూరియును పచ్చకర్పూరమును మంచికుసుమపువ్వును గూర్చి ద్రాక్ష । పండ్లు ఖర్జూరపుపండ్లు ధాత్రీఫలరంభాఫలంబుల రసముతోడ । నేల తాడియు మల్లెపూల రసంబుల మర్దించి పూటకు మాష మెత్తు । మధ్వాజ్యశర్కరామధురోష్ణధారలు మొదలుగా ననుపానములను గొనుచు । మధురాన్నపానముల్ మాంసమద్యంబులు బహువిధభక్ష్యముల్ ఫలము లమర । భుజియింప దేహసంపుష్టి తుష్టియు దృష్టి గలిగించు సంసర్గకామదంబు । కాంతిసుఖదంబు సంతానకారణంబు । నాయురారోగ్యవృద్ధియౌ నవనినివ్వ । సంతకుసుమాకరముస దయాంతరంగ । కంసమదభంగ శ్రీరంగ ఖగతురంగ ॥

అ॥ సువర్ణభస్మ, రజతభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, వీనిని సమభాగములుగ గ్రహించి ఆవుపాలతో నూరి మాత్రలుచేసి కప్పియందుంచి వాలుకాయంత్రమునందు మూడగ్నులతోడను ఒకరోజు వండి పగడభస్మ, ముత్యభస్మ సీసభస్మ, వంగభస్మ, రసభస్మ, రససిందూరము, కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమ పువ్వు, వీనినన్నిటిని (కలిపి) వండగా వచ్చిన యామందుతో సమాన మగునట్లు కలిపి ద్రాక్షపండ్లు, ఖర్జూరపండ్లు, ఉసిరికపండ్లు, అరటిపండ్లు, నేలతాడి, మల్లెపువ్వు, వీని యొక్క రసములతో మర్దింపవలయును. దీనిని తేనె, నెయ్యి, పంచదార, తియ్యని ఉష్ణధారలు, మొదలగు అనుపానములతో పూటకు మాష మెత్తు చొప్పున సేవించుచు తియ్యని అన్నపానములు, మాంసము, మద్యము, అనేకవిధములైన పిండివంటకములు, పండ్లు, వీనినిభుజించుచుండినచో శరీరపుష్టి, మనస్సునకు సంతోషము దివ్యదృష్టి, కామోద్రేకము, శరీరకాంతి, సుఖము, సంతానము, ఆయుర్వృద్ధి ఆరోగ్యవృద్ధి వీనిని ఈ వసంతకుసుమాకరము కలుగ జేయును.

## క్షయరాజమృగాంకరసము

సీ॥ పాలుతామ్రపుభస్మ పాళ్ళు రెండును శిల గంధకంబును తాళకంబు నట్లు । పాళ్ళు రెండును సూతభస్మంబు గలిపి తత్సమభాగ హేమభస్మంబు నొసగి । మేకపాలను నన్ని యేకంబుగా నూరి గవ్వల దొలనిండ దలక ముంచి । వీనిముఖంబుల వెలిగారమును మెత్తగా పాలతో నూరి కప్పివైచి । పెంటిలో నుంచి మూకుట మూసి మృత్తిక గట్టిగా బూసియు గజపుటమును ।

వేసి గవ్వలలోన వెలయుచూర్ణము తీసి యహివల్లి రసమున నార్ద్రికమున ।
చక్కగా నూరి రాజమృగాంకమును చేసి యాయాయివ్యాధులహరములైన ।
యనుపానములతోడ నడ్డిగెత్తుగ పూటచొప్పున సేవించి యుప్పు పులుసు ।
నావ నూనెయు నెయ్యి నత్యుష్ణముల మాని విసుగకన్నంబును పెసరపప్పు ।
కుడుచుచుండిన రోగకులమెల్ల శాంతించు బహువిధక్షయములు బాయునవని ।
నరుచిమందాగ్నిగుల్మరక్తార్శశూల । పాండుశోఫాంతరాధ్మానపవనకీల । శ్వాస
కాసాతిసారముల్ శాంతి నొందు । రక్తగతమైన జీర్ణజ్వరంబు లుడుగు॥

అ॥ తామ్రభస్మ 1 భా, శు॥ మణిశిల 2భా, శు॥ గంధకము 2భా, శు॥ తాళకము 2 భా, రసభస్మ 2 భా, సువర్ణభస్మ 2 భా, వీనిని మేకపాలతో నూరి గవ్వల యందుంచి మేకపాలతో నూరబడిన వెలిగారముతో ఆగవ్వలముఖములను మూసి కుండలో ఉంచి మూకుడు కప్పి సంధిబంధనము చేసి గజపుటము వేసి తీసి గవ్వలయం దున్న చూర్ణమును తీసి తమలపాకులు, అల్లము, వీనియొక్క రసములతో నూరి కుప్పెలు కట్టవలయును. ఇది రాజమృగాంక మనబడును. దీనిని వ్యాధులను హరించు ఆ యా అనుపానములతో పూటకు అడ్డిగయెత్తుచొప్పున సేవించుచు ఉప్పు, పులుపు, ఆవ, నూనె, నెయ్యి, వేడిచేయుపదార్థములు, వీనిని భుజింపక పెసరపప్పును, అన్న మును విసుగుదల లేకుండ తినుచుండినచో అన్నివిధములైన రోగములు, అన్నిక్షయలు, అరుచి, అగ్నిమాంద్యము, గుల్మము, రక్తార్శస్సు, శూల, పాండువు, నంజు, ఆంత్ర వృద్ధి, కడుపుబ్బరము, వాతవ్యాధులు, శ్వాస, కాస, అతిసారము, జీర్ణమై రక్తగత మైన జ్వరములు, ఇవి శాంతి నొందును.

## మహామృగాంకరసము

శ్లో॥ నిరుద్ధభస్మ సౌవర్ణం ద్విగుణం భస్మ సూతకమ్ । త్రిగుణం భస్మ ముక్తోత్థం శుకపుచ్ఛం చతుర్గుణమ్ (1) మృతతాప్యం చ పఞ్చాంశం తారభస్మ చతుర్గుణమ్ । సప్తభాగాః ప్రవాలస్య రసతుల్యం చ టఙ్కణమ్ (2) సర్వమేకత్ర సంమర్ద్య త్రిదినం లుఙ్గవారిణా । తతశ్చ గోలకం కృత్వా శోషయిత్వా ఖరాతపే (3) లవణైః పాత్రమాపూర్య తన్మధ్యే గోలకం క్షిపేత్ । తన్ముఖం తు మృదారుద్ధ్వా పచేద్యామచతుష్టయమ్ (4) అకృష్య చూర్ణితం సర్వం ప్రదేయం పూర్వభాగికమ్ । వజ్రం వా తదభావే తు

వైక్రాన్తం తత్సమాంశకమ్ (5) శ్లో॥ మహామృగాఙ్కః ఖలు సిద్ధ ఏ
శ్రీనన్ది నాథప్రకటీకృతోఽయమ్। వల్లోఽస్య సేవ్యో మరిచాజ్యయు
స్సేవ్యోఽథవా పిప్పలికా సమేతః (6) శ్లో॥ తత్రోపచారాః కర్తవ్యాస్సదే
క్షయగదోదితాః। ముద్గం ఘృతం చ భోక్తవ్యం త్యాజ్యం సూతవిరో
యత్ (7) శ్లో॥ యక్ష్మాణం బహురూపిణం జ్వరగణం గుల్మం త
విద్రధిం। మన్దాగ్నిం స్వరభేదకాస మరుచిం వాన్తిం చ మూర్ఛాం భ్రమమ్
అష్టావేవ మహాగదాన్గదగణాన్పాణ్డ్వామయం కామలాం। పిత్తార్తిం సక
గ్రహాన్బహువిధానన్యాం స్తథా నాశయేత్ (8)

అ॥ సువర్ణభస్మ 1 భా, రసభస్మ 2 భా, ముత్యభస్మ 3 భా, శు॥ గంధకవ
4 భా, హేమమాక్షికభస్మ 5 భా, రజతభస్మ 4 భా, పగడభస్మ 7 భా, శు॥ టం
ణము 2 భా, వీనిని మాదీఫలరసముతో మూడురోజులు మర్దించి ఉండచేసి మట్టి
పూయబడిన వస్త్రముతో చుట్టి తీవ్రమైన ఎండలో ఎండించి ఒక కుండయందు ఉప
పోసి దానిమధ్యయం దాగోలకము నుంచి కుండపైన మూకుడు మూసి సంధిబంధనవ
చేసి నాలుగుజాములు వండి తీసి నూరి వజ్రభస్మ 1 భా, ఆభస్మ లేకపోయినచొ
వైక్రాంతభస్మ 1 భా, కలపవలయును. ఇట్లు సిద్ధమైనది మహామృగాంక మనబడును
ఇది నందినాథునిచే చెప్పబడెను. దీనిని మిరియాలచూర్ణము, నెయ్యి, వీనితో గా
పిప్పళ్ళచూర్ణముతో గాని వల్లపరిమితిగ సేవింపవలయును. క్షయవ్యాధికి చెప్పబడి
ఉపచారముల నన్నిటిని చేయవలయును. పెసరపప్పును, నెయ్యిని, పుచ్చుకో
వలయును. పాదరసమునకు విరుద్ధములైనవానిని విడిచిపెట్టవలయును. ఈ విధము
చేసినచో అనేకవిధములైన క్షయ, జ్వరసముదాయము, గుల్మము, విద్రధి, అగ్నిమా
ద్యము, స్వరభేదము, దగ్గు, అరుచి, వాంతి, మూర్ఛ, భ్రమ, వాతవ్యాధి మొదల
ఎనిమిది మహావ్యాధులు, వ్యాధిసముదాయములు. పాండువు, కామిర్లు, పైత్యవ్యాధులు
సమస్త గ్రహములు, ఇతరమైన అనేక వ్యాధులు, ఇవి నశించును.

## మహామృగాంకరసము (ప్రకారాంతరము)

శ్లో॥ శుద్ధసూతం స్వర్ణభూతిం జమ్బీరైర్మర్దయేద్దినమ్। తయోర్ద్వి
గుణితం తామ్రం త్రిభిస్తుల్యం తు గన్ధకమ్ (1) టఙ్కణం గన్ధకార్ధం
సర్వం జమ్బీరజైర్ద్రవైః। చతుర్యామం విమర్ద్యాఽథ వస్త్రైర్బద్ధ్వా విపా
చయేత్ (2) దోలాయన్త్రే చారనాళే యామాదుద్ధృత్య శోషయేత్। తత్తి

మృణ్మయ భాణ్డాన్తర్లవణం చాఙ్గులద్వయమ్ (3) ఊర్ధ్వాధశ్చాప్త కృత్వా చ గోలకం వస్త్రకై స్తతః । లవణైః పూరితే భాణ్డే మధ్యే ధృత్వా దినం పచేత్ (4) పాచ్యం క్రమాగ్నినాసిద్ధో రసశ్చాయం మృగాఙ్కకః । అనేనైవ ప్రకారేణ మృగాఙ్కాన్పాచయేద్రసాన్ (5) రాజరోగనివృత్త్యర్థం దేయం చాజ్యసితాయుతమ్ । దశభిర్మరిచైస్సార్ధం పిప్పలీమధునాఽపి వా (6)

అ॥ శు॥ రసము 1 భా, సువర్ణభస్మ 1 భా, వీనిని మొదట నిమ్మకాయల రసముతో ఒకరోజు మర్దించి తామ్రభస్మ 4 భా, శు॥ గంధకము 6 భా, శు॥ టంకణము 3 భా, వీనిని కలిపి నిమ్మకాయలరసముతో నాలుగుజాములు మర్దించి బట్టయందు మూటకట్టి డోలాయంత్రమున కలియందు ఒకజాము వండి తీసి ఎండించి ఒక కుండలో రెండంగుళముల ఉప్పును పోసి క్రిందుమీదుల నెనిమిదిసార్లు బట్టతో చుట్టబడిన యీమందు ఉండయొక్క మూటను ఆ ఉప్పుమీదనుంచి పైన ఉప్పు బాగుగ పోసి ఒకరోజు క్రమాగ్నులచే వండవలయును. ఇట్లు సిద్ధమైనది మహామృగాంకరసమనబడును. ఈవిధముగనే మృగాంకరసములను వండవలయును. దీనిని నెయ్యి, పంచదార, వీనితో గాని పదిమిరియాల మూర్ణముతోగాని పిప్పలి మూర్ణము, తేనె, వీనితో గాని సేవించినయెడల రాజయక్ష్మ పోవును.

## మృగాంకరసము

శ్లో॥ రసభూతిం స్వర్ణభూతిం నిష్కం నిష్కం ప్రకల్పయేత్ । శఙ్ఖగన్ధక ముక్తానాం ద్వౌ ద్వౌ నిష్కౌ తు చూర్ణయేత్ (1) ముక్తాభావే వరాటం వా రసబాగం చ టఙ్కణమ్ । వహ్నిగోక్షురక్వాథేన మర్దయేత్ప్రహరద్వయమ్ (2) తద్గోలకం విశోష్యాథ బాణ్డే లవణపూరితే । పచేద్యామ చతుష్కం చ మృగాఙ్కోఽయం మహారసః (3) రోగరాజనివృత్త్యర్థం చతుర్గుఞ్జామితం ఘృతైః । దాతవ్యం మరిచైస్సార్ధం పిప్పలీమధునాఽపి వా (4)

అ॥ రసభస్మ 1 నిష్కము, సువర్ణభస్మ 1 ని, శంఖభస్మ 2 ని, శు॥ గంధకము 2 ని, ముత్యభస్మ 2 ని, ముత్యభస్మ లేనిచో గవ్వలభస్మ 2 ని, శు॥ టంకణము 1 ని, వీనిని చిత్రమూలము, పల్లేరు, వీనియొక్క రసములతో రెండుజాములు మర్దించి ఉండచేసి ఎండించి ఉప్పుతో నిండింపబడిన కుండయందుంచి నాలుగుజాములు వండవల

యును ఈ మృగాంకరసమును నెయ్యి, మిరియాలచూర్ణము, వీనితో గాని పిప్పళ్ళ చూర్ణము, తేనె, వీనితో గాని నాలుగు గురివిందగింజలపరిమితిగ సేవించినచో రాజ యక్ష్మ నశించును.

## లఘుమృగాంకరసము

శ్లో॥ రసభూతిం హేమభూతిం తుల్యం గుఞ్జాద్వయం పృథక్ । పూర్వ వచ్చానుపానేన మృగాఙ్కోఽయం క్షయాపహః । ఛాగీదుగ్ధానుపానేన పథ్యం చైవ యథాక్రమమ్ (1)

అ॥ రసభస్మ, సువర్ణభస్మ, ఇవి సమభాగములు కలిపి నాలుగు గురివిందగింజ పరిమితిగ ఇదివరలో చెప్పబడిన అనుపానములతో సేవించుచు మేకపాలను త్రాగి సరియైన పథ్యము చేసినచో ఈ మృగాంకరసము క్షయను పోగొట్టును.

## రాజమృగాంకరసము

శ్లో॥ రసభస్మ త్రిభాగం చ భాగైకం హేమభస్మకమ్ । మృత తామ్రస్య భాగైకం శిలాగన్ధకతాలకమ్ (1) ప్రతిభాగద్వయం శుద్ధమేకీకృత్య విచూర్ణయేత్ । వరాటాన్పూరయేత్తేన హ్యజాక్షీరేణ టఙ్కణమ్ (2) పిష్ట్వా తేన ముఖం రుద్ధ్వా మృద్భాణ్డే సన్నిధాపయేత్ । శుష్కం గజపుటే పాచ్యం చూర్ణయేత్స్వాఙ్గశీతలమ్ (3) రసో రాజమృగాఙ్కోఽయం చతుర్గుఞ్జః క్షయాపహః ఏకోనవింశన్మరిచైర్ఘృతేన సహ భక్షయేత్ (4) దశానాం పిప్పలీనాం చ చూర్ణం దత్వా ప్రదాపయేత్ । క్షయే కాసే జ్వరే పాణ్డౌ గ్రహణ్యామతి సారకే (5)

అ॥ రసభస్మ 3 భా, సువర్ణభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, శు॥ మణిశిల 2 భా, శు॥ గంధకము 2 భా, శు॥ తాళకము 2 భా, వీనిని కలిపి నూరి గవ్వలయం దుంచి మేకపాలతో నూరబడిన టంకణముచే ఆ గవ్వలయొక్క ముఖములను మూసి కుండయందుంచి మూకుడు కప్పి సంధిబంధనముచేసి ఎండినపిదప గజపుటము వేసి స్వాంగశీతలమున తీసి చూర్ణము చేయవలయును. ఈ రాజమృగాంకరసమును 19 మిరి యములు, 10 పిప్పళ్ళు, వీనియొక్క చూర్ణము నెయ్యి వీనితో నాలుగు గురివింద గింజల పరిమితిగ సేవించినచో క్షయ, దగ్గు, జ్వరము, పాండువు, గ్రహణి, అతి సారము, ఇవి నశించును.

## రత్నరాజమృగాంకరసము

శ్లో॥ నీలం వజ్రం చ వైడూర్యం తార్క్ష్యకం చ ప్రవాలకమ్ । గోమేదకం మౌక్తికం చ మాణిక్యం పుష్యరాగకమ్ (1) తామ్రం తీక్ష్ణాభ్రకే కృష్ణం కాన్తసిన్దూరస్వర్ణకే । గన్ధం సూతం విషం తాలం సమాంశం చిత్రకద్రవైః (2) విశ్వౌషధరసైర్మర్ద్యం వాలుకాయన్త్రకే పచేత్ । త్రిదినం లక్షణాద్యుక్తం స్వాఙ్గశీతలముద్ధరేత్ (3) మర్దయేచ్చూర్ణమాఖ్యాతం రత్నరాజమృగాఙ్కకమ్ । ఏతస్య మాషమాత్రాం చ భక్షయేత్ క్షయరోగజిత్ (4)

అ॥ నీలభస్మ, వజ్రభస్మ, వైడూర్యభస్మ, పచ్చలభస్మ, పగడభస్మ, గోమేదికభస్మ, ముత్యభస్మ, కెంపులభస్మ, పుష్యరాగభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, మాండూరభస్మ, కాంతభస్మ, సువర్ణభస్మ, శు॥ గంధకము, శు॥ రసము, శు॥ నాభి, శు॥ తాళకము, వీనిని సమభాగములుగ గ్రహించి చిత్రమూలము, శు శొ. వీని రసములతో మర్దించి వాలుకాయంత్రమునందు మూడుగోజులు క్రమప్రకారముగ వండి సాంగశీతలమున తీసి నూరి చూర్ణము చేయవలయును. ఈ రత్నరాజ మృగాంకరసమును మాషప్రమాణముగ సేవించినచో క్షయ నశించును.

## మౌక్తికరాజమృగాంకరసము

శ్లో॥ రసేన తుల్యం కనకం తయోర్ద్వౌ సామ్యేన యుఞ్జ్యాన్నవమౌక్తికాని । రసప్రమాణో బలిరఙ్ఘ్రిభాగః క్షారశ్చ సర్వం తుషవారిణా తు (1) సంమర్ద్య వస్త్రే తు నిధాయ గోలం దినం పచేత్తం లవణేన పూర్ణే । భాణ్డే మృగాఙ్కోఽయమతిప్రగల్భః క్షయాగ్నిమాన్ద్య గ్రహణీగదేషు సాజ్యోషణాభిర్మధుపిప్పలీభిర్వల్లోఽస్య దేయో న తతోఽధికస్తు । పథ్యం హితం శీతలమేవ యోజ్యం త్యాజ్యం సదా పిత్తకరం విదాహి (3)

అ॥ శు॥ రసము 1 భా, సువర్ణభస్మ 1 భా, ముత్యభస్మ 2 భా, శు॥ గంధకము 1 భా, శు॥ టంకణము ¼ భా, వీనిని తాండ్రకపాయముతో నూరి ఉండచేసి మట్టిచే పూయబడిన వస్త్రమునందుంచి దానిని, ఉప్పుతో నింపబడిన భాండమునందుంచి ఒకరోజు వండవలయును. గాఢమైన ఈ మృగాంకరసమును నెయ్యి, మిరియాలచూర్ణము, వీనితోడను తేనె, పిప్పళ్ళచూర్ణము, వీనితోడను వల్లప్రమాణముగ సేవించినచో క్షయ, అగ్నిమాంద్యము, గ్రహణీరోగము, ఇవి నశించును. వల్లప్రమాణము

కంటె ఎక్కువగ సేవింపరాదు. హితకరమైనట్టియు, శీతవీర్యము కలిగినట్టియు, పదార్థములనే భుజింపవలయును. పైత్యమును తాపమును కలిగించు పదార్థములను ఎప్పుడు భుజింపరాదు.

## నవరత్నరాజమృగాంకరసము

శ్లో) సూతం గన్ధక హేమతారరసకం వైక్రాన్తకాన్తాయసం । వఙ్గం నాగపవిప్రవాలవిమలామాణిక్య గారుత్మతమ్ । తాప్యం మౌక్తిక పుష్యరాగ జలజం వైడూర్యకం శుల్బకం । శుక్తిస్తాలకమభ్రహిఙ్గుల శిలాగోమేదనీలం సమమ్ (1) గోక్షూరైః ఫణివల్లిసింహావదనాముణ్డీ కణాచిత్రకైః । రిఖచ్ఛిన్న రుహాహరప్రియజయాద్రాక్షావరీజద్రవైః । శోఫఘ్నీశతపర్వికామధుజలై స్తచ్ఛాల్మలీధాతకీ । జాతీసస్యబలా చతుష్టయజలత్వగ్దేవ పుష్పద్రవైః (2) తక్కోలైస్త్వథ నాగకేసర జలైర్భావ్యం పృథక్సప్తధా । భాణ్డే సిన్ధుభృతే మృగాఙ్కవ దయం పాచ్యః క్రమాగ్నౌ దినమ్ । భూయః ప్రాక్సముదాహృతైర్ద్రవ చయైస్తం । భావయేత్పూర్వవత్పశ్చాత్తుల్య విభాగశీతలరజః కస్తూరికాభావనా (3) గోప్యాద్గోప్యతరం రసాయనమిదం శ్రీశఙ్కరేణోదితం గుఞ్జం సిన్దుయుతం కణామధుయుతం శోఫే చ పాణ్డ్వామయే । వాత వ్యాధిముపద్రవైశ్చ సహితం మేహాంస్తథా వింశతిం । సంయోజ్యా చ హరీతకీ గుడయుతా వాతాస్రకే దుర్జయే (4) గమ్భీరే చ గుడూచిసత్వచపలా క్షౌద్రైస్త్రిసంయోజిత । స్త్వాధ్మానారుచిశూల మాన్ద్యకసనాపస్మారవాతోదరాన్ । శ్వాసాన్ సంగ్రహణీం హలీమకమథో సర్వజ్వరాన్నాశయే । ద్ధాతూన్పోష యతి క్షయం క్షపయతి శ్యామాశతం యౌవనమ్ । ప్రౌఢాటోపయుతం కరోతి సహసా తారుణ్య గర్వోజ్ఝితం । సిద్ధో రాజమృగాఙ్క ఏష జయతి స్వస్యానుపానైర్గదాన్ (5)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, సువర్ణభస్మ రజతభస్మ, శు॥ కఫరి, వైక్రాంత భస్మ, కాంతభస్మ, లోహభస్మ, వంగభస్మ, సీసభస్మ, వజ్రభస్మ, పగడభస్మ, విమల భస్మ, మాణిక్యభస్మ, మరకతభస్మ, హేమమాక్షికభస్మ, ముత్యభస్మ, పుష్యరాగభస్మ, శంఖభస్మ, వైడూర్యభస్మ, తామ్రభస్మ ముత్యపుచిప్పలభస్మ, శు॥ తాళకము, అభ్రక భస్మ, శు॥ ఇంగిలీకము, శు॥ మణిశిల, గోమేదభస్మ, నీలభస్మ, వీనిని సమభాగములుగ

గ్రహించి పల్లేరు, తమలపాకులు, అల్లరసము, బోడసరము, పిప్పళ్ళు, చిత్రమూలము, చెఱుకు, తిప్పతీగ, మారేడు, గంజాయి, ద్రాక్షపండ్లు, పిల్లిపీచర, గలిజేరు, నల్లగరిక, యష్టిమధుకము, కురువేరు, బూరుగ, ఆరెపువ్వు, జాజికాయలు, బలాదపుష్పయము, దాసెనచెక్క, లవంగములు, కంకోలములు, నాగకేసరములు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ ఏడేసిసారులు భావన చేసి ఉప్పుతో నింపబడిన కుండయందు మృగాంకరసమువలెనే క్రమాగ్నులయందు ఒకరోజు వండి తీసి పూర్వమందు చెప్పబడిన రసములతో తిరిగి పూర్వమువలెనే భావన చేసి పచ్చకర్పూరమును, కస్తూరిని, సమభాగములు కలిపి భావన చేయవలెను. ఇది మిక్కిలి గోపనీయము. ఈ రసాయనము శంకరునిచే చెప్పబడెను. దీనిని గురువిందగింజపరిమితిగ సైంధవలవణము, పిప్పళ్ళ చూర్ణము, తేనె, వీనితో సేవించినయెడల నంజు, పాండువ్యాధి, ఉపద్రవములతో కూడిన వాతవ్యాధులు, ఇరువది మేహములు, ఇవి నశించును. కరక్కాయల చూర్ణము, బెల్లము, వీనితో సేవించినయెడల కఠినమయినట్టియు, అంతరాశ్రయమయినట్టియు, వాతరక్తము నశించును. తిప్పసత్తు, పిప్పళ్ళచూర్ణము, తేనె, వీనితో సేవించినయెడల కడుపుబ్బరము, అరుచి, శూల, అగ్నిమాంద్యము, దగ్గు, అపస్మారము, వాతోదరము, శ్వాస, సంగ్రహణి, హలీమకము, సమస్తజ్వరములు, క్షయ, ఇవి నశించును. ధాతువులు వృద్ధిపొందును. దీనిని సేవించువాడు మిక్కిలి మదించినవాడై యౌవనవతులయిన నూరుగురు స్త్రీలయొక్క మదము నణగగొట్టును. ఈ రాజమృగాంకరసమును ఆయా అనుపానములతో సేవించినయెడల సమస్తవ్యాధులు నివారించును.

## నవరత్నమహారాజమృగాంకరసము

శ్లో॥ రసభస్మ త్రిభాగం చ షడ్భాగం హేమభస్మకమ్ । మృతతామ్రం చైకభాగం ద్విభాగం రౌప్యభస్మకమ్(1) తత్తుల్యే నాగవఙ్గే చ వజ్రమేకం చతుర్గుణమ్ । గోమేదకం చ ద్విగుణం కాశ్మీరం సప్తమౌక్తికమ్ (2) పద్మరాగేన్ద్రనీలే చ రాజావర్తం తథైవ చ । గరుడోద్గార వైక్రాన్తే ప్రవాలం హేమమాక్షికమ్ (3) తీక్ష్ణం కాన్తం వ్యోమగన్ధౌ పఞ్చభాగం పృథక్పృథక్ । కదలీకన్దసారేణ మాలతీపుష్పజద్రవైః (4) ఉశీరద్వయసారేణ గోక్షురేణ విమర్దయేత్ । ఏలలవఙ్గసారేణ ఘనసారపటీరసైః (5) ముసలీమూలసారేణ మర్దయేచ్చ పృథక్పృథక్ । త్రియామం వాలుకాయన్త్రే

పాచయేత్క్రమలాగ్నినా (6) స్వాఙ్గశీతలముద్ధృత్య పూర్వద్రావైర్విమర్ద యేత్ । మహారాజమృగాఙ్కోఽయం రాజయక్ష్మరుజాపహః (7) పీనసం శ్వాసకాసౌ చ తాణ్డుకామల హృద్రుజాః । మహోదరార్శో గ్రహణీ వాత పిత్తహలీమకాజ (8) దీపకం వృష్యమాయుష్యం కాన్తిశ్రీబలవర్ధకమ్ । తుష్టిపుష్టికరం మేధ్యం సర్వరోగేషు యోజయేత్ (9) వల్లక్రమమితం సేవ్యం సితాజ్య మధుసంయుతమ్ వలీపలితవిధ్వంసి కామదం శుభదం తథా (10) మేహఘ్నం ప్రీతిదం సేవ్యం పరదృగ్జ్ఞానసాధకమ్ । పాణ్డ్వాది గ్రహణీ శూలమూత్రాఘాతశ్మరీ హరమ్ (11) జ్వరఘ్నమతివృష్యం చాప్యతీవ రతికారకమ్ । మహారాజమృగాఙ్కోఽయం సర్వరోగహరః పరమ్ (12)

ఆ॥ రసభస్మ 3 భా, సువర్ణభస్మ 6 భా, తామ్రభస్మ 1 భా, రజతభస్మ 2 భా, సీసభస్మ 2 భా, వంగభస్మ 2 భా, వజ్రభస్మ 1 భా, గోమేదికభస్మ 4 భా, కుంకుమ పువ్వు 2 భా, ముత్యభస్మ 7 భా, కెంపులభస్మ 7 భా, నీలభస్మ 7 భా, రాజావర్త భస్మ 7 భా, పచ్చలభస్మ 5 భా, వైక్రాంతభస్మ 5 భా, పగడభస్మ 5 భా, హేమ మాక్షికభస్మ 5 భా, లోహభస్మ 5 భా, కాంతభస్మ 5 భా, అభ్రకభస్మ 5 భా, శు॥ గంధకము 5 భా, వీనిని గ్రహించి అరటిదుంప, మాలతీపుష్పములు, వట్టివేళ్ళు, తెల్ల వట్టివేళ్ళు, పల్లేరు, ఏలకులు, లవంగములు, తుంగగడ్డలు, పిల్లితేగలు, నేలతాడి, వీని యొక్క రసములతో ప్రత్యేకముగ మర్దించి వాలుకాయంత్రమునందు కమలాగ్నిచే మూడుజాములు వండి స్వాంగశీతలముగ తీసి పూర్వపు రసములతో మరల మర్దింపవల యును. ఈ మహారాజ మృగాంకరసమును పంచదార, నెయ్యి, తేనె, వీనితో వల్ల పరిమితిగ సేవించినయెడల రాజయక్ష్మ, అర్శస్సు, గ్రహణి, వాతవ్యాధులు, పైత్య వ్యాధులు, హలీమకము, సమస్తవ్యాధులు, శరీరము ముడతలు పడుట, వెంట్రుకలు నెరయుట, మేహములు, పాండువు మొదలగు వ్యాధులు, గ్రహణి, శూల, మూత్రా ఘాతము, అశ్మరి, జ్వరము, ఇవి నశించును. మరియు అగ్నిదీప్తి, వీర్యవృద్ధి, ఆయు ర్వృద్ధి, కాంతి, సంభోగశక్తి, మనస్సంతోషము, శరీరపుష్టి, బుద్ధికుశలత, కోరికలు నెరవేర్చుట, శుభములు, ప్రీతి, పరదృష్టిజ్ఞానము, మిక్కిలివీర్యవృద్ధి, మిక్కిలిసంభోగ శక్తి, ఇవి కలుగును. ఈ మహారాజమృగాంకరసము సర్వరోగములను హరింపజేయును.

## విషూచీవిధ్వంసకరసము

శ్లో॥ టఙ్కణాం మాక్షికం శుణ్ఠీం పారదం గన్ధకం విషమ్ । గరలం సమభాగం స్యాత్సర్వేషాం హిఙ్గులం సమమ్ (1) మర్దయేజ్జమ్బీర ద్రావై

ర్వటీ కార్యా ప్రయత్నతః । శ్వేతసర్షపతుల్యా చ మృతసంజీవనీ తథా (2) విషూచీం నాశయత్యాశు దధ్యన్నం పథ్యామాచరేత్ । త్రిదోషోత్థమతీసారం సర్వోపద్రవసంయుతమ్ (3)

అ॥ పా॥ వెలిగారము, మౌక్తికభస్మ, శుంఠి, శు॥ పాదరసము, శు॥ గంధకము, శు॥ నాభి, గరళము, వీనిని సమభాగములుగను శు॥ ఇంగిలీకమును, వీని అన్నిటి యొక్క సముదాయముల సమానముగను గ్రహించి నిమ్మకాయలరసముతో మర్దించి తెల్లఆవాలపరిమితిగ మాత్రలను చేయవలయును. దీనిని సేవించినచో విషూచి(కలరా) వెంటనే నశించును. పెరుగుఅన్నమును పథ్యముగ భుజింపవలయును. త్రిదోషముల వలన పుట్టినట్టియు సమస్తోపద్రవములతో కూడినట్టియు అతిసారము నశించును.

## గో రో చ న ము మా త్ర లు

వ॥ గోరోచనము 1 భా, రసకర్పూరము 1 భా, రససిందూరము 1 భా, మిరియాల చూర్ణము 1 భా, కటుకరోహిణి 1 భా, నాభి ½ భా, కస్తూరి ¼ భా, వీనిని లవంగ కషాయముతో మర్దించి పెసరగింజలంతమాత్రలు చేయవలయును. వీనిని చంటిపిల్లలకు చను పాలతో నియ్యవలయును.

## గో రో చ న ము మా త్ర లు (ప్రకారాంతరము)

వ॥ గోరోచనము 1 భా, కటుకరోహిణి 2 భా, ఇంగిలీకము 1 భా, రసకర్పూరము 1 భా, కుంకుమపువ్వు 1 భా, అక్కలకర్ర 1 భా, లవంగములు 1 భా, నాభి ½ భా, వీనిని మిరియాలకషాయముతో మర్దించి పెసరగింజలంత మాత్రలను చేయవలయును. వీనిని చనుపాలతో గాని ఆయాయి అనుపానములతో గాని చంటిపిల్లల కియ్యవలయును. జలుబు, జ్వరము, దగ్గు, వాంతి, అజీర్ణము, విరేచనములు, ఎగరొప్పు కడుపుబ్బరము, మలబంధము మొదలగునవి నశించును. ఆయాయి రోగానుపానములతో పెద్దవారుకూడ పుచ్చుకొనవచ్చును.

## మృ గాం క పో ట లీ ర స ము

శ్లో॥ శఙ్ఖనాభిం గవాం క్షీరైః పేషయేన్నిష్కషోడశ । తేనమూషా ప్రకర్తవ్యా తన్మధ్యే భస్మసూతకమ్ (1) నిష్కార్థం గన్ధకాత్త్రీణి చూర్ణీకృత్య వినిక్షిపేత్ । రుద్ధ్వా తద్వేష్టయేద్వస్త్రైర్మృత్తికాం లేపయేద్బహిః (2)

శోష్యం గజపుటే పాచ్యం మూషయాసహ చూర్ణయేత్ । గుఞ్జా మాత్రః క్షయం హన్తి మృగాఙ్కః పోటలీరసః (3)

అ॥ శంఖముయొక్క మొదటి భాగములను 16 నిష్కములుగ గ్రహించి ఆవు పాలతో నూరి దానిని మూష (డిప్ప) గా చేయవలయును. రసభస్మ 1 నిష్కము, శు॥ గంధకము 3 నిష్కములు, వీనిని చూర్ణముచేసి ఆ మూషయందుంచి మూతమూసి దానికి బట్టనుచుట్టి పైన మట్టిపూసి ఎండించి గజపుటము వేసి మూషతోకూడ చూర్ణము చేయవలయును. ఈ మృగాంకపోటలీరసమును గురివిందగింజపరిమితిగ సేవించినచో క్షయ పోవును.

## ఆ నం ద ర స ము

శ్లో॥ నాగం వఙ్గం తామ్రభస్మ శుద్ధపారదగన్ధకౌ । అయస్కాన్తం చాభ్రలోహే రాజావర్తం చ మౌక్తికమ్ (1) విద్రుమం మృతతారం చ కృష్ణారమ్భాప్రసూనయోః । సర్వసేన తు ఖల్వే చ త్రిదినం మర్దితం పృథక్ (2) కాచకూప్యాం నివేశ్యాథ యన్త్రే విద్యాధరే పచేత్ । స్వాఙ్గశీతల ముద్ధృత్య గన్ధ పుష్పాక్షతార్చనమ్ (3) ధూపం దీపం చ నైవేద్యం తామ్బూలం చ సమర్పయేత్ । తథా రసైః పునర్భావ్యం కస్తూరీం కుఙ్కుమం క్షిపేత్ (4) కర్పూరం నాగముస్తైస్తు మర్దయే ద్యామమాత్రకమ్ । తతస్సం చూర్ణితం కుర్యాత్ వల్లమాత్రం ప్రమాణతః (5) సక్షౌద్రమాగధీచూర్ణం భక్షితం చ క్షయా పహమ్ । పాణ్డూదరాన్ప్రఇచ్ఛకాసాన్స్వినసం చ హలీమకమ్ (6) జీర్ణజ్వరం యక్ష్మరాజం ప్లీహప్రదరగుల్మకాన్ । సర్వవాతామయాన్పిత్తాన్ క్షయకాసం జ్వరం హరేత్ (7) దీపకం వృష్యమాయుష్యం తేజోధాతువివర్ధకమ్ । బుద్ధిమాన్నీతిమాన్భూత్వా బహుస్త్రీభిర్భవేత్సుఖీ । ఆనన్దరసవిఖ్యాతస్సర్వరోగహరః పరమ్ (8)

అ॥ సీసభస్మ, వంగభస్మ, తామ్రభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, అయస్కాంతభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, రాజావర్తభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, రజితభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి పిప్పళ్లకషాయముతోడను, అరటిపువ్వు రసముతోడను, ప్రత్యేకముగ మూడేసిరోజులు మర్దించి కాచకుప్పెయందుంచి విద్యాధరయంత్రమునందు వండి సాంగశీతలమున తీసి మంచిగంధము, పుష్పములు, అక్ష

తలు, వీనితో పూజించి ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, వీనిని సమ ర్పించి మరల పూర్వపురసములతో భావన చేసి కస్తూరి, కుంకుమపుప్వు, పచ్చకర్పూ రము, వీనిని కలిపి నాగముస్తలరసముతో నొకజాము మర్దించి పిదప చూర్ణము చేయ వలయును. దీనిని తేనెతోకూడిన పిప్పళ్ళచూర్ణముతో వల్లపరిమితిగ సేవించినయెడల క్షయ, పాండువు, ఉదరవ్యాధి, అయిదువిధములగు దగ్గులు, జలుబు, హాలీమకము, జీర్ణజ్వరము, రాజయక్ష్మ, ప్లీహవ్యాధి, ప్రదరము, గుల్మము, సమస్తవాతవ్యాధులు, పైత్యవ్యాధులు, క్షయకాస, జ్వరము, ఇవి నశించును. అగ్నిదీప్తి, వీర్యవృద్ధి, ఆయు ర్వృద్ధి, తేజస్సు, ధాతువృద్ధి, ఇవి కలుగును. దీనిని సేవించినవాడు బుద్ధిమంతుడును, నీతిమంతుడును, అయి చాలమంది స్త్రీలతో సుఖముగా రమించును. ఈ ఆనందరసము సమస్తరోగములను నివారింపజేయును.

## పారదాదిలేపము

శ్లో॥ పారదం మర్దయేన్నిష్కం కృష్ణధత్తూరకద్రవైః నాగవల్లీద్రవై ర్వాఽథ వస్త్రఖణ్డం ప్రలేపయేత్ (1) తద్వస్త్రం మస్తకే బద్ధ్వా ధార్యం యామత్రయం తతః । యూకాః పతన్తి నిశ్చేష్టా సలిక్షా నాత్ర సంశయః

అ॥ నిష్కప్రమాణముకల పాదరసమును నల్లఉమ్మెత్తరసముతోగాని తమల పాకుల రసముతోగాని మర్దింపవలయును. దానిని చిన్న వస్త్రమునకు పూసి ఆవస్త్ర మును తలకు చుట్టుకొని మూడుజాములు ఉంచుకొనినచో పేళ్ళను, ఈళ్ళను తప్పక చచ్చిపడిపోవును.

## ఉదయమార్తాండరసము

శ్లో॥ పలోన్మితస్య శుల్బస్య సూక్ష్మపత్రాణి కారయేత్ । తత్సమం గన్ధకం దత్త్వా ఖల్వే సర్వం వినిక్షిపేత్ (1) జమ్బీరరస సంయుక్తం దినం ఘర్మే నిధాపయేత్ । తతశ్శుల్బే ద్రవీభూతే రసకర్షం నియోజయేత్ (2) తత్సిద్ధ ముదరే యోజ్యం శోఫే చైవ భగన్దరే । నామ్నా తూదయమార్తా ణ్డరస ఏష ప్రకీర్తితః (3)

అ॥ పలపరిమితికల శు॥ తామ్రమును పలుచని రేకులుగ చేసి ఆ రేకులను, పల పరిమితికల శు॥ గంధకమును, ఖల్వమునందుంచి నిమ్మకాయలరసము పోసి ఎండయం

దుంచి తామ్రపురేకులు కరిగినపిదప కర్ష పరిమితిగల రసభస్మను కలపవలయును. సిద్ధమైన దీనిని ఉదరవ్యాధి, నంజు, భగందరము, వీనియందు సేవింపవలయును. ఇది ఉదయమార్తాండరసమని చెప్పబడును.

## కృచ్ఛాంతకరసము

శ్లో॥ సూతం స్వర్ణం చ వైక్రాన్తం మృతం తుల్యం చ మర్దయేత్ । మధుయష్టీ మేఘరసైర్ద్వియామం తచ్చ గోలకమ్ (1) శుష్కం బద్ధ్వా పుటేచ్చాహః కరీషాగ్నౌ మహాపుటే । మాషమాత్రంలిహేత్ క్షౌద్రై ర్మూత్ర కృచ్ఛ్ర ప్రశాన్తయే । జయ స్త్రీ వా జయా శ్లేష్మకృచ్ఛ్రను త్తణ్డులోదకైః

అ॥ రసభస్మ, సువర్ణభస్మ, వైక్రాంతభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి యష్టిమధుకము, తుంగగడ్డలు, వీని రసములతో రెండుజాములు నూరి ఉండజేసి ఎండించి మూకళ్ళయందుంచి సంధిబంధనము చేసి ఏరుపిడకలతో ఒకరోజు పెద్ద పుటము వేయవలయును. దీనిని తేనెతో మాషపరిమితిగ సేవించినచో మూత్ర కృచ్ఛ్రము నశించును. తెక్కలినిగాని కరక్కాయనుగాని బియ్యపుకడుగుతో పుచ్చుకొనినచో శ్లేష్మమూత్రకృచ్ఛ్రము నశించును.

## కర్పూరరసము

శ్లో॥ హిఙ్గులం చాహిఫేనం చ ముస్తకేన్ద్రియవం తథా । జాతీఫలం చ కర్పూరం సర్వం సంమర్ద్య యత్నతః (1) జలేన వటికాకార్యా ద్విగుఞ్జాపరిమాణతః । జ్వరాతిసారిణే చైవ తథాతీసారరోగిణే । షడ్విధాయాం గ్రహణ్యాం చ రక్తాతీసార ఉల్బణే (2)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ నల్లమందు, తుంగగడ్డలు, కొడిశపాలవిత్తులు, జాజికాయ, హారతికర్పూరము, వీనిని జలముతో బాగుగ నూరి రెండుగురివిందగింజల పరిమితిగల మాత్రలను చేయవలయును. వీనిని జ్వరాతిసారము, అతిసారము, ఆఱువిధములైన గ్రహణి, ప్రవృద్ధమైన రక్తాతిసారము, వీనియందు సేవింపవలయును.

## క్షయేశ్వరరసము

శ్లో॥ రసగన్ధకయోశ్చూర్ణ మేకీకృత్యాభ్రకం తథా । హేమభస్మ సమం కృత్వా మర్దయేద్యామకద్వయమ్ (1) త్ర్యూషణాని లవఙ్గైలాటఙ్క-

ణం హేమతుల్యకమ్ । కణ్టకార్యా రసైర్భావ్యమేక వింశతివారకమ్ (2) శిగ్రుబీజార్ద్రక రసైస్సప్తధా భావయేత్పృథక్ । రసః క్షయేశ్వరో నామ కాసశ్వాసక్షయాపహః । అనుపానం ప్రయోక్తవ్యం విభీతకఫలత్వచమ్ (3)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, అభ్రకభస్మ, సువర్ణభస్మ, వీని నొక్కొక భాగముగ గ్రహించి రెండుజాములు నూరి త్రికటుకములు, లవంగములు, ఏలకులు, పొం॥ వెలిగారము, వీని నొక్కొక భాగముగ కలిపి నేలములగరసముతో 21 సారులును, మునగగింజలరసముతోడను అల్లపురసముతోడను ప్రత్యేకముగ ఏడేసిసారులును, భావన చేయవలయును. ఈ క్షయేశ్వరరసమును తానికాయపై బెరడుయొక్క అనుపానముతో సేవించినయెడల దగ్గు, వగర్పు, క్షయ, ఇవి నశించును.

## రసదోషారియోగము

శ్లో॥ గన్ధకం మాషయుగ్మం చ నాగవల్లీదళైస్సహ । ఖాదయేత్వా రదగ్రస్తో దోషశాన్తిస్తథా భవేత్ (1)

అ॥ శు॥ గంధకమును రెండుమాషములపరిమితిగ తమలపాకులతో రసదోషము కలవాడు తినినయెడల రసదోషము వెంటనే శాంతి నొందును.

## బడబానలరసము

శ్లో॥ శుద్ధసూతం సమం గన్ధం మృతం తామ్రాభ్రటఙ్కణాన్ । సాముద్రం చ యవక్షారం సర్జసైన్ధవనాగరమ్ (1) అపామార్గస్య చ క్షారం పాలాశం వత్సనాభకమ్ । ప్రత్యేకం సూతతుల్యం స్యాచ్చూర్ణ కాన్లేన మర్దయేత్ (2) హస్తికన్యాద్రవైశ్చాహో చార్ద్రియుక్తం పుటేల్లఘు । మాషైకం భక్షయేన్నిత్యం రసోఽయం బడబానలః (3) సర్వగుల్మం విహన్త్యాశు గ్రహణీం చ విశేషతః । సర్వాజీర్ణ ప్రశమకస్సర్వశూల వినాశకః (4)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, తామ్రభస్మ, అభ్రకభస్మ, పొం॥ వెలిగారము, సముద్రలవణము, యవక్షారము, స్వర్జికాక్షారము, సైంధవలవణము, శుంఠి, ఉత్తరేణి క్షారము, మోదుగక్షారము, శు॥ నాభి, వీనిని సమభాగములుగ గ్రహించి సెనగ పులుసు, అజామోదము, కలుబంద, అల్లము, వీనితో ఒకరోజు మర్దించి లఘుపుటము

వేయవలయును. ఈ బడబానలరసమును మాషపరిమితిగ సేవించినచో సమస్త గుల్మములు, గ్రహణి, సమస్తములైన అజీర్ణములు, సమస్త శూలలు పోవును.

## కస్తూరికారసము

శ్లో॥ హిఙ్గులం చ విషం టఙ్కో జాతీకోశఫలే తథా । మరిచం పిప్పలీ చైవ కస్తూరీ చ సమాంశకాః (1) రక్తిద్వయం తతః ఖాదేత్సన్నిపాతే సుదారుణే । శ్లేష్మరోగేషు సర్వేషు వాతరోగే తథైవ చ (2)

అ॥ శు॥ ఇంగిలీకము శు॥ నాభి, పొం॥ వెలిగారము, జాపత్రి, జాజికాయ, మిరియాలు, పిప్పళ్ళు, కస్తూరి, వీనిని సమభాగములుగ గ్రహించి రెండురక్తుల ప్రమాణముగ సేవించినచో దారుణసంనిపాతము, సమస్తశ్లేష్మవ్యాధులు, వాతవ్యాధి, ఇవి నశించును.

## మధుమేహాంతకరసము

శ్లో॥ స్వర్ణం రౌప్యం మౌక్తికం చ విశుద్ధం చ శిలాజతు । లోహమభ్రం తథా తాప్యం మధుయష్టీ చ పిప్పలీ (1) మరిచం విశ్వకం చేతి సర్వమేకత్ర కారయేత్ । ప్రయత్నాత్ప్రహరం మర్ద్యం కజ్జలాకృతిసన్నిభమ్ (2) భృఙ్గరాజస్య నిమ్బస్య జమ్బ్వా అపి రసైః పృథక్ । ప్రమేహం వివిధం హన్తి మధుమేహం సుదుస్తరమ్ (3) వాతపిత్తసముద్భూతం సముద్భూతంతథా కఫాత్ । మధుమేహాన్తకో నామ ప్రమేహకులనాశకః (4)

అ॥ సువర్ణభస్మ, రజతభస్మ, ముత్యాభస్మ, శు॥ గోమూత్రశిలాజతు, లోహభస్మ, అభ్రకభస్మ, మాక్షికభస్మ, యష్టిమధుకము, పిప్పళ్ళు, మిరియాలు, శుంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి ఒకజాము కాటుకవలెనూరి గుంటగలగర, వేప, నేరేడు, వీనియొక్క రసములతో వేఱుగ మర్దింపవలయును. దీనిని సేవించినచో సమస్తప్రమేహములు, కఠినమైన మధుమేహము, వాతపిత్తకఫములవలన పుట్టిన మధుమేహము, ఇవి పోవును. ఈ మధుమేహాంతకరసము ప్రమేహసముదాయమును నశింపజేయును.

## రక్తగుల్మాంతకరసము

శ్లో॥ తామ్రమం దశగుణం స్వర్ణాత్స్వర్ణపాదం కటుత్రికమ్ । త్రిఫలా వ్యోషతుల్యా స్యాత్త్రిఫలార్ధమయోరజః (1) అయసోఽర్ధం విషం చైవ

సర్వం మర్దయ యత్నతః । రక్తగుల్మాన్తకో నామ నాశయేద్రక్త గుల్మకమ్ (2)

అ॥ తామ్రభస్మ 10 భా, సువర్ణభస్మ 1 భా, త్రికటుకములు ¼ భా, త్రిఫలములు ¼ భా, లోహభస్మ ¼ భా, శు॥ నాభి 1/16 భా, వీనిని కలిపి నూరవలయును. ఈ రక్తగుల్మాంతకమును సేవించినచో రక్తగుల్మము నశించును.

## మహామేహాంతకరసము

శ్లో॥ సువర్ణం తామ్రతీక్ష్ణే చాప్యాయసం నాగవిద్రుమే । ముక్తాఫలం కమ్బుకం చ పారదం గన్ధకం తథా (1) ఏతాని చార్ధభాగం స్యాత్పఞ్చభాగం చ రౌప్యకం । తత్సమం కాన్తలోహం చ తత్తుల్యం చాభ్రకం తథా (2) తత్తుల్యం త్రపుకం చైవ శాల్మలీరస మర్దితమ్ । కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాయన్త్రికే పచేత్ (3) స్వాఙ్గశీతలముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ ! సర్వతుల్యం శిలాచూర్ణం తత్పాదాంశం రసేన్ద్రికమ్ (4) మృగాణ్డజం చార్ధ భాగం త్రిఫలారసమర్దితమ్ । అమృతాచన్దనోశీరవటాశ్వత్థవరీరసైః (5) ముసలీక్షుగణేనాపి కన్యయా చ విమర్దితమ్ । వల్లద్వయప్రమాణం తు హ్యాను పానవిశేషకైః (6) సేవితో మధుమేహం చ నానామేహం నివారయేత్ । శుక్లమేహం చాతిమూత్రం మూత్రకృచ్ఛ్రం తథాఽశ్మరీమ్(7) వసామేహం సురామేహం మజ్జామేహం చ తాపకమ్ । లిఙ్గదాహం మూత్రదాహం ద్వివిధం ప్రదరం తథా (8) క్షయం పాణ్డుం శ్వాసకాసౌ నిద్రానాశం శిరోవ్యథామ్ । మేహాన్తకరసోనామ సర్వమేహకులాన్తకః (9)

అ॥ సువర్ణభస్మ ½ భా, తామ్రభస్మ ½ భా, తీక్ష్ణలోహభస్మ ½ భా, ఇనుపభస్మ ½ భా, సీసభస్మ ½ భా, పగడభస్మ ½ భా, ముత్యభస్మ ½ భా, శంఖభస్మ ½ భా, శు॥ రసము ½ భా, శు॥ గంధకము ½ భా, రజతభస్మ 5 భా, కాంతభస్మ 5 భా, అభ్రకభస్మ 5 భా, వంగభస్మ 5 భా, వీనిని బూరుగరసముతో మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు వండి సాంగశీతలమున తీసి ఖల్వమునందుంచి దానికి సమానమగు శిలాజతుభస్మను, నాల్గవభాగము రససిందూరమును, అర్ధభాగము కోడిగ్రుడ్ల పెంకులను కలిపి, త్రిఫలములు, తిప్పతీగె, మంచిగంధము, వట్టివేళ్ళు, మఱ్ఱి,

రావి, పిల్లిపీచర, నేలతాడి, ఇక్షుగణము, కలబంద వీనియొక్క రసములతో మర్దింప వలయును. దీనిని అనుపానవిశేషములతో రెండుగురిగింజల పరిమితిగ సేవించినయెడల మధుమేహము, సమస్త మేహములు, శుక్లమేహము, అతిమూత్రము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, వసామేహము, సురామేహము, మజ్జామేహము, శరీరతాపము, మేఢ్రము నందు మంట, మూత్రము పోవునప్పుడు మంట, శ్వేతప్రదరము, రక్తప్రదరము, క్షయ, పాండువు, శ్వాస, కాస, నిద్రలేకపోవుట, తలనొప్పి, ఇవి నశించును. ఈ మేహాంతక రసము సర్వమేహములను నివారింపజేయును.

## మహామేహాంతకరసము

శ్లో॥ మాణ్డూరస్వర్ణతారాభ్రరవిరసశిలాజిచ్ఛవైక్రాన్తముక్తం । గన్ధం నాగం ప్రవాలాయసత్రపుభసితం కాన్తభస్మాపి తుల్యమ్ । లామజ్జావాలుకా శ్రీమలయజపయసా సప్తవారం ప్రసిష్ట్వా । సేవ్యోముద్గప్రమాణో యది సకల రుజాహన్తి మేహాన్తకోఽయమ్ (1) శ్లో॥ రక్తమేహం మూత్ర కృచ్ఛ్రముదకం శుక్లమేహకమ్ । క్షయం పాణ్డుం జ్వరం శోషం శ్వాసం కాసం తథాఽరుచిమ్ । అనుపానవిశేషేణ సర్వమేహాన్వినాశయేత్ (2)

అ॥ మాండూరభస్మ, సువర్ణభస్మ, రజితభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, రసభస్మ, శిలాజతుభస్మ, వైక్రాంతభస్మ, ముత్యభస్మ, శు॥ గంధకము, సీసభస్మ, పగడభస్మ, తీక్ష్ణలోహభస్మ, వంగభస్మ, కాంతభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి వట్టివేళ్లు, కురువేరు, మంచిగంధము, వీనియొక్క రసములతోడను ఆవుపాల తోడను ప్రత్యేకముగ ఏడేసిరోజులు నూరవలయును. ఈ మేహాంతకమును పెసరగింజ పరిమితిగ సేవించినచో సకలవ్యాధులు, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, ఉదక మేహము, శుక్లమేహము, క్షయ, పాండువు, జ్వరము, కృశించుట, శ్వాస, కాస, అరుచి, ఇవి పోవును. అనుపానవిశేషములతో సేవించిన సమస్త మేహములు నశించును.

## మహామేహాంతకరసము

శ్లో॥ ద్విభాగం కానకం భస్మ తుల్యం శుద్ధం చ గన్ధకమ్ । లోహభస్మ త్రిభాగంచ చతుర్భాగం మృతం రసమ్ (1) వంగభస్మ త్రిభాగం చ త్రిభాగం నాగభస్మకమ్ । ప్రవాలం మౌక్తికం చైవ గారుడం చ సమం సమమ్ (2) ఖల్వమధ్యే వినిక్షిప్య మాతులుఙ్గరసేన చ । ఇక్షుఖణ్డరసేనైవ శతావర్యా

రసేన చ (3) దినమేకం విమర్ద్యం తు ద్రాక్షాఖర్జూరకైస్తథా । వటాశ్వత్థ కషాయైశ్చ త్రిదినం చ విమర్దయేత్ (4) ద్విగుఞ్జాపరిమాణేన నవనీతేన సేవయేత్ । వాతమేహం శుక్లమేహం చేక్షుమేహం చ కృచ్ఛ్రకమ్ (5) రక్తమేహం మూత్రఘాతం క్షయకాసజ్వరాన్హరేత్ । మేహాన్తకరసో నామ పూజ్యపాదేన భాషితః (6)

అ॥ సువర్ణభస్మ 2 భా, శు॥ గంధకము 2 భా, లోహభస్మ 3 భా, రసభస్మ 4 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 3 భా, పగడభస్మ 3 భా, ముత్యభస్మ 3 భా, పచ్చలభస్మ 3 భా, వీనిని ఖల్వమందుంచి మాదీఫలములు, చెఱుకుముక్కలు, పిల్లిపీచర, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుపండ్లు, వీనియొక్క రసములతో నొక్కొక్క రోజును మఱ్ఱి, రావి, వీనియొక్క కషాయములతో మూడేసి రోజులును మర్దింపవలయును. దీనిని వెన్నతో రెండుగురివిందగింజల ప్రమాణముగ సేవించినచో వాతమేహము, శుక్లమేహము, ఇక్షుమేహము, మూత్రకృచ్ఛ్రము, రక్తమేహము, మూత్రాఘాతము, క్షయ, కాస, జ్వరము, ఇవి నశించును. ఈ మేహాంతకరసము పూజ్యపాదునిచే చెప్పబడెను.

## మ హా మే హాం త క ర స ము

వ॥ సువర్ణభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, లోహభస్మ 1 భా, సీసభస్మ 1 భా, పగడభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, వజ్రభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, రజతభస్మ 5 భా, కాంతభస్మ 5 భా, అభ్రకభస్మ 5 భా, వంగభస్మ 5 భా, వీనిని కలబంద, నల్లకలువ, త్రికటుకములు, వీని రసములతో మర్దించి వాలుకాయంత్రమునందు ఒకరోజు వండి చల్లారిన పిదప తీసి శిలాజతుభస్మ, తిప్పసత్తు, పచ్చకర్పూరము, లవంగములు, జాజికాయలు, వీనిని ప్రత్యేకముగ మందునకు నాల్గవవంతు చొప్పునను, కస్తూరిని ½ భాగముగను కలిపి తుంగగడ్డలు, వట్టివేళ్లు, మంచిగంధము, కురువేరు, వీనియొక్క రసములతో మర్దింపవలయును. దీనిని పంచదార, వెన్న, తేనె, మొదలగు అనుపానములతో మూడు గురివిందగింజలపరిమితిగ సేవించినయెడల ఇక్షుమేహము, అతిమూత్రము, మధుమేహము, సురామేహము, వసామేహము, హరిద్రామేహము, శుక్లమేహము, పాండువు, క్షయ, కృశించుట, దగ్గు, దౌర్బల్యము, ఉత్థాపనశక్తిలేకపోవుట, కాళ్ళుమంటలు, చేతులు మంటలు, తలనొప్పి, నడుమునొప్పులు, మూత్రముపోవునప్పుడు మంట, జీర్ణజ్వరము, అజీర్ణము, రక్తార్శస్సు, గ్రహణి, ప్రదరములు, మొదలగు వ్యాధులు పోవును. శరీరకాంతి, బుద్ధికుశలత, ఇంద్రియబలము, ఇవి కలుగుటయేగాక చాలమంది స్త్రీలతో

రమించుశక్తి కూడ కలుగును. ఈ మేహాంతకరసము వీర్యవృద్ధిని చేయును. ముసలితనమును, వ్యాధులను పోగొట్టును.

## మహామేహాంతకరసము (పుటయోగము)

శ్లో॥ చతుర్భాగం హాటకంచ రసభస్మ చ రౌప్యకమ్। తీక్ష్ణభూతిం వఙ్గభస్మ నాగం వైక్రాన్తమభ్రకమ్ (1) శిలాం చ గన్ధకం చైవ ప్రత్యేకం చ త్రిభాగకమ్। సుముహూర్తే క్షిపేత్ఖల్వే త్రిఫలాద్రవమర్దితమ్ (2) మోదకాన్ ఛాయయా శుష్కాన్ప్రపుటేత్స్వాఙ్గశీతలమ్ । ఉశీరచన్దనరసైశ్చతస్రో భావనాస్తథా (3) చతుర్గుఞ్జాప్రమాణేన శర్కరామధుసంయుతమ్। మధుమేహం చేక్షుమేహం చాఙ్గతాపం చ నాశయేత్ (4) ఉదకం శుక్లమేహం చ లాలాతన్తువినాశకమ్ । ఏకాదశక్షయాన్హన్తి కాసశ్వాసౌ నిహన్తి చ (5) లిఙ్గదాహం శిరోదాహం నానారోగాన్నివారయేత్ । బలపుష్టికరం వృష్యం భక్షణాదమృతం భవేత్ । మేహాన్తకరసో నామ్నా మూత్రరోగనివారకః (6)

అ॥ బంగారుభస్మ 4 భా, రసభస్మ 3 భా, రజతభస్మ 3 భా, తీక్ష్ణలోహభస్మ 3 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 3 భా, వైక్రాంతభస్మ 3 భా, అభ్రకభస్మ 3 భా, శిలాజతుభస్మ 3 భా, శు॥ గంధకము 3 భా, వీనిని సుముహూర్తమునందు ఖల్వమందుంచి త్రిఫలారసముతో మర్దించి మాత్రలు చేసి నీడ నెండించి పెద్దపుటము వేసి స్వాంగశీతలమున తీసి వట్టివేళ్లు, మంచిగంధము, వీనియొక్క రసములతో నాలుగుభావనలు చేయవలయును. దీనిని పంచదార, తేనె, వీనితో నాలుగు గురివిందగింజలపరిమితిగ సేవించినచో మధుమేహము, ఇక్షుమేహము, శరీరతాపము, ఉదకమేహము, శుక్లమేహము, లాలామేహము, తంతుమేహము, ఏకాదశక్షయలు, కాస, శ్వాస, మేఢ్రమునందలి మంట, శిరస్సునందలి వేడి, సమస్తరోగములు, ఇవి శాంతించును. బలము, శరీరపుష్టి, వీర్యవృద్ధి, ఇవి కలుగును. ఇది సేవించుటవలన అమృతముతో సమానమగును. ఈ మేహాంతకరసము మూత్రసంబంధమైన సమస్త వ్యాధులను హరింపజేయును.

## క్రమవృద్ధిమహామేహాంతకరసము

సీ॥ ముందుగా నొకపాలు ముత్యభస్మంబును పగడభస్మము రెండుపాళ్లుబెట్టి । తామ్రభస్మము మూడు తనరంగ నుంచియు నాగభస్మము నాల్గు

నయముగాను । అనువైన లోహము నైదుభాగంబులు కాంతభస్మం బారు ఘనముగాను । అరును నొక్కటి యభ్రకభస్మంబు వంగంబు నెనిమిదిభాగ భాగములును । ఖల్వంబులో నుంచి కచ్చూరరసమున నుప్పి బూరుగ చెఱకు ను_స్తినీట । నాల్గు దినంబులు ననువుగా మర్దించి పూటకడ్డిగెత్తుపుచ్చుకొన్న । వాతపైత్యశ్లేష్మ వణుకురోగంబులు పాండువు మేహముల్ పారిపోను । మూత్రరుజలను క్షయలను మూర్ఛనణచు । సకలవ్యాధుల మాన్పను చాలి యుండు । విదితమేహాంతక రసమన్ పేరుతోడ । జగతి విఖ్యాతిగన్న దీయగదవాజు॥

అ॥ ముత్యభస్మ 1 భా, పగడభస్మ 2 భా, తామ్రభస్మ 3 భా, సీసభస్మ 4 భా, లోహభస్మ 5 భా, కాంతభస్మ 6 భా, అభ్రకసిందూరము 7 భా, వంగభస్మ 8 భా, వీనిని ఖల్వమందుంచి కచ్చూరాలు, ఉప్పి, బూరుగ, చెఱుకు, ఉ_స్తి, వీనియొక్క రసములతో నాలుగురోజులు మర్దింపవలయును. దీనిని పూటకు అడ్డిగెయెత్తు చొప్పున పుచ్చుకొనినచో వాతవ్యాధులు, పైత్యవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వణుకురోగములు పాండురోగములు, మేహములు, మూత్రవ్యాధి, క్షయలు, మూర్ఛలు, సమస్త వ్యాధులు, ఇవి పోవును. ఈ మేహాంతకరసము మిక్కిలి మేలు చేయును.

## మహామేహాంతకరసము (వంటయోగము)

శ్లో॥ చతుర్భాగం హాటకం చ రౌప్యకం రసభస్మకమ్ లోహం తామ్రం గన్ధకం చ మాణ్డూరం తాలమభ్రకమ్ (1) విద్రుమం మౌక్తికం వజ్రం వైక్రాన్తం నాగవఙ్గకే । సర్వాణి చ సమాయుజ్య ప్రత్యేకం చ త్రిభాగకమ్ (3) సర్వమేకత్ర సంచూర్ణ్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । న్యగ్రోధత్రిఫలానీరైర్మర్దయే ద్దివసత్రయమ్ (3) కాచకూప్యాం వినిక్షిప్య పాచయేత్సాన్ద్రశీతలే । విశుద్ధకమఫేనం చ పాదభాగం వినిక్షిపేత్ (4) మృగనాభిం వినిక్షిప్య చన్దనోశీరజైరసైః । చాతుర్జాతరసైర్భావ్యం యామే యామే చ భావయేత్(5) క్షిపేచ్చన్ద్రిం భావనాన్తే గుఞ్జామాత్రప్రమాణతః। అనుపాన విశేషేణ సర్వమేహాన్వ్యపోహతి (6) నాశయేన్నిశ్చితం చైవ మధుమేహమతిధ్రువమ్ । ఇక్షుమేహం శుక్లమేహమశ్మరీం తన్తుమేహకమ్ (7) బహుమూత్రం మహారోగాన్కాసం శ్వాసం క్షయం తథా । జ్వరాతిసారమర్శాంసి

కుక్షిగుల్మభగన్దరాన్ (8) వివిధాన్ప్రదరాన్హన్తి రక్తపిత్తం చ దారుణమ్ । తత్తద్రోగానుపానేన సర్వరోగహరం పరమ్ (9) వన్ధ్యా చ లభతే గర్భం వృద్ధోఽపి తరుణాయతే । తుష్టి పుష్టికరం చైవ వృష్యం చైవ రసాయనమ్ । మేహాన్తకరసో నామ బ్రహ్మణా నిర్మితః పురా (10)

అ॥ బంగారుభస్మ 4 భా, రజతభస్మ 3 భా, రసభస్మ 3 భా, లోహభస్మ3భా, తామ్రభస్మ 3 భా, శు॥ గంధకము 3 భా, మాండూరభస్మ 3 భా, శు॥ తాళకము 3 భా, అభ్రకభస్మ 3 భా, పగడభస్మ 3 భా, ముత్యభస్మ 3 భా, వజ్రభస్మ 3 భా, వైక్రాంతభస్మ 3 భా, సీసభస్మ 3 భా, వంగభస్మ 3 భా, వీనిని ఖల్వమందుంచి మట్టి, త్రిఫలములు, వీనియొక్క రసములతో మూడురోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు వండి సాంగశీతలమున తీసి శు॥ నల్లమందును పైమందునకు నాల్గవవంతుగ కలిపి కస్తూరిని కలిపి మంచిగంధము, వట్టివేళ్ళు, చాతుర్జాతకములు, వీనిరసములతో ఒక్కొక్కజాము భావనచేసి పిదప పచ్చకర్పూరమును కలుపవలయును. దీనిని అనుపానవిశేషములతో గుంజాప్రమాణముగ సేవించినయెడల సర్వమేహములు, మధుమేహము, ఇవి తప్పక నశించును. ఇక్షుమేహము, శుక్లమేహము, అశ్మరి, లంతుమేహము, అతిమూత్రము, కఠినవ్యాధులు. కాస, శ్వాస, క్షయ, జ్వరము, అతిసారము, మూలశంక, ఉదరవ్యాధులు, గుల్మము, భగందరము, సమస్తప్రదరములు, కఠినమైనరక్తపిత్తము, ఇవికూడ నశించును. ఆయారోగములకు తగిన అనుపానములతో సేవించినచో సమస్తరోగములు హరించును. గొడ్డురాలు గర్భమును ధరించును. వృద్ధుడుకూడ యౌవనవంతుడగును. మనస్సునకు సంతోషము, శరీరపుష్టి, వీర్యవృద్ధి, ఇవి కలుగును. ఇది రసాయనము. ఈమేహాంతకరసము పూర్వమునందు బ్రహ్మచే చెప్పబడెను.

## తామ్రరసాయనము

శ్లో॥ తామ్రభస్మ త్వజాక్షీరే పాచ్యం తుల్యఘృతే పచేత్ । తత్తామ్రం శుద్ధసూతం చ గన్ధకం చ సమం సమమ్ (1) నిర్గుణ్డ్యుత్థ ద్రవైర్మర్ద్యం దినం తద్గోలమాచరేత్ । యామైకం వాలుకాయన్త్రే పాచ్యం యోజ్యం ద్విగుఞ్జకమ్ (2) బీజపూరస్య మూలం తు సజలం చానుపాయయేత్ । తామ్రం రసాయనం నామ్నా చోదరం శూలమూలకే (3) అశ్మరీం విద్రధిం కుష్ఠం కఫవ్యాధీనశేషతః । అజీర్ణం తిమిరం హన్తి గుల్మరోగం చ నిశ్చితమ్ (4)

అ॥ తామ్రభస్మను మేకపాలయందు వండి పిదప సమానమైన నేతియందు వండి ఆ తామ్రభస్మ, శు॥ రసము, శు॥ గంధకము, వీనిని సమభాగములుగ గ్రహించి వావిలి రసముతో ఒకరోజు మర్దించి ఉండచేసి వాలుకాయంత్రమునందు ఒకజాము వండవలయును. మాదీఫలపువేళ్ళను నూరి జలముతో కలిపి ఆ అనుపానముతో ఈ తామ్ర రసాయనమును రెండు గురివిందగింజల పరిమితిగ పుచ్చుకొనినచో ఉదరము, శూల, మూలవ్యాధి, అశ్మరి, విద్రధి, కుష్ఠము, సమస్తకఫవ్యాధులు, అజీర్ణము, తిమ్మిప్లీహ, గుల్మరోగము, ఇవి నశించును.

## త్రిపురభైరవరసము

శ్లో॥ భాగౌ రసస్య భాగశ్చ హేమ్నం పిష్టం విధాయ చ । తథా ద్వాదశభాగాని తామ్రపత్రాణి లేపయేత్ (1) ఊర్ధ్వాధో గన్ధకం దత్వాపల మాత్రం సమన్తతః । క్షారస్య మృగశృఙ్గస్య చూర్ణం యోజ్యం సమన్తతః (2) సిఞ్చేన్మత్స్యాక్షినీరేణ రుద్ధ్వా యామచతుష్టయమ్ । పచేచ్చూలహా రసూనతో భవేత్త్రిపురభైరవః (3) మాషో మధ్వాజ్యసంయుక్తోదేయోఽస్య పరిణామజే । అన్యేష్వేరణ్డతైలేన కటుత్రయయుతో హితః (4)

అ॥ శు॥ రసము 2 భా, బంగారము 1 భా, వీనిని నూరి 12 భాగముల శు॥ తామ్రమును పలుచని రేకులుగా చేసి ఆ రేకులకు పూసి మూకళ్ళయందుంచి క్రిందను మీదను అంతటను ఒక పలము శు॥ గంధకము ఉంచి యవక్షారము, లేడికొమ్ము చూర్ణము, వీనిని అంతటను చల్లి పొన్నగంటికూరరసముతో తడిపి సంధిబంధనముచేసి నాలుగుజాములు వండవలయును. ఈ త్రిపురభైరవరసమును తేనె, నెయ్యి, వీనితో మాషప్రమాణముగ సేవించినయెడల శూలయు పరిణామశూలయు పోవును. ఇతరములైన గుల్మము, ఉదరము, మొదలగు వ్యాధులయందు దీనిని త్రికటుక చూర్ణముతోడను ఆముదముతోడను, పుచ్చుకొనవలయును.

## పాషాణవజ్రకరసము

శ్లో॥ శుద్ధసూతం త్రిధా గన్ధం ద్రవైశ్శ్వేతపునర్నవైః । మర్దయిత్వా దినం ఖల్వే రుద్ధ్వా తద్భూధరే పచేత్ (1) పాషాణభేది చూర్ణం తు సమం యోజ్యం ద్వమాషకమ్ । భక్షయేదశ్మరీం హన్తిరసః పాషాణవజ్రకః (2)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 3 భా, వీనిని తెల్లగలిజేరురసముతో ఖల్వమునందు ఒకరోజు మర్దించి తీసి భూధరయంత్రమునందుంచి సంధిబంధనము చేసి

వండి అనుండునను సమానమగు పాషాణభేదిచూర్ణమును కలుపవలయును. ఈ పాషాణ వజ్రకరసమును రెండుమాషములపరిమితిగ సేవించినచో అశ్మరి పోవును

## మే హాం త క ర స ము

సీ॥ కాంతంబు నొక్కటి గగనభస్మము మూడు వంగభస్మము రెండు భాగములు । షడ్భాగములు శిలాజతును జేరిచి వేపచెక్కనీటను నూరఁ జెలువుగాంచు । మేహాంతకము పాలమీగడచే గ్రోల వహ్నిరోగంబుల వడి హరించు । జీరకరసమున నారగించిన మేహవాతముల్ పిత్తముల్ బాసి చనును । ద్రాక్షపండ్లరసంబున దాహమడచు । గసగసాల రసంబున కాక లణచు । త్రిఫల కల్కముచే శుష్కతెవులడంచు । నవని మేహాంతకంబను నాఖ్య దనరి॥

అ॥ కాంతభస్మ 1 భా, అభ్రకభస్మ 3 భా, వంగభస్మ 2 భా, శిలాజతుభస్మ 6 భా, వీనిని వేపచెక్కకషాయముతో నూరవలయును. ఈ మేహాంతకరసమును పాలమీది మీగడతో సేవించినయెడల అగ్నిమాంద్యములును, జీలకర్రరసముతో సేవించినయెడల మేహవాతములును, పైత్యవ్యాధులును, ద్రాక్షపండ్లరసముతో సేవించినయెడల తాపములును, గసగసాలరసముతో పుచ్చుకొనినచో కాకలును, త్రిఫలా కల్కముతో పుచ్చుకొనినచో కృశించుటయు నశించును.

## మే హాం త క ర స ము

వ॥ కాంతభస్మ 1 భా, వంగభస్మ 2 భా, లోహభస్మ 3 భా, అభ్రకభస్మ 3 భా, సీసభస్మ 3 భా, రససిందూరము 3 భా, ముత్యభస్మ 1 భా, శు॥ గంధకము 2 భా. వీనిని గ్రహించి ద్రాక్షపండ్లు, నిమ్మకాయలు, కలుబంద, జీలకఱ్ఱ, త్రిఫలములు, 宗 ని రసములతో మర్దించి కప్పెలు కట్టవలయును. ఈ మేహాంతకరసమును అనుపాన విశే షములతో పూటకు మూడుగురువిందగింజల పరిమితిగ సేవించినయెడల శుక్లమేహము, వసామేహము, తంతుమేహము మొదలగు సమస్తమేహవ్యాధులు, క్షయ, పాండువు, అగ్నిమాంద్యము, శరీరతాపము, బలహీనము, బుద్ధిమాంద్యము, కాళ్లుమంటలు, చేతులుమంటలు, నడుమునొప్పి, కాళ్ళులాగుట, కృశించుట, కండ్లుమంటలు, పైత్య వ్యాధులు, మూర్ఛ, అపస్మారము, వీర్యము పలుచనగుట, గుండెదడ, నోటిపూత, ఉత్సాహములేకుండుట, అతిమూత్రము, మూత్రము వెడలునప్పుడు మంట, దగ్గు, వగర్పు, సమస్తప్రదరవ్యాధులు, రక్తపిత్తము, రక్తార్శస్సు మొదలగు వ్యాధులను వెంటనే నివారింపజేయును.

## మేహాంతకరసము

వ॥ శిలాజతుభస్మ 2 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 4 భా, అభ్రకభస్మ 5 భా, రససిందూరము 3 భా, రసము 1 భా, గంధకము 1 భా, వీనిని ఖర్జూరపుకాయల కషాయములతో మర్దించి కుప్పెలు కట్టవలయును. ఈ మేహాంతకరసమును అనుపాన విశేషములతో పూటకు మూడు గురువిందగింజల పరిమాణముగ సేవించిన యెడల మేహములు, రక్తార్శస్సు, మూత్రకృచ్ఛ్రము, తాపము, గ్రహణీదోషము, శుష్కించుట, దగ్గు మొదలగు వ్యాధులు పోవును.

## క్రమవృద్ధిమేహాంతకరసము

శ్లో॥ రసేన్ద్రమేకభాగం చ ద్విభాగం గన్ధకం తథా । త్రిభాగం వఙ్గభూతిం చ చతుర్భాగం చ నాగకమ్ (1) పఞ్చభాగం వ్యోమభస్మ షడ్భాగం చ ప్రవాలకమ్ । శిలాజిత్సప్తభాగం చ కుఙ్కుమం చాష్టభాగకమ్ (2) సర్వమేకీకృతం చూర్ణం జమ్బీరామ్లేన మర్దితమ్ । మేహాన్తకరసో నామ సర్వమేహ వినాశకః (3) సమస్తపైత్యరోగాంశ్చ మూత్రాఘాతం తథైవ చ । అతిమూత్రం బుద్ధిమాన్ద్యం గ్రహణీమప్యపస్మృతిమ్ (4) అఙ్గదాహం నేత్రదాహం నారీణాం ప్రదరం తథా । వీర్యదోషం రజోదోషం నాశయేన్నాత్ర సంశయః (5)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 4 భా, అభ్రకభస్మ 5 భా, పగడభస్మ 6 భా, శిలాజతుభస్మ 7 భా, కుంకుమపువ్వు 8 భా, వీనిని నిమ్మకాయపులుసుతో మర్దింపవలయును. ఈ మేహాంతకరసమును సేవించినచో సమస్త మేహములు, సమస్త పైత్యవ్యాధులు, మూత్రాఘాతము, అతిమూత్రము, బుద్ధిమాంద్యము, గ్రహణీదోషము, అపస్మారము, శరీరతాపము, నేత్రములు మండుట, ప్రదరవ్యాధులు, శుక్లదోషములు, రజోదోషములు ఇవి నశించును.

## లఘుమేహాంతకరసము

శ్లో॥ అభ్రకం గన్ధకం సూతం వఙ్గభస్మ సమాంశకమ్ । ఏలాశిలాజితీ చైవ రమ్భాసారేణ మర్దయేత్ । ప్రమేహాన్వింశతిం హన్యాత్కామలాపిత్తనాశకమ్ (1)

అ॥ అభ్రకభస్మ, శు॥ గంధకము, శు॥ రసము, వంగభస్మ, ఏలకులు శిలాజతు భస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి అరటిదుంపరసముతో మర్దింపవలయును. దీనిని సేవించినచో ఇరువది ప్రమేహములు, కామిర్లు, పైత్యము ఇవి నశించును.

## విజయేశ్వరరసము

శ్లో॥ శుద్ధతాలం మృతం సూతం తుల్యం తాభ్యాం చతుర్గుణామ్ । భర్జితాం విజయాం చైవ సర్వతుల్యం గుడం క్షిపేత్ (1) శ్వేతకుష్ఠహరో నిష్కో రసోఽయం విజయేశ్వరః । దార్వీ ఖదిరనిమ్బానాం క్వాథం తమను పాయయేత్ (2)

అ॥ శు॥ తాళకము 1 భా, రసభస్మ 1 భా, వేయించిన గంజాయిఆకు 8 భా, బెల్లము 10 భా, వీనిని కలుపవలయును. ఈ విజయేశ్వరరసమును మానిపసుపు, చండ్ర, వేప, వీని కషాయముయొక్క అనుపానముతో నిష్కప్రమాణముగ సేవించినచో శ్వేతకుష్ఠము నశించును.

## జేపాలరసము

శ్లో॥ జేపాలేన సమైస్సూతవ్యోషటఙ్కణగన్ధకైః । నారాచస్స్యాద్రసో హ్యేష మాషస్సర్పితాయుతః । హన్త్యుదావర్తమానాహ ముదరాణి చ గుల్మకమ్ (1)

అ॥ శు॥ రసము 1 భా, త్రికటుకములు 1 భా, శు॥ టంకణము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ నేపాళములు 4 భా, వీనిని కలుపవలయును. ఈ నారాచరసమును నెయ్యి, పంచదార, వీనితో మాషప్రమాణముగ సేవించినచో ఉదావర్తము, కడుపుబ్బరము, ఉదరవ్యాధి, గుల్మము ఇవి నశించును.

## షడ్వర్గసిందూరము

వ॥ సువర్ణభస్మ 1 భా, శు॥ గంధకము 8 భా, పొం॥ వెలిగారము 8 భా, కాంతభస్మ 2 భా, ఖడ్గలోహభస్మ 12 భా, పాదరసము 5 భా, వీనిని కలుబంద రసముతో మర్దించి వాలుకాయంత్రమునందు వండి తీసి మరల కలుబందరసముతో నూరి కప్పెలు కట్టవలయును. దీనిని సేవించినచో నంజు, పాండువు, కామిర్లు, అశీతి వాతములు, అండవాతము, శిరోవాతము, మొదలగు వ్యాధులు నశించును.

## సూతశేఖరరసము

శ్లో॥ శుద్ధం సూతం మృతం స్వర్ణం టఙ్కణం వత్సనాభకమ్ । వ్యోష మున్మత్తబీజం చ గన్ధకం తామ్రభస్మకమ్ (1) చాతుర్జాతం శఙ్ఖభస్మ బిల్వ మజ్జాకచూరకే । సర్వం సమం క్షిపేత్ఖల్వే మర్ద్యం భృఙ్గరసైర్దినమ్ (2) ద్విగుఞ్జామధుసర్పిభ్యాం గుఞ్జామాత్రాం వటీం చరేత్ । భక్షయేదమ్లపిత్తఘ్నో వాన్తిం శూలామయం హరేత్ (3) పఞ్చగుల్మాన్ప్రఞ్చకాసాన్గ్రహణ్యామయ నాశకః । త్రిదోషోత్థాతిసారఘ్నశ్శ్వాసమన్దాగ్నినాశకః (4) ఉగ్రహిక్కా ముదావర్తం దేహయాప్య గదాపహః । మణ్డలాన్నాత్ర సందేహస్సర్వరోగ హరః పరమ్ । రాజయక్ష్మహరస్సాక్షాద్రసో౽యం సూతశేఖరః (5)

అ॥ శు॥ రసము, సువర్ణభస్మ, శు॥ వెలిగారము, శు॥ నాభి, త్రికటకములు, శు॥ ఉమ్మెత్తవిత్తులు, శు॥ గంధకము, తామ్రభస్మ, చాతుర్జాతకములు, శంఖభస్మ, మారేడుగుంజు, కచ్చూరాలు, వీనిని సమభాగములుగ ఖల్వమందుంచి గుంటగలగర రసములతో ఒకరోజు మర్దించి గురివిందగింజపరిమితిగ మాత్రలను చేయవలయును. రెండు గురివిందగింజలపరిమితిగ తేనె, నెయ్యి, వీనితో దీనిని సేవించినయెడల ఆమ్లపిత్తము, వాంతి, శూల, అయిదు విధములగు గుల్మములు, అయిదు విధముల గు దగ్గులు, గ్రహణీవ్యాధులు, త్రిదోషములవలన పుట్టిన అతిసారము, శ్వాస, అగ్ని మాంద్యము, కఠినమైన ఎక్కిళ్ళు, ఉదావర్తము, యాప్యవ్యాధులు, ఇవి నశించును. మండలము రోజులు సేవించినచో సమస్తవ్యాధులు తప్పక నశించును. ఈ సూతశేఖర రసము రాజయక్ష్మను తప్పక నశింపజేయును.

## రామబాణరసము

శ్లో॥ తాలకం రసకర్పూరం గౌరీపాషాణశఙ్ఖకే । ఏతాని సమభాగాని కృష్ణధత్తూరపత్రకైః (1) మర్దితం చ యథాగాఢం గుఞ్జామాత్రప్రమాణతః జీరకస్యానుపానేన శీతజ్వరవినాశకః । సంనిపాతం జ్వరం సర్వం హరత్యేవ న సంశయః (2)

అ॥ శు॥ తాళకము, శు॥ రసకర్పూరము, శు॥ గౌరీపాషాణము, శు॥ శంఖ పాషాణము, వీనిని సమభాగములుగ గ్రహించి నల్లఉమ్మెత్తాకురసములతో బాగుగ మర్దింపవలయును. జీలకర్రరసముయొక్క అనుపానముతో గురివిందగింజ పరిమితిగ

సేవించిన యెడల శీతజ్వరము, సంనిపాతజ్వరము, సమస్తజ్వరములు, ఇవి తప్పక నశించును.

## ప్రవాలపంచామృతరసము

శ్లో॥ ప్రవాలముక్తాఫలశఙ్ఖశుక్తి కపర్దికానాం చ సమాంశభాగమ్। ప్రవాలమాత్రం ద్విగుణం ప్రయోజ్యం సర్వైస్సమాంశం రవిదుగ్ధమేవ (1) ఏకీకృతం తత్ఖలు భాణ్డమధ్యే క్షిప్త్వా ముఖే బన్ధనమత్ర యోజ్యమ్। పుటం విదధ్యాదతిశీతలే చ హ్యుద్ధృత్య తద్భస్మ క్షిపేత్కరణ్డే (2) నిత్యం ద్వివారం ప్రతిపాకయుక్తం వల్లప్రమాణం హి నరేణ సేవ్యమ్। ఆనాహగుల్మోదర ప్లీహ కాసశ్వాసాగ్నిమాన్ద్యాన్కఫమారుతోత్థాన్। అజీర్ణముద్గారహృదామయఘ్నం గ్రహణ్యతీసారవికారనాశమ్ (3) శ్లో॥ మేహామయం మూత్రరోగం మూత్రకృచ్ఛ్రం తథాఽశ్మరీమ్॥ నాశయేన్నాత్ర సందేహస్సత్యం గురువచో యథా (4) శ్లో॥ పథ్యాశ్రితం భోజనమాదరేణ సమాచరేన్నిర్మలచిత్తవృత్త్యా। ప్రవాలపఞ్చామృతనామధేయో యోగోత్తమస్సర్వగదాపహారీ (5)

అ॥ పగడభస్మ 2 భా, ముత్యభస్మ 1 భా, శంఖభస్మ 1 భా, ముత్యపుచిప్పల భస్మ 1 భా, గవ్వలభస్మ 1 భా, జిల్లేడుపాలు 6 భా, వీనిని కలిపి కుండయందుంచి ముఖము మూసి పుటమువేసి బాగుగ చల్లారిన పిదప తీసి ఆ భస్మను భరణియందుంచవలయును. దీనిని రోజునకు రెండుసారులు వల్లపరిమితిగ సేవించినచో కడుపుబ్బరము, గుల్మము, ఉదరవ్యాధి, ప్లీహవ్యాధి, దగ్గు, ఆయాసము, అగ్నిమాంద్యము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, అజీర్ణము, త్రేణుపులు, హృద్రోగము, గ్రహణి, అతిసారము, మేహవ్యాధులు, మూత్రరోగము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి ఇవి తప్పక నశించును. దీనిని సేవించినప్పుడు నిర్మలమైన చిత్తవృత్తికలవాడై పథ్యయుక్తమైన ఆహారమును ఆదరముగ భుజింపవలయును. రసశ్రేష్ఠమైన ఈ ప్రవాలపంచామృతము సమస్తవ్యాధులను నశింపజేయును.

## సవాయిసంజీవనీరసము

వ॥ శు॥ ఇంగిలీకము 1 తు. శు॥ రసకర్పూరము 1 తు, శు॥ సౌవీరము 1 తు, పటిక 2½ తు, రససిందూరము 1 తు, మృద్దారుసింగు 1 తు, వీనిని తీగజెముడు, గుంటగలగర, వీనియొక్క రసములతో చుగకాయిచ్చి చివరకు తేనెమైనము 1 తులము వేసి దింపబోవునప్పుడు 1 తులము శుంఠిచూర్ణము వేసి కొద్దిగ తేనెవేసి బటాని

గింజలంత మాత్రలు కట్టవలయును. దీనిని సవాయి, కొరుకు, మేహవ్రణములు, మొదలగు వ్యాధులయందు పథ్యముతో సేవింపవలయును.

## రసప్రతాపమార్తాండరసము

శ్లో॥ రసం హిఙ్గులజేపాలే పృథ్వీద_న్త్యమ్బుమర్దితమ్ । దినార్ధేన జ్వరం హన్త్యార్ద్రగుడేన సితయా తథా । చతుర్వల్లమిమం ఖాదేత్సర్వజ్వర ప్రశా న్తయే (1)

అ॥ శు॥ రసము, శు॥ ఇంగిలీకము, శు॥ నేపాళెములు, వీనిని నేలదంతిరసముతో మర్దింపవలయును. దీనిని బెల్లముతోగాని పంచదారతోగాని నాలుగు వల్లముల పరిమితిగ సేవించినచో అర్థదినములో సమస్త జ్వరములు నశించును.

## తరుణార్కరసము

శ్లో॥ గన్ధకం టఙ్కణం చాభ్రం విషం దుత్తూరబీజకమ్ । కృష్ణసర్పస్య గరలం ర_క్తచన్దనవఙ్గకే (1) ఏతాని సమభాగాని సర్వతుల్యం తు హిఙ్గులమ్॥ మాతులుఙ్గరసైర్మర్ద్యం త్రిదినం చ మహామృదు (2) వటీస్సర్షపమాత్రేణ హ్యనుపానవిశేషతః । తరుణాఖ్యరసో ఖ్యాతస్సర్వ జ్వరనివారకః (3)

అ॥ శు॥ గంధకము 1 భా, శు॥ వెలిగారము 1 భా, అభ్రకభస్మ 1 భా, శు వాభి 1 భా, శు॥ ఉమ్మెత్తవిత్తులు 1 భా, నల్లత్రాచుపాము విషము 1 భా, రక్తచంద నము 1 భా, వంగభస్మ 1 భా, ఇంగిలీకము 8 భా, వీనిని మాదీఫలరసముతో మూడు రోజులు మిక్కిలి మృదువుగ మర్దించి ఆవాలంత మాత్రలను చేయవలెను. ఈ తరుణా ర్కరసమును అనుపానవిశేషములతో సేవించినయెడల సర్వజ్వరములు పోవును.

## సమగరళతరుణార్కరసము

శ్లో॥ గోద_న్తం హిఙ్గులం తుల్యం ద్వయోస్తుల్యం హలాహలమ్ । త్రయాణాం గరలం తుల్యం గరలం కృష్ణసర్పజమ్ (1) మాతులుఙ్గ రసైర్మ ర్ద్యం దినమేకం తు కజ్జలీమ్ । ముద్గప్రమాణవటికాం నారికేలోదకేన చ (2) దాతవ్యం సంనిపాతార్తే తతశ్శైత్యముపాచరేత్ । తరుణార్కరసో నామ మృత్యుం జయతి నిశ్చయమ్ (3)

అ॥ శు॥ తాళకము 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ నాభి 2 భా, నల్లత్రాచు పాముయొక్క గరళము 4 భా, వీనిని మాదీఫలరసముతో ఒకరోజు మెత్తగ మర్దించి పెసరగింజలంత మాత్రలను చేయవలయును. దీనిని కొబ్బరికాయల నీళ్ళతో సేవించి శీతలోపచారములను చేసినచో సన్నిపాతజ్వరము నశించును. ఈ తరుణార్కరసము మృత్యువును నిశ్చయముగ జయించును.

## మహాతరుణార్కము

శ్లో॥ అభ్రకం గన్ధకం తామ్రం టఙ్కణం నాగవఙ్గకే। మాక్షికం లోహభూతిం చ మౌక్తికం ఫణినో విషమ్ (1) హేమ చోన్మత్తబీజాని ప్రవాలం రక్తచన్దనమ్। వంశక్షీరీం చ కస్తూరీం సులోహితమనశ్శిలామ్ (2) ఏతత్సర్వం సమాంశం చ సర్వతుల్యం విషం తథా। సర్వేషాం పాదభాగం చ స్వచ్ఛసూతం చ హిఙ్గులమ్ (3) సర్వం ఖల్వే వినిక్షిప్య జమ్బీరార్ద్రికచిత్రకైః। మర్దయే త్త్రిదినం ఖల్వే నవనీతసమం మృదు (4) గుఞ్జాయుగ్మం ప్రదాతవ్యం సంనిపాతాంస్త్రయోదశ। త్రిదోషజనితాన్పుంసాం రజోదోషం చ యోషితామ్ (5) సర్వవ్యాధీన్నిహన్త్యేవ హ్యనుపానవిశేషతః। ద్రాక్షాదాడిమఖర్జూరఫలం దేయం చ ఖాదయేత్ (6) దేయముష్ణోదకం చైవ తృష్ణార్తే తు ప్రకల్పయేత్। సమాచరేద్ధి పథ్యం చ మనసా చాతిభీరుణా। తరుణార్కో మహాపూర్వో బాలరోగప్రశాన్తికృత్ (7)

అ॥ అభ్రకభస్మ 1 భా, శు॥ గంధకము 1 భా, తామ్రభస్మ 1 భా, శు॥ టంకణము 1 భా, సీసభస్మ 1 భా, వంగభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, లోహభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, త్రాచుపామువిషము 1 భా, సువర్ణభస్మ 1 భా, శు॥ ఉమ్మెత్తవిత్తులు 1 భా, పగడభస్మ 1 భా, రక్తచందనము 1 భా, తవాక్షీరి 1 భా, కస్తూరి 1 భా, శు॥ రక్తమణిశిల 1 భా, శు॥ నాభి 7 భా, శు॥ పాదరసము 8½ భా, శు॥ ఇంగిలీకము 8½ భా, వీనిని ఖల్వమందుంచి నిమ్మకాయలు, అల్లము, చిత్రమూలము, వీని రసములతో మూడురోజులు, వెన్నవలె మెత్తగ మర్దింపవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ సేవించినచో పదుమూడు సంన్నిపాతములు, పురుషులయొక్క త్రిదోషజనిత వ్యాధులు, స్త్రీలయొక్క రజోదోషము, ఇవి నశించును. అనుపాన విశేషములతో సేవించినచో సమస్త వ్యాధులు నశించును. ఈ మందును సేవించునప్పుడు ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, ఖర్జూరపుపండ్లు, వీనిని తినవలయును. దప్పిక

అయినచో వేడినీళ్ళు త్రాగవలయును. మిక్కిలి భయముతోకూడిన మనస్సుతో పథ్యము చేయవలయును. ఈ మహాతరుణార్కరసము బాలుర వ్యాధులను కూడ శాంతింపజేయును.

## రత్నమహాతరుణార్కము

శ్లో॥ హింగ్గూలం తాలకం చైవ రసగన్ధకటఙ్కణాన్। సమాంశం వత్సనాభం చ సమాంశం తీక్ష్ణతామ్రకే (1) కాన్తాభ్రస్వర్ణభస్మాని ప్రవాలం మౌక్తికం తథా। రజతం నాగవఙ్గే చ మాక్షికం చ మనశ్శిలా (2) వైక్రాన్తం వజ్రవైడూర్యే పుష్యరాగేన్ద్రనీలకే। సర్వాణ్యేతాని తుల్యాని కృష్ణసర్ప విషం తథా (3) మాతులుఙ్గరసేనైవ మర్దయేద్దివసత్రయమ్। చిత్రమూలరసేనైవ మర్దయేద్దినపఞ్చకమ్ (4) హంసపాదీరసేనైవ మర్దయేద్దివసద్వయమ్। శిగ్రుమూలరసేనైవ జమ్బీరామ్లైర్దినత్రయమ్ (5) తత్కాచకూప్యాం నిక్షిప్య వాలుకాయన్త్రమధ్యతః। మృద్వగ్నినా పచేద్ధీమాన్యామమాత్రం పచేత్క్రమాత్ (6) స్వాఙ్గశీతలమాదాయ మర్దయేద్గులికాం స్తతః। స్తన్యానుపానసంయుక్తం ద్విగుఞ్జం చ ప్రదాపయేత్ (7) సర్వరోగాన్హరత్యేవ తత్క్షణేన న సంశయః। అనుపానవిశేషేణ సర్వరోగహరః పరమ్। రత్నేన తరుణార్కశ్చ మహాయోగేన నిర్మితః (8)

అ॥ శు॥ ఇంగిలీకము, శు॥ తాలకము, శు॥ రసము, శు॥ గంధకము, పొం॥ వెలిగారము, శు॥ నాభి, లోహభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, రజతభస్మ, నాగభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, శు॥ మణిశిల, వైక్రాంతభస్మ, వజ్రభస్మ, వైఢూర్యభస్మ, పుష్యరాగభస్మ, ఇంద్రనీలభస్మ, నల్లత్రాచుపాముపిషము, వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమందుంచి మాదీఫల రసములతో మూడురోజులును, చిత్రమూలరసముతో అయిదురోజులును, హంసపాది రసముతో రెండురోజులును, మునగవేళ్ళు, నిమ్మకాయలు వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులును, మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు మందాగ్నిచే ఒక జామమాత్రము వండి స్వాంగశీతలమున తీసి నూరి కప్పెలు కట్టవలయును. దీనిని చనుపాల అనుపానముతో రెండుగురివిందగింజల పరిమితిగ సేవించినచో వెంటనే సర్వరోగములు నిస్సందేహముగ నశించును. అనుపానవిశేషములతో సేవించినయెడల ఈ రత్నమహాతరుణార్కము సర్వరోగములను నశింపచేయును.

పా షా ణాం త ర ణా ర్క ము

శ్లో॥ రసభూతిం తథా స్వర్ణం మాక్షికం రౌప్యభస్మకమ్ । హిఙ్గులం వత్సనాభం చ లోహం కాన్తాభ్రతామ్రకమ్ (1) గోదన్తం చ శిలాతాలే ద్విక్షారం బలిసంయుతమ్ । ఏతాని సమభాగాని సంగృహ్యాం చ భిషగ్వరైః (2) సర్వేషాం త్రిగుణం యోజ్యం పాషాణత్రయమేవ చ । మాతులుఙ్గరసేనైవ సర్వం మర్ద్యం దినావధి (3) గులికాం ఛాయయా శుష్కాన్కాచ కూప్యాం నివేశయేత్ । వాలుకాయన్త్రే పాచ్యం త్రియామం కమలాగ్నినా (4) స్వాఙ్గశీతల ముద్ధృత్య హిఙ్గులం చ రసార్ధకమ్ । సూతభాగం చ గరలం సర్వతుల్యం విషం తథా (5) ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయేన్మాతులుఙ్గకైః॥ సూర్యావర్తమునీ భృఙ్గాత్రిపర్ణీ చేన్ద్రివారుణీ (6) దుత్తూరం తులసీ దన్తీ బృహతీ కణ్టకారికా । స్నుహ్యర్కౌ విజయా ముణ్డీ కటుతుమ్బీ జయామృతా (7) ఏతేషాం చ రసేనైవ దినం మర్ద్యం పృథక్పృథక్ । మత్స్య మాహిషమాయూరవారాహ చ్ఛాగపన్నగైః (8) భావనా సప్తదివసాన్కణా క్వాథే దినం దృఢమ్ । ఆర్ద్రకస్యానుపానేన మాక్షికస్యానుపానతః (9) సంనిపాతజ్వరే ఘోరే త్రిదోషే చాహికజ్వరే । పురాణే తరుణే వాపిచాతుర్థికత్రిరాత్రకే (10) అన్యత్ర వివిధే దోషే శమనం చ ప్రణాన్నయేత్ । సహన్యాద్దుర్బలం జాతం చోద్ధరేచ్చ ముహుర్ముహుః (11) అనేన చానుపానేన సర్వరోగహరః పరమ్ । ద్రాక్షా దాడిమఖర్జూరఫలం దేయం చ ఖాదయేత్ (12) దేయముష్ణోదకం చైవ తృష్ణార్తే తు ప్రకల్పయేత్ । యావనాలోదకం చైవ పథ్యం చాపి సమాచరేత్ (13) వాతవ్యాధీనశేషాంశ్చ శ్లేష్మవ్యాధీం స్తథైవ చ । తరుణార్కరసో నామ హ్యపమృత్యుహరః పరమ్ (14)

అ॥ రసభస్మ 1 భా, స్వర్ణభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, రజతభస్మ 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ నాభి 1 భా, లోహభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, శు॥ తాలకము 1 భా, శు॥ మణిశిల 1 భా. శు॥ అరిదలము 1 భా, సద్యఃక్షారము 1 భా, యవక్షారము 1 భా, శు॥ గంధకము 1 భా, శు॥ గౌరీపాషాణము 16 భా, శు॥ ఉల్లిపాషాణము 16 భా, శు॥ దొడ్డిపాషాణము 16 భా, వీనిని మాదీఫలరసముతో ఒకరోజు మర్దించి మాత్రలుచేసి నీడను ఎండించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు కమలాగ్నిచే మూడుజాములు వండి




చల్లారిన పిదప తీసి శు॥ ఇంగిలీక ముక్క భా, త్రామ్రభస్మము 1 భా, శు। నాభి 65 భా, వీనినన్నిటిని ఖల్వమందుంచి మాదీఫలము, సూర్యకాంతము, అవిసె, గుంటగలగ్గర, పర్ణత్రితయము, చేదుపుచ్చ, ఉమ్మెత్త, తులసి, నేపాళము, నేలములగ, వావిలి, జెముడు, జిల్లేడు, గంజాయి, బోడసరము, చేదుఆనప, లెక్కలి, తిప్పతీగె, వీని యొక్క రసములతో ప్రత్యేకముగ నొక్కొక్కరోజు మర్దించి చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, త్రాచుపాము. వీనియొక్క చేదుకట్లతో ఏడురోజులు భావనచేసి పిప్పళ్ళకషాయముతో నొకరోజు దృఢముగ మర్దింపవలయును. వీనిని అల్లపురసము, తేనె, వీనియొక్క అనుపానములతో సేవించినయెడల ఘోరమైన సంనిపాతజ్వరము, త్రిదోషమువలన పుట్టిన ఆహికజ్వరము, పురాణముగాని తరుణము గాని అయిన చాతుర్థికజ్వరము, త్ర్యాహికజ్వరము, ఇతరములైన అనేక రోగములు, వ్రణములు, ఇవి నశించును. ఇది దుర్బలులైన రోగిని నశింపచేయును గావున మాటి మాటికి చూచుచుండవలయును. పై అనుపానములతో సేవించినయెడల సర్వరోగ ములు పోవును, దీనిని సేవించునప్పుడు ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, ఖర్జూరపుపండ్లు, వీనిని తినవలయును. దప్పిక అయినచో వేడినీళ్ళను త్రాగవలయును. యవలగంజిని త్రాగవలయును. పథ్యము చేయవలయును.

ఈ తరుణార్కరసము సమస్త వాతవ్యాధులను, సమస్త శ్లేష్మవ్యాధులను, మృత్యువును నశింపజేయును.

## మహవిషతరుణార్కము

శ్లో॥ రసభూతిం హేమభస్మ మాక్షికస్యాపి భస్మకమ్ । హిఙ్గులం వత్సనాభం చ గౌరీపాషాణమేవ చ (1) ఏతాని సమభాగాని గృహీత్వా చ భిషగ్వరైః । సర్వేషాం త్రిగుణం సర్పవిషం సంగృహ్య యత్నతః (2) మాతులుఙ్గరసేనైవ సర్వం మర్ద్యందినావధి । గులికాంశ్ఛాయయా శుష్కాన్కాచకూప్యాం నివేశయేత్ (3) వాలుకాయన్త్రమధ్యస్థం పాచితం చ ద్వియామకమ్ । స్వాఙ్గశీతల ముద్ధృత్య రసస్యార్ధం చ హిఙ్గులమ్ (4) తావత్సర్ప విషం దత్వా మర్దయేత్పూర్వవద్రసైః । ఏతస్య మాషమాత్రం తు సర్వ రోగేషు యోజయేత్ (5) సంనిపాతే మహాఘోరే నారికేలోదకేన చ । అనేన చానుపానేన దత్వా చైనం మహారసమ్ (6) ద్రాక్షాదాడిమఖర్జూరఫలం దేయం

చ ఖాదయేత్ । యావనాలోదకం చైవ పథ్యం చాపి సమాచరేత్ (7) ఉశీర వ్యజనానాం చ రక్షణీయశ్చ వాయునా । తరుణార్కరసో నామ మృత్యుం జయతి నిశ్చయమ్ (8) ప్రయత్నాద్రోగిణస్సర్వాన్ సంనిపాతేన పీడితాన్ । పూర్వోక్తైరుపచారైశ్చ జీవయేత్తున సంశయః (9)

అ॥ రసభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, మాక్షికభస్మ 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ నాభి 1 భా, గౌరీపాషాణము 1 భా, త్రాచుపామువిషము 18 భా, వీనిని మాదీఫలరసముతో ఒకరోజు మర్దించి మాత్రలుచేసి నీడను ఎండించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు రెండుజాములు వండి చల్లారిన పిదప తీసి శు॥ ఇంగిలీకము ½ భా, గరలము ½ భా, వీనిని కలిపి మాదీఫలరసముతో ఒకరోజు మర్దింపవలయును. దీనిని మాషపరిమితిగ సేవించినచో సమస్త రోగములు నశించును. కొబ్బరికాయనీళ్ళతో సేవించినచో మహాఘోరమైన సంనిపాతము నశించును. ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, ఖర్జూరపుపండ్లు వీనిని తినవలయును. యవలగంజిని త్రాగవలయును, పథ్యము చేయవలయును. వట్టివేళ్ళవిసనకర్రలతో చక్కని గాలి వచ్చునట్లు వీచవలయును. ఈ తరుణార్కరసము మృత్యువును జయించును. జాగ్రత్తగ నిచ్చి పూర్వమునందు చెప్పబడిన యుపచారములను చేసినచో సంనిపాతరోగిని జీవింపజేయును.

## కాసశ్వాసహరరసము

శ్లో॥ రసగన్ధకణాపథ్యాకలిద్రుఫలవాసకాః । భార్గీ చేతి క్రమాద్వృద్ధానేతాన్సబ్బూలజద్రవైః (1) దినానాం వింశతిం పిష్ట్వా కుర్యాత్ క్షౌద్రేణ గోలకాన్ । కర్షప్రమాణమేతస్య తమేకం ప్రాతరుత్థితః (2) దద్యాన్మాసత్రయం క్షుద్రా క్వాథం దశకణాయుతమ్ । పిబేత్తదను కాసాచ్ఛ్వాసాచ్చ పరిముచ్యతే (3)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, పిప్పళ్ళు 3 భా, కరక్కాయ 4 భా, తానికాయ 5 భా, అడ్డసరము 6 భా, గంటుభారంగి 7 భా, వీనిని తుమ్మకషాయముతో ఇరువదిరోజులు మర్దించి తేనెతో కర్ష పరిమితిగ మాత్రలను చేయవలయును. ఉదయమున లేచి ఒక మాత్ర చొప్పున పదిపిప్పళ్ళచూర్ణముతో కూడిన నేలములగ కషాయము యొక్క అనుపానముతో మూడు మాసములు సేవించినచో దగ్గును, ఆ శ్వాసమును నశించును.

## న య నా మృ త ము

శ్లో॥ రసేన్ద్రభుజగౌ తుల్యౌ తయోర్ద్విగుణమఞ్జనమ్ । సూత తుర్యాంశ కర్పూరమఞ్జనం నయనామృతమ్ (1) తిమిరం పటలం కాచం శుక్రమర్మార్జునాని చ । క్రమాత్పథ్యాశినో హన్తి తథాఽన్యానపి దృగ్గదాన్ (2)

అ॥ రసభస్మ 1 భా, సీసభస్మ 1 భా, రసాంజనము 4 భా, పచ్చకర్పూరము ¼ భా, వీనిని అంజనము వేసికొనుచు పథ్యముగ భుజించుచుండినచో తిమిరము, పటలము, కాచము, శుక్రము, అర్మము, అర్జునము మొదలగు నేత్రవ్యాధులు పోవును.

## చం ద్ర ప్ర భా ర స ము

శ్లో॥ శుద్ధసూతం ద్విధా గన్ధం మర్ద్యం నిమ్బమయూరయోః । ద్వయోర్ద్రావైస్సగోమూత్రైర్దినం వాకుచికాద్రవైః (1) ముస్తం పిణ్డీతకం క్షిప్త్వాతం రుద్ధ్వా భూధరే పుటేత్ । స్వాఙ్గశీతం సముద్ధృత్య చూర్ణాద్దశగుణం క్షిపేత్ (2) తథా చ వాకుచీబీజం గోమూత్రే మర్దయేద్దినమ్ । ద్వినిష్కాం వటికాం ఖాదేచ్ఛ్విత్ర కుష్ఠవినాశినీ (3) ఖ్యాతా చన్ద్రప్రభా హ్యేషా కుర్యాత్తక్రేణ భోజనమ్ । కాకోదుమ్బరికామూలం జలైర్ఘృష్టం పిబేదను (4)

అ॥ శు॥ రసము 1 భా, శు॥ గంధకము 2 భా, వీనిని వేపరసము, ఉత్తరేణి రసము, గోమూత్రము, బావంచాలరసము, వీనితో ఒక్కొక్కరోజు మర్దించి తుంగముస్తలు, మ్రంగకాయ, వీని చూర్ణమును కలిపి భూధరపుటము వేసి చల్లారిన పిదప తీసి దానికి పదిరెట్లు బావంచివిత్తులచూర్ణమును కలిపి గోమూత్రముతో ఒక రోజు మర్దించి రెండునిష్కముల ప్రమాణముగ మాత్రలను చేయవలయును. బ్రహ్మమేడి వేళ్ళను ఉదకముతో నూరి ఆ రసముయొక్క అనుపానముతో ఈ చంద్రప్రభారసమును సేవించుచు మజ్జిగఅన్నమును భుజించుచుండినచో శ్వేతకుష్ఠము నశించును.

## వ జ్ర క ర స ము

శ్లో॥ సూక్ష్మచూర్ణం తు మాణ్డూరం గోమూత్రే పాచయేద్దినమ్ । వజ్రవల్లీం సమాంశాం చ చిఞ్చాత్వక్క్షారసంయుతామ్ । భక్షితం చాక్షమాత్రం తు హ్యసాధ్యం శ్వయథుం జయేత్ (1)

అ॥ మెత్తని మండూరచూర్ణము, నల్లేరుచూర్ణము, చింతబెరళ్ళబూడిద, వీనిని సమభాగములుగ గ్రహించి గోమూత్రములో నొకదినము వండి తానికాయ పరిమితిగ సేవించిన యెడల అసాధ్యమైన నంజు హరించును.

## సువర్ణసూర్యావర్తి (వంటయోగము)

శ్లో॥ సువర్ణం రజతం వఙ్గం శశివైక్రాన్తమౌక్తికం । ప్రవాలం నాగకాసీసే గుడూచీసత్త్వమేవ చ (1) టఙ్కణం జాసదాం భూతిం చైక భాగం పృథక్పృథక్ । ద్విభాగం గగనం చైవ సిన్దూరం చ చతుర్దశ (2) ఇత్థం చ వస్తుసంయుక్తం సమం సర్వైశ్చ హిఙ్గులమ్ । తచ్ఛుద్ధవస్తుభూతిం చ ఖల్వమధ్యే తు నిక్షిపేత్ (3) ద్రాక్షామలకఖర్జూరకార్పాస కుసుమద్రవైః। కార్పాసబీజసారేణ జమ్బీరేణవిమర్దయేత్ (4) కపిత్థబిల్వమూలానాం రసేన చ విమర్దయేత్ । ధాన్యకార్ద్రకనారఙ్గజీరకద్రాక్షికారసైః (5) మాదీఫలైరావ తయోర్నాడి మ్యాశ్చణకస్య చ । కాకబిమ్బస్య సారేణ మర్దితం చ ప్రయత్నతః (6) తదౌషధం కుక్కుటాణ్డే బిల్వమూలరసేన చ డోలాయన్త్రే యామ మాత్రం పాచితం చ భిషగ్వరైః (7) స్వాఙ్గశీతం సమాదాయ మృత్తికాలేప మాచరేత్ । పుటపాకం తతః కుర్యాత్కుమారీ రసమర్దితమ్ (8) ముద్గ మాత్రం ప్రదాతవ్య మనుపానవిశేషతః । రాజయక్ష్మ క్షయాన్హన్తి హిక్కాం చ వమనాని చ (9) సర్వపైత్త్యం చ తాపం చ సర్వజ్వరనివారకః । సర్వ వాతోపశమకస్సర్వమేహ వినాశకః (10) తత్తద్రోగానుపానేన సర్వ రోగాన్ని కృన్తయేత్ । తుష్టిపుష్టికరః కాన్తివర్ధనో బలవర్ధకః । గురుసూర్యా వర్తిరసో నామ విష్ణువినిర్మితః (11)

అ॥ సువర్ణభస్మ 1 భా, రజతభస్మ 1 భా, వంగభస్మ 1 భా, పచ్చకర్పూరము 1 భా, వైక్రాంతభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, పగడభస్మ 1 భా, సీసభస్మ 1 భా, అన్నభేదిభస్మ 1 భా, తిప్పసత్తు 1 భా, పొ॥ వెలిగారము 1 భా, సత్తుభస్మ 1 భా, అభ్రకభస్మ 2 భా, రససిందూరము 14 భా, శు॥ ఇంగిలీకము 28 భా, వీనిని ఖల్వ మందుంచి ద్రాక్షపండ్లు, ఉసిరిపండ్లు, ఖర్జూరపుకాయలు, పమిడిప్రత్తిపువ్వులు, పమిడి ప్రత్తిగింజలు, నిమ్మకాయలు, వెలగవేళ్లు, మారేడువేళ్లు, ధనియాలు, అల్లము, నారింజకాయలు, జీలకర్ర, పులిచింత, మాదీఫలములు, దబ్బకాయ, దానిమ్మగింజలు సెనగ, కాకిదొండవిత్తులు, వీనియొక్క రసములతో బాగుగ మర్దించి కోడిగ్రుడ్ల యందుంచి డోలాయంత్రమందు మారేడువేళ్ళకషాయముతో నొకజాము వండి స్వాంగ శీతలమున తీసి పైన మట్టిపూసి పుటపాకముచేసి కలుబందరసముతో మర్దింపవలయును. దీనిని అనుపానవిశేషములతో పెసరగింజ పరిమాణిగ నిచ్చినయెడల రాజయక్ష్మ,

క్షయ, ఎక్కిళ్లు, వాంతులు, సమస్త పైత్యములు, తాపము, సమస్త జ్వరములు, సమస్త వాతములు, సమస్త మేహములు, ఇవి నశించును. ఇది ఆయా రోగములకు తగిన అనుపానములతో సమస్త వ్యాధులను ఖండించును. మనస్సంతోషము, శరీరపుష్టి, కాంతి, బలము, వీనిని కలిగించును. గురుసూర్యావర్తియని చెప్పబడును. పూర్వమందు విష్ణువుచే చెప్పబడినది.

గద్య. ఇతి శ్రీగోదావరీమణ్డలమణ్డనాయమానకోనసీమాన్తర్వర్తి
మోదేకుఱ్ఱుగ్రామవాసినా భూసురాగ్రగణ్యేన శ్రీపాదోపనామ్నా
కౌశికసగోత్రపవిత్రేణ వేఙ్కటేశ్వరపౌత్రేణ సోమయాజి
పుత్రేణ సుబ్బమామ్బాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన
సద్గురుసేవాసమాసాదితసాహితీశబ్దశాస్త్రాయుర్వేదాది
విద్యానిధానేన భిషగ్వరాయుర్వేదభూషణాదిబిరు
దావలీవిరాజమానేనవిద్వత్ప్రభుసభాస్థానసమ్మా
నసమ్భాజమానేన సకలసజ్జనవిధేయేన కృష్ణ
మూర్తిశాస్త్రిణా ప్రణీతే ఆయుర్వేదౌ
షధరత్నాకరే తృతీయగుచ్ఛః
సమాప్తః



ఓమ్

శ్రీరస్తు

ఆరోగ్యమస్తు

ఆంధ్ర తాత్పర్య సహిత

# ఆయుర్వేదౌషధరత్నాకరము

## అనుబద్ధగుచ్ఛము

### బ్రహ్మరంధ్రరసము

శ్లో॥ రసాభ్రగన్ధకాంస్తాలం హిఙ్గులం మరిచం తథా । టఙ్కణం సైన్ధవం చైవ సర్వాంసమమృతం తథా (1) సర్వపాదసమోపేత మహిషీ పిత్తమర్దితమ్ । బ్రహ్మరన్ధ్రే ప్రయోక్తవ్యం సన్న్యాసజ్ఞానసజ్ఞమే (2) సహస్రకలశైః స్నానం లేపనం చందనాదిభిః । ఇక్షుముద్గరసో భోజ్యస్తక్ర భక్తం యథేప్సితమ్ (3)

అ॥ శు॥ రసము, అభ్రకభస్మ, శు॥ గంధకము, శు॥ తాళకము, శు॥ ఇంగిలీకము, మిరియాలు, శు॥ వెలిగారము, సైంధవలవణము, వీనిని ఒక్కొక్క భాగమునను శు॥ నాభిని, వీనియన్నిటితో సమానముగను గ్రహించి వీనిని వీనియన్నిటికిని నాలుగవ వంతు పరిమితిగల బఱ్ఱెపిత్తముతో మర్దింపవలయును. స్మారకముతప్పి మగత గలిగి యున్నప్పుడు దీనిని బ్రహ్మరంధ్రమునందు ప్రయోగించి వెయ్యికలశములతో స్నానమును, మంచిగంధము మొదలగువానితో లేపనమును, చెఱకురసమును, పెసరకట్టును, మజ్జిగతో కూడిన యన్నమును, ఇష్టానుసారముగ ప్రయోగింపవలయును.

### మహాశ్లేష్మాంతకరసము

శ్లో॥ వజ్రమేకం ద్వయం గన్ధం త్రిభాగం సూతకం తథా । చతుర్భాగం చ పిణ్డంచ రౌప్యకం పఞ్చభాగకమ్ (1) ద్విభాగం కాంస్యకం చైవ

హ్యాశ్మసారం తథైవ చ । మ్లేచ్ఛభస్మ ద్విభాగం చ త్రిభాగం చాభ్రకం తథా (2) ఏకభాగం శిలాం చైవ తత్సమం కనకప్రభమ్ । చిద్ఘటం ఖర్పరం హేమయవనేష్టం ద్వయం ద్వయమ్ (3) ప్రవాలం వారిజం కాన్తం త్రిభాగం కిట్టకం పృథక్ । ద్విభాగం చ వరాటం చ సౌభాగ్యం శిఖితుత్థకమ్ (4) ఖల్వమధ్యే వినిక్షిప్య వజ్రవల్ల్యా చ మర్దయేత్ । కాచకూప్యాం వినిక్షిప్య చతుర్యామం తు పాచయేత్ (5) సర్వసామ్యం హిఙ్గులం చ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । చిత్రమూలరసేనైవ వ్యోషేణార్ద్రరసేన వై (6) జమ్బీరస్య రసేనైవ చార్కదుగ్ధేన భావయేత్ । గుఞ్జామాత్రప్రమాణేన హ్యనుపాన విశేషతః (7) సర్వశ్లేష్మహరశ్చైవ ప్లీహపాణ్డ్వా మయాపహః । అజీర్ణం కఫశూలం చ వాతశూలం నివారయేత్ (8) అక్షిరోగహరశ్చైవ సర్వరోగ హరః పరమ్ । శ్లేష్మాన్తకరసో నామ హ్యశ్వినీదేవ నిర్మితః (9)

అ॥ వజ్రభస్మ 1 భా, శు॥ గంధకము 2 భా, శు॥ రసము 3 భా, శు॥ పిండ తాళకము 4 భా, వెండిభస్మ 5 భా, కంచుభస్మ 2 భా, లోహభస్మ 2 భా, తామ్ర భస్మ 2 భా, అభ్రకభస్మ 3 భా, శు॥ మణిశిల 1 భా, శు॥ పత్రతాళకము 1 భా, వంగభస్మ 2 భా, శు॥ కఫరి 2 భా, బంగారుభస్మ 2 భా, సీసభస్మ 2 భా, పగడభస్మ 3 భా, శంఖభస్మ 3 భా, కాంతభస్మ 3 భా, మాండూరభస్మ 3 భా, గవ్వలభస్మ 2 భా, శు॥ వెలిగారము 2 భా, శు॥ మైలతుత్తము 2 భా, ఇటుల వీనిని గ్రహించి ఖల్వమందుంచి నల్లేరురసముతో నూరి కాచకుప్పెయందుంచి నాలుగుజాములు వండి, తీసి ఖల్వ మందుంచి యీ మందుకు సమానముగు శు॥ ఇంగిలీకమును కలిపి చిత్రమూలము, త్రికటుక ములు, అల్లము, నిమ్మకాయలు, వీని యొక్క రసములతోడను జిల్లేడుపాలతోడను భావన చేయవలయును. దీని నొక గురిగింజ పరిమితిగ ననుపానవిశేషములతో సేవించిన యెడల సమస్తమైన శ్లేష్మములు, ప్లీహవ్యాధి, పాండురోగము, అజీర్ణము కఫశూల, వాతశూల, నేత్రవ్యాధులు, ఇవి హరించును. సమస్త వ్యాధులు హరించును. శ్లేష్మాంతకరసమని చెప్పబడును. అశ్వినీదేవతలచే చెప్పబడినది.

## హృద్రోగ చింతామణిరసము

శ్లో॥ పారదం గన్ధకం చాభ్రం లోహం వఙ్గం శిలాజతు । సమం సమం గృహీత్వా చ స్వర్ణం సూతాఙ్ఘ్రిసమ్మితమ్ (1) స్వర్ణస్య ద్విగుణం రౌప్యం సర్వమేకత్ర మర్దయేత్ । చిత్రకస్య ద్రవేణాపి భృఙ్గరాజామ్బునా తతః (2) పార్థస్యాథ కషాయేణ సప్తకృత్వో విభావయేత్ । తతో గుఞ్జా

మితాః కుర్యాద్వటీశ్ఛాయాప్రశోషితాః (3) ఏకైకాం దాపయేదాసాం గోధూమక్వాథ వారిణా । హృద్రోగాన్నిఖిలాన్హన్తి వ్యాధీన్ ఫుప్ఫుసజానపి (4) ప్రమేహాన్వింశతిం శ్వాసన్కాసానపి సుదుస్తరాన్ । బలపుష్టికరో హృద్యో రసశ్చిన్తామణిస్మృతః (5)

అ॥ శు॥ పాదరసము 1 భా, శు॥ గంధకము 1 భా, అభ్రకభస్మ 1 భా, లోహభస్మ 1 భా, వంగభస్మ 1 భా, శు॥ గోమూత్రశిలాజతు 1 భా, సువర్ణభస్మ ¼ భా, రజతభస్మ ¼ భా, వీనిని బాగుగ నూరి చిత్రమూలరసము, గుంటగలగరరసము, మద్దిచెక్క కషాయము, వీనితో నేడేసిసారులు భావనచేసి గురివిందగింజ పరిమితికల మాత్రలను చేసి నీడ నెండించవలయును. వీనిలో నొక్కొక్క మాత్రను గోధుమల కషాయముతో సేవించినయెడల సమస్తమైన హృద్రోగములు, ఊపిరితిత్తుల సంబంధమగు సమస్త వ్యాధులు, ఇరువది ప్రమేహములు, ఆయాసములు, కఠినమైన దగ్గులు, ఇవి హరించును. ఇవి బలమును, పుష్టి, కలిగించును. హృదయమునకు బలము మొదలగు వానిని చేయును. చింతామణియని చెప్పబడును.

## నా రా య ణ క వ చ ము

శ్లో॥ సూతం శుల్బం చ వైక్రాన్తం తారం తీక్ష్ణం చ నాగకమ్ । గగనం హేమభూతిం చ సమభాగాని యోజయేత్ (1) గన్ధకం ద్విగుణం చైవ సర్వమేకత్ర చూర్ణయేత్ । వజ్రవల్లీరసేనైవ దినమేకం విమర్దయేత్ (2) యామద్వయం పచేత్తార్క్ష్యే స్వాఙ్గశీతలముద్ధరేత్ । నారాయణస్య కవచం సర్వక్షయహరం పరమ్ (3)

అ॥ శు॥ పాదరసము 1 భా, తామ్రభస్మ 1 భా, వైక్రాంతభస్మ 1 భా, రజితభస్మ 1 భా, తీక్ష్ణలోహభస్మ 1 భా, సీసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, శు॥ గంధకము 2 భా, వీనినన్నిటిని నూరి నల్లేరు సముతో నొకరోజు మర్దించి తార్క్ష్యపుటమందు రెండు జాములు పక్వముచేసి స్వాంగశీతలమున తీయవలయును. ఈ నారాయణకవచము సమస్తక్షయలను హరింపజేయును.

## అ ష్ట నా రా య ణ క వ చ ము

శ్లో॥ వజ్రం తామ్రం లోహభస్మ రససిన్దూరహిఙ్గులే । ధూతులస్యాపసేనైవ నవవారం తు మర్దయేత్ (1) రసదోషం శ్లేష్మరోగం క్షయాన్సర్వాన్నివారయేత్ । నారాయణస్య కవచం విష్ణుపాదేన నిర్మితమ్ (2)

అ॥ వంగభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, గసగసింగారము, శు॥ ఇంగిలీకము, వీనిని భూతులసిరసముతో తొమ్మిదిరోజులు మర్దింపవలయును. ఇది గసరోగములను, శ్లేష్మవ్యాధులను, సమస్తమగు క్షయలను, నశింపజేయును. ఈ నారాయణకవచము విష్ణువుచే చెప్పబడినది.

## శీతభంజీరసము

శ్లో॥ పారదం రసకం తాలం తుత్థం టఙ్కణగన్ధకౌ । సర్వమేతత్సమం శుద్ధం కారవేల్లీరసైర్దినమ్ (1) మర్దయేత్తేన కల్కేన తామ్రపాత్రోదరం లిపేత్ । అఙ్గుల్యర్ధార్ధమానేన తం పచేత్సికతాహ్వయే (2) యన్త్రే యావత్స్ఫుటన్త్యేవ వ్రీహయస్తస్య పృష్ఠతః । తామ్రపాత్రం సముద్ధృత్య చూర్ణయేన్మరిచైస్సహ (3) శీతభఞ్జీరసో నామ ద్విగుఞ్జో వాతికే జ్వరే । దాతవ్యః పర్ణఖణ్డేన ముహూర్తాన్నాశయేజ్జ్వరమ్ (4)

అ॥ శు॥ రసము, శు॥ కంఘరి, శు॥ తాళకము, శు॥ మైలతుత్థము, శు॥ వెలిగారము, శు॥ గంధకము, వీనిని సమభాగములుగ గ్రహించి కాకరాకురసముతో నొక దినము మర్దించి యాముద్దను రాగిపాత్రలోపల అంగుళముతో నాలుగవంతు పరిమితిగ పూసి యా రాగిపాత్రను వాలుకాయంత్రమునుంచి పైన ధాన్యమును చల్లి యా ధాన్యము పేలువరకు వండవలయును. పిదప తీసి మిరియాలను కూడ కలిపి చూర్ణము చేయవలయును. ఈ శీతభంజీరసమును రెండు గురివిందగింజల పరిమితిగ తమలపాకులతో కూడ నిచ్చినయెడల వాతికజ్వరము పండ్రెండుక్షణములలో నశించును.

## అభ్రకపంచామృతరసము

శ్లో॥ ఘుజఙ్గం త్రపుకం శైలం కాన్తమభ్రకభస్మకమ్ । ఏకద్విత్రిచతుష్పఞ్చభాగమేతద్యథాక్రమమ్ (1) కాశ్మీరం ఘనసారం చ టఙ్కణం హేమమాషికమ్ । సిన్దూరం పూర్వవత్సర్వం ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) ధత్తూర తులసీ భృఙ్గీముణ్డీమర్కటుగోక్షురైః । కుమారీశాల్మరమ్భాగుడూచీభిచ్చ మర్దయేత్ (3) గుఞ్జాద్వయ ప్రమాణేన హ్యనుపానవిశేతః । వింశతిం మేహజాన్ రోగాన్ వింశతిక్షయరోగకాన్ (4) వింశతిశ్లేష్మజాన్ రోగాన్ చతుర్వింశతి పైత్తికాన్ । చతుర్వింశత్యతీసారాన్ గ్రహణీం శూలాకం

తథా (5) మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయేన్నాత్ర సంశయః । స్త్రీణాం ప్రదరరోగం చ యోనిదోషం చ నాశయేత్ (6) గర్భవృద్ధిం వపుష్పుష్టిం శీతవీర్యం చ కారయేత్ । అన్తర్బాహ్యం తథా తాపం హిక్కాం ఛర్దిం చ నాశయేత్ (7) అన్తర్గతిం జ్వరం జీర్ణం సర్వాజీర్ణహరః పరమ్ । అభ్ర పఞ్చామృతాభిఖ్యస్సీతా నాథేన భాషితః (8)

అ॥ సీసభస్మ 1 భా, వంగభస్మ 2 భా, శిలాజతుభస్మ 3 భా, కాంతభస్మ 4 భా, అభ్రకభస్మ 5 భా, కుంకుమపువ్వు 1 భా, పచ్చకర్పూరము 2 భా, శు॥ వెలిగారము 3 భా, హేమమాక్షికభస్మ 4 భా, రససింధూరము 5 భా, ఇటుల వీనిని గ్రహించి ఖల్వమందుంచి ఉమ్మెత్త, తులసి, గుంటగలగర, బోడతరము, దూలగోవిల, పల్లేరు, కలుబందయేరు, చాగంటిదుంప, తిప్పతీగ, వీనియొక్క రసములతో మర్దింపవలయును. దీనిని రెండు గురివిందగింజల పరిమితిగ అనుపాన విశేషములతో సేవించినయెడల ఇరువది మేహములు, ఇరువది క్షయలు, ఇరువది శ్లేష్మవ్యాధులు, ఇరువది నాల్గు పైత్యవ్యాధులు, ఇరువదినాల్గు అతిసారములు, గ్రహణీదోషము, శూల, సమస్తము లగు మూత్రకృచ్ఛ్రములు, స్త్రీల యొక్క ప్రదరరోగము, యోనిదోషము, ఇవి నశించును. ఇది గర్భవృద్ధిని, శరీరపుష్టిని, చలువను, చేయును. అంతస్తాపము, బాహ్యతాపము, ఎక్కిళ్ళు, వాంతి, అంతర్గతజ్వరము, జీర్ణజ్వరము, సమస్తములగు అజీర్ణములు, వీనిని హరింపజేయును. అభ్రకపంచామృతరసమని చెప్పబడును. సీతానాధునిచే చెప్పబడినది.

## శూలాకుఠారము

శ్లో॥ ప్రవాలం పఞ్చలవణం శఙ్ఖం శుక్తివరాటకౌ । పవిత్రం కోలవహ్నీ చ చాకలాస్థి ఘయారకః (1) ద్రుమాణాం క్షారకం గ్రాహ్యం ప్రత్యేకం చైకభాగకమ్ । చిఞ్చాక్షారం సర్వతుల్యం లికుచస్య రసేన వై (2) మర్దయేత్పఞ్చహాత్రం చ హార్ద్రికస్య రసేన చ । ద్వివల్లవటికాం ఖాదేత్సర్వశూలాన్నిహన్తి చ రసశ్శూల కుఠారోఽయం పూజ్యపాదేన భాషితః (3)

అ॥ పగడభస్మ, పంచలవణములు, శంఖభస్మ, ముత్యపుచిప్పలభస్మ, గవ్వలభస్మ, జమ్మిక్షారము, రేగుక్షారము, చిత్రమూలక్షారము, గాడిదగడపక్షారము,

ఉత్తరేణుక్షారము, వీని నొక్కొక భాగముగను వీనియన్నిటితో సమానముగు చింత క్షారమును, గ్రహించి నిమ్మకాయలరసముతోడను, అల్లపురసముతోడను, అయిదేసి రోజులు మర్దించి రెండువల్లములు పరిమితిగల మాత్రలను చేసి సేవించినయెడల సమస్తమగు శూలలు హరించును. ఈశూలకుఠారరసము పూజ్యపాదునిచే చెప్పబడినది.

## శ్లీపదరిలోహము

శ్లో॥ హరీతక్యా విభీతక్యా ధాత్ర్యాశ్చూర్ణం సుచూర్ణతమ్ । షట్తోలక ప్రమాణేన గ్రాహ్యమేవ గుణైషిణా (1) తోలద్వయం కాన్తలోహచూర్ణం తద్వచ్ఛిలాజతు । కృత్వైకత్ర సమస్తేషు త్రిఫలా క్వాథభావనా (2) శ్లీప దాద్యగద ధ్వంసీ సర్వవ్యాధివినాశకః । శ్లీపదారి రితిఖ్యాతో లోహో ముని భిరర్చితః (3)

అ॥ కరక్కాయలు, తానికాయలు, ఉసిరికపప్పు, వీనియొక్క చూర్ణమును ఆరుతులముల పరిమితిగను, కాంతలోహభస్మను రెండుతులముల పరిమితిగను, శిలాజతును రెండుతులముల పరిమితిగను, గ్రహించి త్రిఫలాకషాయముతో భావన చేసి సేవించినయెడల శ్లీపదము (బోదకాలు) మొదలగు వ్యాధులును, సమస్తమగు వ్యాధులును, నశించును. శ్లీపదాదిరసమని చెప్పబడును. మునీశ్వరులచే పొగడబడినది.

## ప్లీహారిరసము

శ్లో॥ పారదం టఙ్కణం గన్ధం విషం వ్యోషం ఫలత్రికమ్ । తోల కస్య సమోపేతం జైపాలం చ తదర్ధకమ్ (1) కింశుకస్య రసేనైవ యామ మాత్రం తు మర్దయేత్ గుఞ్జామాత్రాం వటీం కృత్వా ఛాయాయాం శోష యేత్తతః (2) వటికైకా ప్రదాతవ్యా శృఙ్గవేరరసేన చ । గుదాఙ్కురే గుల్మశూలే ప్లీహశోథే కఫాత్మకే (3) ఉదావర్తే వాతశూలే శ్వాసకాస జ్వరేషు చ । రసః ప్లీహారినామాఽయం కోష్ఠామయవినాశకః । ఆమవాత గదాన్నిహన్యాత్ శ్లేష్మామయవినాశకః (4)

అ॥ శు॥ రసము 1 తు, శు॥ వెలిగారము 1 తు, శు॥ గంధకము 1 తు, శు॥ నాభి 1 తు, త్రికటుకములు 1 తు, త్రిఫలములు 1 తు, శు॥ నేపాళములు 3 తు, ఇటుల వీనిని గ్రహించి మోదుగరసముతో నొకజాము మర్దించి గురివిందగింజ పరిమితిగ

మాత్రలు చేసి నీడను ఎండించి యొక మాత్రను శుంఠిరసముతో సేవించిన యెడల మూలవ్యాధి, గుల్మము, శూల, కఫమువలన కలిగిన ప్లీహవ్యాధి, నంజు, ఉదావర్తము, వాతశూల, అయాసము, దగ్గు, జ్వరము, ఇవి నశించును. ఇది ప్లీహారిరసమని చెప్పబడును. కోష్ఠవ్యాధులను నశింపచేయును. ఆమముచే గాని, వాతముచే గాని, కఫముచే గాని కలిగిన వ్యాధులను నశింపజేయును.

## వైక్రాంతకాంతవల్లభరసము

శ్లో॥ కాన్తం షోడశభాగం చ చతుర్దశమయోరజః । కిట్టం ద్వాదశభాగం చ దశభాగం తు టఙ్కణమ్ (1) దశభాగం శుల్బభూతిం నాగవఙ్గేఽష్టభాగికే । షడ్భాగం త్వభ్రకం చాపి కునటీం చాష్టభాగికామ్ (2) శైలజం చాపి షడ్భాగం ప్రవాలం పఞ్చభాగకమ్ । మౌక్తికం చ చతుర్భాగం వైక్రాన్తం చ త్రిభాగకమ్ (3) సర్వతుల్యం చ సూతం చ గన్ధకం చాపి తత్సమమ్ । సప్తరాత్రం మర్దయేచ్చ పఞ్చకోలకషాయకైః (4) ఆర్ద్రికస్య రసేనైవ త్రిఫలాయా రసేన చ । సిన్దూవార రసేనైవ వహ్నిమూలరసేన చ (5) ఆర్ద్రిమూషోదరే న్యస్య వాలుకాయన్త్రికే క్షిపేత్ । పాచయేత్సప్తరాత్రం తు సంగ్రాహ్యః సూక్ష్మచూర్ణితః (6) సేవితో మధునా యుక్తశ్చానుపాన విశేషతః (7) అర్ధనిష్కప్రమాణేన రాజయక్ష్మనికృన్తకః । పాణ్డురోగం గుల్మరోగం గ్రహణీరోగకం తథా (8) కాసశ్వాసౌ జ్వరం ఛర్దిం ప్లీహోదరమరోచకమ్ । మాన్దాగ్నిం కుష్ఠరోగం చ మూత్రరోగం భగన్దరమ్ (9) వాతశూలే హరేద్వ్యేష్య స్తథా చైవాతిదీపకః । తుష్టిపుష్టికరః కాన్తివర్ధకో బలవర్ధకః (10) కాన్తవల్లభనామాఽయం విష్ణునా నిర్మితః పురా । సర్వపాణ్డు క్షయహరో లోకస్యారోగ్యకారణమ్ (11)

తా॥ కాంతభస్మ 16 భా, ఉక్కుభస్మ 14 భా, మాండూరభస్మ 12 భా, శు॥ వెలిగారము 10 భా, తామ్రభస్మ 10 భా, సీసభస్మ 8 భా, వంగభస్మ 8 భా, అభ్రకభస్మ 6 భా, శు॥ మణిశిల 8 భా, శిలాజితుభస్మ 6 భా, పగడపుభస్మ 5 భా, ముత్యపుభస్మ 4 భా, వైక్రాంతభస్మ 3 భా, శు॥ రసము 110 భా, శు॥ గంధకము 110 భా, ఇటుల వీనిని గ్రహించి పంచకోలములు, అల్లము, త్రిఫలములు, వావిలి, చిత్రమూలము, వీనియొక్క రసములతో వేఁడేసిరోజులు మర్దించి ఆర్ద్రిమూసయందుంచి వాలుకాయంత్ర

మందు ఏడురోజులు వండి తీసి మెత్తగ నూరి అర్ధనిష్కపరిమితిగ తేనెతో కలిపి అనుపానవిశేషములతో సేవించినయెడల రాజయక్ష్మ, పాండురోగము, గుల్మము, గ్రహణీరోగము, దగ్గు, ఆయాసము, జ్వరము, వాంతి, ప్లీహోదరము, అరోచకము, అగ్నిమాంద్యము, కుష్ఠము, మూత్రరోగము, భగందరము, వాతవ్యాధి, శూల, ఈ వ్యాధులు హరించును. వీర్యవృద్ధి, అధికమగు జాఠరదీప్తి, మనస్సంతోషము, సరీరపుష్టి, శరీరకాంతి, బలము, వీనిన కలిగించును. ఈ కాంతవల్లభరసము విష్ణువుచే పూర్వకాలమందు చెప్పబడినది. సమస్తములగు పాండురోగములను, క్షయలను, హరించును. లోకమున కారోగ్యమును కలిగించును.

## కిన్నరకంఠరసము

శ్లో॥ రసం గన్ధకమభ్రం చ మాక్షికం లోహమేవ చ । కర్షప్రమాణం సంగృహ్య వైక్రాన్తం రసపాదికమ్ (1) వైక్రాన్తార్ధం తథా హేమ రౌప్యం హేమచతుర్గుణమ్ । వాసాయాశ్చ తథా భార్గ్యా బృహత్యోరార్ద్రికస్య చ (2) స్వరసేన సరస్వత్యా భావయిత్వా పృథక్పృథక్ । రక్తిద్వయమితాః కుర్యాద్వటీశ్ఛాయాప్రశోషితాః (3) స్వరభేదానశేషాంశ్చ కాసాన్ శ్వాసాంశ్చదారుణాన్ । నిఖిలాన్కఫజాన్వ్యాధీన్వాతశ్లేష్మసముద్భవాన్ (4) హన్యాత్కిన్నర కణ్ఠాఖ్యో రసోఽసౌరుద్రనిర్మితః । కిన్నరస్యేవ కణ్ఠస్య స్వరోఽస్య ప్రాసనాద్భవేత్ (5)

అ॥ శు॥ రసము 1 కర్షము, శు॥ గంధకము 1 క, అభ్రకభస్మ 1 క, మాక్షికభస్మ 1 క, లోహభస్మ 1 క, వైక్రాంతభస్మ $\frac{1}{4}$ క, సువర్ణభస్మ $\frac{1}{8}$ క, రజతభస్మ $\frac{1}{2}$ క, వీనిని అడ్డసరము, గంటుభారంగి, చిననేలములగ, పెదనేలములగ, అల్లము, సరస్వతీయాకు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ భావనచేసి రెండురక్తికల పరిమితికల మాత్రలను జేసి నీడ నెండింపవలయును. ఇది సమస్తమైన స్వరభేదములు దగ్గులు, దారుణమైన అయాసములు, సమస్తమైన శ్లేష్మవ్యాధులు, వాతశ్లేష్మములచే జనించిన వ్యాధులు, వీనిని హరింపజేయును. కిన్నరకంఠరసమని చెప్పబడును. ఈశ్వరునిచే చెప్పబడినది. దీనిని సేవించుటచే కిన్నరకంఠస్వరముతో సమానమగు కంఠస్వరము కలుగును.

## ద్విగుణసిందూరము

వ॥ శు॥ ఇంగిలీకము 10 భా, శు॥ గంధకము 20 భా, వీనిని కలుబంధరసముతో మూడురోజులు మర్దించి వాలుకాయంత్రమందు 2-3 రోజులు వండవలయును. ఎర్రగ

సిందూరించును. దీనిని తగిన అనుపానముతో రెండుగురివిందగింజల పరిమితిగ మేహ వ్యాధులు, జీర్ణించిన సవాయివ్యాధులు, రక్తదోషములు, శుక్లనష్టము, శరీరము నెచ్చగనుండుట, దగ్గు, మొదలగు వ్యాధుల నాశం చెయ్యవలయును.

## పంచాననరసము

శ్లో॥ పారదాంశకతుత్థం చ గన్ధం జైపాలపిప్పలీః । అరగ్వధఫలా న్మజ్జాం వజ్రీక్షీరేణ భావయేత్ (1) ధాత్రీరసయుతం ఖాదేద్రక్తగుల్మ ప్రశాన్తయే । చిఞ్చాదలరసం చాను పథ్యం దధ్యోదనం హితమ్ (2)

అ॥ శు॥ రసము, శు॥ మైలతుత్థము, శు॥ గంధకము, శు॥ నేపాళములు, పిప్పళ్ళు, రేలగుజ్జు, వీనిని సమభాగములుగ గ్రహించి జెముడుపాలతో భావన చేసి ఉసిరిక పండ్లరసముతో కూడ పుచ్చుకొని వెంటనే చింతాకులరసమును త్రాగి పెరుగుతో కూడిన యన్నమును తినినయెడల రక్తగుల్మము నశించును.

## శిలావంగేశ్వరరసము

శ్లో॥ త్రపుకం దశభాగం చ తత్సమం తు శిలాజతు । పారదం దశ భాగం చ తత్సమం గన్ధకం తథా (1) కుమార్యాశ్చ రసేనైవ మర్దయేదేక రాత్రికమ్ । వాలుకాయాం కాచకుమ్భే త్రిదినం పాచయేత్తథా (2) స్వాఙ్గ శీతం విచూర్ణ్యాథ ద్వివల్లం సేవయేత్తథా । తనుపుష్టిం వర్ధయేచ్చ శుక్ల దోషం నిహన్తి చ (3) త్రివిధం మూత్రకృచ్ఛ్రం చ బహుమూత్రం చ నాశయేత్ । శిలావఙ్గేశ్వరోనామ రసో రుద్రేణ భాషితః (4)

అ॥ వంగభస్మ 10 భా, కర్పూరశిలాజతుభస్మ 10 భా, శు॥ పాదరసము 10 భా, శు॥ గంధకము 10 భా, వీనిని కలబందరసముతో నొకరోజు మర్దించి కాచకుప్పె యందుంచి వాలుకాయంత్రమందు మూడురోజులు వండి స్వాంగశీతలమున తీసి చూర్ణము చేయవలయును. దీనిని రెండువల్లముల పరిమితిగ సేవించినయెడల శరీరపుష్టి కలుగును. శుక్లదోషములు, మూడువిధములగు మూత్రకృచ్ఛ్రము, బహుమూత్రము, ఇవి నశించును. ఇది శిలావంగేశ్వరమని చెప్పబడును. ఈశ్వరునిచే చెప్పబడినది.

## తారకేశ్వరరసము

శ్లో॥ శుద్ధం సూతం సమం గన్ధం లోహం వఙ్గం మృతాభ్రకమ్ । దురాలభాం యవక్షారం బీజం గోక్షురజం శివామ్ (1) సమాంశం భావయేత్స

ర్వం కూష్మాణ్డఫలవారిణా । పఞ్చతృణభవక్వాథే రసే గోక్షురజే తథా (2) సంపిష్య వటికా కార్యా ద్విగుఞ్జాఫల మానతః । మధునా మిశ్రితం లేహ్యం మూత్రకృచ్ఛ్రవినాశకమ్ (3) ఉదుమ్బరఫలం పక్వం చూర్ణితం కర్షమాత్రకమ్ । లేహయేన్మధునా సార్ధ మనుపానం సుఖావహమ్ । అజాక్షీరం భవేత్పథ్యం శర్కరేక్షురసో హితః (4)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, లోహభస్మ, వంగభస్మ, అభ్రకభస్మ, దూలగొండి, యవక్షారము, పల్లేరుకాయలు, కరక్కాయ, వీనిని సమభాగములుగ గ్రహించి బూడిదగుమ్మడికాయరసమందును, తృణపంచమూలము యొక్క కషాయమందును, పల్లేరురసమందును, భావనచేసి నూరి రెండుగురివిందగింజల పరిమితిగల మాత్రలనుచేసి తేనెతో కలిపి పుచ్చుకొని వెంటనే మేడిపండుచూర్ణమును కర్షపరిమితిగ తేనెతో నాకవలయును. మేకపాలను, పంచదారను, చెఱుకురసమును, సేవింపవలయును. ఇట్లు చేసినయెడల మూత్రకృచ్ఛ్రము నశించును.

## స్వర్ణవంగము

శ్లో॥ ప్రక్షిప్య భాజనే వఙ్గ మాయసే వాపి మృణ్మయే । విద్రుతే వహ్ని తాపేన తస్మిం స్తన్మానకం రసమ్ (1) క్షిప్త్వా సంచూర్ణయేత్తత్ర నవసారం చ గన్ధకమ్ । తనువాసోమృదాలిప్త కాచకూప్యాం నిధాయ చ (2) తత్సర్వం సికతాయన్త్రే పచేద్యామచతుష్టయమ్ । పాకాత్సఞ్జాయతే చిత్రం కీర్ణం హేమకణైరివ (3) రమణీయతరం స్వర్ణవఙ్గం నామ రసాయనమ్ । బల్యం మేహహరం కాన్తి మేధావీర్యాగ్నివర్ధకమ్ (4)

అ॥ శు॥ వంగము 1 భా, ఇనుపపాత్రయందు గాని మట్టిపాత్రయందు గాని యుంచి కరగించి యందు శు॥ పాదరసము 1 భా, ఉంచి పిదప ఖల్వమందుంచి నవాసారము 1 భా శు॥ గంధకము 1 భా. వీనిని వేసి నూరి పలుచని మట్టిగుడ్డలచే చుట్టబడిన కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు నాలుగుజాములు వండవలయును. పాకమైన పిదప బంగారపుకణములతో వ్యాప్తమైనట్లు రమణీయముగ నుండును. స్వర్ణవంగమని చెప్పబడును. ఇది రసాయనము. బలమును కలిగించును. మేహములను హరించును. శరీరకాంతి, బుద్ధిబలము, శుక్లము, జాఠరాగ్ని వీనిని వృద్ధి నొందించును.

## సంనిపాతభైరవరసము (వంటయోగము)

శ్లో॥ శుద్ధసూతం తథా గన్ధం టఙ్కణం తామ్రభస్మకమ్ । దరదం తారకం చైవ తీక్ష్ణలోహం మనశ్శిలామ్ (1) ద్వితుత్థం కాన్తలోహాభ్రే తాలకం నాగవఙ్గకే । నీలాఞ్జనం చ సర్వాణి ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) జమ్బీరఫలసారేణ చిత్రమూలరసేన చ । మర్దయేత్త్రిదినం చైవ గుఞ్జాం శుష్కాం ప్రమాణతః (3) కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాయన్త్రమధ్యతః । త్రియామం పాచయేద్వహ్నౌ శాఙ్గశీతలముద్ధరేత్ (4) ఖల్వమధ్యే వినిక్షిప్య ద్విభాగం వత్సనాభకమ్ । మర్దయేత్పూర్వనీరాభ్యాం ద్వియామం మర్దితం తథా (5) గుఞ్జామాత్రం ప్రదాతవ్యమనుపానవిశేషతః । సంనిపాతే మహాఘోరే విషమజ్వర ఏవ చ (6) సర్వానపి చ రోగాన్వై సంనిపాతకులాన్ హరేత్ । భైరవస్సంనిపాతానాం శఙ్కరేణ ప్రకల్పితః (7)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ వెలిగారము, తామ్రభస్మ శు॥ ఇంగిలీకము, వెండిభస్మ, ఉక్కుభస్మ, శు॥ మణిశిల, శు॥ మైలతుత్థము, శు॥ పాలతుత్థము, కాంతభస్మ, అభ్రకభస్మ, శు॥ తాళకము, సీసభస్మ, వంగభస్మ, శు॥ నీలాంజనము, వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమందుంచి నిమ్మకాయలరసముతోడను, చిత్రమూలరసముతోడను, మూడురోజులు మర్దించి గురివిందగింజలంత మాత్రలను చేసి యెండించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడుజాములు వండి చల్లారిన పిదప తీసి ఖల్వమందుంచి రెండుభాగముల శు॥ నాభిని కలిపి నిమ్మకాయలరసముతోడను, చిత్రమూలరసముతోడను. రెండుజాములు నూరవలయును. దీనిని గురివిందగింజపరిమితిగ అనుపానవిశేషములతో దారుణమైన సంనిపాతజ్వరమందును విషజ్వరమందును ఇయ్యవలయును. ఇది మూడుదోషములవలనను కలిగిన సమస్త వ్యాధులను హరించును. సంనిపాతములను నశింపజేయును. శంకరునిచే చెప్పబడినది.

## హేమనాథరసము

శ్లో॥ సూతం గన్ధం హేమ తాప్యం ప్రత్యేకం కోలసమ్మితమ్ । అయశ్చన్ద్రిం ప్రవాలం చ వఙ్గం చార్ధం వినిక్షిపేత్ (1) ఫణిఫేనస్యతోయేన కదలీ కుసుమేన చ । ఉదుమ్బరరసేనాపి సప్తధా పరిమర్దయేత్ (2) వల్లమాత్రాం వటీం ఖాదేద్యథా వ్యాధ్యనుపానతః । ప్రమేహాన్వింశతిం

హన్తి బహుమూత్రం సుదారుణమ్ (3) సోమరోగం క్షయం చైవ శ్వాసం కాసమురః క్షతమ్ । హేమనాథరసో నామ్నా కృష్ణాత్రేయేణ భాషితః (4) రసగన్ధక యోస్థానే షడ్గుణో బలిజారితః । ప్రయోజితో భవేన్నౄణాం విశేషఫలదాయకః (5)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, సువర్ణభస్మ, మౌక్తికభస్మ, వీని నొక్కొక్క కోలపరిమితిగను లోహభస్మ, వెండిభస్మ, పగడభస్మ, వంగభస్మ, వీని నొక్కొక్క యర్ధకోలపరిమితిగను గ్రహించి నల్లమందు, అరటిపువ్వు, మేడి, వీనియొక్క రసములతో నేడేసిరోజులు మర్దించి వల్లపరిమితిగ మాత్రలను చేసి వ్యాధికి తగిన యనుపానముతో పుచ్చుకొనినయెడల ఇరువదివిధములగు ప్రమేహములు, దారుణమైన బహుమూత్రము, సోమరోగము, క్షయ, శ్వాస, కాస, ఉరఃక్షతము, ఇవి నశించును. హేమనాథరసమనెడి పేరుతో కృష్ణాత్రేయునిచే చెప్పబడినది. రసగంధకములకు బదులుగ, రసమునకు ఆరురెట్లు గంధకమును వేసికొని వండుకొనిన షడ్గుణమును వేసికొనినయెడల అధికమగు గుణము నిచ్చును.

## రసమాణిక్యము

శ్లో॥ తాలకం వంశపత్రాఖ్యం కూష్మాణ్డసలిలే క్షిపేత్ । సప్తధా వా త్రిధావాపి దధ్నాఒమ్లేన తథైవ చ (1) శోధయిత్వా పునశ్శుష్కం చూర్ణయేత్తణులాకృతిమ్ । తతశ్శరావకేయన్త్రే స్థాపయేత్కుశలో భిషక్ (2) బదరీపల్లవోత్థేన లేపనం కారయేత్తతః । అరుణాభమథఃపాత్రం తావజ్జ్వాలాః ప్రదాపయేత్ (3) స్వాఙ్గశీతం చ గృహ్ణీయాన్మాణిక్యాభో భవేద్రసః । ఘృతక్షౌద్రేణ సంమర్ద్యఖాదయే ద్రక్తికాద్వయమ్ (4) సంపూజ్య దేవదేవేశం కుష్ఠరోగాద్విముచ్యతే । స్ఫుటితం గలితం కుష్ఠం వాతరక్తం భగన్దరమ్ (5) నాడీ వ్రణం వ్రణం దుష్టముపదంశం విచర్చికామ్ నాసాస్యసమ్భవాన్ రోగాన్ క్షయాన్హన్యాత్సుదారుణాన్ । పుణ్డరీకం చ చర్మాఖ్యం విస్ఫోటం మణ్డలం తథా (6)

అ॥ పత్రతాళకమును బూడిదగుమ్మడికాయరసమునందును, పుల్లని పెరుగునందును ఏడురోజులు గాని, మూడురోజులు గాని ఉంచవలయును. శుద్ధమగును. దీనిని ఎండించి

బియ్యపుగింజలవలె చూర్ణముచేసి పెద్దమూకళ్ళయందుంచి రేగుచిగుళ్ళముద్దతో పైన పూసి పొయ్యిమీదనుంచి క్రిందపాత్ర ఎఱ్ఱగనగువరకు మంటను వేయవలయును. చల్లారిన పిదప తీయవలయును. మాణిక్యపురంగుకలదిగ నుండును. దీనిని నూరి నెయ్యి, తేనె, వీనితో రెండురక్తికలపరిమితిగ నియ్యవలయును. ఈశ్వరుని పూజింప వలయును. ఇట్లు చేసినచో కుష్ఠరోగమునుండి విముక్తుడగును. బ్రద్దలగుచున్నట్టియు, జారుచున్నట్టియు, కుష్ఠము నశించును. వాతరక్తము, భగందరము, నాడీవ్రణము, దుష్టమైనవ్రణము, ఉపదంశము (కొరుకువ్యాధి), విచర్చికాకుష్ఠము, నాసికావ్యాధులు ముఖవ్యాధులు, దారుణమైన క్షయలు, పుండరీకకుష్ఠము, గజచర్మకుష్ఠము, విస్ఫోట కుష్ఠము, మండలకుష్ఠము, ఇవి నశించును.

## శ్వాసకాలేశ్వరరసము

శ్లో॥ మృతం వజ్రం మృతం లోహం మృతార్కం మృతమభ్రకమ్ । శుద్ధసూతం తథా గన్ధం మాక్షికం హిఙ్గులం విషమ్ (1) జాతీఫలం లవఙ్గం చ త్వగేలానాగకేసరాన్ । ఉన్మత్తకస్య బీజానీ జైపాలం రాత్రిదుర్లభే (2) ఏతాని సమభాగాని మరిచం హరనేత్రకమ్ । సర్వమ్ తచ్చ క్షిపేత్ఖల్వే లోహదణ్డేన మర్దయేత్ (3) తావచ్చూర్ణీకృతం ధీమాన్యావత్సూతో న దృశ్యతే । శక్రాస నస్య స్వరసైర్భావనా శ్చైకవింశతిః (4) ద్విగుఞ్జా చోత్తమా మాత్రాహ్యార్ద్రకస్వరసైర్యుతా । తదర్ధా బాలవృద్ధేషు పథ్యం దేయం తదుచ్యతే (5) పఞ్చశ్వాసాన్ క్షయం కాసం యక్ష్మరాజం నిహన్తి చ । శ్వాసకాలేశ్వరో నామలోకానామపి దుర్లభః (6)

అ॥ వంగభస్మ 1 భా, లోహభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, శు॥ రసము 1 భా, శు॥ గంధకము 1 భా, స్వర్ణమాక్షికభస్మ 1 భా, శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ నాభి 1 భా, జాజికాయలు 1 భా, లవంగములు 1 భా, దాసెనచెక్క 1 భా, ఏలక్కాయలు 1 భా, నాగకేసరములు 1 భా, శు॥ ఉమ్మెత్తవిత్తులు 1 భా, శు॥ నేపాళపువిత్తులు 1 భా, పసుపు 1 భా, కచ్చూరములు 1 భా, మిరియాలు 3 భా, వీనినన్నిటిని ఖల్వమందుంచి లోహదండముతో పాదరసము బాగుగ కలియువరకు నూరి కొడిశపాలరసముతో ఇరువదియొక పర్యాయములు భావనచేయవలయును. దీనిని రెండుగురివిందగింజల పరిమితిగ సేవించినయెడల ఉత్తమమాత్రగ నుండును. అల్లపురస ముతో ప్రయోగించవలయును. బాలురకును వృద్ధులకును ఒక గురివిందగింజ పరిమితిగ

నియ్యవలయును. ఇది అయిదువిధములైన శ్వాసలు, క్షయ, కాస, రాజయక్ష్మ, వీనిని నశింపజేయును. శ్వాసకాశేశ్వరమని ప్రసిద్ధమైనది. చిక్కిలి దుర్లభమైనది.

## కం ద ర్ప ర స ము

శ్లో॥ రసం గన్ధం ప్రవాలం చ కాఞ్చనం గిరిమృత్తికామ్ । వైక్రాన్తం రజతం శఙ్ఖం మౌక్తికం చ సమం సమమ్ (1) న్యగ్రోధస్యకషాయేణ భావ యిత్వా చ సప్తధా వల్లోన్మానాం వటీం కృత్వా త్రిఫలాక్వాథవారిణా (2) సురప్రియ స్యార్జునస్య క్వాథేనాఽథామ్బు సాఽపి వా । ఔపసర్గిక మేహస్య శాన్త్యర్థం వినియోజయేత్ (3)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, పగడపుభస్మ, సువర్ణభస్మ, గైరికము, వైక్రాంతభస్మ, వెండిభస్మ, శంఖభస్మ, ముత్యభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి మఱ్ఱి కషాయముతో ఏడురోజులు భావనచేసి వల్లపరిమితిగల మాత్రలనుచేసి త్రిఫలములయొక్క గాని, దేవదారుయొక్క గాని, మద్దియొక్క గాని, తుమ్మయొక్క గాని కషాయముతో పుచ్చుకొనిన యెడల అంటుమేహము, (పచ్చసెగ మొదలగునవి) నశించును.

## దీ ప నా గ్ని కు మా ర ము (మందాగ్నికుమారము)

శ్లో॥ సమానౌ గన్ధకరసౌ తదర్ధం వత్సనాభకమ్ । రసస్య తామ్రభస్మాపి సమం సంచూర్ణ్య మర్దయేత్ (1) హంసపాదీరసేనాథ కాచకూప్యాం వినిక్షిపేత్। వాలుకాయన్త్రవిధినా త్రియామం పాచయేద్బుధః (2) రసార్ధ మమృతం క్షిప్త్వా పునస్సంచూర్ణ్య దాపయేత్ । వహ్ని త్రికటుసిన్ధూత్థయుక్తేనార్ద్రకవారిణా (3) గుఞ్జామాత్రం ప్రదాతవ్యం మన్దాగ్నౌ సంనిపాతకే ధనుర్వాతేఽప్యజీర్ణేషు శూలేషు క్షయకాసయోః । దీపనాగ్ని కుమారాఖ్యో రసోఽయం ప్లీహగుల్మజిత్ (4)

అ॥ శు॥ గంధకము, శు॥ రసము, శు॥ నాభి, తామ్రభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి హంసపాదిరసముతో మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడుజాములు వండి తీసి రసములో సగముభాగము శు॥ నాభిని కలిపి నూరవలయును. దీనిని చిత్రమూలము, త్రికటుకములు, సైంధవలవణము, వీనియొక్క

చూర్ణముతో కూడిన అల్లపురసముతో గురివిందగింజపరిమితిగ అగ్నిమాంద్యము, సంనిపాతము, ధనుర్వాతము, అజీర్ణము, శూల, క్షయ, దగ్గు, ప్లీహవ్యాధి, గుల్మము, ఈ వ్యాధులయందు నియ్యవలయును. ఇది దీపనాగ్నికుమారరసమని చెప్పబడును.

## కామధేనురసము

శ్లో॥ సిన్దూరమభ్రకం నాగం చ కర్పూరం హేమమాక్షికమ్ । ఖర్పరం రజతం చాపి మర్దయేత్కమలామ్భసా (1) తతో గుఞ్జామితాః కృత్వా వటీచ్ఛాయా ప్రశోషితాః । ఏకైకాం దాపయేదాసాం కసేరుకరసేన చ (2) ప్రమేహాన్వింశతిం హన్తి శుక్రమేహం విశేషతః । జ్వరం జీర్ణం చ యక్ష్మాణం కామధేన్వభిధో రసః (3)

అ॥ రససింధూరము, అభ్రకభస్మ, సీసభస్మ, పచ్చకర్పూరము, హేమమాక్షికభస్మ, శు॥ కర్పరి, వెండిభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి పద్మములరసముతో మర్దించి గురివిందగింజపరిమితిగల మాత్రలను చేసి నీడయందు ఎండించి ఒక్కొక్క మాత్రను తుంగగడ్డలరసముతో నియ్యవలయును. ఇరువదివిధములగు ప్రమేహములను నశింపచేయును. శుక్రస్రావమును ప్రధానముగ నశింపచేయును. జీర్ణజ్వరమును, రాజయక్ష్మను నశింపచేయును. కామధేనురసమని చెప్పబడును.

## శ్వేతారిరసము

శ్లో॥ శుద్ధసూతం సమం గన్ధం త్రిఫలాం భృఙ్గవాకుచీమ్ । భల్లాతకం తిలం కృష్ణం నిమ్బబీజం సమం సమమ్ (1) మర్దయేత్ భృఙ్గజద్రావైః శోష్యం పేష్యం పునః పునః । ఇత్థం కుర్యాత్త్రిసప్తాహం రసః శ్వేతారికో భవేత్ । మధ్వాజ్యైర్మాషమాత్రం తు ఖాదేచ్ఛ్వితం వినాశయేత్ (2)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, త్రిఫలములు, గుంటగలగర, బావంచాలు, శు॥ జీడిగింజలు, నల్లనువ్వులు, వేపగింజలు, వీనిని సమభాగములుగ గ్రహించి గుంటగలగర రసముతో నూరి ఎండింపవలయును. మరల నూరి ఎండింపవలయును. ఇట్లు ఇరువదియొకరోజు నూరుచు ఎండించుచుండవలయును. శ్వేతారిరసమని చెప్పబడును. దీనిని మాషపరిమితిగ తేనె, నెయ్యి, వీనితో సేవించినయెడల శ్వేతకుష్ఠము (బొల్లి) నశించును.

## శ్వా స కు ఠా ర ర స ము

శ్లో॥ రసో గన్ధో విషం చాపి టఙ్కణశ్చ మనశ్శిలా । ఏతానికర్ష మాత్రాణి మరిచం చాష్టకర్షకమ్ (1) కటుత్రయం కర్ష యుగ్మం పృథ గత్ర వినిక్షిపేత్ । రసశ్వాసకుఠారోఽయం సర్వశ్వాసనివారకః (2)

అ॥ శు॥ పాదరసము, 1 కర్షము, శు॥ గంధకము 1 క, శు॥ నాభి 1 క, శు॥ వెలిగారము 1 క, శు॥ మణిశిల 1 క, మిరియాలు 8 క, త్రికటుకములు 2 క, ఇట్లు వీనిని గ్రహింపవలయును. ఇది శ్వాసకుఠారమనబడును. సమస్త శ్వాసలను నివారింప జేయును.

## ఉ ద య భా స్క ర ర స ము

శ్లో॥ గన్ధకేన హతం తామ్రం దశభాగం సముద్ధరేత్ । ఊషణం పఞ్చభాగం స్యాదమృతం చ ద్విభాగకమ్ (1) దాతవ్యం కుష్ఠినే సమ్యగను పానస్య యోగతః । గలితే స్ఫుటితే చైవ విపుటే మణ్డలే తథా । విచర్చికా దద్రుపామా సర్వకుష్ఠప్రశాన్తయే (2)

అ॥ గంధకముతో చేయబడిన తామ్రభస్మ 10 భా, మిరియాలు 5 భా, శు॥ నాభి 2 భా, ఇటుల వీని నేకముగ గ్రహించి తగిన యనుపానముతో నిచ్చినయెడల మాంసము జారుచున్నట్టియు, చర్మము పగిలినట్టియు, బాగుగ వ్యాపించినట్టియు, కుష్ఠము నశించును. మండలము, విచర్చిక, దద్రు, పామ, మొదలగు సమస్త కుష్ఠము లును నశించును.

## సిం దూ ర భూ ష ణ ము

శ్లో॥ దరదం విద్రుమమభ్రకాన్తశిలజం వఙ్గం చ గన్ధం తథా । సౌభాగ్యం సమభాగయుక్తకథితం సర్వైస్సమం సిన్దురమ్ । సర్వం మర్దయ హంసపాదిసురసైర్గుఞ్జైకమాత్రాన్వితం । ప్రఖ్యాతం భువిసోమనాథకథితం సిన్దూరభూషాఖ్యకమ్ (1)

అ॥ శు॥ ఇంగిలీకము, పగడభస్మ, అభ్రకభస్మ, కాంతభస్మ, శిలాజతుభస్మ, వంగభస్మ, శు॥ గంధకము, శు॥ వెలిగారము, వీనినిక్క సమభాగములుగను రససిందూర మును, వీనియన్నిటితో సమానముగను గ్రహించి హంసపాదిరసముతో మర్దించి యొక

గురివిందగింజ పరిమితిగ సేవింపవలయును. ఈ సిందూరభూషణము సోమనాథునిచే చెప్పబడినది.

## మహాతాలకేశ్వరరసము

శ్లో॥ సంమర్ద్య తాలకం శుష్కం వంశపత్రాఖ్యముచ్చకైః । కూష్మాణ్డనీరైః సంభావ్య త్రిదినం శోషయేత్పునః (1) ఘృతకన్యా ద్రవైర్భూయో భావయేచ్చ దినత్రయమ్ । సంమర్ద్య కాఞ్జికేనైవ దధ్నామ్లేన విమర్దయేత్ (2) సంమర్ద్య చూర్ణం సలిలే రసే పౌనర్నవేపునః । త్రిదినం మర్దయిత్వా తు కారయేత్ ఖటికాకృతిమ్ (3) స్థాల్యాం దృఢతరాయాం తు పలాశక్షార సఞ్చయమ్ । ఉపర్యధశ్చతాలస్య క్షారం దత్వాసరావకైః (4) పిధాయ లేపయేద్యత్నా త్పూరయేత్ క్షారసఞ్చయమ్ పునా రుద్ధం శరావేణ లేపయేత్తద్దృఢం పునః (5) ద్వాత్రింశద్యామపర్యన్తం వహ్నిజ్వాలాం ప్రదాపయేత్ । ఏవం సిద్ధేన తాలేన గన్ధతుల్యేన మేలయేత్ (6) ద్వయోస్తుల్యం జీర్ణతామ్రం వాలుకాయన్త్రగం పచేత్ । అయం తాలేశ్వరో నామరసః పరమదుర్లభః (7) హన్త్యష్టాదశ కుష్ఠాని వాతశోణితనాశకః । రక్తమణ్డల మత్యుగ్రం స్ఫుటితం గలితం తథా (8) బహురూపం సర్వజాతం నాశయేదవికల్పతః । దుష్టవ్రణం విసర్పం చ త్వగ్దోషం చ వినాశయేత్ । దృష్టవారసహస్రం చ రోగవారణకేసరి (9)

అ॥ శు॥ పత్రతాళకమును పొడిగనే బాగుగ నూరి బూడిదగుమ్మడికాయ రసముతో మూడురోజులు భావనచేసి మరల ఎండించి నేతితోడను, కలుబందరసము తోడను, మూడురోజులు భావనచేసి కాంజికముతోడను, పుల్లని పెరుగుతోడను, నూరి చూర్ణించి నీటితో నూరి గలిజేరురసముతో మూడురోజులు నూరి గుండ్రనిబిళ్లను చేయవలయును. ఒక మూకుడుయందు మోదుగక్షారమును పోసి యందుపై ఆ తాళకపుబిళ్లను ఉంచి పైనకూడ క్షారమును పోసి మూకుడును బోర్లించి బాగుగ సంధిబంధనమును చేయవలయును. ఒక గట్టికుండయందు మోదుగక్షారమును పోసి యందుపై ఈ మూకుడు సంపుటమును పెట్టి పైన నిండుగ క్షారమును పోసి కుండపైన మూకుడు మూసి గట్టిగ సంధిబంధనముచేసి ముప్పదిరెండుజాములు వండవలయును. ఇట్లు వండబడిన తాళకము 1 భా, శు॥ గంధకము 1 భా, తామ్రభస్మ 2 భా, ఇటుల వీనిని గ్రహించి వాలుకాయంత్రమునందు వండవలయును. ఇది తాళేశ్వరరసమని చెప్ప

బడును. మిక్కిలి దుర్లభమైనది. ఇది పదునెనిమిది కుష్ఠములను, వాతరక్తమును, నశింపచేయును. ఎట్టిని దద్దుళ్లు కలిగినట్టియు, బాధకమైనట్టియు, పగుళ్లుకలిగినట్టియు, మాంసమును స్రవించుచున్నట్టియు, అనేకవిధములైనట్టియు, మూడుదోషములచేతను జనించునట్టియు, కుష్ఠమును నశింపచేయును. దుష్టవ్రణమును, విసర్పమును, చర్మదోషమును, నశింపజేయును. దీనియొక్క గుణములు వెయ్యిసారులు చూడబడినవి. కుష్ఠరోగమనెడి ఏనుగునకు సింహము వంటిది.

## మేహాంతకరసము

శ్లో॥ కాన్తమేకం ద్వయం వఙ్గమభ్రకం తు త్రిభాగకమ్ । చతుర్భాగం శిలాజిచ్చ నిమ్బతోయేన మర్దయేత్ (1) బదరాస్థిప్రమాణేన భక్షయేత్ ప్రాతరుత్థితః । నవనీతేన సంయుక్తస్సద్యో మేహం వినాశయేత్ (2)

అ॥ కాంతభస్మ 1 భా, వంగభస్మ 2 భా, అభ్రకభస్మ 3 భా, శిలాజతుభస్మ 4 భా, వీనిని వేపరసముతో మర్దింపవలయును. దీనిని రేగుగింజపరిమితిగ వెన్నతో ఉదయమున సేవించినయెడల మేహము వెంటనే నశించును.

## కామినీవిద్రావణరసము

శ్లో॥ ఆకారకరభం శుణ్ఠీ లవఙ్గం కుఙ్కుమం కణామ్ । జాతీ ఫలం చ తత్కోశం చన్దనం కార్షికం పృథక్ (1) హిఙ్గులం గన్ధకం శాణం ఫణిఫేనం పలోన్మితమ్ । గుఞ్జాత్రయమితాం కుర్యాత్సంమర్ద్య వటికాం భిషక్ (2) పయసా పరిపీతోఽయం శుక్రస్తమ్భకరో రసః । విద్రావణః కామినీనాం వశీకరణ ఏవ చ (3)

అ॥ అక్కలకర్ర, శుంఠి, లవంగములు, కుంకుమపువ్వు, పిప్పళ్లు, జాజికాయలు, జాపత్రి, చందనము, వీని నొక్కొక కర్ష పరిమితిగను శు॥ ఇంగిలీకమును, శు॥ గంధకమును, ఒక్కొక శాణపరిమితిగను శు॥ నల్లమందును, ఒక పలపరిమితిగను గ్రహించి నూరి (నీటితో) మూడు గురువిందగింజల పరిమితిగల మాత్రలను చేయవలయును. వీనిని పాలతో సేవించినయెడల శుక్రస్తంభనమును చేయును. స్త్రీలయొక్క మనస్సును కరగించును. స్త్రీలను వశ్యలనుగ చేయును.

## ప్రళయానలరౌద్రరసము

శ్లో॥ హిఙ్గులోత్థరసః భాగం ద్విభాగం గన్ధకం తథా । బాణభాగాభ్రగోదన్తే కాలభాగాం మనశ్శిలామ్ (1) టఙ్కణం నేత్రభాగం చ రసితం ఋతుభాగకమ్ । ఏకభాగం చ జైపాలం ద్విభాగం చ హాలాహలమ్ (2) దరదం చ చతుర్భాగం లోహం తామ్రం చ భాగకమ్ । సర్వం ఖల్వోదరే క్షిప్త్వాక్షీరేణార్కస్య మర్దయేత్ (3) సిన్దువారాగ్ని దుత్తూరజమ్బీరైశ్చ కతిల్లకైః । గన్ధతాలవిషమ్లేచ్ఛ భాగాంస్తత్ర క్షిపేద్బుధః (4) దశమూల కషాయేణ మర్దయేద్యామయుగ్మకమ్ । పఞ్చకోలకషాయేణ మర్దయేద్యామ మాత్రకమ్ (5) పచేత్ క్షిప్త్వా తామ్రపాత్రే ద్వౌ యామౌ వాలుకాగ్నినా । సాఙ్గశీతలముద్ధృత్య వల్లమాత్రప్రమాణతః (6) యోజయేత్తరుణోపేతే దోషవాతజ్వరేఽపిచ । పిత్తవాతగతేచైవ ప్రత్యహం తరుణేఽపి చ (7) చాతుర్థికే త్రిరాత్రే చ హ్యన్యత్ర వివిధే జ్వరే । ఆమే చ దీపకం జ్ఞేయం దాహం స్వేదోల్బణం జయేత్ (8) పయశ్శాల్యోదనం పథ్యం దధితక్రసమన్వితమ్ । సితయా మిశ్రితం తోయం నారికేలామ్బువైతథా (9) కదల్యాశ్చ ఫలాన్యత్ర పక్వాని వివిధాని చ । తామ్బూలం చన్దనంచైవ దేయం తత్రభిషగ్వరైః (10) వాపీకూపతటాకేషు స్నానం కుర్యాద్యథేచ్ఛయా । ప్రలయానలరౌద్రాఖ్యో రసః కాలాగ్నిభైరవః (11)

అ॥ శు॥ ఇంగిలీకమునుండి తీయబడిన పాదరసము 1 భా, శు॥ గంధకము 2 భా, అభ్రకభస్మ 5 భా, శు॥ తాళకము 5 భా, శు॥ మణిశిల 3 భా, శు॥ వెలిగారము 2 భా, శు॥ ఉల్లిపాషాణము 6 భా, శు॥ నేపాళములు 1 భా, శు॥ నాభి 2 భా, శు॥ ఇంగిలీకము 4 భా, లోహభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, వీనినిఖల్వమందుంచి జిల్లేడు పాలతోడను వావిలి, చిత్రమూలము, ఉమ్మెత్త, నిమ్మకాయలు, కాకర, వీనియొక్క రసములతోడను మర్దించి పిదప గంధకము, తాళకము, నాభి, తామ్రభస్మ, వీని నిప్పుడు మొదట చెప్పిన భాగముల ప్రకారముగ నుంచి దశమూలకషాయముతో రెండు జాములును, పంచకోలకషాయముతో నొక జామును, మర్దించి తామ్రపాత్ర యందుంచి వాలుకాయంత్రమందు రెండు జాములు వండి సాంగశీతలమున తీయ వలయును. దీని నొక వల్లపరిమితిగ తరుణజ్వరము, దోషజ్వరము, వాతజ్వరము, పిత్తవాతజ్వరము, ప్రత్యహమునుండు తరుణజ్వరము, చాతుర్థికజ్వరము, త్ర్యాహిక

జ్వరము, సమస్తమైన జ్వరములు, ఆమము, అగ్నిమాంద్యము, తాపము, అధికముగు చెమట, వీనియందియ్యవలయును. దీని నిచ్చునప్పుడు పాలు, శాల్యన్నము, పెరుగు, మజ్జిగ, పంచదార కలుపపడిన జలము, కొబ్బరికాయనీళ్లు, అరటిపండ్లు, తాంబూలము, వీని నియ్యవలయును. చందన లేపనమును చేయవలయును. దిగుడుబావులు, బావులు, చెరువులు, వీని యందిష్టానుసారముగ స్నానము చేయింపవలయును. ఇది ప్రశేయానల రౌద్రరసమనియు, కాలాగ్నిభైరవరసమనియు చెప్పబడును.

## మన్మథాభ్రరసము

శ్లో॥ రసగన్ధకయోర్గ్రాహ్యం పలమేకం సుశోధితమ్ । అభ్రం నిశ్చన్ద్రికం దద్యాత్పలార్థం చ విచక్షణః (1) కర్పూరం తోలకం దద్యాద్వఙ్గం వై కోలసమ్మితమ్ । తామ్రం తోలార్థకం తత్ర నిక్షేపం మారితం పునః (2) లోహకర్షం సుజీర్ణం చ వృద్ధదారం చ జీరకమ్ । విదారీం శతమూలీం చ క్షురబీజం బలాం తథా (3) మర్కట్యతివిషాంచైవ జాతీకోశఫలే తథా । లవఙ్గం విజయాబీజం శ్వేతసర్జం యవానికామ్ । శాణభాగాన్ గృహీత్వైతా నేకీకృత్యైవ పేషయేత్ (4) గుఞ్జాద్వయం తు కర్తవ్యం కోష్ణం క్షీరం పిబేదను । గృహే యస్య శతంనార్యో విద్యన్తేఽతి వ్యవాయినః (5) నతస్య లిఙ్గశైథిల్యమౌషధస్యాస్య సేవనాత్ । న చ శుక్రం క్షయం యాతి న బలం హ్రాసతాం వ్రజేత్ (6) కామరూపో భవేన్నిత్యం వృద్ధః షోడశవర్షవత్ । రసః శ్రీమన్మథాభ్రోఽయం మహేశేన ప్రకాశితః (7) అస్య భక్షణమాత్రేణ కాష్ఠం జీర్యతి తత్క్షణాత్ । నాశయేత్ ధ్వజభఙ్గాదీన్ రోగాన్యోగకృతానపి (8)

అ॥ శు॥ రసము 1 పలము, శు॥ గంధకము 1 ప, అభ్రకభస్మ ½ ప, పచ్చకర్పూరము 1 తులము, వంగభస్మ 1 కోలము, తామ్రభస్మ ½ తులము, లోహభస్మ 1 కర్షము, బొద్దికూర, జీలకఱ్ఱ, నేలగుమ్మడి, పిల్లిపీచర, గొలిమిడివిత్తులు, ముత్తవపులగము, దూలకోవిలవిత్తులు, అతివస, జాజికాయలు, జాపత్రి, లవంగాలు, గంజాయి విత్తులు, తెల్లగుగ్గిలము, ఓమము, వీని నొక్కొక శాణము, ఇటుల వీనిని గ్రహించి కలిపి నూరి (నీటితో) రెండుగురివిందగింజల పరిమితిగల మాత్రలను చేయవలయును. వీనిని సేవించిన వెంటనే గోరువెచ్చని పాలను త్రాగవలయును. అధిక మైథునము

నాచరించు స్వభావము కలిగి యనేక స్త్రీలు కలవాడు దీనిని సేవించిన యెడల వారికి లింగశైథిల్యము గాని, శుక్రక్షయము గాని, బలహాని గాని కలుగ నేరదు. ముసలివాడు సేవించిన యెడల పదునారు సంవత్సరములు వయస్సుకలవానివలెనై మన్మథునితో సమానుడగును. ఈ మన్మథాభ్రరసము మహేశునిచే చెప్పబడినది. దీనిని సేవించుటచే పుడకలు కూడ వెంటనే జీర్ణమగును. దుర్యోగములచే గలిగిన ధ్వజభంగము మొదలగు రోగములు నశించును.

## అపుటాగ్నికుమారము

శ్లో॥ రసస్య భాగా శ్చత్వారో వఙ్గం చాష్ట ప్రకల్పయేత్ । చత్వారో మరిచం గన్ధం విషకం చ త్రిభాగకమ్ (1) ద్వాదశ స్ఫటికాం చాపి సర్వం చూర్ణం ప్రకల్పయేత్ అపుటాగ్నికుమారోఽయం దీయతాం గుఞ్జమాత్రకమ్। ఆర్ద్రికస్వరసేనైవ సంనిపాతజ్వరాపహః (2)

ఆ॥ శు॥ పాదరసము 4 భా, వంగభస్మ 8 భా, మిరియాలు 4 భా, శు॥ గంధకము 3 భా, శు॥ నాభి 3 భా, పటిక 12 భా, వీనిని నూరి ఈ అపుటాగ్నికుమారమును ఒక గురివిందగింజ పరిమితిగ అల్లపురసముతో సేవించినయెడల సంనిపాతజ్వరములు నశించును.

## ప్రదరారిరసము

శ్లో॥ వఙ్గా యః ఫణిఫేనశ్చ రసః షడ్గుణజారితః । మూలం రక్తోత్పల భవం రక్తచన్దనమేవ చ (1) సమం సర్వమశోకస్య క్వాథైస్సం మర్దయేత్నతః । చణకాభా వటీ కార్యాఽశోకత్వాథం పిబేదను (2) ప్రదరారి రసో హన్తి ద్వివిధం ప్రదరామయమ్ । వస్త్రౌ చ వేదనాం రక్త స్రావం ఘోరజ్వరం తథా (3) మూత్రాధిక్యాదికాం శ్చైవ భాస్కర స్తిమిరం యథా । అథవా త్వగశోకస్య గుడూచీ వాసకత్వచః (4) రసాఞ్జనం ముస్తకం చ రక్త చన్దనమేవ చ । ఏషామను పిబేత్క్వాథం సర్వప్రదర శాన్తయే (5)

ఆ॥ వంగభస్మ, లోహభస్మ, శు॥ నల్లమందు, ఆరురెట్లుగంధకముతో వండబడిన రసము (షడ్గుణము), ఎఱ్ఱకలువదుంప, ఎఱ్ఱచందనము, వీనిని సమభాగములుగ

గ్రహించి అశోకపట్టకషాయముతో బాగుగ మర్దించి సెనగగింజలంతమాత్రలను చేయవలయును. వీనిని సేవించి వెంటనే అశోకపట్టకషాయమును త్రాగవలయును. ఈ ప్రదరారిరసము శ్వేతప్రదరమును, రక్తప్రదరమును, వస్తియందలిబాధను, రక్తస్రావమును, తీవ్రమైన జ్వరమును, అతిమూత్రము మొదలగు వ్యాధులను, సూర్యుడు చీకటినివలె హరించును. లేక అశోకపట్ట, తిప్పతీగ, కోడిశపాలపట్ట, రసాంజనము, తుంగగడ్డలు, ఎఱ్ఱచందనము, వీనియొక్క కషాయమును వెంటనే త్రాగినయెడల సమస్తములైన ప్రదరములను హరించును.

## జోగినీరసము

శ్లో॥ రసం విషం గన్ధకం చ టఙ్కణం తాలకం తథా । త్రికటు త్రిఫలా చైవ జైపాలం చ సమం సమమ్ । భృఙ్గరాజేన సమర్ద్యం జీవ యేజ్జోగినీ రసః (1)

అ॥ శు॥ పాదరసము, శు॥ నాభి, శు॥ గంధకము, శు॥ వెలిగారము, శు॥ తాళకము, త్రికటుకములు, త్రిఫలములు, శు॥ నేపాళములు, వీనిని సమభాగములుగ గ్రహించి గుంటగలగరరసముతో మర్దింపవలయును. ఇది ప్రాణము నిచ్చును. జోగినీ రసమని చెప్పబడును.

## నవలోహాగ్నికుమారము

శ్లో॥ సంశుద్ధం పారదం తుల్యం భస్మలోహాష్టకం సమమ్ । అర్కమూల కషాయేన మర్దితం దినపఞ్చకమ్ । కూపికాయాం నివేశ్యాథ లేప యేద్వస్త్ర మృత్తికామ్ (1) మృద్వగ్నినా వాలుకాభిర్ద్వాదశప్రహారం పచేత్, స్వాఙ్గశీతల ముద్ధృత్య మర్దితం చూర్ణయేత్తతః (2) గుఞ్జామాత్రం ప్రదాతవ్యం సర్వరోగాన్వినాశయేత్ । సంనిపాతం తు శీఘ్రంచ సర్వజ్వరహరః పరమ్ । ప్రఖ్యాతం నవలోహాఖ్యో రసో హ్యగ్నికుమారకః (3)

అ॥ శు॥ రసము, సువర్ణభస్మ, రజతభస్మ, వంగభస్మ, లోహభస్మ, నాగభస్మ, తామ్రభస్మ, కంచుభస్మ, ఇత్తడిభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడువేళ్ళ కషాయముతో నైదురోజులు మర్దించి కాచకుప్పెయందుంచి మట్టిపూసిన గుడ్డలు చుట్టి వాలుకాయంత్రమందు మందాగ్నిచే పన్నెండుజాములు వండి స్వాంగశీతలమున తీసి మర్దించి చూర్ణము చేయవలయును. దీనిని గురివిందగింజ పరిమితిగ నిచ్చినయెడల

సమస్త వ్యాధులు నశించును. సంనిపాతము వెంటనే హరించును. సమస్త జ్వరములు హరించును. ఇది నవలోహాగ్ని కుమారమని చెప్పబడును.

## అర్ధనారీశ్వర రసము

శ్లో॥ వరాటం టఙ్కణం శుద్ధం పఞ్చభాగసమన్వితమ్ । నవభాగం మరీచస్య విషం భాగత్రయం మతమ్ । స్తన్యేన వటికాం కృత్వానస్యం దద్యాద్విచక్షణః । శిరోవికారాన్వివిధాన్ హన్తిశ్లేష్మోత్తరానపి (2)

అ॥ గవ్వలభస్మ 5 భా, శు॥ వెలిగారము 5 భా, మిరియాలు 9 భా, శు॥ నాభి 3 భా, ఇటుల వీనిని గ్రహించి చనుబాలతో నూరి కణికలను చేసి నస్యముగ నుపయోగించినచో శ్లేష్మము (జలుబు) వలన కలిగినట్టి గాని స్వయముగ కలిగినట్టి గాని శిరోవ్యాధులన్నియు నశించును.

## చంద్రప్రభారసము (ప్రభావతీరసము)

శ్లో॥ శఙ్ఖం వరాటకం శుల్బం ప్రత్యేకం చార్ధభాగకమ్ । భుజఙ్గం కాన్తలోహం చ ప్రత్యేకం వేదభాగకమ్ (1) తత్తుల్యం త్రపుకం చైవ సర్వతుల్యం మృతాభ్రకమ్ । అభ్రతుల్యం శిలాజిచ్చ ఖల్వమధ్యే వినిక్షిపేత్ (2) నిమ్బద్రవేణ సంమర్ద్య సప్తాహం భావయేద్దృఢమ్ । ద్వివల్లవటికాం ఖాదేత్సర్వ మేహాన్నిహన్తి చ (3) మూత్రకృచ్ఛ్రం శిలామేహం బహుమూత్రం నిహన్తి చ । శుక్లమేహం తథాత్యుగ్రం హ్యగ్నిరోగం చ నాశయేత్ । చన్ద్రప్రభావతీ నామా చన్ద్రివాక్చన్ద్రి భాషితః (4)

అ॥ శంఖభస్మ ½ భా, గవ్వలభస్మ ½ భా, తామ్రభస్మ ½ భా, సీసభస్మ 4 భా, కాంతలోహభస్మ 4 భా, వంగభస్మ 9½ భా, అభ్రకభస్మ 19 భా, కర్పూర శిలాజతుభస్మ 19 భా, వీనిని ఖల్వమందుంచి నిమ్మకాయలరసముతో నేడురోజులు దృఢమగు మర్దనను, భావనను చేసి, రెండువల్లముల పరిమితికల మాత్రలను చేయవలయును. దీనిని సేవించినయెడల సమస్తమగు మేహములు, మూత్రకృచ్ఛ్రము, మూత్రమందు రాళ్లు పడుట, అతిమూత్రం, దారుణమైన శుక్ల మేహము, జాఠరాగ్ని సంబంధమగు వ్యాధులు, ఇవి నశించును. ఇది ప్రభావతీరస మనబడును, చంద్రునిచే చెప్పబడినది.

## నిత్యోదితరసము

శ్లో॥ మృతసూతార్కలోహాభ్రం విషం గన్ధం సమం సమమ్ । సర్వతుల్యాంశభల్లాతఫలమేకత్ర చూర్ణయేత్ (1) ద్రవైః శూరణమాణోత్థైర్భావ్యం ఖల్వే దినత్రయమ్ । భాగమాత్రం లిహేదాజ్యైరసైశ్చార్శాంసి నాశయేత్ రసో నిత్యోదితో నామ గుదోద్భవకులాన్తకః (2)

అ॥ రసభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, శు॥ నాభి, శు॥ గంధకము, వీనిని సమభాగములుగను శు॥ జీడిగింజలను, వీనియన్నిటితో సమానముగను గ్రహించి చూర్ణించి అడవికందరసముతో మూడురోజులు ఖల్వమునందు భావన చేయవలయును. దీనిని మేకమాంసపురసముతో సేవించినయెడల మూలవ్యాధులు నశించును. నిత్యోదితరసమని చెప్పబడును.

## రజఃప్రవర్తకరసము

శ్లో॥ టఙ్కణం హిఙ్గుకాసీసం కన్యాసారం సమాంశకమ్ । కుమారీస్వరసేమర్ద్యం చణకప్రమితా వటీ (1) రజోరోధం కష్టరజో వేదనాశ్చ తదుద్భవాః । రజఃప్రవర్తినీ నామ వటీ తూర్ణం వినాశయేత్ । భాషితా నీలకణ్ఠేన వహ్నిః కాష్ఠచయం యథా (2)

అ॥ పొ॥ వెలిగారము, శు॥ ఇంగువ, కాసీససింధూరము, ముసాంబ్రము, వీనిని సమభాగములుగ గ్రహించి కలుబందరసముతో మర్దించి సెనగగింజలంత మాత్రలను చేసి సేవించినయెడల రజస్సు సరిగ వెడలకుండుట, రజస్సు వెడలునప్పుడు బాధ, రజస్సంబంధమైన బాధలు, ఇవి నశించును. రజఃప్రవర్తినీవటి యని చెప్పబడును. నీలకంఠునిచే చెప్పబడినది. కట్టెలసముదాయము అగ్నివలె, నిది రజోదోషములను వెంటనే నశింపజేయును.

## వాతాగ్నికుమారము

శ్లో॥ రసగన్ధక తాలానామేకద్విత్రిపలం క్రమాత్ । హంసపాదీరసేనాథ సూక్ష్మచూర్ణాని మర్దయేత్ (1) నిధాయ కూపికామధ్యే వాలుకాయన్త్రకే పచేత్ । క్రమాగ్నౌ త్రిదినం సాధు తతశ్శీతం సముద్ధరేత్ (2) విషం

కలాంశమానేన యోజనీయం భిషగ్వరైః । స్యాద్వాతాగ్నికుమారాఖ్యో గుఞ్జామాత్ర ప్రమాణకమ్ (3) సంనిపాతే ధనుర్వాతే గృధ్రస్యా మపబాహుకే । సర్వాఙ్గకమ్పవాతే చ హ్యగ్నిమాన్ద్యే తథైవ చ (4)

అ॥ శు॥ రసము 1 పలము, శు॥ గంధకము 2 ప, శు॥ తాళకము 3 ప, ఇటుల వీనిని గ్రహించి మెత్తగ చూర్ణించి హంసపాదిరసముతో మర్దించి కుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే మూడురోజులు వండి స్వాంగశీతలమయినపిదప తీసి యాయౌషధమునకు పదునారవవంతు శు॥ నాభిని కలుపవలయును. ఇది వాతాగ్నికుమారమని చెప్పబడును. దీనిని గురివిందగింజపరిమితిగ సంనిపాతము, ధనుర్వాతము, గృధ్రసి, అపబాహుకము, సర్వాంగవాతము, కంపవాతము, అగ్నిమాంద్యము, వీనియం దియ్యవలయును.

## వంటబాలసూర్యోదయము

శ్లో॥ చతుష్పలం గన్ధకం చ చతుష్పలరసం తథా । పలమేకం తాలకం చ పలార్ధం చ మనశ్శిలామ్ (1) శిలార్ధం టఙ్కణం చైవ సర్వైస్తుల్యం తు హిఙ్గులమ్ । శాఖాపృక్షస్య పత్రైస్తు మర్దయేచ్చ దినత్రయమ్ (2) కాచకూప్యన్తరే క్షిప్త్వా వాలుకాయన్త్రకే పచేత్ । మన్దాగ్నినా చ త్రిదినం స్వాఙ్గశీతలముద్ధరేత్ । బాలసూర్యోదయాఖ్యశ్చ సర్వజ్వరకులాన్తకః (3)

అ॥ శు॥ గంధకము 4 పలములు, శు॥ రసము 4 ప, శు॥ తాళకము 1 ప, శు॥ మణిశిల ½ ప॥ శు॥ వెలిగారము ¼ ప, శు॥ ఇంగిలీకము 9¾ ప, ఇటుల వీనిని గ్రహించి బేకుఆకులరసముతో మూడురోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మందాగ్నిచే మూడురోజులు వండి చల్లారినపిదప తీయవలయును. ఉదయించుచున్న బాలసూర్యునితో సమానమైన కాంతిని (ఎఱుపును) కలిగియుండును. సమస్తమగు జ్వరములను హరించును.

## విషమజ్వరాంతకరసము

శ్లో॥ కిరాతఃపర్పటో దారు పృశ్నిపర్ణీమనశ్శిలా । త్రికటుస్త్రాయమాణా చ ఛిన్నాఽరిష్టః పటోలకమ్ (1) మూర్వామూలం ఖర్పరాభ్రే సమభాగాని కారయేత్ । సర్వాఙ్గం జారితం తీక్ష్ణం వారిణా మర్దయేద్భిషక్ (2)

చతుర్గుఞ్జామితం దద్యాత్ కిరాతక్వాథసంయుతమ్ । ప్లీహాగ్ని సాద దౌర్బల్య యకృచ్ఛోథసమన్వితాన్ । సర్వాన్ జ్వరాన్నిహన్త్యేవ భాస్కర స్తిమిరం యథా (3)

అ॥ నేలవేము, పర్పాటకము, దేవదారు, కాలహాన్న, శు॥ మణిశిల, త్రికటుకములు, కలుత్రానుగ, తిప్పతీగ, వేప, చేదుపొట్ల, చాగదుంప, శు॥ కపరి, అభ్రకభస్మ వీనిని సమభాగములుగను, లోహభస్మను వీనియన్నిటితో సమానముగను గ్రహించి ఉదకముతో నూరవలయును. దీనిని నాలుగు గురివిందగింజలపరిమితిగ నేలవేముకషాయముతో సేవించినయెడల ప్లీహాభివృద్ధి, అగ్నిమాంద్యము, దౌర్బల్యము, యకృద్వృద్ధి, నంజు, వీనితో కూడిన సమస్తములగు జ్వరములును సూర్యునివలన చీకటివలె నశించును.

## మృత్యుంజయరసము

శ్లో॥ విషస్యైక స్తథా భాగో మరిచం పిప్పలీకణః గన్ధకస్య తథా భాగో భాగస్స్యాట్టఙ్కణస్య వై (1) సర్వత్ర సమభాగాస్స్యుర్ద్వి భాగం హిఙ్గులం భవేత్ । జమ్బీరస్య రసేనాత్ర హిఙ్గులం భావయేద్భిషక్ (2) రసశ్చేత్సమ భాగాస్స్యుర్ద్విగులం నేష్యతే తథా । గోమూత్రశోధితం చాత్రవిషం సౌరవిశోషితమ్ (3) చూర్ణ యేత్ఖల్వమధ్యే తు ముద్గమాత్రాం వటీం చరేత్ । మధునాలేహనం ప్రోక్తం సర్వజ్వరనివృత్తయే (4) దధివార్యనుపానేన వాతజ్వర నిబర్హణః । ఆర్ద్రకస్య రసైః పానం దారుణే సాంనిపాతకే (5) జమ్బీరరసయోగేన హ్యాజీర్ణ జ్వరనాశకః । అజాజీ గుడసంయుక్తో విషమ జ్వరనాశకః (6) జీర్ణ జ్వరే మహాఘోరే పురుషే యౌవనాన్వితే । పూర్ణా మాత్రా ప్రదాతవ్యా పూర్ణం వటి చతుష్టయమ్ (7) అతిక్షీణేఽతివృద్ధే చ శిశౌ చాల్పవయస్యపి । చుర్యమాత్రా ప్రదాతవ్యా వ్యవస్థా సారనిశ్చితా (8) నవజ్వరే ప్రదానేన యామైకాన్నాశయేజ్జ్వరమ్ । అక్షీణే చ కఫాభావే దాహే వై వాత పైత్తికే (9) సితాం దద్యాత్ప్రయత్నేన నారికేలామ్బు నిర్భయమ్, అయం మృత్యుఞ్జయో నామ రసస్సర్వజ్వరాపహః । అనుపానప్రభేదేన నిహన్తి సకలాన్గదాన్ (10)

అ॥ శు॥ నాభి 1 భా, మిరియాలు 1 భా, పిప్పళ్లు 1 భా, జీలకర్ర 1 భా శు॥ గంధకము 1 భా, శు॥ వెలిగారము 1 భా. శు॥ ఇంగిలీకము 2 భా, (లేక) శు॥ పాద

రసము 1 భా॥, ఇట్లు వీనిని గ్రహింపవలయును. ఇందు వేయు ఇంగిలీకమును నిమ్మకాయరసముతో భావన చేయవలయును. ఇందు పాదరసమును వేసికొనునెడల ఇంగిలీకమును వేయనవసరము లేదు. ఇందు గోమూత్రముతో భావనచేయబడి ఎండయందుండింపబడిన నాభిని వేయవలయును. పై వస్తువులను ఖల్వమందుంచి నూరి పెసరగింజలంత మాత్రలను చేయవలయును. తేనెతో సేవించినయెడల సమస్తజ్వరములును, పెరుగుమీగడనీటితో సేవించినయెడల వాతజ్వరమును, అల్లపురసముతో సేవించినయెడల దారుణమైన సంనిపాతమును, నిమ్మకాయలరసముతో సేవించినయెడల అజీర్ణజ్వరమును, సోపు బెల్లము నీటితో సేవించినయెడల విషమజ్వరమును నశించును. జీర్ణజ్వరమందును, ఘోరమైన జ్వరమందును, యౌవనవంతునికి కలిగిన జ్వరమందును, పూర్ణమైన మోతాదుగ అనగా నాలుగుమాత్రలు చొప్పున ఇయ్యవలయును. మిక్కిలి క్షీణించినవారు, మిక్కిలివృద్ధులు, శిశువు, స్వల్పవయస్సుకలవారు, వీరికి నాల్గవవంతు పరిమితిగ నియ్యవలయును. మోతాదుయొక్క నిశ్చయము బలము ననుసరించి యుండును. నవజ్వర మందిచ్చినయెడల నొకజామునకే యా జ్వరము నశించును. రోగి క్షీణించకుండనుండి కఫము లేకుండనుండి వాతపిత్తములకు సంబంధముండి తాపముగ నున్నయెడల పంచదారను, కొబ్బరికాయనీటిని, నిర్భయముగ నియ్యవలయును. ఇది మృత్యుంజయ రసమనబడును. సమస్తజ్వరములను హరింపజేయును. అనుపానభేదములతో సమస్త వ్యాధులను నశింపజేయును.

## కనకబాలసూర్యోదయము (వంటయోగము)

శ్లో॥ రసం బలిం తాలకం చ టఙ్కణం తుల్యభాగకమ్ । నవసారం హేమభస్మ గగనం రజతం తథా (1) తామ్రం విద్రుమతీక్ష్ణే చ వఙ్గం చాపి సమం సమమ్ । రవిణా చ సమూలేన మర్దయేదార్ద్రికేణ చ (2) చిత్రమూలరసేనాపి షడ్దినం చ పృథక్పృథక్ । కాచకూప్యాం వినిక్షిప్య మృదువస్త్రైశ్చ వేష్టయేత్ (3) వాలుకాయన్త్రికే పాచ్యం చోదయేద్రవిరూపకమ్ । బాలసూర్యోదయో నామ నాశయేత్స కలా రుజః । వాతజాన్వివిధాన్రోగాన్హన్తి సద్యః క్షయానపి (4)

అ॥ శు॥ పాదరసము, శు॥ గంధకము, శు॥ తాళకము, శు॥ వెలిగారము, నవాసారము, సువర్ణభస్మ, అభ్రకభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, పగడభస్మ, ఖడ్గలోహభస్మ, వంగభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి వేళ్ళతోకూడిన జిల్లేడు, అల్లము,

చిత్రమూలము, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ ఆరేసిరోజులు మర్దించి కాచ కుప్పెయందుంచి పైన సన్నని వస్త్రములతో (మట్టిపూయబడిన) చుట్టి వాలుకాయంత్రమందు వండి సూర్యుని (ఉదయించుచున్న)తో సమానవర్ణము కల యీ మందును గ్రహింపవలయును. ఇది బాలసూర్యోదయమని చెప్పబడును. సమస్తవ్యాధులను, వాతవ్యాధులను, క్షయలను వెంటనే నశింపచేయును.

## పూర్ణచంద్రరసము

శ్లో॥ ద్వికర్షం శుద్ధసూతం చ గన్ధకం చ ద్వికర్షకమ్ । లోహభస్మ పలం చాభ్రం జారితం చ పలాంశకమ్ (1) ద్వితోలం రజతం చైవ వఙ్గ భస్మ ద్వికర్షకమ్ । సువర్ణం తోలకం చైవ తామ్రం కాంస్యం చ తత్స మమ్ (2) జాతీఫలం చేన్ద్రపుష్పమేలాం త్వక్పత్రజీరకాః । కర్పూరం వని తాం ముస్తం కర్షం కర్షం పృథక్పృథక్ (3) సర్వం ఖల్వతలే క్షిప్త్వా కన్యా రసవిమర్దితమ్ । భావయిత్వా వరీతోయైరురుబూకరసేన చ (4) ఏరణ్డపత్రై స్సంవేష్ట్య ధాన్యేరాత్రిం దివోషితమ్ । ఉద్ధృత్య మర్దయే త్కృత్వా వటికా వల్ల సంమితాః (5) ఖాదేచ్చ వటికామేకాం పర్ణఖణ్డేన సంయుతామ్ । సర్వ వ్యాధి వినాశాయ కాశీనాథేన నిర్మితః (6) పూర్ణచన్ద్రరసో నామ్నా సర్వ రోగేషు యోజయేత్ । బల్యం రసాయనం చైవ వాజీకరణ ఉత్తమః (7) అయమష్ఠీలికాం హన్తి కాసం శ్వాసమరోచకమ్ । ఆమశూలం కటిశూలం హృచ్ఛూలం పక్తిశూలకమ్ (8) అగ్నిమాన్ద్యమజీర్ణం చ గ్రహణీం చిర జాం పరామ్ । ఆమవాతం చామ్లపిత్తం భగన్దరమపి ద్రుతమ్ (9) కామ లాం పాణ్డురోగం చ ప్రమేహం వాతశోణితమ్ । నాతఃపరతరం శ్రేష్ఠం విద్యతే వాజికర్మణి (10) రసస్యాస్య ప్రసాదేన నరో భవతి నిర్గదః । మేధాం చ లభతే వాగ్మీ తుష్టిపుష్టి సమన్వితః (11) మదనస్య సమాం కాన్తి మదనస్య సమం బలమ్ । గీయతే మదనే నైవ మదనస్య సమం వపుః (12) ప్రియాం చైవ రతిప్రాయాం పశ్యేచ్చ మదనాకులః । స్త్రీణా మప్యనపత్యానాం దుర్బలానాం హితం తథా (13) క్షీణానామల్పశుక్రాణాం వృద్ధా నాం వాతరేతసామ్। ఓజస్తేజస్కరశ్చాయం స్త్రీషు కామవివర్ధకః ॥శ్లో॥ అభ్యా

సేన నిహన్తి మృత్యుపలితే సర్వామయ ధ్వంసకః । వృద్ధానాం మదనోదయో దయకరః ప్రౌఢాఙ్గనాసఙ్గమే । నిర్వ్యాసన్దకర స్తథాతిసుఖదో భూపైస్సదా సేవ్యతే । దృష్టస్సిద్ధఫలో రసాయనవర(శ్శ్రీ పూర్ణచన్ద్రో) రసః ।

అ॥ శు॥ రసము 2 కర్షములు, శు॥ గంధకము 2 క, లోహభస్మ 1 పలము, అభ్రకభస్మ 1 ప, రజతభస్మ 2 తులములు, వంగభస్మ 2 కర్షములు, సువర్ణభస్మ 1 తులము తామ్రభస్మ 1 తు, కంచుభస్మ 1 తు, జాజికాయలు 1 కర్షము, లవంగములు 1 క, ఏలకులు 1 క, దాసెనచెక్క 1 క, ఆకుపత్రి 1 క, జీలకర్ర 1 క, పచ్చకర్పూరము 1 క, త్రికంఖణము 1 క, తుంగముస్తలు 1 క, వీనిని ఖల్వమందుంచి కలుబంద రసముతో మర్దించి పిల్లిపీచర, ఆముదపువేళ్ళు, వీనియొక్క రసములతో భావనచేసి ఆముదపాకులతో చుట్టి ధాన్యపురాశియందు దొక రాత్రింబవలు నుంచి తీసి నూరి వల్లపరిమితికల మాత్రలను చేయవలయును. ఒక మాత్రను తమలపాకులతో సేవించినయెడల సమస్తవ్యాధులు నశించును. ఇది కాశీరాజుచే చెప్పబడినది. పూర్ణచంద్రరస మనబడును. దీనిని సమస్తవ్యాధులయం దియ్యవలయును, ఇది బలమును కలిగించును. రసాయనము. శ్రేష్ఠమైన వాజీకరణము, అష్ఠీలిక, దగ్గు, ఆయాసము, అరోచకము, ఆమశూల, కటిశూల, హృదయశూల, పరిణామశూల, అగ్నిమాంద్యము, అజీర్ణము, చిరకాలమునుండియున్న గ్రహణీవ్యాధి, ఆమవాతము, అమ్లపిత్తము, భగందరము, కామిర్లు, పాండురోగము, ప్రమేహము, వాతరక్తము, వీనిని నశింపజేయును. దీని కంటె శ్రేష్ఠమైన వాజీకరణము లేదు. దీనిని సేవించుటచే వ్యాధులు లేనివాడగును. బుద్ధికుశలత, వాక్పటుత్వము, మనస్సంతోషము, శరీరపుష్టి, మన్మధునితో సమానమైన శరీరకాంతి, మన్మథబలము, మన్మథగానము, మన్మథశరీరము, వీనిని పొందును. మన్మథోద్రేకముకలవాడై భార్యను రతిదేవితో సమానమైనదానిగ తలచును. సంతానము లేనట్టియు, దుర్బలులైనట్టియు స్త్రీలకు హితకరముయినది. క్షీణించినవారలకును, స్వల్పమగు శుక్రము కలవారకని, వృద్ధులకును, వాతముచే చెడిన శుక్రముకలవారలకును హితకరమైనది. ఓజస్సును, తేజస్సును, కలిగించును. కామమును వృద్ధినొందించును. కొంతకాలము సేవించినయెడల మృత్యువును, ముసలితనమును, సమస్తవ్యాధులను కలుగకుండచేయును. దీనిని సేవించినచో ముసలివారుకూడ మన్మథోద్రేకము కలవారై ప్రౌఢలగు స్త్రీలను సురతముచే తృప్తిపరచెదరు. ఇది ఎల్లప్పుడు ఆనందమును, అధికమగు సుఖమును, కలిగించును. రాజులచే సేవింపబడుచున్నది. ఈపూర్ణచంద్ర రసము రసాయనములలో శ్రేష్ఠమైనది. పై గుణములను నిశ్చయముగ కలిగించును. ఉపయోగించి చూడబడినది.

## మే హ గ జాం కు శ ము

శ్లో॥ దరదదారదవఙ్గలవఙ్గకం । శరదశారదసీరదపారధమ్ । గరుడగారుడ తద్రసమర్దితం । పిబతు దారుణ మేహగజాఙ్కుశమ్ (1)

అ॥ శు॥ ఇంగిలీకము, శిలాజతుభస్మ, వంగభస్మ, లవంగములు, రససిందూరము పగడభస్మ, అభ్రకభస్మ, అయస్కాంతభస్మ, సీసభస్మ, ముత్యభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి దూసరిఆకురసముతో మర్దింపవలయును. ఇది దారుణమైన మేహములను నశింపచేయును.

## క ఫ చిం తా మ ణి

శ్లో॥ పారదాభ్రే ఖడ్గలోహం తారతామ్రే చ గన్ధకమ్ । కాన్తం నాగం వఙ్గతాలే వైక్రాన్తాయశ్శిలాశ్చవై (1) కిట్టశుక్తి విద్రుమం చ వరాటం హేమమాక్షికమ్ । బృహత్యా వజ్రవల్లీభ్యాం బదరీసిన్ధు భృఙ్గకైః (2) పఞ్చకోలైశ్చ సంమర్ద్య కృత్వా చ గులికాం స్తతః । కాచకూప్యాం వినిక్షిప్య వాలుకాభిధయన్త్రికే (3) త్రిదినం పాచయిత్వాఽథ స్వాఙ్గశీతల ముద్ధరేత్ । కాంస్యభస్మ చ తత్తుల్యం వాసయా నాగపత్రకైః (4) ముణ్డ్యా చ వజ్రవల్ల్యా చ బృహతీచిత్రమూలకైః । ప్రత్యేకం సప్తదివసం మర్దయేదనుపానకైః (5) ఏకగుఞ్జాప్రమాణేన కాసం శ్వాసం క్షయం హరేత్ । వాతవ్యాధీంశ్చ సర్వాంస్తు కఫరోగాన్విశేషతః । కఫచిన్తామణిర్నామ హ్యశ్వినీదేవ నిర్మితః (6)

అ॥ శు॥ పాదరసము, అభ్రకభస్మ, ఖడ్గలోహభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, శు॥ గంధకము, కాంతలోహభస్మ, సీసభస్మ, వంగభస్మ, శు॥ తాళకము, వైక్రాంత భస్మ, ఇనుపలోహభస్మ, శు॥ మణిశిల, మాండూరభస్మ, ముత్యపుచిప్పలభస్మ, పగడ భస్మ, గవ్వలభస్మ, హేమమాక్షికభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి, నేలములగ, జముదు, చిత్రమూలము, రేగు, వావిలి, గుంటగలగర, పంచకోలములు, వీనియొక్క రసములతో మర్దించి మాత్రలుచేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్ర మందు మూడురోజులు వండి సాంగశీతలమున తీసి ఆ మందుకు సమానమగు కంచుభస్మను కలిపి అడ్డసరము, తమలపాకులు, బోడసరము, నల్లేరు, నేలములగ, చిత్రమూలము, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ నేడేసిరోజులు మర్దింపవలయును. దీనిని అనుపానవిశేషములతో నొకగురివిందగింజ పరిమితిగ సేవించినయెడల దగ్గు, ఆయాసము,

క్షయ, సమస్తమగు వాతవ్యాధులు, ఇవి నశించును. కఫవ్యాధులు ముఖ్యముగ నశించును. కఫచింతామణి యనబడును. అశ్వినీదేవతలచే చెప్పబడినది.

గద్య. ఇతి శ్రీ గోదావరీమణ్డల మణ్డనాయమానకోనసీమాన్తర్వర్తి మోడే
కుఱ్ఱుగ్రామవాసినా భూసురాగ్రగణ్యేన శ్రీపాదోపనామ్నా కౌశిక
సగోత్రపవిత్రేణ వేఙ్కటేశ్వరపౌత్రేణ సోమయాజిపుత్రేణ సుబ్బ
మామ్బాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన సద్గురుసేవా
సమాసాదితసాహితీశబ్దశాస్త్రాయుర్వేదాదివిద్యానిధా
నేన భిషగ్వరాయుర్వేదభూషణాది బిరుదావలీ
విరాజమానేన విద్వత్ప్రభుసభాస్థానసమ్మాన
సభ్రాజమానేన సకలసజ్జనవిధేయేన కృష్ణ
మూర్తిశాస్త్రిణా ప్రణీతేఆయుర్వే
దౌషధరత్నాకరే అనుబద్ధగుచ్ఛ
సమాప్తః



## తృతీయ ముద్రణమునందు నూతనముగ జేర్చబడిన యోగములు

### షడ్గుణ బలిజారిత మకరధ్వజము

శ్లో॥ పలమేకం సువర్ణస్య రసేన్ద్రస్య పలాష్టకమ్ । రసస్య ద్విగుణం గన్ధం కజ్జలీకృత్య యత్నతః (1) కుమారికారసైర్భావ్యం కాచపాత్రే నిధాపయేత్ । సంస్థాప్య వాలుకాయన్త్రే క్రమశస్త్రిదినం పచేత్ (2) స్వాఙ్గశీతం సమాదాయ పుష్పారుణరజస్సమమ్ । రసస్య షడ్గుణైరన్యైః పూర్వవత్కజ్జలీ కృతే (3) భావితే పాచితే సమ్యక్ షడ్గుణో బలిజారితః । యవమాత్రం ప్రదాతవ్యమహివల్లీదలైస్సహ (4) విధివత్సేవితో హ్యేష ముమూర్షుమపి జీవయేత్ । ఏతదభ్యాసతశ్చైవ జరామరణనాశనమ్ (5) అనుపానవిశేషేణ కరోతి వివిధాన్గుణాన్ । జ్వరం త్రిదోషజం ఘోరం మన్దాగ్నిత్వమరోచకమ్ (6) అన్యాంశ్చ వివిధాన్రోగన్నాశయేన్నాత్ర సంశయః । కరోత్యగ్నిం బలం పుంసాం వలీపలితనాశకః (7) మేధాయుః కాన్తిజనకః కామోద్దీపనకృన్మహాన్ । భాస్వజ్జ్యోతిర్యథా భాతి కాచే నీలాదికే శుభే । తథాఽనుపానభేదేన క్రియావాన్మకరధ్వజః (8)

అ॥ స్వర్ణపత్రము 1 పలము, శు॥ పాదరసము 8 ప, శు॥ గంధకము 16 ప, వీనిని మెత్తగనూరి కలుబందరసముతో భావనచేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు క్రమాగ్నులచే మూడురోజులు వండవలయును. చల్లారిన పిదప పుష్పముల యొక్క ఎఱ్ఱనిపరాగముతో సమానముగనున్న దానిని గ్రహించి మరల 16 పలముల శు॥ గంధకమును చేర్చి మెత్తగనూరి పూర్వమునందువలెనే వండవలయును. గంధకము రసమునకు ఆరురెట్లు అగునట్లు మరల పూర్వమునందువలెనే వండవలయును. ఇట్లు మర్దింపబడి వండబడి ఆరురెట్లు గంధకము జీర్ణింపజేయబడిన ఇది షడ్గుణ బలిజారిత మకరధ్వజ మనబడును. దీనిని తమలపాకులతో యవపరిమితిగ నియ్యవలయును. విధిప్రకారముగ సేవించినచో చచ్చుటకు సిద్ధముగనున్నవానిని కూడ బ్రతికింపచేయును. దీనిని సేవించుచుండినచో ముసలితనమును మరణమును కలుగకుండును. అనుపానవిశేషములతో అనేక గుణములను కలిగించును. మూడుదోషముల వలన జనించునట్టియు, ఘోరమైనట్టియు జ్వరమును, అగ్నిమాంద్యమును, అరోచకమును, ఇట్టి యితర వ్యాధులను, తప్పక నశింపజేయును. జాఠరవృద్ధిని, బలమును

చేయును. శరీరము ముడతలు పడుటను, వెంట్రుకలు నెరయుటను నశింపచేయును. బుద్ధిశక్తి, ఆయువు, మన్మథోద్రేకము, వీనిని వృద్ధినొందించును. నీలము మొదలగు పరిశుద్ధమైన కాచముణులయందు సూర్యకాంతిమువలె నీ మకరధ్వజము అనుపాన భేదములతో గుణములను కలుగచేయును.

## వ్యాధిహరణరసము

శ్లో॥ హిఙ్గులోద్ధరసం భాగం రసకర్పూరకం ద్విధా । రసతుల్యం బలిం దద్యాత్ దత్వాస్యాద్దే తు కజ్జలీమ్ (1) మృత్పటైః పఞ్చధాబద్ధ్వా వాలుకాయన్త్రికే పచేత్ । దినైకం తు క్రమాగ్నా తు స్వాఙ్గశీతం సముద్ధరేత్ (2) పూజయేద్గురువిప్రాదీన్ యథారోగం ప్రయోజయేత్ । గుఞ్జాచతుష్టయం ఖాదేన్నాగవల్లీదలైర్యుతమ్ (3) షణ్డోఽపి లభతే పుంస్త్వం వాజీకరణ ముత్తమమ్ । అపుత్త్రః పుత్రమాప్నోతి జీవేచ్చ శరదాం శతమ్(4) వలీపలితహృచ్ఛూలవాతశ్లేష్మోపదంశకాన్ । హరేద్వ్యాధిహరస్యాతః పూజ్యపాదేన నిర్మితః (5)

అ॥ ఇంగిలీకమునుండి తీయబడి శుద్ధిచేయబడిన పాదరసము 1 భా, శు॥ రసకర్పూరము 2 భా, శు॥ గంధకము 1 భా, వీనిని మెత్తగ నూరి కోడిగ్రుడ్డునందు పోసి గుట్టిపూయబడిన గుడ్డలతో పైన నైదుసారులు చుట్టి వాలుకాయంత్రమునందొక రోజు క్రమాగ్నులచే వండి స్వాంగశీతలమున తీయవలయును. గురువులు బ్రాహ్మణులు మొదలగు వారిని పూజించి ఆయా రోగములకు తగునట్లు నాలుగు గురివిందగింజల పరిమితిగ తమలపాకులతో సేవింపవలయును. నపుంసకుడు కూడ పుంస్త్వము నొందును. వాజీకరణౌషధములలో శ్రేష్ఠమైనదిగ నుండును. సంతానములేనివాడు సంతానము నొందును. అనేక సంవత్సరములు జీవించును. శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, హృదయశూల, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, ఉపదంశవ్యాధులు, వీనిని నశింపజేయును. ఈ వ్యాధిహరణరసము పూజ్యపాదునిచే చెప్పబడినది.

## పంచబాణరసము

శ్లో॥ మృతసూతాభ్రకే స్వర్ణం కాన్తం తీక్ష్ణం మృతం తథా । ప్రవాలం మౌక్తికం వజ్రం శోధితం చ శిలాజతు (1) తామ్రమరౌప్యే మృతం నాగం కస్తూరీ రోచనం తథా సర్వం సమం ఖల్వమధ్యే సుముహూర్తే వినిక్షి

పేత్ (2) రమ్భా గోక్షురశాల్మల్యౌ చేక్షుర్వాశా శతావరీ। కోకిలాక్షస్య బీజాని మర్కటీ జీరకో బలా (3) అశ్వగన్ధా విదారీ చ తథా భూశర్కరాఽపి చ। మృణాలం బిసగ్రన్థిబేరే నారికేళశ్చ శుష్కకమ్ (4) చన్దనం జాతి పత్రీ చ ఫలం ముస్తం సుచన్దనమ్। వివర్ణం తులసీబీజం కూష్మాణ్డకదలీ ఫలే (5) ద్రాక్షా ఖర్జూరవిజయే చార్ద్రం చైతైర్విమర్దయేత్। ఘనసారం మేలయిత్వా హ్యౌషధస్య దశాంశకమ్ (6) ఏతద్రసాయనం ఖల్వే పన్నీరేణ చ భావయేత్। గుటికా ఛాయయా శుష్కా వంశనాలే వినిక్షిపేత్ (7) చతుర్గుఞ్జాప్రమాణేన శర్కరాక్షీరమిశ్రితమ్। పూర్వకాలే తథా గ్రాహ్యం త్వపరాహ్ణే తదర్ధకమ్ (8) రాత్రౌ గోక్షీరసితయా చాభ్యాసేనగుణౌషధమ్। వలీపలితనాశం చ వృద్ధోఽపి తరుణాయతే (9) షణ్ఢోఽపి లభతే పుత్రం వీర్యవృద్ధికరం నృణాం స్తమ్భనం మోహనం చైవ ద్రావణం పుష్టివర్ధకమ్ (10) మధుమేహం చేక్షుమేహం బహుమూత్రం చ తస్తుకామ్। లాలామేహం హస్తిమేహం హారిద్రా శుక్లమేహకే (11) రక్తమేహం మూత్రకృచ్ఛ్రం చాశ్మరీం ప్రదరం తథా। కదలీకాకవన్ధ్యాత్వం స్త్రీణాం రోగవినాశనమ్ (12) ఛర్దిం హిక్కామపస్మారం హ్యున్మాదం మూర్ఛరోగకమ్। అఙ్గదాహం లిఙ్గదాహం నష్టవీర్య ప్రపూరకమ్ (13) ఏకాదశ క్షయాంశ్చైవ కామలాం పాణ్డురోగకమ్। అర్శో రక్తాతిసారం చ గుల్మం శూలం వినాశయేత్ (14) శ్రేష్ఠం రసాయనం జ్ఞేయం మన్మథోద్రేకకారకమ్। పఞ్చబాణరసో నామ హ్యశ్వినీదేవ నిర్మితః (15)

అ॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, లోహభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, వంగభస్మ, శు॥ గోమూత్రశిలాజతు, తామ్రభస్మ, రజతభస్మ, సీసభస్మ, కస్తూరి, గోరోచనము, వీని నన్నిటిని సమభాగములుగ గ్రహించి సుముహూర్తమున ఖల్వమునందుంచి అరటి, పల్లేరు, బూరుగ, చెరుకు, అడ్డసరము, పిల్లిపీచర, దూలగొండివిత్తులు, జీలకర్ర, ముత్తవపులగము, పెన్నేరు, నేలగుమ్మడి, భూశర్కర, తామరతూండ్లు, తామరఅగడ్లు, వరువేరు, కొంగల్వకోష్టు, చందనము, జాపత్రి, జాజికాయలు, తుంగగడ్డలు, తెల్లచందనము, నల్లతులసిగింజలు, బూడిదగుమ్మడికాయ, అరటిపండ్లు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయలు, అల్లము, వీనియొక్క రసములతోడను కొబ్బరికాయనీటితోడను మర్దించి ఈ ఔషధమునకు పదియవ వంతు

పచ్చకర్పూరమును చేర్చి పన్నీరుతో భావనచేసి కుప్పెలను చేసి నీడను ఎండించి వెదురగొట్టమునందుంచవలయును. దీనిని నాలుగు గురివిందగింజల పరిమితిగ పంచదార, పాలు, వీనితో ఉదయమునందును మధ్యాహ్నమునందును రాత్రియందును పుచ్చుకొనవలయును. మధ్యాహ్నమునందు అర్ధపరిమితిగ పుచ్చుకొనవలయును. ఈ రసాయనమును కొంతకాలము సేవించినచో శ్రేష్ఠమైన గుణములను కలిగించును. శరీరము ముడతలుపడుటయు, వెంట్రుకలు నెరయుటయు నశించును. ముసలివాడు కూడ యౌవనవంతుడగును. నపుంసకుడు కూడ సంతానము నొందును. వీర్యవృద్ధిని వీర్యస్తంభనమును చేయును. మోహమును కలిగించును. మనస్సును ద్రవింపచేయును. శరీరపుష్టిని కలిగించును. మధుమేహము, ఇక్షుమేహము, బహుమూత్రము, తంతుమేహము, లాలామేహము, హస్తిమేహము, హరిద్రామేహము, శుక్లమేహము, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, ప్రదరము, కదలీవంధ్యాత్వము, కాకవంధ్యాత్వము, స్త్రీల యొక్క వ్యాధులు, వాంతి, ఎక్కిళ్ళు, అపస్మారము, ఉన్మాదము, మూర్ఛ, శరీరతాపము, లింగమునందలి తాపము, శుక్రనాశము, పదునొకండు క్షయలు, కామిర్లు, పాండురోగము, అర్శస్సు, రక్తాతిసారము, గుల్మము, శూల, వీనిని నశింపచేయును. రసాయనములలో శ్రేష్ఠమైనదిగ నుండును. మన్మథోద్రేకమును కలిగించును. పంచబాణరసమని ప్రసిద్ధమైనది. అశ్వినీదేవతలచే చెప్పబడినది.

## వాతాంతకరసము

శ్లో॥ రసం బలిం చాభ్రతాలే చాయసం నాగవఙ్గకే । శుల్బం వరాటకం శఙ్ఖం కునటీం కాంస్యకిట్టకే (1) తుత్థద్వయం హిఙ్గులం చ సౌభాగ్యం వత్సనాభకమ్ । గృహీత్వా సమభాగం తు చార్కక్షీరే దినత్రయమ్ (2) మర్దయేన్మాషమాత్రం చ కాచకుమ్భే వినిక్షిపేత్ । మన్దాగ్నౌ వాలుకాయన్త్రే పాచయేచ్చ త్రిరాత్రకమ్ (3) తత్తుల్యం విషతిన్దుం చ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । వీర్యవృక్షో పూతివహ్నౌ కరమ్భో వక్త్రసిన్ధుకే (4) వైజయన్తి భృఙ్గరాజో జమ్భస్త్వేషాం రసేన చ పృథక్పృథక్త్రివారం చ మర్దయేదతియత్నతః (5) ముద్గమాత్రాం వటీం ఖాదేదశీతిర్వాతనాశనమ్ । సర్వామయాన్నిహన్త్యేవ తత్క్షణేన నసంశయః । వాతాన్తకరసో నామ శమ్భునా పరికల్పితః (6)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము అభ్రకభస్మ, శు॥ తాళకము, లోహభస్మ సీసభస్మ, వంగభస్మ, తామ్రభస్మ, గవ్వలభస్మ, శంఖభస్మ, శు॥ మణిశిల, కంచుభస్మ,

మాండూరభస్మ, శు॥ మైలతుత్థము, శు॥ పాలతుత్థము, శు॥ ఇంగిలీకము, శు॥ వెలిగారము, శు॥ నాభి, వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడుపాలతో మూడురోజులు మర్దించి మాషపరిమితిగల మాత్రలను చేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమునందు మందాగ్నిచే మూడురోజులు వండి ఆ మందునకు సమానముగు శు॥ విషముష్టిగింజలను కలిపి ఖల్వమునందుంచి వెణుతురు, నెమలి, అడుగుచెట్టు, చిత్రమూలము, దుష్టపు, గ్రంథితగరము, వావిలి, తెక్కలి, గుంటగలగర, నిమ్మకాయలు, వీనియొక్క రసములతో ప్రత్యేకముగ మూడేసిరోజులు బాగుగ మర్దించి పెసరగింజలంత మాత్రలను చేసి సేవించినచో ఎనుబదివాతములను, సమస్త వ్యాధులను, వెంటనే తప్పక నశింపచేయును. ఈ వాతాంతకరసము ఈశ్వరునిచే చెప్పబడినది.

## సవాయిసంజీవనీరసము (ప్రకారాంతరము)

శ్లో॥ సూతగన్ధకమ్లేచ్ఛాని తుత్థం వహ్నిం చ తిన్దుకమ్ । రసభస్మారుష్కరే చ గౌరీపాషాణమేవ చ (1) ప్రత్యేకం చైకభాగం చ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । నిమ్బద్రవేణ సంమర్ద్యం ముద్గమాత్రం తు సేవయేత్ (2) శతం సవామేహరోగాం వ్రణాన్ సర్వాంశ్చ నాశయేత్ । సవాసంజీవనీ నామారసస్త్రైలోక్యపూజితః (3)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, శు॥ ఇంగిలీకము, శు॥ పాలతుత్థము, చిత్రమూలము, శు॥ విషముష్టిగింజలు, రసభస్మ, శు॥ జీడిగింజలు, గౌరీపాషాణము, వీనిని ప్రత్యేకముగ ఒక్కొక్క భాగము చొప్పున గ్రహించి ఖల్వమునందుంచి వేపచెక్క రసముతో మర్దించి పెసరగింజలంత మాత్రలను చేసి సేవించినచో అనేక విధములైన సవామేహములు, సమస్త వ్రణములు నశించును. సవాయిసంజీవనీరసమని చెప్పబడును.

## కృష్ణోషణరసము

శ్లో॥ అకరామ్బకకృష్ణే చ ప్రత్యేకసమభాగికే । ద్వితుల్యం రససిన్దూరం మర్దయేద్భృఙ్గరాజకైః (1) గుఞ్జామాత్రం వటీం ఖాదేత్సర్వజ్వర నివారకః । శోథం పాణ్డుం నిహన్త్యేవ తత్క్షణేన నసంశయః । కృష్ణోషణ రసో నామ సర్వామయ నివారకః (2)

అ॥ అక్కలకర్ర 1 భా, మిరియాలు 1 భా, రససిందూరము 2 భా, వీనిని గుంటగలగరరసముతో మర్దించి గురివిందగింజలంత మాత్రలనుచేసి సేవించినచో సమస్త జ్వరములు, నంజు, పాండువు ఇవి వెంటనే తప్పక నశించును. ఈ కృష్ణోషణరసము సమస్త వ్యాధులను నశింపచేయును.

## త్రైలోక్యాడంబరరసము

శ్లో॥ రసగన్ధకతామ్రాణి లోహమభ్రం విషం తథా । టఙ్కణం సర్జ కాక్షారం దరదం చ కపర్దికాః (1) అర్కక్షీరేణ సంమర్ద్య వజ్రీక్షీరేణ భావయేత్ । నిర్గుణ్ఠ్యా భృంగరాజస్య చార్ద్రికస్య ద్రవేణ చ (2) గుల్మే జలోదరే రోగే శోఫే పాణ్డ్వామయే క్షయే । శూలే విషూచికాయాం చ హ్యనుపానైః ప్రయోజయేత్ (3) త్రైలోక్యాడమ్బరో నామ కథితో రోగశాన్తయే । వల్లమాత్రప్రమాణేన త్రిస్సప్తాహం ప్రదాపయేత్ (4)

అ॥ శు॥ రసము, శు॥ గంధకము, తామ్రభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, శు॥ నాభి, సర్జక్షారము, శు॥ వెలిగారము, శు॥ ఇంగిలీకము, గవ్వలభస్మ, వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడుపాలు, జెముడుపాలు, వావిలిరసము, గుంటగలగరరసము అల్లపురసము, వీనితో మర్దనను భావనను చేయవలయును. దీనిని గుల్మము, జలోదరము, నంజు. పాండువ్యాధి, క్షయ, శూల, విషూచి, వీనియందు తగు ననుపానములతో నియ్యవలయును. ఈ త్రైలోక్యాడంబరరసము రోగములు శాంతించు నిమిత్తము చెప్పబడినది. వల్లపరిమితిగ ఇరువదియొక్కరోజులు ఇయ్యవలయును.

## విషూచీగజకేసరిరసము

శ్లో॥ టఙ్కణం పారదం గన్ధం ప్రత్యేకం వేదభాగకమ్ । శుక్తి ప్రవాలశఙ్ఖాంశ్చ ముక్తాఫలవరాటికే (1) పృథక్చ ఇచ్ఛభాగం విషం ద్వాదశ భాగకమ్ । ద్వాత్రింశద్భాగకృష్ణం చ బిల్వాశ్చారఘలోద్రకౌ (2) కపిత్థనిమ్బ చూతాశ్చ శుకేష్టం శాల్మలీ తథా । జమ్బ్వారేషాం చ నిర్యాసం ప్రత్యేకం చైక భాగకమ్ (3) నవభాగమహీఫేనం చ లికుచస్య రసేన చ । మర్దయేద్దశరాత్రం తు వల్లమాత్రం తు భక్షయేత్ (4) అత్యుగ్రాం త్రివిధానం చైవ విషూచీం వాతరోగకమ్ । జరాతిసారం గ్రహణీం సర్వశూలాన్నిహన్తి చ (5) విషూచీ గదనామాని కేసరీ కరిణం యథా । లోకానాముపకారాయశమ్భునా పరికల్పితః (6)

అ॥ తు॥ వెలిగారము, తు॥ పాదరసము, తు॥ గంధకము, వీనిని నాలుగేసి భాగములుగను, ముత్యపుచిప్పలభస్మ, పగడభస్మ, శంఖభస్మ, ముత్యభస్మ, గవ్వలభస్మ, వీనిని ఐదేసిభాగములుగను, నాభిని పండ్రెండుభాగములుగను, మిరియాలను ముప్పది రెండుభాగములుగను, నూరేడు, పెద్దమ్రాను, లొద్దుగ, వెలగ, వేప, మామిడి, జానిమ్మ, బూరుగ, నేరేడు వీని జిగురులను ఒక్కొక్క భాగముగను, తు॥ నల్లమందును తొమ్మిదిభాగములుగను, గ్రహించి నిమ్మకాయరసముతో పదిరోజులు మర్దించి వల్లపరిమితిగ సేవించినచో ఉగ్రమైనట్టియు మానువిధములైనట్టియు విషూచి, వాతవ్యాధులు, జ్వరాతిసారము, గ్రహణి, సమస్తశూలలు, ఇవి నశించును. సింహము, ఏనుగునువలె నిది విషూచిని నశింపచేయును. లోకముయొక్క ఉపకారము కొరకు ఈశ్వరునిచే చెప్పబడినది.

## భీమసేనకర్పూరము (పచ్చకర్పూరము)

శ్లో॥ సుధాంశోర్వసుభాగాః స్యురేలాభాగద్వయం తథా । చన్దనం చాబ్ధిఫేనం చ బీజం కతకసంభవమ్ (1) రసాఞ్జనం భద్రముస్తం ప్రత్యేకం భాగసమ్మితమ్ । సర్వం దుగ్ధే విమర్ద్యాథ పిణ్డం గోధూమపిష్టవత్ (2) కృత్వాపాత్రే నిధాయాథ క్షిపేత్పాత్రం తథోపరి । అథః ప్రజ్వాలయేద్దీపం వర్త్యాఽఙ్గుష్ఠసమానయా (3) ఏవం ప్రహరపర్యన్తం వహ్నిం కుర్యాచ్చ యుక్తితః । పాత్రస్యోపరిభాగం తు శీతలం రక్షయేద్బుధః (4) సదాఽఽర్ద్రై ర్వైలఖణ్డేన శీతరేన చ వారినా । స్వాఙ్గశీతం తతో జ్ఞాత్వా పశ్చాత్కర్పూరమహరేత్ (5) స్ఫటికాకారమత్యచ్ఛం శ్వేతం హీరమణిప్రభమ్ । భీమసేనాఖ్య కర్పూరమౌషదేషు ప్రయోజయేత్ (6)

అ॥ ముద్దహారతికర్పూరము 8 భా, ఏలకాయలు 2 భా, చందనము 1 భా, సముద్రపునురుగు 1 భా, చిల్లగింజలు 1 భా, రసాంజనము 1 భా, భద్రముస్తలు 1 భా, వీనిని ఆవుపాలతో నూరి గోధుమపిండివలె ముద్దను చేసి ఒక పాత్రయందుంచి పైన పాత్రను పెట్టి వ్రేలితో సమానమగు వత్తిని వెలిగించి అడుగుపాత్రయొక్క క్రిందను రెండుజాము లుంచవలయును. పై పాత్రయొక్క పైభాగమందు తడిగుడ్డలను చల్లనినీటిని వేయుచు చల్లగ నుండునట్లు చేయవలయును. అట్లు రెండుజాములు వండి స్వాంగశీతలమైన పిదప స్ఫటికమువలెను మిక్కిలి స్వచ్ఛముగను, తెల్లగను వజ్రమువంటి కాంతిగలదిగను నున్న కర్పూరమును గ్రహింపవలయును. ఇది భీమసేన కర్పూరమనబడును. సమస్తౌషధములయందును ఉపయోగింపవలయును.

## లో హ సౌ వీ ర ము

వ॥ శు॥ లోహరజనును 1 భాగముగను, శు॥ సౌవీరపాషాణమును 1 భాగముగను, గ్రహింపవలయును. లోహశోధన విధి :— లోహరజను ఇనుపకళాయియందు బాగుగ వేయించి నువ్వులనూనెయందు ముంచవలయును. పిదప వేడినీటితో కడుగవలయును. ఇట్లు రెండుపర్యాయములు చేసినయడల శుద్ధినొందును. లేక లోహరజనును నిమ్మకాయరసమునం దొకరాత్రియంతయు నానబెట్టి మరునాడు వేడినీటితో కడిగి ఎండయం దెండింపవలయును. ఇట్లు నాలుగు రోజులు చేయవలయును. సౌవీర శోధనవిధి :— సౌవీరమును చనుపాలయందుంచి ఆ చనుపాలిగురువరకు ఎండయం దుంచవలయును. ఇట్లు ఇరువదియొక పర్యాయములు చేయవలయును. తరువాత ఎండింపవలయును. లేక సౌవీరమును ఆవుపాలయందుంచి పాలు గట్టిపడువరకు ఎండలో పెట్టి పిమ్మట వేడినీటితో కడిగి ఎండింపవలయును. ఇట్లు శుద్ధిచేయబడిన లోహ సౌవీరములను ఖల్వమందుంచి మెత్తని చూర్ణమగు వరకు బాగుగ నూరి పిమ్మట ఆ మృదుచూర్ణమును శరావసంపుటమునందుంచి చక్కగ సంధిబంధనమును చేసి ఎండించి పొయ్యిమీద పెట్టి ఆరుగంటలకాలము వండవలయును. అందు మొదటి రెండుగంటలు మధ్య మాగ్నిచేతను తర్వాత నాలుగుగంటలు తీక్ష్ణాగ్నిచేతను వండవలయును. స్వాంగశీతలమున సిందూరమును గ్రహింపవలయును. మాత్ర—1 మొదలు 5 గ్రెయినుల వరకు. వాతరోగములకు ముఖ్యముగ నుపయోగింపవలయును.

## ర స సిం దూ ర వి ధి

శ్లో॥ శుద్ధసూతస్య గృహ్ణీయాద్భిషగ్భాగచతుష్టయమ్ । శుద్ధగన్ధస్య భాగైకం తావత్కృత్రిమగన్ధకమ్ (1) అథవా పారదస్యార్ధం శుద్ధగన్ధకమేవ హి । తయోః కజ్జలికాం కుర్యాద్దినమేకం విమర్దయేత్ (2) మృత్తికాం వాససా సార్ధం కుట్టయేదతియత్నతః । తయా వారత్రయం సమ్యక్కాచ కూపీం ప్రలేపయేత్ (3) మృత్తికాం శోషయిత్వా తు కూప్యాం కజ్జలికాం క్షిపేత్ । తాం కూపీం వాలుకాయన్త్రే స్థాపయిత్వా రసం పచేత్ (4) అగ్నిం నిరన్తరం దద్యాద్యావద్దినచతుష్టయమ్ । గృహ్ణీయాదూర్ధ్వసంలగ్నం సిన్దూర సదృశం రసమ్ (5)

ఆ॥ శు॥ పాదరసము 4 భా, శు॥ గంధకము 1 భా, కృత్రిమగంధకము 1 భా, ఇటుల వీనిని గ్రహింపవలయును. లేక శు॥ పాదరసమును 1 భా, శు॥ గంధకము ½ భా,

ఇటుల వీనిని గ్రహింపవలయును. వీనిని ఒకరోజు మర్దించి కజ్జలి చేయవలయును. మట్టిని బాగుగ నలియగొట్టి గుడ్డను పూసి కాచకుప్పెకు మూడుసారులు చుట్టవలయును. మట్టి ఎండినపిదప ఆ కాచకుప్పెయందు కజ్జలిని పోసి వాలుకాయంత్రమునందుంచి నాలుగుదినములు ఎడతెగకుండ మంటనువేసి వండవలయును. పిమ్మట కుప్పెకు పైన పట్టుకొనియున్న రససిందూరమును గ్రహింపవలయును.

## హింగుళోత్థరససిందూరము

వ॥ శు॥ ఇంగిలీకము 1 భా, శు॥ గంధకము 1 భా, ఈ రెండింటిని మెత్తగనూరి కాచకుప్పెయందు పోసి వాలుకాయంత్రమునందు మూడుదినములు క్రమాగ్నులతో వండి సిందూరమును గ్రహింపవలయును.

## రసకర్పూరనిర్మాణవిధి

శ్లో॥ శుద్ధసూతసమం కుర్యాత్ప్రత్యేకం గైరికం సుధీః । ఇష్టికాం ఖటికాం తద్వత్స్ఫటికాం సిన్ధుజన్మ చ (1) వల్మీకం క్షారలవణం భాణ్డరఞ్జకమృత్తికామ్ । సర్వాణ్యేతాని సంచూర్ణ్య వాససాచాపి శోధయేత్ (2) ఏభిశ్చూర్ణైర్యుతం సూతం యావద్యామం విమర్దయేత్ । తచ్చూర్ణ సహితం సూతం స్థాలీమధ్యే పరిక్షిపేత్ (3) తస్యాః స్థాల్యా ముఖే స్థాలీమపరాం ధారయేత్సమామ్ । సవస్త్రకుట్టితమృదా ముద్రయేదనయోర్ముఖమ్ (4) సంశోష్య ముద్రయేద్భూయో భూయః సంశోష్య ముద్రయేత్ । సమ్యగ్విశోష్య ముద్రాం తాం స్థాలీం చుల్ల్యాం విధారయేత్ (5) అగ్నిం నిరన్తరం దద్యాద్యావద్దిన చతుష్టయమ్ । అఙ్గారోపరి తద్యన్త్రం రక్షేద్యత్నాదహర్నిశమ్ (6) శనైరుద్ఘాటయేద్యన్త్రమూర్ధ్వస్థాలిగతం రసమ్ । కర్పూరవత్సువిమలం గృహ్ణీయాద్గుణవత్తరమ్ (7) శ్లో॥ దద్దేవకుసుమచన్దన కస్తూరీకుఙ్కుమైర్యుక్తమ్ । ఖాదన్హరతి ఫిరఙ్గం వ్యాధిం సోపద్రవం సపది (8) విన్దతి వహ్నేర్దీప్తిం పుష్టిం వీర్యం బలం విపులమ్ । రమయతి రమణీశతకం రసకర్పూరస్య సేవకః సతతమ్ (9)

అ॥ గైరికము, ఇటుకరాయి, సుద్ద, పటిక, సైంధవలవణము, పుట్టమన్ను, సూరేకారము, కుండలకు రంగువేయుమన్ను, వీనిని ప్రత్యేకముగ ఒక్కొక్క భాగము చొప్పున గ్రహించి చూర్ణించి వస్త్రగాలితము చేసి అందు శు॥ పాదరసమును 1 భా,

చేర్చి ఒక జాము మర్దించి ఒక పాత్రయందు పోసి ఆపాత్రతో సమానమైన పాత్రను పైన బోర్లించి ఈ రెండిటియొక్క మూతులను మట్టిచే పూయబడిన గుడ్డతో చుట్టి సీలచేసి ఎండింపవలయును. మరల సీలచేసి ఎండింపవలయును. ఇట్లు మూడుసారులు చేయవలయును. పిమ్మట ఆ సంపుటమును బొగ్గులపొయ్యి మీదనుంచి నాలుగురోజులు రాత్రింబగళ్ళు ఎడతెగకుండ అగ్ని యుండునట్లు చేయవలయును. తరువాత ఆ సంపుటమును మెల్లగ విప్పి పైపాత్రకు పట్టినట్టియు కర్పూరమువలె స్వచ్ఛముగ నున్నట్టియు శ్రేష్ఠమైన గుణములు కలిగినట్టియు రసకర్పూరమును గ్రహింపవలయును. దానిని లవంగములు, చందనము, కస్తూరి, కుంకుమపువ్వు, వీనితో సేవించినయెడల ఉపద్రవములతో కూడిన ఫిరంగవ్యాధులు (సవాయి మొదలగునవి) వెంటనే నశించును. అగ్నిదీప్తి, శరీరపుష్టి, వీర్యవృద్ధి, బలము ఇవి కలుగును. చాలమంది స్త్రీలతో రమించుశక్తి కలవాడగును.

* గ్రన్థస్సమాప్తః *

# ఔ ష ధ నా మ ము ల ర్థ ము

## పే రు ల యొ క్క ఉ ద్దే శ ము

ఒకే పేరుగల ఔషధయోగములు కొన్ని యున్నప్పుడు ఆ యోగము నందు వస్తువులు స్వల్పముగ కలిసినచో "లఘు" అనియు, అధికముగ కలిసినచో "మహా" అనియు, బంగారము కలిసినచో "సువర్ణ" లేక "సువర్ణాది" అనియు, మొదలగు పేరులు వ్యవహారజ్ఞానముకొరకై ఏర్ప రచబడును. ఒక్కొక్కప్పుడు అనేకయోగములు లేకపోయినను అధికమగు వస్తువులు కలియుట, బంగారము కలియుట, మొదలగు కారణములచే "మహా" "సువర్ణ" మొదలగు పేరులుండును. మరియు వంట, కట్టలి, పుటభేదములు, మందునందు కలియు ముఖ్యవస్తువులు, మందుయొక్క ముఖ్యగుణము, మందుయొక్కవర్ణము, మందుయొక్క స్వభావము, మొద లగువాని ననుసరించి మందులయొక్క పేరులుండును. పేరుచేతనే మందు యొక్క స్వభావము, ముఖ్యగుణము, ముఖ్యముగ కలియువస్తువు, మొద లగునవి తెలియునట్లుగ మందులయొక్క పేరులు పెద్దలచే పరికల్పింప బడినవి.

పేజీ

కాం త వ ల్ల భ ర స ము :- కోరబడెడి ఔషధములలో ప్రధానమైనది. లేక కాంతము ప్రధానముగ కలది, కావున కాంత వల్లభరసమని చెప్పబడును. 3

ర జ త లో హ ర సా య న ము :- వెండియును లోహ మును ఇందు ప్రధానముగ నుండును. కావున రజతలోహరసాయన మని చెప్పబడును. 5

జ్వ ర గ జాం కు శ ము :- జ్వరమనెడి ఏనుగునకు అంకు శమువంటిది. కావున జ్వరగజాంకుశమని చెప్పబడును. 8

సూ చి కా ము ఖ ర స ము:- సూదియొక్క కొనచే గ్రహింప

పేజీ

దగిన యౌషధము. కావున సూచికాముఖరసమని చెప్పబడును. 8

పంచవక్త్రరసము:- సింహముతో సమానమైన పరాక్రమము కలది. కావున పంచవక్త్రరసమని చెప్పబడును. 9

చండభానురసము:- తీక్ష్ణమైన సూర్యునితో సమానమైనది. అనగా తీవ్రముగ పనిచేయునది. కావున చండభానురసమనబడును. 10

సంనిపాతభైరవము,- సంనిపాతములకు భయమును కలిగించునది. కావున సంనిపాతభైరవమని చెప్పబడును. 11

వైష్ణవరసము :- విష్ణువుచే చెప్పబడినది. కావున వైష్ణవరసమని చెప్పబడును. 11

సూచికాభరణరసము:- సూదిచే భరింప (గ్రహింప) దగిన యౌషధము. కావున సూచికాభరణరసమని చెప్పబడును. 11

వాతవిధ్వంసనరసము:- వాతమునుధ్వంశము (నశింప) చేయునది. కావున వాతవిధ్వంసనరసమని చెప్పబడును. 12

జ్వరగజకేసరిరసము:- జ్వరమనెడి ఏనుగునకు సింహము వంటిది. కావున జ్వరగజకేసరి యనబడును. 16

పైత్యాంతకరసాయనము-: పైత్యవ్యాధులను నశింపజేయునది. కావున పైత్యాంతక మనబడును. 16

హేమరజతరసాయనము :- బంగారమును, వెండియు కలిసిన యౌషధము. కావున హేమరజతరసాయనమని చెప్పబడును. 17

వాతకుఠారరసము - వాతమునకు గండ్రగొడ్డలివంటిది. (నశింపజేయునది) కావున వాతకుఠారరసమని చెప్పబడును. 18

వాతగజాంకుశరసము:- వాతమనెడి గజమునకు అంకుశము వంటిది, అనగా వాతములను నశింపజేయునది. కావున వాతగజాంకుశ రస మనబడును. 18

పేజీ

సింహప్రతీపాలనము :- సింహముతో సమానమైన పరాక్రమముకలది, కావున సింహప్రతీపాలన మనబడును. 18

వాతరాక్షసము :- వాతములనుండి రక్షించునది. కావున వాతరాక్షస మనబడును. 20

మహాలక్ష్మివిలాసరసము :- లక్ష్మిప్రదమైన యౌషధము కావున లక్ష్మివిలాస మనబడును. 28

వంగాదియోగము :- వంగభస్మ ఆదియందు గల యోగము. కావున వంగాదియోగమని చెప్పబడును. 28

సుధానిధిరసము :- అమృతమునకు స్థానమైనది. అనగా అమృతముతో సమానమైనది. కావున సుధానిధిరసమని చెప్పబడును. 30

మహాతాళేశ్వరరసము :- తాళకము కలిసిన యౌషధము. కావున మహాతాళేశ్వరరసమని చెప్పబడును. 31

విద్యాధరరసము :- దేవతాభేదములగు విద్యాధరులచే గూడ సేవింపదగినది. కావున విద్యాధరరసమని చెప్పబడును. 33

రసభూపతి :- రసౌషధములలో శ్రేష్ఠమైనది. కావున రసభూపతి యనబడును. 33

త్రినేత్రరసము :- ఈశ్వరుని యొక్క మూడవనేత్రము ద్రవ్యములనువలె నిది పరిణామశూలను నశింపజేయును. కావున త్రినేత్రరసమని చెప్పబడును. 33

స్వచ్ఛందభైరవరసము :- రోగముల యొక్క స్వాతంత్ర్యమునకు భయమును కలిగించునది. అనగా రోగములను నశింపజేయునది. కావున స్వచ్ఛందభైరవరసమని చెప్పబడును. 34

పేజీ

పేజీ

చెప్పబడును. లేక పుచ్చుకొనునప్పుడు తొమ్మిది చుట్లు (సారులు) అరగదీసి పుచ్చుకొనదగినది. కావున నవగ్రహియని చెప్పబడును. 90

షడ్గుణము :- పాదరసమునకు ఆరురెట్లు గంధకముతో వండబడునది. కావున షడ్గుణ మనబడును. 93

సర్వమేహారిపురసము – సమస్తమేహములను నశింపజేయునది. కావున సర్వమేహారిపురస మనబడును. 93

సువర్ణకల్పామృతము :- బంగారము కలిసి అమృతతుల్యముగ నుండునది. కావున సువర్ణకల్పామృత మనబడును. 94

శ్లేష్మవిధ్వంసిరసము :- శ్లేష్మములను, శ్లేష్మవ్యాధులను నశింపజేయును. కావున శ్లేష్మవిధ్వంసి యనబడును. 95

కఫవిధ్వంసినీరసము :- కఫమును కఫవ్యాధులను, నశింపజేయునది. కాన కఫవిధ్వంసిని యనబడును. 95

పూర్ణచంద్రోదయము :- పదునారుభాగముల గంధకమును కలిగియుండుటచే గాని చంద్రోదయమువలె మన్మథోద్రేకమును కలిగించునదగుటచే గాని చంద్రునితో సమానమగు కాంతిని కలిగించునదగుటచే గాని పూర్ణచంద్రోదయమని చెప్పబడునని యందురు. (మన్మథోద్రేకమును కలిగించునది. కావున మకరధ్వజమనికూడ కొన్ని గ్రంథములయందు చెప్పబడినది. కాని పూర్ణచంద్రోదయమునకు మకరధ్వజమనెడి వాడుక ఆంధ్రదేశములో లేదు.) 97

మకరధ్వజము :- మకరధ్వజుడనగా మన్మథుడు. మన్మథోద్రేకమును కలిగించునది. కావున మకరధ్వజమని చెప్పబడును. 99

షడ్గుణబలిజారితమకరధ్వజము :- ఆరురెట్ల గంధకముతో వండబడునది. కావున షడ్గుణబలిజారితమకరధ్వజమని చెప్పబడును, 100

పేజీ

సిద్ధమకరధ్వజము:- సిద్ధుల కొరకు చెప్పబడినది. కావున సిద్ధమకరధ్వజమని చెప్పబడును. 100

పంచశరరసము:- మన్మథోద్రేకమును కలిగించునది. కావున పంచశరరసమని చెప్పబడును. 102

రాజరసాయనము.- రసాయనములలో శ్రేష్ఠమైనది. కావున రాజరసాయనమని చెప్పబడును. 104

మహాకామసంజీవనరసము - అధికమగు కామోద్రేకమును కలిగించునది. కావున మహాకామసంజీవనరసమని చెప్పబడును. 105

పర్పటీరసము:- అప్పడమువలె పలచగ తయారగు నౌషధము. కావున పర్పటీరసమని చెప్పబడును. 107

శూలనికృంతనము:- శూలలను నశింపచేయునది. కావున శూల నికృంతకమని చెప్పబడును. 108

చంద్రశీతరసము:- చంద్రుడువలె చలువను జేయునది. కావున చంద్రశీతరసమని చెప్పబడును. 109

ఆమకులాంతకము:-ఆమమును నశింపజేయునది. కావున ఆమకులాంతకమని చెప్పబడును. 109

కామవిలాసరసము:- మన్మథోద్రేకమును కలిగించునది. కావున కామవిలాసరసమని చెప్పబడును. 110

సూర్యప్రభారసము:- సూర్యునితో సమానమైన తీక్ష్ణగుణము కలది. కావున సూర్యప్రభారస మనబడును. 111

బాలసూర్యోదయము:- ఉదయించుచున్న బాలసూర్యుని యొక్క వర్ణము వంటి వర్ణము కలది. కావున బాలసూర్యోదయమని చెప్పబడును. 114

శృంగారాభ్రకరసము :- అభ్రకమధికముగ కలిసినది. కావున శృంగారాభ్రకరసమనబడును. 127

కాసకుఠారరసము :- దగ్గులను ఛేదించునది. కావున కాసకుఠారరస మనబడును. 128

రోగశోషణరసము :- రోగములను నశింపజేయునది. కావున రోగశోషణరస మనబడును. 128

పాశుపతాస్త్రరసము :- పాశుపతాస్త్రము రాక్షసులనువలె నిది జ్వరములను సంహరించును. కావున పాశుపతాస్త్రరసమని చెప్పబడును. 130

భేదిజ్వరాంకుశము :- విరేచనమును చేయుచు జ్వరమును నశింపజేయునది. కావున భేదిజ్వరాంకుశ మనబడును. 140

కాంచనకాంతిరసము :- శరీరమునకు బంగారముతో సమానమైన కాంతిని కలుగజేయునది. కావున కాంచనకాంతిరస మనబడును. 140

విస్ఫోటకనాశకరసము :- స్ఫోటకమును నశింప జేయునది. కావున విస్ఫోటకనాశకరస మనబడును. 141

కందర్పరసము :- కామమును వృద్ధిపరచునది. కావున కందర్పరస మనబడును. 142

క్షారతామ్రరసము :- క్షారము, తామ్రము, ప్రధానముగ గల యౌషధము. కావున క్షారతామ్రరసమనబడును. 142

వీరవిక్రమరసము :-వీరునివలె పరాక్రమముగలిగి రోగములతో పోరాడెడి యౌషధము. కావున వీరవిక్రమరస మనబడును, 142

పేజీ

పేజీ

వాతమారకరసము :- వాతవ్యాధులను చంపునది. (నశింపజేయునది.) కావున వాతమారకరస మనబడును. 206

ముఖారిరసము :- నోటివ్యాధులకు శత్రువు. (నశింప జేయునది). కావున ముఖారిరస మనబడును. 207

వాతనాశకరసము :- వాతవ్యాధులను నశింపజేయునది. కావున వాతనాశకరస మనబడును. 207

చతుర్ముఖరసము :- బ్రహ్మచే చెప్పబడినది. కావున చతుర్ముఖ రస మనబడును. 208

సర్వవాతహరరసము :- సమస్త వాత వ్యాధులను హరింపజేయునది. కావున సర్వవాతహరరస మనబడును. 209

వాతకులాంతకరసము :- వాతవ్యాధులను అంత మొందించునది, కావున వాతకులాంతకరస మనబడును. 210

వసంతకుసుమాకరము :- వసంత ఋతువునందలి పుష్పములకు స్థానము. అనగా వసంతఋతువునందు పుష్పించు పుష్ప ములన్నిటియొక్క రసములచే భావనచేయతగినది. కావున వసంత కుసుమాకరమని చెప్పబడును. 211

విషూచీవిధ్వంసకరసము :- విషూచిని (కలరాను) నశింపజేయునది. కావున విషూచీ విధ్వంసకరమని చెప్పబడును. 226

ఆనందరసము :- క్షయ మొదలగు వ్యాధులను నశింప జేసి సంతోషమును కలిగించునది. కావున ఆనందరసమని చెప్ప బడును. 228

కృచ్ఛ్రాంతకరసము :- మూత్రకృచ్ఛ్రమును నశింప జేయునది. కావున కృచ్ఛ్రాంతకరస మనబడును. 230

కర్పూరరసము:- హారతికర్పూరము కలిసిన యౌషధము. కావున కర్పూరరస మనబడును. 230

పేజీ

రసదోషారియోగము :- రసదోషములను నశింపజేయు యోగము. కావున రసదోషారియోగమని చెప్పబడును. 231

మధుమేహాంతకరసము :- మధుమేహమును నశింపజేయునది. కావున మధుమేహాంతకరస మనబడును. 232

రక్తగుల్మాంతకరసము :- రక్తగుల్మమును అంతమొందించునది. కావున రక్తగుల్మాంతకరసమని చెప్పబడును. 232

మహామేహాంతకరసము:- మేహములను నశింపజేయు వానిలో గొప్పది. కావున మహామేహాంతకరసమని చెప్పబడును. 233

తామ్రరసాయనము :- తామ్రప్రధానమైన యౌషధము, కావున తామ్రరసాయనమని చెప్పబడును. 238

పాషాణవజ్రరసము.- రాళ్ళను (అశ్మరిని) భేదించునది. కావున పాషాణవజ్రరసమని చెప్పబడును. 239

మేహాంతకరసము :- మేహములను నశింపజేయునది. కావున మేహాంతకరసమని చెప్పబడును. 240

నేపాలరసము :- నేపాళము ప్రధానముగ కలిగిన యౌషధము. కావున నేపాలరసమని చెప్పబడును. 242

షడ్వర్గసిందూరము :- ఆరు వస్తువులు కలిసిన సిందూరౌషధము. కావున షడ్వర్గసిందూర మనబడును. 242

సూతశేఖరరసము :- రసౌషధములలో శ్రేష్ఠమైనది. కావున సూతశేఖరరస మనబడును. 243

రామబాణరసము :- రామబాణమువలె నమోఘముగ జ్వరములను నశింపజేయునది. కావున రామబాణరస మనబడును. 243

పేజీ

తారకేశ్వరరసము :- చంద్రునివలె చలవను చేయు నది. కావున తారకేశ్వరరసమని చెప్పబడును. 262

హేమనాధరసము :- బంగారము కలిసిన యౌషధము. కావున హేమనాధరసమని చెప్పబడును. 264

రసమాణిక్యము :- మాణిక్యములవలె మెరయుచుండు ఔషధము. కావున రసమాణిక్యమని చెప్పబడును. 265

కామధేనురసము :- కోరినకోరికలను ఇచ్చునది. అనగా ప్రమేహాదులను నశింపజేయునది. కావున కామధేనురసమని చెప్ప బడును. 268

శ్వేతారిరసము - శ్వేతకుష్ఠమునకు శత్రువు. కావున శ్వేతారిరసమని చెప్పబడును. 268

మహాతాలకేశ్వరరసము :- తాలకము ప్రధానముగా గల యౌషధము కావున మహాతాళకేశ్వరరసమని చెప్పబడును. 270

కామినీవిద్రావణరసము :- స్త్రీలయొక్క మనస్సును కరరించునది. కావున కామినీవిద్రావణరసమని చెప్పబడును. 271

ప్రళయానలరౌద్రరసము :- ప్రళయకాలమునందలి యగ్నితో సమానమైన రౌద్రముకలది. కావున ప్రళయానలరౌద్ర రసమని చెప్పబడును. 272

మన్మథాభ్రరసము :- మన్మథునితో సమానముగ చేయునది, కావున మన్మథాభ్రరసమని చెప్పబడును. 273

ప్రదరారిరసము :- ప్రదరములకు శత్రువు. కావున ప్రదరారిరసమని చెప్పబడును. 274

పే

ర జః ప్ర వ ర్త క ర స ము :- ఆర్తవమును సరిగ ప్రవర్తింప జేయునది. కావున రజఃప్రవర్తకరసమని చెప్పబడును. 27

బా ల సూ ర్యో ద య ము :- ఉదయించుచున్న బాలసూర్యుని యొక్క వర్ణమువంటి వర్ణము (ఏఱుపు) కలది. కావున బాల సూర్యోదయమని చెప్పబడును. 27

వి ష మ జ్వ రాం త క ర స ము :- విషమజ్వరములను నశింప జేయునది. కావున విషమజ్వరాంతకరసమని చెప్పబడినది. 27

మృ త్యుం జ య ర స ము :- మృత్యువును నశింపజేయునది. కావున మృత్యుంజయరసమని చెప్పబడును. 27

మే హ గ జాం కు శ ము :- మేహములనెడి ఏనుగులకు అంకు శము వంటిది. కావున మేహగజాంకుశమని చెప్పబడును. 28

సువర్ణ, మహా మొదలగు పేరులు కలుగుటకు కారణముల ప్రారంభమున వివరించి వ్రాయుటచేతను, కొన్నిటికి అర్థములు సరిగ తెలి యక పోవుటచేతను, కొన్నిటికి తెలిసియుకూడ ప్రయోజనకారిగ నుండ పోవుటచేతను, అన్నియోగములయొక్క పేరులకు అర్థమును వ్రాసి చద వరులకు శ్రమను కలిగించలేదు. మరియు అంతక, కుఠార, అరి, మొ లగు శబ్దములు చాల సారులు వచ్చుటచే వానికి అర్థము గ్రహింపగల దురు గదా యని అట్టి శబ్దములు తుదను కల చాలయోగములకు అర్థముల వ్రాయుట మానితిని.

# ఔషధ విశేష వివరణము

## కాంతవల్లభరసము — పేజి 3

ఇందు శిలాజతు అనగా తెల్లగనుండు కర్పూరశిలాజతుభస్మనే అనేకులు వేయుచున్నారు. కాని గోమూత్రశిలాజతును వేయుట శ్రేష్ఠము. మర్దన నిమిత్తము రసము లేవియు చెప్పబడి యుండకపోవుటచే నీటితో మర్దింపవలయును. ఆర్ద్రిమూసయని చెప్పబడియున్నను ఇతరౌషధములను వండు గాజుకుప్పెలతో వండుచున్నారు. యోగమునందు చెప్పబడిన భాగముల ప్రకారముగ వేసిన (నూరిన) ఔషధమును 2, 3, 4 కుప్పెలయందుంచి వండవచ్చును. పాకవిశేషపరిజ్ఞానము_కడ్డీకి రసగంధకకజ్జలి పట్టుకొనుట మానగనే మణిశిల పచ్చగ పట్టుకొనును. పిమ్మట వెలిగారమును కర్పూరశిలాజతును కలిసి తెల్లగ బూడిదపూసినట్లు పట్టుకొనును. పిమ్మట పాదరసము తెల్లగ పట్టుకొనును. పాదరసము కడ్డీకి పట్టుకొనుట ప్రారంభింపగనే మంటను మానక కడ్డీకి గంధకపువాసన కొంచెమైనను లేనంతవరకు వండవలయును. ఒక్కొక్కప్పుడు 5, 6 రోజులకే పక్వమగును. విశేషపరిజ్ఞానము_రసము సిందూరించి కొంతభాగము వంటకుప్పె పైభాగమునందు (లోపల) పట్టుకొనును. కొంతభాగము కుప్పె అడుగుభాగమునందున్న యౌషధముపైన సిందూరించి యుండును. వంటకుప్పెకు అడుగుభాగమునందున్న యౌషధమును పైభాగమునందు పట్టుకొనియున్న సిందూరమును తీసి ఏకముగ కలిపి నీటితో నూరి కుప్పెలను కట్టవలయును. త్రిఫలారసము, కలుబంద రసము మొదలగు వానితో నూరి కుప్పెలను కట్టు సాంప్రదాయము కూడ కలదు. గోమూత్రశిలాజతును వేయునెడల వంటయైన పిదప కుప్పెలను కట్టునిమిత్తము నూరునప్పుడు వేయవలయును. తయారైన మందుకుప్పెలు కొంచెము ఎరుపువర్ణము కలసిన నలుపువర్ణమును కలిగియుండి గట్టిగ బరువుగ నుండును.

## రజతలోహరసాయనము — పేజి 5

3—వ యోగమునందు తీక్ష్ణ (ఖడ్గ) లోహమని సామాన్యముగ చెప్పబడియున్నను 1, 2, 4, 5—వ యోగములయందు జీవలోహము (లోహరజను) అని చెప్పబడియుండుటచే నీ రజతలోహరసాయనము లన్నిటియందును శుద్ధిచేయబడిన ఖడ్గలోహపురజనునే వేయవలయును. భస్మను వేసినను బాగుగ పని చేయును. ఈ యోగములయందు (రజతలోహ రసాయనములయందు) రజనును వేయవలయునని ప్రత్యేకముగ చెప్పుటకు తగిన కారణము లేదు. (తెలియదు). రజనును కలిపి వండిన మందుయొక్క కుప్పెలు మిక్కిలి గట్టిగ నుండును. కొందరు వెండిని కూడ రజనుగనే చేసెదరు. కాని భస్మనే వేయుట శ్రేష్ఠము. పాకవిశేషపరిజ్ఞానము—రసగంధకకజ్జలి కడ్డీకి పట్టుకొనుట మానినపిదప రసము కడ్డీకి తెల్లగ పట్టుకొనుటకు ప్రారంభించును. అప్పుడు పక్వమైనట్లు తెలిసికొనవలయును, వీనిలో కొన్ని యోగములయందు కొన్ని

గుణములు చెప్పబడియుండకపోయినను ప్రతి యోగమునందును ఆ గుణములన్నియు నున్నవని తెలిసికొనవలయును. ఈ యోగములయందు వ్రాయబడిన గుణములన్నిటి యందును ఇది చక్కగ పనిచేయును. వెండి అధికముగ కలిసినది మేహప్రధానమైన వ్యాధులయందును, లోహ మధికముగ కలిసినది వాతశ్లేష్మప్రధానమైన వ్యాధుల యందును, చక్కగ పనిచేయును. ఆయా అనుపానములతో అరగదీసి చంటిపిల్లలకు కలుగు దగ్గు, ఎగరొప్పు, డొక్కలెగరవేయుట, మొదలగువాని యందుగూడ వాడెదరు.

## సన్నిపాతభైరవి — పేజి 11

ఇందు శు॥ మణిశిల 3 భా, శు॥ వెలిగారము 3 భా, శు॥ ఇంగిలీకము 12 భా, అనెడి అర్థభేదము కూడ గలదు. దీనిని సన్నిపాతజ్వరము మొదలగు వానియందు కలిగిన అతిసారములయందును, జలుబు మొదలగు వానియందును, కూడ వాడెదరు. జ్వరము, జలుబు మొదలగు వానియందు కలికముగ కూడ నుపయోగించెదరు.

## వాతవిధ్వంసి — పేజి 12

ఇందు అల్లము అను స్థలమున జిల్లేడు అనియు, నిమ్మకాయ అను స్థలమున వేప అనియు, అర్థము కలుగునట్లు పాఠభేదములు కలవు. మరియు నేలయుసిరిక మొదలగు మరి కొన్ని రసములతోగూడ మర్దింపవలసినట్లుగ కొన్ని యధికపాఠములు కలవు. దీనిని జ్వరమునందు కలిగిన అతిసారములందు ఉపయోగించు సాంప్రదాయము కలదు.

## వాతగజాంకుశము — పేజి 18

ఇందు కొందరు గంధకమును 8 భాగములుగ వేయుదురు. కాని అట్లు వేయుటకు తగిన అవకాశము కనబడదు. విశేషగుణములు—ఇందు ముషిణిగింజలు కలియుటచే అజీర్ణము, నరములయొక్క బలహీనత, అగ్నిమాంద్యము, గుండెవ్యాధులు, మలబంధము మొదలగు వానిని కూడ నశింపజేయును.

## మహాలక్ష్మీవిలాసము — పేజి 28

పుటయోగమునందు "ఏతత్సమం వ్యోషరసేన మర్ద్యం" వీనిని సమభాగములుగ త్రికటుకషాయముతో మర్దించి అని పాఠభేదము కలదు. ఈ పాఠము ననుసరించినచో సమానమగు రసభస్మను వేయనవసరములేదు. క్రమవృద్ధి మహాలక్ష్మీవిలాసరసమునందు మామూలుగ నుపయోగించు రససిందూరమును వేసెదరు. కాని ఇంగిలీకమునుండి తీయబడినరసముతో వండబడిన రససిందూరమునే వేయుట శ్రేష్ఠము. త్రిఫలాకషాయ మును పోసి నూరగనే ఔషధము కొద్దిగ నల్లగ నగును. కుంకుమపువ్వును, కస్తూరిని, బహుస్వల్పముగ అనగా సువర్ణభస్మను 1 తులమునకు చొప్పున గ్రహించినయెడల వానిని

ఒక్కొక్క ¼ తులము చొప్పున గ్రహింపవలయును. విశేషగుణములు—శుక్లస్రావము, నాడి నీరసముగనుండుట, పొడిదగ్గు, పొడిఆయాసము, శరీరము ఎల్లపుడును వేడిగ నుండుట, వేడివలన బలహీనముగనుండుట, క్షయ, శ్వేతరక్తప్రదములు, మొదల, వేడివలన కలిగిన వ్యాధులయందు అమోఘములగు గుణముల నిచ్చును.

## రసభూపతి — పేజి 33

క్షయ దగ్గు, ఆయాసము, అజీర్ణము, తిమ్మిర్లు మొదలగు శ్లేష్మవ్యాధులను వాతవ్యాధులను, చంటిపిల్లలకు కలుగు జలుబు, డొక్కలెగరవేయుట మొదలగు వ్యాధులను, ఇది నశింపజేయును.

## స్వచ్ఛందభైరవరసము — పేజి 34

ఈ యోగమునందు చెప్పబడకపోయినను దీనిని తమలపాకులరసముతో మర్దించెదరు. విశేషగుణములు—వాంతి, జ్వరము, జలుబు, దగ్గు, అజీర్ణము, అతిసారము, మొదలగు పసిపిల్లలకు కలుగు వ్యాధులయందు ప్రధానముగ వాడెదరు.

## సిందూరభూషణము — పేజి 36

దీనిని నోటిపూత, రక్తప్రదరములు, శుక్లనష్టము, మొదలగు ఉష్ణప్రధానమైన వ్యాధులయందుకూడ తరచు వాడెదరు. లఘుసిందూరభూషణమును మాత్రము గర్భిణీ స్త్రీలకుకలుగు సమస్తవ్యాధులయందును వాడెదరు.

## స్వర్ణమాల్యవసంతము — పేజీ 43

ఇందు వెన్నను మిక్కిలిస్వల్పముగనే వేసి మర్దింపవలయును. వెన్నను అధికముగ వేసినచో మందునందలి చమురు ఆరక కప్పెలు సరిగ కానేరవు. మిగిలిన మూడు యోగములయందు వెన్నయని సామాన్యముగ చెప్పబడియున్నను పచ్చిపాలను చిలకగ వచ్చిన వెన్ననే గ్రహించుట శ్రేష్ఠము.

## తాలకభస్మయోగము — పేజీ 49

తాళకమును ముక్కగ నుంచుటకంటె ఉత్తరేణాకుపసరుతో నూరి బిళ్ళచేసి యుంచుట శ్రేష్ఠము. ఉత్తరేణీబూడిదను కుండయందు 5-6 అంగుళముల యెత్తున పోసి పైన తాళకమునుంచిపైన మరల 4-5 అంగుళముల యెత్తున ఉత్తరేణీబూడిదను పోయవలయును, కొందరు కుండపైన మూకుడును బోర్లించి సంధిబంధనమును చేసెదరు.

## కీటమర్దరసము — పేజీ 55

కృములను, కృములమువలన కలిగిన వ్యాధులను నశింపజేయుననియు జాఠరదీప్తిని మూడురోజులలో కలుగజేయుననియు గ్రంథాంతరములయందు చెప్పబడినది.

## క్రవ్యాదరసము — పేజీ 59

తామ్రభస్మ 1 పలము, లోహభస్మ 1 ప, అనియు తామ్రభస్మ ¼ ప, లోహభస్మ ¼ ప, అనియు మొదటి క్రవ్యాదరసమునందు పాఠభేదములు కలవు. ఈ భాగములననుసరించి వెలిగారము మొదలగు వానియొక్క భాగములను మార్చుకొనవలయును. "తదర్ధపఞ్చలవణైః" (వెలిగారమునకు సగము భాగము పంచలవణములు) అని యోగాంతరమునందు కలదు. శ్లో॥ వివ్వ హిఙ్గుభిరైస్సార్ధం క్రవ్యాదో భక్షితో రసః। గుల్మానశేషాన్ ప్లీహానం విద్రధీనపి నాశయేత్॥ శుంఠి, ఇంగువ, బిడాలలవణము. వీనితో క్రవ్యాదరసమును సేవించినయెడల సమస్తగుల్మములును, ప్లీహావ్యాధులును, విద్రధులును నశించును అనియుకూడ గ్రంథాంతరమునందు కలదు. ఈ క్రవ్యాదరసములలో కొన్నిటియందు, తయారైన పిదప ఎండించి నూరి సీసాయందుంచవలయునని చెప్పబడియున్నను తడిగ ముద్దగనే యుంచెదరు.

## స్వర్ణవంగము — పేజీ 65

మొదట వంగమును కరిగించి పొయ్యిమీదనుండిదింపి వెంటనే యందు పాదరసమును పోసి వెంటనే మఱియొక పాత్రయందు పోయవలయును. కొద్ది కాలమునకు (వెంటనే) బిళ్లవలె నగును. దానిని ఖల్వమందుంచి నలియకొట్టినచో తొందరగనే ముక్కలుగ విరుగును. దీనిని మెత్తగనూరి పిదప గంధకమును వేసి నూరి కలుబందరసముతో మర్దించి తుదకు నవాసారమును వేసి మరల కలుబందరసముతోడనే మర్దింపవలయును. నవాసారమును వేసిన పిదప కలుబందరసమును మిక్కిలి స్వల్పముగనే వేయుచు మర్దింపవలయును. కలుబందరసము అధికమైనచో మందంతయు మిక్కిలి పలుచనై చాలదినముల వరకు గట్టిపడదు. వంగమును పలచనిరేకులుగ చేయించి చిన్న చిన్న ముక్కలుగ కత్తిరించి పాదరసమునందు వేసి నూరినను పాదరసమునందు కలిసిపోవును. పిదప గంధకమును చేర్చుట మొదలగువానిని చేయవచ్చును. పాకవిశేషపరిజ్ఞానము—పదేసితులముల చొప్పున వేసి యొక్క కుప్పెయందు వండినచో సుమారు 15—30 గంటలు వండవలయును. మందు ఉడుకునప్పుడు కడ్డీ వేసినయెడల మొదట కొద్దిగ నల్లగ పట్టుకొనును. క్రమముగ బంగారపు వర్ణముగ పట్టుకొనును. అప్పుడు పూర్తిగ పక్వమైనట్లు తెలిసికొనవలయును. మరియు మొదట కడ్డీ వేసినప్పుడు నవాసారము తెల్లనిజిగురుగ పట్టుకొనును. పాకము వచ్చునప్పటికి క్రమముగ పట్టుకొనుట తగ్గును. మరియు మందునందు వేసిన కడ్డీకి గంధకపు వాసన లేకుండ నుండవలయును. ఇదియు పాకలక్షణమే దీనికి కుప్పెయొక్క మూతియందు సిందూర

ముండదు. మందు అడుగుననే యుండును, బంగారపు వర్ణమును కలిగి యుండును. పదితులముల చొప్పున వేసినప్పుడు తయారైన మందు సుమారు 12-15 తులములుండును. మందు మిక్కిలి చులకనగ నుండును. దీనిని కుప్పెలు కట్టరు. దీనిని నూరి నిలువయుంచి వండినచో పాకము సరిగ రానేరదు. ఈ మందును ఎట్టి సీసాలయందైనను (మట్టిపూసిన గుడ్డలు చుట్టియే) వండెదరు. మరియు మట్టిమూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి యా సంపుటమును పొయ్యిమీద బెట్టి వండెదరు, ఇట్లు చేయునప్పుడు పై మూకుడునకు మధ్యయందు సన్నని రంధ్రమును పొడిచి యా రంధ్రమునుండి కడ్డీని వేయుచు పాకమును చూచుచుండవలయును. కాచకుప్పెయందు వండినమందే చక్కని వర్ణమును కలిగియుండును. దీనియందు వండినను మందునకు పైభాగమున కొంత మిగిలి నల్లగ నున్నయెడల దానిని తీసివేసి శుభ్రమైన దానినే గ్రహింపవలయును. విశేషగుణములు—సెగ వ్యాధులయందు కూడ ప్రధానముగ నిచ్చెదరు.

## రసరాట్ — పేజి 69

ఇందు వస్తువుల నన్నిటిని సమభాగములుగ గ్రహింపవలయునని కూడ కొందరి మతము కలదు. దీనిని మూకుళ్ళయందుంచి బాగుగ సంధిబంధనముచేసి గంధకము నశించునట్లు పుటమును వేయవలయును. లేక పొయ్యిమీదనుంచి మంట వేయవలయును. విశేషగుణములు :— నంజు, తిమ్మెర్లు, దగ్గు, మొదలగు వ్యాధులయందు వాడవచ్చును. చంటిపిల్లలకు కలుగు దగ్గు, ఎగరొప్పు, జలుబు, డొక్కలెగురవేయుట, మొదలగు శ్లేష్మవ్యాధులయందు ప్రధానముగ వాడెదరు.

## సూర్యావర్తి — పేజి 76

లఘుసూర్యావర్తి :— సమిడిపత్తిగింజలను కొద్దిగ వేయించి బట్టయందు మూటగకట్టి సామాన్యముగ నలియగొట్టి తీసి యాగింజలను విదల్చినయెడల నందలి పప్పు క్రిందపడును. గింజలలో నింకను పప్పు మిగిలియున్నట్లు తోచినయెడల మరల బట్టలో కట్టి మరల నలియకొట్టి విదల్పవలయును. గింజలను హెచ్చుగ (ఎఱ్ఱగ గాని దోరగ గాని) వేయించినయెడల పప్పు నల్లగ మాడిపోవును. కాన గింజలకు బాగుగ వేడితగల (కలుగ) గనే వేగినట్లు గుర్తింపవలయును. 4 తులములగింజలకు 1 తులము పప్పు దిగును. కాకిదొండ యనగా కొద్దిగ పొడుగుగనుండు కాయలు కలదానిని గాక గుండ్రముగ నుండు కాయలు కలదానిని గ్రహింపవలయును. వీని విత్తులు బీరవిత్తులవలె నుండును. బజారులో దొరకును. ఈ విత్తులపై పెంకను తీసివేసి లోనిపప్పును తీసికొనవలయును. ఈ విత్తులను అడ్డముగ గోడుగ నుంచి పైన మెల్లగ కొట్టినచో పై పెంకు త్వరలో నేకముగ నూడిపోయి లోనిపప్పు త్వరలో బయటికి తీసికొనుటకు బాగుగ వీలుగనుండును. తులము గింజలనుండి ¼ తులము పప్పు వచ్చును. ముత్యభస్మ అని

చెప్పబడియున్నను కొందరు ముత్యపుచిప్పలభస్మనే వేయుదురు. చమురుకల పప్పూలు కలియుటచే కప్పెలు త్వరలో నారవు. విశేషగుణములు:— లఘుసూర్యావర్తి చలవను చేయునది. కావున నోటిపూత మొదలగు ఉడుకుతో కూడిన పైత్యవ్యాధుల యందు చక్కగ పనిచేయును. దీనిని గర్భిణీస్త్రీలకు కలుగు పైత్యవ్యాధులన్నిటి యందును ఉపయోగించెదరు.

సువర్ణసూర్యావర్తి:— కొందరు దీనియందు కేవలము బంగారమునే వేయుదురు. కాని భస్మను వేయుట శ్రేష్ఠము. ఇందు టంకణము 2 భా, అని పాఠభేదము కలదు. కస్తూరిని తుదకు కలిపి నూరవలయును. లవంగముల కషాయముతో నధికముగ మర్దించినయెడల మందు నల్లగ నగును. ఇది ఉడుకుతో కూడిన పైత్యవ్యాధుల యందుకంటె వాతముతో కూడిన పైత్యవ్యాధులయందు అమోఘముగ పనిచేయును. దీనికి సువర్ణసూర్యావర్తి, సువర్ణగురుసూర్యావర్తి, గురుసూర్యావర్తి, మహాసూర్యావర్తి, అనెడి పేరులు కలవు.

వంటసువర్ణసూర్యావర్తి:— రాగిపాత్రయని చెప్పబడియున్నను కాచకప్పెలయందుకూడ వండెదరు. ఇందు బంగారుభస్మను తులము చొప్పున గ్రహించిన యెడల కస్తూరిని అరతులము గాని పావుతులము గాని వేయవలయును. పచ్చకర్పూరమును ఒక తులము వేయవలయును. పైత్యవ్యాధులయందు చక్కగ పనిచేయును.

## హుతాశనరసము — పేజి 80

దీనిని కొందరు గుంటగలగరరసముతో మర్దించెదరు. దీనిని శూల, పరిణామ శూల, మొదలగు వానియందు కూడ నియ్యవచ్చును.

## శీతాంశురసము — పేజి 81

కొందరు త్రికటుచూర్ణమును 4 భాగములుగను, కొందరు శుంఠిని 2 భా, పిప్పళ్ళు 2 భా, మిరియాలు, 2 భా, ఇటులను గ్రహించెదరు. కాని అట్లు చేయుటకు సరియైన ఆధారము కనబడదు. దీనిని కొందరు వేపచెక్కరసముతోడను, కొందరు నిమ్మకాయరసముతోడను, కొందరు రెండింటియొక్క రసములతోడను మర్దించెదరు. "జమ్భ" అని గాని, "నిమ్బా" అని గాని పాఠభేద మున్నప్పుడే నిమ్మకాయ రసముతో మర్దింపవలెను. కాని "నిమ్బ" అనెడి పాఠ మున్నప్పుడు వేపచెక్క రసముతోడనే మర్దింపవలయును. విశేషగుణములు:— దీనిని జలుబు, శిరోభారము, తలనొప్పి, జలుబుజ్వరము, మొదలగు వానియందు నేత్రములలో కలికముగ వేయుదురు. శీతపైత్యజ్వరములయందు దీనిని, ఆనందభైరవిని కలిపి మాత్రలు గట్టి, అల్లపురసముతో నుపయోగించెదరు. తేలుకాటు మొదలగువానికి కూడ నుపయోగించెదరు.

## లోకనాథరసము — పేజి 84

మహాలోకనాథరసమునందు వ్యాధిభేదము ననుసరించి అనుపానములును, పథ్యమును, చెప్పబడినవి. కాని గ్రంథవిస్తరభీతిచే వానిని వ్రాయలేదు.

## ఆనందభైరవరసము — పేజి 89

మొదటి యోగమునందు కేవలము అల్లపురసముతోడనే మర్దన చెప్పబడియున్నను నిమ్మకాయరసముతో కూడ మర్దించుట సాంప్రదాయసిద్ధమైనది. మొదటి యోగమును చతురానందభైరవియనియు, రెండవ యోగమును షష్ఠ్యానందభైరవియనియు, మూడవయోగమును పంచానందభైరవియనియు, కొందరు వ్యవహరించెదరు. ఆనందభైరవిని నాలుకయందుంచి చప్పరించినచో నాలుకయందు చిమచిమకలిగి నాలుక లాగుచున్నట్లుండకూడదనియు అవి తగ్గువరకు మర్దింపవలయుననియు చెప్పెదరు. దీర్ఘకాలము మర్దించుట శ్రేష్ఠమే కావచ్చును. కాని నాభి, పిప్పళ్లు, మొదలగునవి కలిసిన ఏ మందు చప్పరించినను చిమచిమ మొదలగునవి కలుగవచ్చును. కాన చిమచిమ మొదలగునవి తగ్గువరకు మర్దింపవలయుననియు అట్టిమందే శ్రేష్ఠమనియు చెప్పుటకు తగిన యవకాశము లేదు. పైత్యహారములగు మందులను చప్పరించు స్వభావముండుటచే దీనిని చప్పరించునప్పుడు అట్టి బాధలు లేకుండునట్లుండవలయునని కొందరట్లు చెప్పియుండవచ్చును.

## నవగ్రహి — పేజి 90

కొందరు “గౌరీశిలా” యనినప్పుడు గౌరీపాషాణము, ఉప్పుపాషాణము అనెడి అర్థమును పరికల్పించి పదివస్తువులను వేయుచున్నారు. వారిమతమునందు, “నవఖల్వమధ్యే” యనునప్పుడు క్రొత్త (మంచి) ఖల్వమునందు అని యర్థము. పాకవిశేషపరిజ్ఞానము:—రసగంధగజ్జలి కడ్డీకి నల్లగ పట్టుకొనుట మానగనే కడ్డీకొద్దిగ పచ్చగనగును. అప్పుడు ఔషధము పక్వమైనట్లు అనుకొని వెంటనే మంటను తీసివేయవలెను. ఔషధమంతయు కలిసి పక్వమై వంట కుప్పెయడుగుభాగమునందు గడ్డకట్టియుండును. బాగుగ నూరి కుప్పెలు కట్టవలయును. ఈ కుప్పెలు శీతాంశురసముకంటె కొంచెము తక్కువగనున్న పచ్చనిరంగును కలిగియుండును. విశేషగుణములు:— దీనిని సేవించుటచే శ్లేష్మవ్యాధులు, దోషజ్వరములు, సన్నిపాతజ్వరములు, విషమజ్వరములు, సవాయి వ్యాధులు, కుష్ఠములు, సూతికావ్యాధులు, మొదలగునవి నశించును. విశేషపరిజ్ఞానము:— పాషాణము మొదలగు తీక్ష్ణద్రవ్యములు కలియుటచే స్వల్పపరిమాణముగను కఠినపథ్యముతోడను నియ్యవలయును. కొందరు పాదరస

ములు, గంధకమును, ప్రత్యేకముగ అన్నివస్తువులకును సమానముగ వేయుదురు. అట్లు చేసినయెడల సింధూర మధికముగ నేర్పడును. అందుచే మందుకుప్పెలు ఎఱ్ఱగ నుండును. ఇట్లు చేయబడిన యౌషధము తీవ్రముగ పనిచేయక సౌమ్యముగ పని చేయును.

## లక్ష్మీవిలాసము — పేజీ 90

పాదరసము, గంధకము, మణిశిల, తాళకము, మొదలగునవి కలిసిన ఇంకొక విధమగు లక్ష్మీవిలాసము కలదని కొందరు చెప్పెదరు.

## కస్తూరిమాత్రలు — పేజీ 91

వీనిని ఆవాలకంటె పెద్దవిగను పెసరగింజలకంటె చిన్నవిగను చేయవలయును. ఇవి, వీనియందుపడు కస్తూరియొక్క పరిమాణముననుసరించి అనగా మొత్తముమందులో కస్తూరి ఎన్నవవంతు కలిసినదో దానినిబట్టి గుణముల నిచ్చును. కస్తూరి అధికముగ కలుపబడినవిగాని వాతరాక్షసము మొదలగునవి చేర్చబడినవిగాని సూతికావాతము, దోషజ్వరము, మొదలగువానిని నశింపజేయును. కస్తూరి తక్కువగ కలుపబడినవానిని చంటిపిల్లలకగలుగు జలుబు మొదలగువానియందు సామాన్యముగ వాడవలయును.

## షడ్గుణము — పేజీ 93

పాదరసమునకు సమానమగు గంధకమును చేర్చుచు ఆరుసార్లు వండు పద్ధతియు, రెండురెట్లు గంధకమును చేర్చుచు మూడుసార్లు వండుపద్ధతియు, మూడురెట్లు గంధకమును చేర్చుచు రెండుసార్లు వండు పద్ధతియు, ఆరురెట్లు గంధకమును ఒకేసారి చేర్చి ఒకేసారి వండు పద్ధతియు, కలవు. ఎన్నిసారులు వండెదరో అన్నిరెట్లు అధికముగ గుణములుండునని చెప్పెదరు. ఒకేసారి వండదలచినను అన్నిరెట్ల గంధకమును నొకేసారి వేయక ఒక భాగమును వేసి బాగుగ నూరుచు మరల ఇంకొక భాగమును వేయుచుండవలయును. ఒకేసారి వేసినయెడల గంధకము పాదరసముతో సరిగ కలియదు. వండవలసిన వంటల ననుసరించి మొదటి వంటలయందు లేతపాకములుగ నుండగనే దించుచుండవలయును. లేనిచో తుదకు ముదురువంట యగును. విశేష గుణములు :- ఇది ఆరురెట్లు గంధకముతో వండబడినదిగావున చక్కగ రక్తశుద్ధిని చేయును. జీర్ణించిన సవాయివ్యాధులను నశింపచేయును. గంధకము సమానముగ చేర్చబడినది రోగములను నశింపచేయునదియు, రెండురెట్లు గంధకము చేర్చబడినది రాజయక్ష్మను నశింపజేయునదియు, మూడురెట్లు చేర్చబడినది, అధికమగు మన్మథోద్రే

కము కలవానిగ చేయుననియు, నాలుగురెట్లు చేర్చబడినది. తేజోవంతునిగను సర్వ శాస్త్రప్రావీణ్యము కలవానిగను చేయుననియు, అయిదురెట్లు చేర్చబడినది సిద్ధునిగ చేయుననియు, ఆరురెట్లు చేర్చబడినది మృత్యువును నశింపజేయుననియు, యోగ రత్నాకరమునందు చెప్పబడినది.

## సువర్ణాదిలేపము — పేజీ 91

ఈ లేపనమును శరీరమునకు చేయవలయునో నాలుకకు చేయవలెనో స్పష్టముగ చెప్పలేదు. కాని సంనిపాతజ్వరములయందు పగడము, ముత్యము, రుద్రాక్షు, మొద లగువానిని చనుపాలతో గాని నీటితోగాని అరగదీసి నాలుకకు పూసి బంగారపు రేకుతో గీయు సాంప్రదాయము కలదు.

## పూర్ణచంద్రోదయము — పేజీ 97

ఇందు స్వర్ణదలమని స్పష్టముగ చెప్పుటచే పలచగ రేకులుగగాని చుట్టలుగ గానియుండు కుందనమునే వేయవలయును. కేవలకుందనమును వేసినయెడల అడుగున మిగిలియున్న దీనిని మరల కరగించినయెడల ముద్దగ బంగారమగును. కావున సరిగ నిదిజీర్ణమై సరియైన గుణములను కలిగింపదు. కాబట్టి సువర్ణభస్మనే వేయవలయునని కొందరు చెప్పెదరు. కుందనమును వేయునెడల దానిని మొదట పాదరసములో 4, 5 రోజులు బాగుగ నూరి పిదప గంధకమును చేర్చి నూరవలయును. "మేము చేసిన యెడల బంగారము పైకిఎక్కి సిందూరములో కలియును" అని కొందరు చెప్పెదరు. కాని నమ్మతగిన విషయముగ కనపడదు. పాదరసమునందు బంగారమును ఆరుమాసము లుంచి నూరినచో బంగారము పైకి ఎక్కునని చెప్పెదరు. అట్లుచేయగా కార్యసిద్ధి కలుగలేదు. "ఫలానిరసముతో మర్దించినచో పైకి ఎక్కును" అని చాలమంది అనేక రసములను చెప్పిరి. కాని మాకు నమ్మకముగ చెప్పిన కొంతమందియొక్క మాటలను విని చెమ్మతీగ, ఉత్తరేణు మొదలగువానియొక్క రసములతో వారుచెప్పినవిధముననే నూరి వండితిమి. కాని ఎంతమాత్రము పైకి ఎక్కలేదు. రసమునకు అష్టాదశసంస్కా రములు చేసినచో పైకి ఎక్కునని కొందరు చెప్పెదరు. అది ఎంతవరకు నిజమో తెలి యదు, "ఇట్లు మేము చేసితిమి. పైకిఎక్కినది" అని ఎవరును ధైర్యముగ చెప్పలేదు. బంగారము కలిసిన ఇతర వంటౌషధములును, ఇతరలోహముల కలిసిన లోహరసాయ నము మొదలగునవియు కలవు. లోహముపైకి ఎక్కునా? బంగారము పైకి ఎక్కునా? అనెడి విచక్షణలను వానిలో మాని కేవలము పూర్ణచంద్రోదయము వద్దనే బంగారము ఎక్కుట విషయమై ఆలోచన కలుగుటకు కారణము తెలియదు. "అడు గున నున్న బంగారము జీర్ణముకాదు. దానితో కలిసి యుండుటచే సిందూరమునందు బంగారుగుణము కొంత సంక్రమించును. కావున అడుగుననున్న బంగారమును తీసికొని

కేవలసింధూరమునే వాడవలయును" అని కొందరు చెప్పెదరు. కాని అడుగున భస్మ రూపకముగ నున్న బంగారమునుకూడ కలుపుటయే సాంప్రదాయము. కుందనమును మూని భస్మను వేసినయెడల ఎట్టిసందేహమును లేదు. అనుపానద్రవ్యములను కలుపువిష యమై అర్థము 2, 3 విధములుగ స్ఫురించుచున్నది. అనేకమంది అనేకవిధములుగ కలుపుకొనుచున్నారు. కస్తూరియొక్కయు, పచ్చకర్పూరముయొక్కయు భాగ ముల ననుసరించి వేడిచేయుట, మందముచేయుట, మొదలగు లక్షణము లొక్కొక్క ప్పుడు కలుగుచున్నవి. అర్థభేదములును, వేసికొను విధానములును, గుణములను, గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. అనుభవమునుమాత్రము వ్రాయుచున్నాను. పైనున్న సింధూరమును అడుగుననున్న బంగారమును పూర్తిగ గ్రహించి జాజికాయలు, పిప్పళ్ళు, లవంగములు, వీనిని ప్రత్యేకముగ మొదటవేసిన బంగారమునకు సమానముగను, పచ్చ కర్పూరమును సగముగను, కస్తూరిని పదనారవవంతుగను, గ్రహించి అనగా సింధూ రమును బంగారమును కలిసిన మందు ఒకతులమైనయెడల జాజికాయలు మొదలగు మూడింటిని పేడయెత్తు చొప్పునను, పచ్చకర్పూరమును అణాఎత్తుగను, కస్తూరిని అర కాని (సుమారు $\frac{1}{4}$ చిన్నము) చొప్పునను, కలపవలయును. మందముచేయునవేడి భావముతో పచ్చకర్పూరమును శాస్త్రవిహితమగు భాగములో సగము తగ్గించవల యునది. అనుపానవస్తువులను కలిపిన పిదప మొదటిరసములతో మర్దింపక పన్నీరుతో మర్దించు సాంప్రదాయము కలదు.

మొదటియోగమునకు, పూర్ణచంద్రోదయమనియు, మూడవయోగమునకు మకర ధ్వజమనియు, నాల్గవయోగమునకు మకరధ్వజము లేక షడ్గుణబలి జారిత మకరధ్వజ మనియు, అయిదవయోగమునకు సిద్ధమకరధ్వజమనియు వాడుకకలదు. ఈనాలిగింటి కిని రసము, గంధకము, బంగారము, వీనియొక్కయు వంటలయొక్కయు భేదముల ననుసరించియే భేదము కాని యితరభేదము లేదు. కాని బంగారము మొదలగు వాని యొక్క ఆధిక్యమునుబట్టి గుణాధిక్యమునందు భేదముండును.

మకరధ్వజమునందుకూడ అనుపానవిషయమై అర్థభేదములును, సాంప్రదాయ భేదములును కలవు. పూర్ణచంద్రోదయమునందువలెనే చూచుకొనుడు.

షడ్గుణబలిజారితమకరధ్వజము మొదలగువానియందు అనుపానవస్తువులు చెప్ప బడకపోయినను తగువిధమున కలుపుకొనవచ్చును.

మకరధ్వజమునందు మిరియాలు అని చెప్పబడియున్నది. పూర్ణచంద్రోదయము నందు పిప్పళ్ళను వేయుచున్నారు. ఇందు "త్ర్యూషణ" (త్రికటుకములు) అని పాఠ

భేదములు కలవు. ఇటువంటి అనేకవిషయములు విమర్శింపదగినవి కలవు. కాని గ్రంథవిస్తరభీతిచే ఏమియు విమర్శింపలేదు.

సిద్ధమకరధ్వజమునకు కొన్నిగ్రంథములయందు పాళ్ళభేదము కొద్దిగ కలదు. మరియు రెండురెట్ల గంధకమును చేర్చుచు మూడుసార్లు వండవలయుననికూడ స్పష్టముగ కలదు.

## సూతికామాత్రలు — పేజి 103

వీనిని పెసరగింజలకంటె పెద్దవిగను కందిగింజలకంటె చిన్నవిగను చేయవలయును. ఈ మూడువిధానములతో క్రమముగ నొకదానికంటె నింకొకటి అధికగుణముకలదిగ నుండును. ఈ మాత్రలను ప్రసవమైన రోజు మొదలుకొని మూడురోజులవరకు ప్రతి సాయంకాలము ఒక్కొకమాత్రగను, పథ్యమిచ్చు రోజునను స్నానము చేయించు రోజునను ఉదయమున ఒక్కొకమాత్రగను, ఇచ్చునట్టి సాంప్రదాయము కలదు. అట్లు చేసినచో ఏ వ్యాధియు చేరదని పెద్దల యభిప్రాయము. ఏ వ్యాధియైనను కలిగినయెడల తగిన అనుపానముతో తగినన్నిమాత్రల నీయవలయును.

## మహాకామసంజీవనరసము — పేజి 105

ఈ యోగము చాలా బాగుగ పనిచేయునని విని దీని నిమిత్తము చాల ప్రయత్నించితిమనియు, ఈ ప్రకారము చేసి వుపయోగింపగా చాలా బాగుగా పని చేసినదనియు, శుక్లనష్టము, దగ్గు, శ్వేతరక్తప్రదరములు మొదలగువాని మీద కూడ చాలబాగుగ పనిచేసినదనియు అనేకులు చెప్పిరి.

## పర్పటీరసము — పేజి 107

పేడను వెడల్పుగనుండు నుండుగ కట్టి దానిపైన లేతయరటాకువేసి కరగించిన మందును దానియందుపోసి పైన మరల లేతయరటాకును కప్పియుంచినచో కొద్దికాలముననే గట్టిపడి పలచగ అప్పడమువలె నగును. దీనిని నూరి జాగ్రత చేయవలయును. తొలుత గంధకమును కరిగించి యందు మిగిలిన వస్తువులను వేసి కలిపిన పిదప అరటాకునందు పోయవలెనని శ్లోకములో చెప్పబడియున్నది. కాని అన్నిటిని కలిపి నూరిన పిదపనే కరిగించి పోయుట సాంప్రదాయము. బంగాళాదేశస్థులు పర్పటీరసమును గ్రహణీరోగము మొదలగు వానియందు తరుచుగ నుపయోగించెదరు.

## బాలసూర్యోదయము — పేజి 1 3

వీనిలో కజ్జల్యౌషధము లేరగ నుండకపోయినను బాలసూర్యోదయమని పేరు పెట్టుటకు తగినకారణము కనబడదు. కజ్జలీబాలసూర్యోదయములయందు ఆరూష

శబ్దమునకు ఇంగువ అనియు, గవ్వలభస్మ అనియు, అర్థభేదములు కలవు. బాలసూర్యోదయములను జీర్ణజ్వరములు, ఉదుకలు, శ్వేతరక్తప్రదరములు, మొదలగు వానియందు ప్రధానముగ వాడెదరు.

## వసంతకుసుమాకరము — పేజి 211

బసవరాజీయము మొదలగు కొన్ని గ్రంథములయందు కొద్ది పుష్పములచేతనే భావన చెప్పబడియున్నను "వసంతఋతువునందలి పుష్పములన్నిటిచే భావనచేయదగినది" అనెడి వసంతకుసుమాకరశబ్దము యొక్క అర్థము ననుసరించియు, "శతపత్రరసేనైవ" అనుచోట "శతపుష్పరసేనైవ" (అనేక పుష్పములయొక్క రసముతో) అనెడి పాఠభేదముండుటచేతను, కొన్ని యోగములయందు "అనేక పుష్పజాత్యా చ" (అనేక పుష్పములతో) అనెడి పాఠముండుటచేతను, ఈ వసంతకుసుమాకరమును అనేక విధములగు (అనుకూలములైన) పుష్పములయొక్క రసములతో భావనచేయవలయును. మరియు నిందు "వాసానేత్రుగణేన చ" అనెడి పాఠభేదము కలదనియు వాసానేత్రుగణమని పుష్పములధికముగల గణమొకటి కలదనియు ఆ ద్రవ్యరసములన్నిటితో భావన చేయవలయుననియు కొందరు చెప్పెదరు. శాస్త్రమునందు ఆయా రసములతో కేవలభావనలే చెప్పబడియున్నను భావనను చేయుచు మర్దనను కూడ చేయుట సాంప్రదాయసిద్ధమై యున్నది. గంధకసంయోగములేనిచో పాదరసము ఇతర ద్రవ్యములతో సరిగ సమ్మేళనము కానేరదు. కావున నిందలి సూతశబ్దముచే రసభస్మను గ్రహింపవలసియున్నది. ఇందు రసభస్మను వేసినచో వేడిని చేయును గావున శ్లో॥ బాలసూర్యోదయే తద్వద్వసంతకుసుమాకరే। సూతశబ్దప్రయోగేణ రససిందూరమానయేత్॥ అనెడి సాంప్రదాయశ్లోకము ననుసరించి రసభస్మకు బదులుగ రససిందూరము వేయుదురు. రససిందూరముకంటె షడ్గుణము గుణవత్తరమైనదగుటచే కొందరు షడ్గుణమునే వేయుదురు. రసము యోగవాహి (ఏ వస్తువులతో కలియునో యా వస్తువులయొక్క గుణములనే వృద్ధిపరచును) అనెడి శక్తికలది గావున సూతశబ్దముచే రసభస్మనే గ్రహింపవచ్చునని కొందరు పెద్దలు చెప్పుదురు. రసభస్మను వేసిన యౌషధము స్వల్పమగు నలుపువర్ణమును, రససిందూరమును గాని షడ్గుణమును గాని వేసిన యౌషధము బహుస్వల్పమగు ఎరుపువర్ణమును గలిగియుండును. ఈ యౌషధము యొక్క మధ్యమందు సెనగగింజల నుంచినచో తడిసి మొలకలెత్తవలయుననియు చెప్పెదరు. అనగా ఎప్పుడును పచ్చిగ (తడిగ) నుండవలెనని భావము. సమస్తమగు పుష్పములయొక్క రసములతోడను భావనను మర్దనను చేయుటచేతనే యిట్లుండును. ఈ యుద్దేశము ననుసరించియే యా విషయము

చెప్పబడుచున్నది. పుష్పములయందు తేనె కలదు. తేనె కలిపి మర్దింపబడిన మందు ఆరక పచ్చిగనే యుండును. దీనిని కస్తూరితో భావనచేయవలెననగా కస్తూరిని నీటిలో కలిపి ఆద్రవముతో భావన చేయవలయును. ఇందు కస్తూరి సువాసన నిమిత్తమే చెప్పబడినది. కాని గుణమును ప్రధానముగ నెంచి చెప్పబడలేదు. కాన కస్తూరియొక్క పరిమాణము సామాన్యముగ చెప్పబడియున్నను భాగమనునప్పుడు తులమును గ్రహించి నప్పుడు కస్తూరిని ఒక అణాయెత్తు చొప్పున కలుపవలయును. అధికముగ కలిపినచో వేడిచేయును. ఇతర యోగములయందు కస్తూరిని ఒక భాగముగ కలుపవలయునని స్పష్టముగ చెప్పబడియుండుటచే నిందు ఒక భాగము చొప్పున అనగా భాగశబ్దముచే తులమును గ్రహించినప్పుడు కస్తూరి కూడ తులముగ గ్రహింపవలయునని కొందరు చెప్పెదరు. కాని యది సాంప్రదాయసిద్ధముగ నున్నట్లు కనబడదు. వసంతకుసుమాకర మును వసంతఋతువునందే పుచ్చుకొనవలయునని కొందరనెదరు. వసంతఋతువునందు వేడిమిని తగ్గించుటకై పుచ్చుకొనవచ్చును. కాని ఇతర ఋతువులయందు పుచ్చుకొన కూడదనుటకు తగిన కారణములేదు. దీనిని సేవించునప్పుడు ఇతర యోగములయందు చెప్పబడిన కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, జాజికాయలు, మొదలగు అనుపాన ద్రవ్యములను దీనియందు కొందరు కలుపుకొనెదరు. దీనిని మాత్రలుగ చేసి ఆవుపాలతో గాని ఆయా కషాయములతో గాని కేవలమాత్రలుగనే సేవించు పద్ధతి కలదు.

## ఉదయమార్తాండరసము (తామ్రమైనము) - 229

దీనియందు గంధకమును తామ్రమునకు రెట్టింపుగకూడ వేయు సాంప్రదాయము కలదు. కొందరు తామ్రమునకు నాల్గవవంతు రసభస్మను వేయుదురు. నిమ్మకాయ రసమును పోయుచు ఛర్దిపోవువరకు 10—15 రోజులు ఎండయందుంచవలయును. దీనిని జీర్ణించిన నవాయివ్యాధులు, శూలలు, అజీర్ణము, కుష్ఠము, మొదలగు వ్యాధుల యందు కూడ నుపయోగింపవచ్చును.

## సువర్ణసూర్యావర్తి (వంటయోగము) పేజీ 252

ఇది పైత్యవ్యాధులయందును, ఉష్ణవ్యాధులయందును, చక్కగ పనిచేయును.

## శీతభంజీరసము - పేజీ 257

ఇందు చెప్పబడిన ద్రవ్యములను అరుతులములుగ గ్రహించి ఆరుతులముల పరిమితి కల కు|| రాగిసంపుటమునందు పూసి కుండయందుంచి పైన ఇసుకపోసి దానిమీద ధాన్యమును చల్లి, ధాన్యము పేలునరకు వండి పిదప, నాసంపుటమును, ఆరుతులముల మిరియాలను, కలిపి నూరి చూర్ణము చేయవలయునని చెప్పెదరు.

## రసమాణిక్యము — పేజీ 265

మూడుతులముల తాళకమును చూర్ణించి రెండు పెద్దమూకుళ్ళయందుంచి సామాన్యపు మంటయందు మూడుగంటలు వండి తీసినయెడల సిందూరించి యుండును. అడుగున నున్నపాత్ర ఎర్రగనగువరకు మంటవేయనక్కరలేదు. తెల్లఅభ్రకపురేకుల పైన మట్టిపోసిన గుడ్డలను దళసరిగ చుట్టి 7-8 పిడకలతో పుటమువేసినను సిందూరించును. లేక ఈ సంపుటమును క్రింది స్పిరిట్ దీపముంచుటకు వీలగునట్లు ఎత్తునుంచి క్రింద స్పిరిట్ దీపమును అరగంటయుంచి తీసినచో ఎర్రగ సిందూరించి యుండును. రెండు తెల్లఅభ్రకపురేకులమధ్యయందు తాళకచూర్ణమునుంచి పైన ఏమియు చేయకుండగనే చక్కని నిప్పులుకల కుంపటియందుంచినచో 2-3 నిమిషములకే సిందూరించును. సిందూరించుచున్నట్లు పై అభ్రకపురేకులలో నుండి అద్దములోనుండి వలె మనకు తెలియుచునే యుండును. సిందూరించగనే తీయవలయును. మరికొన్ని విషయములు భస్మప్రకాశికయందు వ్రాయబడియున్నవి. దీనిని దగ్గు, అయాసము, మొదలగు శ్లేష్మవ్యాధులయందుకూడ నుపయోగింపవచ్చును.

## జోగినీరసము — పేజీ 275

దీనిని పెసరగింజలంత మాత్రలనుగ చేయవలయును. ఇది విషమజ్వరము, శీతపైత్యజ్వరము, ఆమజ్వరము, అజీర్ణజ్వరము మొదలగు వానిని నశింపజేయును.

## బాలసూర్యోదయము — పేజీ 278

కడ్డీకి రసగంధకకజ్జలి పట్టుకొనుట మానగనే పక్వమైనట్లు తెలిసికొనవలయును. ఒకొక్కప్పుడు మందు గడ్డకట్టి కుప్పెకు అడుగుభాగమునందే యుండును. విశేషగుణములు — జీర్ణజ్వరము, మేహజ్వరము, శ్వేతప్రదరము, రక్తప్రదరము మొదలగు వానిని నశింపజేయును.

జ్ఞప్తి:— ప్రతియోగముయొక్కయు ప్రతివిషయమును విమర్శించి వ్రాసినయెడల అంతములేని విషయమగును. సమస్తవిషయములును వేరువేరు స్థలములయందు విమర్శించబడియుండుటచే ప్రతియోగముయొద్దను అవసరములేదని వ్రాయలేదు. ప్రత్యేకముగ అవసరమనితోచిన విషయములనే వ్రాసితిని.

# ఔషధవిషయములు

1. కాంతవల్లభరసము, వంటబాలసూర్యోదయము, మొదలగు టంకణము కలియు వంటయౌషధములయందు టంకణమును పొంగించకుండగనే వేయవలయునని పెద్దలు చెప్పెదరు.

2. రజతలోహరసాయనము, వాతరాక్షసము, మొదలగు పుటౌషధముల యందుగాని వంటయౌషధములయందుగాని గంధకము పూర్తిగనశింపక మిగిలి యున్నట్లు తోచినయెడల మరల కొన్నిరసములతో మర్దించి మరల బాగుగ పుటమును గాని వంటనుగాని చేయవలయును.

3. షడ్గుణము, పూర్ణచంద్రోదయము, కాంతవల్లభరసము, మొదలగు వంటయౌషధములయందు గంధకము మిగిలినయెడల పై సింధూరము మొదలగు వానినన్నిటిని కలిపి మరల కొంత గంధకమును చేర్చి ఆయా రసములతో నూరి మరల సరిగ వండవలయును.

4. ఔషధము పక్వమైనపిదప ఉండవలసిన పరిమాణముకంటె నధికముగ నుండుట, నిప్పుమీదనుంచినచో కొద్దిగపచ్చగను గంధకపువాసనతోడను పొగ వచ్చుట, మందుయొక్క వర్ణము సరిగ లేకుండుట, కప్పెలు గట్టిగ లేకుండుట, బరువుగ లేకుండుట, మొదలగు కారణములచే గంధకము మొదలగునవి సరిగ జీర్ణింపలేదని తెలిసికొనవలయును.

5. సువర్ణము, లోహము, తామ్రము, తాళకము, రసము, మణిశిల, గంధకము అని సామాన్యముగ చెప్పబడియున్నను వంటయౌషధములయందు గాని, కజ్జలౌషధములయందుగాని సువర్ణము మొదలగువానిని పరిశుభ్రమగు భస్మములుగను, తాళకము మొదలగు వానిని బాగుగ శుద్ధిచేయబడినవిగను చేర్చుకొనవలయును.

6. "ఈవస్తువులను గ్రహింపవలయును" అని సామాన్యముగ చెప్పి మర్దన ద్రవము, మాత్రలనుచేయుట, పరిమితి, అనుపానము, మొదలగునవి చెప్పకపోయి నప్పుడు అన్నిటిని ఖల్వమునందుంచి జలముతో నూరి కప్పెలను కట్టిగాని, మాత్రలను చేసిగాని, మెత్తని చూర్ణముగ నుంచిగాని తగిన మోతాదుతో తగిన అనుపానముతో నియ్యవలయును.

7. ఆనందభైరవి, పైత్యాంతకము, క్రవ్యాది మొదలగునవి అరి గట్టిగనైన యెడల మరల నిమ్మకాయరసము మొదలగు వానితో మర్దించి తడిగనుండునట్లు చేయ వచ్చును.

8. కాంతవల్లభరసము మొదలగు మందులయందు పైనున్న సిందూరమునుకూడ కలిపి నూరి కప్పెలు కట్టవలయును.

9. షడ్గుణము, స్వర్ణవంగము మొదలగు వానినికూడ నూరి కప్పెలు కట్ట వచ్చును.

10. పైత్యాంతకము, ఆనందభైరవి, క్రవ్యాది, మొదలగు నిమ్మకాయరసము గాని, ఉప్పులుగాని ప్రధానముగ కలియు మందులను నూరునప్పుడు కలియత్రిప్పుటకై ఇనుపసంబంధమైన రేకల నుపయోగించినయెడల కిలుము తగిలి మందులు చెడును. కావున కిలుమెక్కని వెదురుబద్ద మొదలగువాని నుపయోగింపవలయును.

11. నేపాళములుకలిపిన నారాచరసము, భేదిజ్వరాంకుశము, మొదలగు మందులను నూరునప్పుడుగాని మాత్రలు చేయునప్పుడుగాని యాయందును ముఖము మొదలగువానికి అంటనిచ్చినయెడల కొన్నితత్త్వములకు చర్మము పొక్కును. కాన అంటనీయకుండుట మంచిది.

12 క్రవ్యాది మొదలగు ముద్దగనుండు మందులను నిలవయుంచుటకుగాని చిల్లరగ వాడుటకుగాని తూచుటకు ముందు అయాపాత్రలను తూచి (పడికట్టి) పిదప మందును తూచినయెడల మందు త్రాసునకు అంటదు. మరియు నిలవయుంచు పాత్రను మొదట తూచి ఆతూకమును పాత్రమీద నుంచినయెడల మందు ఎంత నిలవయున్నదియు తెలిసికొనదలచినప్పుడు పాత్రతోకూడ తూచి పాత్రభారమును (బరువును) తీసివేసినయెడల మందుయొక్క పరిమితి తెలియకలదు.

13. ప్రతిమందును పరిశుభ్రమైన సీసాయందుంచవలయును. ప్రతిసీసాకును సరియైనమూత యుండవలయును. ప్రతిమందునకును సీసాపైన పేరు తప్పక యుండ వలయును.

14. క్రవ్యాది, పైత్యాంతకము, ఆనందభైరవి, మొదలగు మెత్తని మందులను కూడ కప్పెలుగ చేసి యుంచవచ్చును.

14A. ఆనందభైరవి, క్రవ్యాది, మొదలగు పుల్లని ద్రవములుగాని ఉప్పులుగాని కలిసిన మందులు వేసినట్టి సీసాలకు గాజు, జిలుగు మొదలగువానియొక్క మూతలనుంచవలయును. కాని కిలుమెక్కునట్టి సీసారేకు మొదలగువానియొక్క మూతల నుంచకూడదు. వీనిని జాడీలయందుకూడ నుంచవచ్చును.

15. మందును ఖల్వములో వేయుటకు ప్రారంభించిన రోజుమొదలుకొని నిలువ చేయువరకు ఏరోజున ఏవస్తువు వేయబడినది? ఎప్పుడు ఏరసముతో ఎన్ని

దినములు మర్దింపబడినది? మధ్య ఏయేమార్పులు జరిగినవి? మొదలగు సంగతుల నన్నిటిని వివరముగ నొక పుస్తకమున తప్పక వ్రాయుట యనేక విధముల మంచిది.

16. ఆయా మందులయందు నాభి, ముషిణిగింజలు, మొదలగు విషవస్తువులు కలియునప్పుడు వానిని చూర్ణముచేసి వేయవచ్చును. కాని విషవస్తువులు కావున చూర్ణముచేయకయే వేసి ఆయా రసములతో నానినపిదప నూరవచ్చును. లేదా మొదట తూచి ఆయా రసములలో వేరుగ నానబెట్టి మందునందు కలిపి నూరవచ్చును.

17. మందును వండినపిదప కప్పెలుకట్టుటకు ఫలానిరసముతో నూరవలెనని చెప్పనియెడల మొదటి రసములతో గాని నీటితో గాని సాంప్రదాయానుసారమగు ద్రవముతో గాని నూరి కప్పెలు కట్టవలయును.

18. అగ్నికుమారము, లశునూర్యావర్తి, కాంతవల్లభరసము, మొదలగు వెలిగారమును కలిసినట్టి మందులయొక్క కప్పెలు, కొంతకాలమునకు లోని వెలిగారము పైకి వచ్చుటచే కొంచెము తెల్లతెల్లగ నుండవచ్చును.

19. మందును కప్పెలుగ కట్టుటకు బాగుగ నూరిన పిదప ప్రారంభమున 2, 3, 4, 5, 7, 8, 9, 11, మొదలగు అణాలయెత్తుచొప్పున 5, 6 విధములగు కప్పెలను కట్టి ఏ కప్పెను ఎంతపరిమితిగ కట్టినదియు గుర్తుంచుకొని బాగుగ ఆరినపిదప ఎంతపరిమితిగ కట్టిన కప్పె ఎంతపరిమితికి వచ్చినదియు ఎన్నవవంతు తగ్గినదియు మొదలగుసంగతులు తెలిసికొని అనగా 5 అణాలయెత్తుగ తూచినమందు ఆరినపిదప ¼ తులము కప్పెయైనయెడల ప్రతి ¼ తులమునకు ఇంకొకఅణాఎత్తు హెచ్చుచేర్చుచు, ¼ తు, ½ తు, 1 తు, మొదలగు కప్పెలు కట్టవలయును. ఖల్వమునందు వేసిన మందు స్వల్పమైనయెడల ఏకముగాతీసి తూచి మొదటవేసిన మందునకు ఎంత హెచ్చున్నదియు గుర్తెరిగి ప్రతికప్పెకు ఆ హెచ్చులను వేయుచు అనగా మొదటవేసిన మందు 10 తులములైయుండి కప్పెలు కట్టునప్పుడు తూచగా 15 తులములున్నయెడల ¼ కప్పెకు రెండు అణాలఎత్తుచొప్పున హెచ్చుచేర్చి (6 అణాలఎత్తు తూచి) అనగా ప్రతి ¼ తులమునకును రెండుఅణాలఎత్తు హెచ్చుచేర్చుచు కప్పెలు కట్టవలెను. మందును ఖల్వములోవేసినదిమొదలు అన్ని సంగతుల నొకపుస్తకములో వ్రాయుమని చెప్పియుంటిని. మందుకప్పెలు ఎంతఎత్తు హెచ్చువేయగా ఎంతఎత్తునకు సరిగ సరిపోయినదియు నాపుస్తకములో వ్రాసినయెడల మరియొకసారి ఏమియు శ్రమ యక్కరలేకయే సరిగకప్పెలు కట్టవచ్చును.

20. ప్రతిమందుకప్పెకును మొహరు (పేరు) ఉండుట అనేకవిధముల మంచిది. కాన ప్రతిమందుకును పేరును వేయవలయును. ఏకారణముచేనైనను అన్ని మొహరులను చేయించుటకు వీలులేనియెడల అచ్చాఫీసునందలి చిన్న యక్షరములను తెచ్చి ఏకముగకట్టి దానితో నొక్కినయెడల, అక్షరములు లోనికి పడగలవు,

21. చేతికి నూనెను పూసికొని కప్పెలు చేసినయెడల కప్పెలు బాగు (నున్న)గ వచ్చును. మొహరుకుకూడ నూనెను పూయుచుండినచో అక్షరములు సరిగపడును. కాని మందుకప్పెలకు నూనెతగులుట అంతశ్రేష్ఠము కాదు.

22. మందులను, అరుగుస్వభావము లేనట్టియు అనుకూలముగనున్నట్టియు మంచి ఖల్వములయందు నూరవలయును.

23. ఎర్రగనున్నమందులుగాని, తెల్లగనున్నమందులుగాని త్రిఫలాకషాయముతో మర్దనచేయుటచే కొద్దిగ నల్లనగును.

24. పాకము హెచ్చుగవచ్చిన షడ్గుణము, పూర్ణచంద్రోదయము, మొదలగు మందులు వేడిని చేయును.

25. పాకముతక్కువగవచ్చిన కాంతవల్లభరసము, రజతలోహరసాయనము, మొదలగు మందులయొక్క కప్పెలు సరియైనవర్ణముకలవిగను, గట్టిగను నుండక పోవుటయేగాక వేడిని చేయక సరియైనగుణములను కలిగింప నేరవు.

26. రసము, గంధకము ఇవికల ప్రతిమందునందును ప్రారంభమున రసమును గంధకమును కలిపి కజ్జలిచేసి అనగా కాటుకవలె నూరి పిదపనే మిగిలినవస్తువులను వేయవలయును. అట్లు చేయనియెడల రసము సరిగ సమ్మేళనము కానేరదు.

27. పూర్ణచంద్రోదయము, సిద్ధమకరధ్వజము మొదలగు కుందనము కలియునట్టి వంటయౌషధములయందు తొలుత బంగారమును కేవలపాదరసమునందు 5-6 రోజులు బాగుగ నూరి పిదపనే గంధకము కలిపి నూరవలయును.

28. వెండిరజనుకలియు రజతలోహరసాయనము మొదలగు వానియందు తొలుత వెండిరజను రసమునందు 2, 3 రోజులు నూరి పిదప గంధకము మొదలగు వానిని క్రమముగ కలుపవలయును.

29. వంగముకలియు స్వర్ణవంగము, వంగరాజీయము, మొదలగు వంటయౌషధములయందు వంగమును రేకులనుగ చేయించి చింతాకులవలె కత్తిరించి రసమునందు బాగుగ కలియువరకు నూరి పిదప గంధకము మొదలగు వానిని కలిపి నూరవలయును. లేదా వంగమును కరిగించి యందు పాదరసమును పోసి వెంటనే ఇంకొకపాత్రయందు పోసి చల్లారినపిదప నూరినయెడల మెత్తగ చూర్ణమగును. పిదప గంధకము మొదలగు వానినిచేర్చి నూరవలయును.

30. మందును కప్పెలుగ చేసినపిదప నీడయందు బాగుగ ఎండినపిదపనే జాగ్రత్త చేయవలయును. లేనిచో త్వరలో నారకపోవుటయేగాక కొన్నికప్పెలకు

బూజుకూడ పట్టవచ్చును. ఎండయం దెండించినచో మందుయొక్క గుణమునకు వైపరీత్యము కలుగుటయేగాక కుప్పెలు సరిగనుండక పగులుట మొదలగు వికృతములు కలుగును.

31. వస్తువులను సామాన్యముగ చెప్పి భాగములను చెప్పనియెడల సమభాగములుగ గ్రహింపవలయును. "వీనిని వండవలయును" అని చెప్పినను అన్నిటిని కలిపి నూరియే వండవలయును. కాచకుప్పెయందు వండవలయునని సామాన్యముగ చెప్పినను వాలుకాయంత్రమునందే వండవలయును. సామాన్యముగ చెప్పినను క్రమాగ్నులయందే వండవలయును. చెప్పకపోయినను సాంగశీతలముననే తీయవలయును. 1, 2, 3 మొదలగు రోజులు చెప్పినను చెప్పకపోయినను సరియైన పాకమునొందువరకు వండవలయును. చెప్పకపోయినను నూరి కుప్పెలు కట్టవలయును. చెప్పకపోయినను ఇటులనే యనేక విషయములను గ్రహింపవలయును.

32. శీతాంశురసము, సంనిపాతము, కాలకూటము, మొదలగు మందులయందు కలియు తాళకమును వేరుగ కాటుకవలె నూరి కలపవలయును. లేనిచో అన్నియు కలిసినపిదప నెంతగ మర్దించినను తాళకపుతళుకు నశింపదు.

33. మనశ్శిలను వేరుగ నూరి కలుపుటయే శ్రేష్ఠము.

34. పైత్యాంతకము, ఆనందభైరవి, సూర్యావర్తి, సంనిపాతభైరవి, సిందూరభూషణము, మొదలగువానియందు కలియు ఇంగిలీకమును, రససిందూరమును, తొలుత ఆయా రసములతో బాగుగ పలచగ నూరినపిదప ఆయా వస్తువులను కలిపి నూరినయెడల ఇంగిలీకమును రససిందూరమును సరిగ కలియుటయేగాక మందులకు సరియైన వర్ణముకూడ కలుగును.

35. సంనిపాతభైరవి, సూర్యావర్తి, సిందూరభూషణము, క్రవ్యాది, పంచవక్త్రరసము, మొదలగు కజ్జల్యౌషధములయందు వేయు టంకణము (వెలిగారము) ను పొంగించకుండగనే భాగప్రకారముగ తూచి పిదప పొంగించి వేయవలయును. ఇతర ద్రవ్యములను శుద్ధియైనపిదపనే భాగప్రకారముగ తూచి వేయుచుండగ పొంగించిన పిదప అధికముగ తగ్గుస్వభావముగల దీనినిట్లు వేయుటకు సాంప్రదాయముగాక వేరు కారణము కనబడదు. మరియు కాంతవల్లభరసము, వంటబాలసూర్యోదయము, మొదలగు వంటయౌషధములయందు పొంగించకుండగనే వేయవలయునని చెప్పెదరు. ఇంగువనుకూడ భాగప్రకారముగ తూచియే పొంగించెదరు.

36. సంనిపాతభైరవి, లఘుసూర్యావర్తి, మొదలగు కొన్ని యౌషధములకు మర్దనయు, భావనయు, కొద్దిరోజులే చెప్పబడియున్నను కొందరు చాలదినములు చేయుదురు,

37. సంనిపాతభైరవి, వైష్ణవీరసము, మొదలగు కొన్ని మందులను తయారైన పిదప కప్పెలుగ కట్టుమని చెప్పకపోయినను కప్పెలుగను కట్టవలయును.

38. అగ్నికుమారము, శీతాంశురసము, వాతగజాంకుశము, వాతవిధ్వంసి, హుతాశనము, మొదలగు కొన్ని మందులను తయారైనపిదప కప్పెలుగను, మాత్రలుగను కూడ చేసెదరు.

39. వాతమును నశింపచేయునని సామాన్యముగ చెప్పియున్నను వికృతినొందిన వాతము చేయగలిగిన సమస్త వ్యాధులనుకూడ నశింపచేయునని తెలిసికొనవలయును. ఇటులనే పిత్తకఫములవిషయమైకూడ తెలిసికొనవలయును.

40. వసంతకుసుమాకరము, క్రమవృద్ధిమహాలక్ష్మీవిలాసము, మహాసువర్ణ సూర్యావర్తి, మొదలగు మందులయందు కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, మొదలగువానికి భాగములు చెప్పకపోయినను, కొన్ని యోగములయందు "యథా లాభమ్" అని సామాన్యముగ చెప్పినను, యుక్తినిబట్టియు సందర్భానుసారముగను వేయవలయును.

41. నవాసారము మొదలగుక్షారములుకలిసిన స్వర్ణవంగము మొదలగు వానిని నూరి నిలువయుంచి వండినయెడల పాకము సరిగరాక మందు సరిగ తయారుకాదు. షడ్గుణము, కాంతవల్లభరసము, మొదలగు మందులనుకూడ నూరిన వెంటనే వండుటయె శ్రేష్ఠము.

42. కొన్ని యౌషధములు సరియైన మాత్రలుగ కానియెడల కొందరు కొంచెము తుమ్మబంకను కలిపెదరు. కాని యిది శ్రేష్ఠమైన పద్ధతి కాదు.

43. సంనిపాతభైరవి, లఘుసూర్యావర్తి, శీతాంశురసము, మొదలగు వానిని శాస్త్రమునందు చెప్పబడిన రోజులకంటె హెచ్చురోజులు మర్దించిన యెడలనే వానియొక్క కప్పెలు చాలరోజుల వరకు మెత్తగ నుండును. కాని శాస్త్రమునందు చెప్పిన రోజుల ప్రకారమే మర్దించినయెడల కప్పెలు వెంటనే గట్టిపడును.

44. కొన్ని మందులయందు భావన చెప్పక ఆయా రసములతో కేవల మర్దననే చెప్పినను సాయంకాలమునందు మందు కలియువరకు రసమునుపోసి రాత్రి యా రస ముతో ఊరనిచ్చి మరునాడు నూరుట శ్రేష్ఠము.

45. షడ్గుణము, స్వర్ణవంగము, పూర్ణచంద్రోదయము, మొదలగు మందులయందు పాదరసము బాగుగ కలియకుండగనే రసమునుపోసి నూరినయెడల పాదరసము ఉండలుగ పైకి తేలును. అప్పుడు మందును బాగుగ ఆరనిచ్చి పాదరసము బాగుగ కలియువరకు మర్దించి పిదప రసములను పోసి నూరవలయును.

46. నవాసారము మొదలగు క్షారములు కలిసిన స్వర్ణవంగము మొదలగు మందులయందు గాని ఉప్పులు అధికముగ కలిసిన మందులయందు గాని నూరునప్పుడు రసముల నధికముగ పోయక కొద్దికొద్దిగ పోయుచుండవలయును. అధికముగ పోసిన యెడల బాగుగ పలచగనై త్వరలో నారవు.

47. మందులను నూరునప్పుడు రసమధికముగ పోసి నీరువలె చేసి నూరక గరిటె జారుపాకమువలె నుండునట్లుగ కొద్దిరసమునే పోయుచు నూరవలయును. అంతకంటె పలచగనున్నగాని, గట్టిగనున్నగాని మందు సరిగ నలుగదు. కాని ప్రారంభమున నొకసారి రసమధికముగ పోసి పలచగచేసి నూరినయెడల, మందునందు మొరుము (ఘన) పదార్థమున్నచో ప్రత్యేకముగ ఖల్వము యొక్క మధ్యకు వచ్చి చక్కగ నలిగి మందులో బాగుగ కలియగలవు.

48. మందులో కస్తూరి, కుంకుమపువ్వు, మొదలగు ద్రవ్యములను కలుపునెడల ముందుగ ఆయా రసములలో బాగుగ కలిపి మందులో పోసినచో చక్కగ కలియ గలవు.

49. ఒక రసముతో మర్దించి యింకొక రసమును పోయునెడల పూర్వపు రసము బాగుగ ఆరి మందు ఆరినపిదపనే తరువాతి రసమును పోయవలయును.

50. కొందరు భావనను సామాన్యదృష్టితో చూచి మర్దనను మాత్రము చేసి భావనను చేయరు. భావనయనగా సామాన్యముగ నా రసముతో ఊరుట యని యర్థము. అట్లూరుటవలన నా రసమునందలి గుణము మందునందు చక్కగ సంక్రమించును. కాన భావన కూడ మిక్కిలి యవసరమే యగును.

51. వారితరమైన లోహభస్మ, నిశ్చంద్రికమైన అభ్రకభస్మ, అని కొన్ని యోగములయందు మాత్రమే చెప్పినను సామాన్యముగ చెప్పినట్లనుకొని ప్రతి యోగమునందును లోహభస్మను, అభ్రకభస్మను, ఇట్టివానినే వేయవలయుననియేకాక ప్రతి భస్మను ఆయా పరీక్షాలక్షణములతోకూడి నిర్దుష్టముగనున్నవానినే గ్రహింపవలయునని కూడ తెలిసికొనవలయును.

52. మందు మొత్తము 10 లేక 30 లేక 40 తులము లుండునట్లు యోగములలో చెప్పినను మనయిష్టము ననుసరించి 20 లేక 50 లేక 35 తులము లుండునట్లు తయారు చేయవచ్చును.

53. మందులను నూరునప్పుడు దుమ్ము మొదలగునవి పడకుండ నుండవలయును. మరియు రాత్రులయందు గాని నూరని సమయమునందు గాని ఏ విధములగు దోషములు సంక్రమించకుండునట్లు తగిన మూతలను తప్పక యుంచవలయును.

54. శాస్త్రమునకు భిన్నముగ అధిక ద్రవ్యములను చేర్చుట, అధికముగు రసములతో మర్దించుట, అధికముగు రోజులు మర్దించుట, మొదలగు వానిని కొందరు చేయుదురు. అట్లు చేయుట ఎంతమాత్రమును మంచిది కాదు. శాస్త్రమునందు చెప్పిన విధముననే చేయవలయును.

55. మందును చేయునపుడు గాని ఉపయోగించునపుడు గాని ఇందు ఏ వస్తువు, ఏ రసము, ఏ విధానము, ఎందునిమిత్తము చెప్పబడినదో ఆలోచించుకొనుచుండ వలయును.

56. వంట యౌషధములను తయారైన పిదప మాత్రలనుగ చేయవలయునని చెప్పినను కప్పెలనుగ చేయవచ్చును.

57. గంధకము మిగిలిన స్వర్ణవంగము మొదలగునవి వేడినే చేయును.

58. తామ్రపాత్ర, మూస, అర్ధమూస, మొదలగు వానియందు వండవలయునని చెప్పినప్పుడు వానియందే వండుట శ్రేష్ఠము. కాని అట్టిస్థలములయందు కొందరు కాచకప్పె మొదలగు వానినే యుపయోగించుచున్నారు.

59. వసంతకుసుమాకరము, క్రవ్యాది, మొదలగు మందులను మాత్రలనుగ చేయునప్పుడు మందు చేతికి పట్టుకొనునెడల త్రిఫలాచూర్ణము, త్రికటుచూర్ణము, మొదలగువానిని చేతికి పూసికొనవలయును.

60. మందును మర్దించునప్పుడు నిటునటునున్న మందును పాత్రముతో పాత్రము క్రిందకు తీయుచు చక్కని నేర్పుతో ఎటులనైనను మందునకు వత్తిడి కలిగి నలుగు నట్లు దృఢముగ మర్దింపవలయును. పాత్రము నిటునటు త్రిప్పుట మర్దనయనబడదు.

61. మందును మర్దించునప్పుడు ప్రక్కలనున్న మందును గాని పాత్రమునకు ప్రక్కనపట్టుకొనినమందును గాని తీసి ఖల్వమధ్యయందుంచుటకు ఇనుపరేకులు, వెదురు బద్దలు, మొదలగు పలుచనిపటకరముల నుపయోగించవలయును.

62. ఆనందభైరవి, పైత్త్యాంతకము, క్రవ్యాది, మొదలగుమందలు ఎప్పటికిని ఆరక ముద్దగ నుండుటకై కొందరు తుదకు కొద్దిగ తేనెను వేసి మర్దించి నిలువచేసెదరు కాని ఇది శ్రేష్ఠమైన పద్ధతి కానేరదు.

63. 2-3 సారులు వండవలసి మరల నూరవలసిన మకరధ్వజము, సిద్ధమకరధ్వజము, మొదలగువానియందు క్రిందనున్న బంగారమును, పైనున్న సిందూరమును, కలిపియే మర్దించుచుండవలయును.

# సేవనావిషయములు

64. గర్భిణీస్త్రీలకు కలుగు వ్యాధులయందు లఘుసిందూరభూషణము, లఘుసూర్యావర్తి, మాదీఫలరసాయనము, వీనినే వాడవలయును. కాని రస విషగంధకములు కలిసిన ఇతరౌషధములను వాడకూడదని చెప్పెదరు. గర్భిణీస్త్రీలకు పైత్య సంబంధమగు లక్షణములు తరుచు కలుగుచుండును. కావున మాదీఫలరసాయనమును, లఘుసూర్యావర్తిని వాడవచ్చును. ఉదుకువలన కలుగు వ్యాధులయందు లఘుసింఘూర భూషణమును వాడవచ్చును. ఇతరౌషధములను వాడకూడదనుటకు ఎట్టి హేతువును కనబడదు. ఎందుచేననగా గంధకముకలిసిన సిందూరభూషణము, ఇంగిలికము మొదలగు ననేకవస్తువులు కలిసిన సూర్యావర్తిని, వాడుటలేదా? కావున నీ మందులతో సమానస్వభావముగల ననేకౌషధములను అవసరమునుబట్టి వాడవచ్చును. కాని రస విషగంధకములు కలిసిన ఔషధములను వాడకూడదనగా "మిక్కిలి తీక్ష్ణ గుణము కలిగి వేడిచేసి గర్భమును నశింపజేయు మందులను ఎంతమాత్రము వాడకూడ" దనెడి అభిప్రాయమును మాత్రము పూర్తిగ గుర్తెరుగవలయును. మిక్కిలి వేడినిగాని మిక్కిలి చలువనుగాని చేయు మందులను వాడక సమశీతములగు మందులనే వాడవలయునని సిద్ధాంతమునుగూడ మనస్సునందుంచుకొనవలయును. మరియు సమశీతలములగు చూర్ణములు, ఆసవములు, అరిష్టములు, కషాయములు మొదలగువానిని కూడ నిస్సందేహముగ వాడవచ్చును.

65. ఒకేజాతిగల యోగములు కొన్ని యున్నప్పుడు ఒకయోగమునం దనేక గుణములను చెప్పి ఇంకొకయోగమునందు ఆ గుణములన్నిటిని చెప్పక పోయినను ఆ గుణములన్నియు నున్నట్లుగనే తెలిసికొనవలయును. ఉదాహరణము-రజితలోహరసాయనము, వాతరాక్షసము, సూతికాభరణము, మొదలగునవి.

66. కొన్నియోగములయందు ప్రధానగుణమును గాని ఇంకను కొద్ది గుణములను గాని చెప్పి యూరకున్నను, అందుకలియు వస్తువుల గుణమునను సరించి యింకను ననేకగుణము లున్నట్లూహించుకొనవలయును. ఉ॥ రసభూపతి, వాతగజాంకుశము, ఉదయమార్తాండరసము, రసరాట్, మొదలగునవి.

67. ఈ మందు ఈ వ్యాధిని నశింపజేయునని సామాన్యముగ చెప్పినను ఆ మందు నందు వేసిన వస్తువులయొక్క గుణములను గుర్తెరిగి వ్యాధి వాతమువలన జనించినదా? పిత్తమువలన జనించినదా? ద్వంద్వమువలన జనించినదా? మొదలగు వివరములను ఊహించుకొని ఉపయోగింపవలయును. ఉ॥ దగ్గులపోవ పనిచేయునని సామాన్యముగ చెప్పబడియున్నను సిందూరభూషణము వేడి సంబంధమగు దగ్గులకుపనును, సువర్ణ

భూపతి శ్లేష్మసంబంధమగు దగ్గులమీదను, లోకనాథము అజీర్ణముతోకూడిన దగ్గుల మీదను. మహాలక్ష్మీవిలాసము ద్వంద్వముతోకూడిన దగ్గులమీదను పనిచేయును.

68. పూర్ణచంద్రోదయము, అభ్రకము, మొదలగు మందులను కలిపి పొట్లములు కట్టుకొనకయే తేనెతో నూరి ముద్దగజేసి యుంచి మాత్రగ నుపయోగించు పద్ధతికూడ కలదు.

69. రజతలోహరసాయనము, కాంతవల్లభరసము, మొదలగు మందు కప్పెల నుపయోగించుటకు నూరునప్పుడు కాటుకవలె మెత్తగ నూరి పొట్లములు కట్టవలయును మెత్తగ నూరనచో సరిగ జీర్ణముకాక సరిగ పనిచేయదు.

70. మందును తేనె మొదలగువానితో పుచ్చుకొనునపుడు కాగితమునందే కలిపి పుచ్చుకొనక దబ్బ, నారింజ, రావి, మర్రి. మొదలగువానియొక్క ఆకులయందుగాని తమలపాకులయందుగాని కలిపి పుచ్చుకొనవలయును. ఆయా రసములతో పుచ్చుకొను నెడల మందునుగాని, రసమునుగాని వికృతినొందింపని వెండిపాత్ర మొదలగువాని యందు కలిపి పుచ్చుకొనవలయును. మందును పుచ్చుకొనినవెంటనే, ఆకు మొదలగునవి యైనయెడల చింపివేయవలయుననియు పాత్ర అయినయెడల బోర్లించవలయుననియు చెప్పెదరు. అట్లు చేయనియెడల రక్షస్సులు మొదలగునవి యందు సంక్రమించి మందుయొక్క శక్తిని తగ్గింపచేయునని శాస్త్రమునందు చెప్పబడినది.

71. స్వల్పమగు వర్ణభేదముచే మందులు మంచివనిగాని చెడ్డవనిగాని అనుకొనుటకు వీలులేదు.

72. మందుకప్పెను చూచి ఇది ఈ మందు అని నిర్ధారణ చేయుటకు ఎంత మాత్రమును వీలులేదు.

73. ఆయా వ్యాధులకు తగిన అనుపానములతో వాడవలయునని సామాన్యముగ చెప్పినప్పటికిని అనేక విషయములను మనస్సునందుంచుకొని అనుపానము ప్రయోగింపవలయును. అనుపానోద్దేశములకై "భస్మప్రణాళికను" చూడుడు.

74. తగిన అనుపానములతో నుపయోగింపవలయుననియు ప్రతి మందునందును చెప్పకపోయినను చెప్పినట్లుగనే యూహించి తగిన అనుపానములతో వాడవలయును.

75. మందులను సేవించువిషయమై గురివిందగింజలు, వల్లము, మాషము, మొదలగు పరిమితులను చెప్పినప్పుడు ఆయాపరిమితిగ వాడవచ్చును. కాని మాషము మొదలగు కొన్ని పరిమితులయందు, మాషమనగా ఎనిమిదిగురువిందగింజలు అగుటచే మోతాదు హెచ్చుగనున్నట్లు కనబడుచున్నది. ఔషధసేవనా పరిమితినిగూర్చి

భస్మప్రకాశికను, పరిమాణమునుగూర్చి ఈగ్రంథమునందలి సామాన్యవిషయములను చూడుడు. ప్రస్తుతము రసౌషధములనుగాని భస్మములనుగాని అరచిన్నము (2 గురిజింద గింజలు) పరిమితిగ రోజునకు రెండుసారులు వాడుపద్ధతి కలదు అవసరముబట్టియు మందుయొక్క స్వభావమునుబట్టియు ఒకచిన్నము మోతాదువరకును రోజునకు నాలుగుసారులువరకును కూడ వాడెదరు. మకరధ్వజము మొదలగు రాజౌషధములను ఒక తులము 2-3 నెలలుకూడ వాడెదరు. కాంతవల్లభరసము, రజతలోహరసాయనము, మొదలగువానిని రోజు మొత్తమునకు అరచిన్నము అనగా ఒకతులము రెండు నెలలుకూడ వాడినను తృప్తికరములగు గుణముల నిచ్చినవి.

76. ప్రతివ్యాధియందును ప్రధానకారణమును తెలిసికొని మందును ప్రయోగింప వలయును. జీర్ణించిన సవాయివ్యాధి, ప్రదరవ్యాధి, మొదలగు వానివలన కలిగిన పాండువ్యాధియందు రక్తమునుకలిగించువనెడి సామాన్యోద్దేశముతో కాంతవల్లభ రసము మొదలగువానిని ఇచ్చినయెడల లాభము కలుగ నేరదు. ప్రధానవ్యాధిని తగ్గించుచు రక్తమును కలిగించు నౌషధము నియ్యవలసియుండును.

77. మందును ప్రయోగించునప్పుడు శరీరములోనున్న లక్షణముల కన్నిటికి నేక ముగనుపకరించు మందును ప్రయోగించుట శ్రేష్ఠము దగ్గు, శుక్లనష్టము, పాండువు, ఇవి యున్నప్పుడు రజతలోహరసాయనము నియ్యవలయును.

78. కాంతవల్లభరసము, రజతలోహరసాయనము, మొదలగు కొన్నిమందులు సేవించుచున్నప్పటికంటె మానినపిదపనే చక్కగ పనిచేయును.

79. అధికమగు మందులను ప్రయోగించినయెడల నొక్కొక్కప్పుడు వికృతియే కలుగును. అప్పుడు 1-2 మందులనుమాత్రము వాడుటగాని ఏమందును వాడకుండుట గాని చేయవలయును.

80. తక్కువ వస్తువులు కలిసిన మందులు తక్కువగ పనిచేయుననియు, అధిక మగు వస్తువులు గాని బంగారము కస్తూరి మొదలగు ఖరీదుగల వస్తువులు గాని కలిసిన మందులు అధికముగ పనిచేయుననియు, అనుకొనుటకు వీలులేదు. ఉ॥ లఘు సూత్వావర్తి ఉడుకుతో కూడిన పైత్యములమీద చక్కగ పనిచేయును. అట్టి వ్యాధులయందు సువర్ణసూత్వావర్తి పనిచేయకపోవుటయేగాక వేడినికూడ చేయును. సువర్ణసూత్వావర్తి వాతముతో కూడిన పైత్యవ్యాధులమీద చక్కగ పనిచేయును.

81. కొన్నియోగములయందు స్వాంగశీతలమున తీసి సేవించినయెడల, మాత్రలనుచేసి సేవించినయెడల, మర్దించి సేవించినయెడల, మొదలగు వాక్యములచే నెంటనే సేవింపవలయుననెడి అభిప్రాయము కలుగుచున్నది. వెంటనే సేవింప

వచ్చును. కాని నిలువయుంచికూడ సేవింపవచ్చును. కాని మందును ఎప్పటికప్పుడు తయారుచేయవలెననెడి భావనుమాత్రము స్ఫురింపదు.

82. కొన్ని యోగములయందు వ్యాధులను వరుసగ చెప్పుచు మధ్యమధ్య అయిదు విధములగు దగ్గులను, ఇరువది మేహములను అని చెప్పబడియుండును. అట్టి చోట పాండువును, భగందరములను. అని సామాన్యముగ చెప్పబడియున్నను అయిదువిధములగు పాండువులను, ఆరువిధములగు భగందరములను, నశింపజేయునని గ్రహింపవలయును. మరియు మరియొకచోట దగ్గులను, మేహములను, అని సామాన్యముగ చెప్పినను అయిదువిధములైన ఇరువదివిధములైన, అనియే గ్రహింపవలయును

83. మందునుపయోగించునప్పుడు, ఇంకకలియు ద్రవ్యములేవి? వీనియొక్క గుణములేవి? గుణములయొక్క తరతమాదిభేదము లేవి? రోగముయొక్క స్వభావమేమి? ఏదోషములు కలవు? దోషములయొక్క తరతమాదిభేదములెవ్వి? మొదలగు ననేకవిషయములను తప్పక నాలోచింపవలయును. కాని ఇది సామాన్యవిషయము కాదు.

84. దీనిని తేనె, నెయ్యి. మొదలగువానితో మాషపరిమితిగ నని చెప్పినప్పుడు తేనె మొదలగువానినిగాక కేవలమందునే మాషపరిమితిగ సేవింపవలయును.

---

## సందేహ సమాధానములు

85. ప్రశ్న :— కాంతవల్లభరసము, రజతలోహరసాయనము, రసరాట్, రస భూపతి, లోహరసాయనము మొదలగు వంటయౌషధములయందు వేయవలసిన లోహములు పచ్చివా? లేక కొన్ని పుటములు వేయబడినవా? లేక పూర్తిగా పుటముల వేయబడినవా?

86. సమాధానము :— కేవలపచ్చిలోహములను వేయుట శ్రేష్ఠముకాదు పూర్తిగ పుటములనువేసిన లోహములనే వేయవలయును. కాని ఔషధమును వండవలసిన కాలపరిమితి ననుసరించియు, మందునందు ఇంకనుకలియు రసము గంధకము మొదలగు (లోహమునను మృదుత్వము నొందించు) ద్రవ్యములయొక్క సంబంధము ననుసరించియు, కొద్దిపుటములు తక్కువగ వేయబడిన లోహములనుకూడ చేర్చవచ్చును. పచ్చిలోహములను వేసినయెడల కుప్పెలు గట్టిగ బరువుగనుండును. కాన అందునిమిత్తము పచ్చిలోహములను వేయనవసరములేదు. పూర్తియైన భస్మములను వేసినను గంధకము మొదలగునవి పూర్తిగ జీర్ణమైనయెడల కుప్పెలు గట్టిన బరువుగా నుండును. పచ్చిలోహములు వేయబడిన మందులుకూడ కొంతవరకు పనిచేయుచున్న

87. ప్ర॥ శిలాజతు అని సామాన్యముగ చెప్పినప్పుడు గోమూత్రశిలాజతా? కర్పూరశిలాజతా?

88. స॥ కర్పూరశిలాజతునే చాలమంది వేయుదురు. కాని రసాయనత్వము మొదలగు గుణములననుసరించి కొన్ని యోగములయందు గోమూత్రశిలాజతు చేర్చ వలసి యుండును.

89. ప్ర॥ మందులయందు వేయు శుంఠి, కరక్కాయలు, పిప్పళ్లు, లవంగములు, జాజికాయలు, మొదలగువానిని ఎట్లు చేర్చవలయును? ఎప్పుడు తూచవలయును?

90. స॥ చూర్ణించి వస్త్రగాలితముచేసి చేర్చుటయే శ్రేష్ఠము. కొందరు వస్తువులను భాగప్రకారముగ తూచి వస్త్రగాలితముచేసి ఆ చూర్ణమును చేర్చెదరు. ఇది ఎంతమాత్రమును మంచిపద్ధతి కాదు. ఎందుచేతననగా వస్త్రగాలితము చేయునప్పటికి కొన్ని చూర్ణములు మొత్తముభాగములో సగముదనుక కూడ తగ్గును. మరియు చూర్ణించు వానియొక్క స్వభావము ననుసరించి ఇటునటుపోవుట మొదలగు కారణములచే కొంత తగ్గవచ్చును. అప్పుడు వస్తువు పూర్తి పరిమాణముగ వేయబడక పోవును. శాస్త్రకారుడు శుంఠి యొకతులమని చెప్పినపుడు మందులో నొక తులము కలియవలయుననియే వాని యభిప్రాయము. కాని మొదటనే తూచి పోగా మిగిలినంతే వేయుమని యభిప్రాయము కాదు. ఇట్లు భిన్నముగ చేయుటచేతనే సువర్ణ సూర్యావర్తి, లోకనాథము మొదలగు మందులు కొందరు చేసినవి ఒక విధమగు రంగుగను, కొందరు చేసినవి ఇంకొక విధమగు రంగుగను, కొందరు చేసినవి బరువుగను, కొందరు చేసినవి చులకనగను ఉండును. ఇంతియేకాక ఒకరు చేసినదియే యొకసారి యొకవిధముగను ఇంకొకసారి ఇంకొకవిధముగను నుండుటకు కూడ నిదియే కారణము. మరియు ఎల్లప్పుడును ఒకేవిధమగు భాగముల ప్రకారముగనే చేసినను మొత్తము మందు ఒకసారి బాగుగ తగ్గుచుండుటయు, ఇంకొకసారి మరల కొద్దిగ హెచ్చుచుండుటయు, ఇతరులమీద అనుమానము పడుచుండుటయు మొదలగు అవస్థలు కూడ కలుగుచున్నవి. కొందరు ప్రతివస్తువును చెప్పిన భాగముకంటె కొంచెము హెచ్చుగ వేసి యేకముగ కలిపి వస్త్రగాలితముచేసి ఆ ద్రవ్యములయొక్క మొత్తమునకు సరిపోవునట్లు అనగా నాలుగు మూలికాద్రవ్యములుండి యొక్కొక్క తులమని చెప్పబడియున్నపుడు ఒకటిన్నరతులము చొప్పున తూచి చూర్ణించి యాచూర్ణమును నాలుగు తులములుగ తూచి వేసెదరు. ఈ పద్ధతికూడనంత శ్రేష్ఠమైనది కాదు. ఎందుచేతననగా? పిప్పళ్లు, తెగడ, మొదలగు వానియందు మొరుమెక్కువగ పోవచ్చును. వెదురుప్పు మొదలగునవి గాలికి కొంత యధికముగ పోవచ్చును. ఇట్టి కారణములచే వస్తుభాగము సరిగ కలియనేరదు. కొందరు ప్రతివస్తువును వేరువేరుగ చూర్ణించి యా చూర్ణములను ఆయా భాగముల ప్రకారముగ వేరువేరుగ తూచి ఖల్వములో వేయుదురు. ఇదియే ఉత్తమమైన పద్ధతియనుటకు ఎంతమాత్రమును సందేహము లేదు. కొందరు శుంఠి,

యోగాలు మొదలగు మృదుద్రవ్యములను జాజికాయ, జీలకర్ర మొదలగు చమురు
గి వస్త్రగాలితము కాని ద్రవ్యములను వస్త్రగాలితము చేయకుండగనే వేసెదరు.
మంచి పద్ధతియని చెప్పుటకు వీలులేదు.

91. ప్ర॥ శీతాంశురసము, వాతగజాంకుశము, శూలనికృంతనము, వాతమారక
ము, మొదలగు వానియందు చెప్పబడిన త్రికటుకములు, త్రిఫలములు, పంచలవణ
ు, క్షారద్వయము, మొదలగువానిని ప్రత్యేకముగ ఆయా భాగముల ప్రకారముగ
హింపవలయునా ? లేక సాముదాయకముగ అనగా అన్నిటిని కలిపియే భాగ
కారముగ గ్రహింపవలయునా ?

92. స॥ కొందరు వేరువేరుగ భాగముల ప్రకారముగ గ్రహించెదరు. కాని
ి శాస్త్రకారుని యొక్క యభిమతముగ కన్పట్టదు. ఎందుచేతననగా శ్లీపదారి
హము మొదలగు మందులయందు త్రిఫలములని యేకముగ చెప్పక కరక్కాయ
ొదలగు వానిని వేరుగ చెప్పియుండుటచేతను. వాతవిధ్వంసి మొదలగు యోగముల
ందు శుంఠిని, పిప్పళ్లను, మిరియాలను వేరువేరుగ చెప్పి ప్రత్యేకముగ నొక్కొక్క
గముగ గ్రహింపవలయునని కంఠోక్తిగ, స్పష్టముగ చెప్పుటచేతను, కొన్ని
ాగములయందు చాతుర్జాతకములు లవణత్రయము మొదలగు సాముదాయక శబ్ద
లను ప్రయోగించుటకు వీలుగనున్నను ఆ ద్రవ్యములను వేరువేరుగనే చెప్పుటచేతను,
స్త్రకారునియొక్క అభిప్రాయము కలిసియే భాగప్రకారముగ గ్రహింపవలసినదిగ
చుచున్నది. మఱియు త్రికటు, చాతుర్జాతక, లవణపంచక, మొదలగు శబ్దములచే
ముదాయమే గ్రాహ్యమగును. కాన సముదాయమునే భాగముగ గ్రహింపవలయును,
ూ ద్రవ్యవాచకములగు పదములను సంస్కృత మూలమునందు సమాహారముగ
ప్పినప్పుడు ఆ ద్రవ్యములను వేరువేరుగ గ్రహించుచుండుటచేతను, ఇట్టి సముదాయ
లు కలిసిన యోగములయందు ప్రత్యేకముగ అని చెప్పినప్పుడు నా ప్రత్యేకత
ముదాయమున కూడ సమన్వయించునదగుటచేతను, ఇట్టి సముదాయములను కూడ
ుగనే గ్రహింపవలయునని కొందరు చెప్పెదరు. కాని అంతటితో ఆ వాదమునకు
ము కలుగనేరదు. ఏలాద్వయము, ద్విక్షారము, మొదలగు మూడు ద్రవ్యములకు
క్క వగకల అనగా రెండు ద్రవ్యములుకల సముదాయమును వేరువేరు భాగములుగనే
హించుచున్నారు. ఇచ్చట మాత్రమిట్లు చేయుటకు సాంప్రదాయమనిగాక వేరు
రణమును చెప్పుటకు వీలుకనబడదు.

93. ప్ర॥ సేవించుటకు రెండు గురివిందగింజలు, మాషము, మొదలగు పరిమితి
ప్పినపుడు ఒక మోతాదునకనియా ? రోజు మొత్తమునకనియా ?

94. స॥ ఒక్కొక్క మోతాదునకనియే గ్రహింపవలసి యున్నది.

95. ప్ర॥ మాత్రలను చేయునప్పుడు మాష, ముద్గ, చణక, గుంజ, సర్షప, మొదలగు పరిమితులను చెప్పునపుడు వాని యాకారమంత యనియా? వాని తూకమంత యనియా? 95. స॥ వాని యాకారమంతయనియే తెలిసికొనవలయును.

96. ప్ర॥ కొన్ని యోగములయందు మర్దన నిమిత్తము కొన్ని రసములను చెప్పి వీనితో నొక రోజు మర్దింపవలయును అని సామాన్యముగ చెప్పినప్పుడు అన్ని రసములను కలిపి వానితో నొకరోజు మర్దింపవలయునా? వేరువేరుగ నొక రోజు మర్దింపవలయునా? వేరువేరుగా నొక్కొక రోజు మర్దింపవలయునా?

97. స॥ అన్నిరసములనుకలిపి మర్దించుట శ్రేష్ఠముకాదు. ఒకరోజుననే గాక ఒక్కొక్క రసముతో ఒక్కొకరోజు మర్దింపవలయును.

98. ప్ర॥ మందును బలానుసారముగ నుపయోగింపవలయుననగా నేమి?

99. స॥ రోగియొక్కయు, మందుయొక్కయు, రోగముయొక్కయు, బలము ననుసరించి ఉపయోగింపవలయునని యభిప్రాయము.

100. ప్ర॥ ఈరసములతో మర్దింపవలయును అని సామాన్యముగ చెప్పినపుడు అన్నిరసములను కలిపియా? వేరువేరుగనా?

101. స॥ వేరువేరుగ ననియే యర్థము.

102. ప్ర॥ మూడురసములను చెప్పి ఐదురోజులు మర్దింపవలయునని చెప్పినపుడు ఎట్లు మర్దింపవలయును?

103. స॥ ఒక్కొకరసముతో నైదేసిరోజులు మర్దింపవలయును.

104. ప్ర॥ ఎన్నిదినములు మర్దింపవలసినదియు నిర్ధారణగ చెప్పని శీతాంశు రసము మొదలగు మందులను ఎన్నిదినములు మర్దింపవలయును.

105. స॥ ఒకరోజుమాత్రమే మర్దింపవలసియుండును. కాని 10-15 రోజులు కూడ మర్దించెదరు.

106. ప్ర॥ త్రికటు, త్రిఫల, త్రిజాత, మొదలగువానియొక్క కషాయములతో మర్దింపవలయునని చెప్పినప్పుడు శుంఠి మొదలగువానిని వేరువేరుగ కషాయముకాచి మర్దింపవలయునా? మూడేసిద్రవ్యములను కలిపి కషాయముకాచి మర్దింపవలయునా?

107. స॥ మూడేసిద్రవ్యములను కలిపియే కషాయముకాచి దానితో మర్దింపవలయును. ఇటులనే చాతుర్జాత, పంచకోల మొదలగు వానియొద్దకూడ గ్రహింపవలయును.

108. ప్ర॥ కజ్జల్యౌషధము అనగా నేమి?

109. స॥ రసగంధకములను కలిపి కాటుకవలె నూరి మిగిలిన వస్తువులనుగూడ కలిపి మెత్తగనూరి వండవండవలసినయులేక వండబడక పోవుటచే రసగంధక కజ్జలితో కూడ కలిసియున్న యౌషధములు కావున కజ్జలౌషధములని చెప్పబడును. అనగా వండబడని యౌషధములని యర్థము.

110. ప్ర॥ వంటయౌషధము లనగా నేమి ?

111. స॥ అగ్నిసంయోగముచే పక్వముచేయబడిన యౌషధములని యర్థము. వీనిని పాచితౌషధములు మొదలగు శబ్దములచే వ్యవహరించినచో బాగుగనుండెడిని.

112. ప్ర॥ సంనిపాతభైరవి. శీతాంశురసము, మొదలగువానిని చిత్రమూలము వేపచెక్క మొదలగువానియొక్క నిజరసములతో మర్దింపవలయునా ? లేక ఏమి చేయవలయును ?

113. స॥ నిజరసములతో మర్దించుటయే మిక్కిలి శ్రేష్ఠము. లేనిచో వానియొక్క కషాయములతో మర్దింపవలసి యుండును.

114. ప్ర॥ శాస్త్రకారు లిన్నివిధములగు యోగముల నెందులకు చెప్పిరి ?

115. స॥ యోగమునందలి ద్రవ్యసంయోగమును ఆ ద్రవ్యముల సంబంధమగు గుణములయొక్క తరతమాదిభేదములను తెలిసికొనియు, వ్యాధుల యందలి వాతాగులయొక్క సంయోగమును తరతమాదిభేదములను తెలిసికొనియు, ఔషధములను ప్రయోగించునెడల నీ యోగములు చాలునాయనెడి సందేహము కలుగుచున్నది.

116. ప్ర॥ వంటయౌషధములను వండినవెంటనే సేవింపరాదనియు, నిలువయున్నచో నధికగుణముల నిచ్చుననియు నిలవయున్న కజ్జలౌషధములు గుణప్రదములు కావనియు, అనుటకు కారణ మేమి ?

117. స॥ అగ్నిసంయోగముచే వండినవెంటనే కొంత తీవ్రగుణమును కలిగియుండుననియు, మాగిన (నిలవయున్న) కొలదియు తీవ్రత తగ్గి వస్తుసమ్మేళనము బాగుగనై యధికగుణములను కలిగించుననియు నభిప్రాయము. కజ్జలౌషధములయందు మూలికలు చాలవరకు కలియును. మూలికలయొక్క గుణము చిరకాలము నిలువయుండదు. కాన కజ్జలౌషధములు చిరకాలమున్నచో గుణప్రదములు కానేరవు. సామాన్యముగ వంటయౌషధములలో మూలికలు కలియవు. కొన్నిటియందు కలిసినను వంటయందు మూలికాభాగమంతయు నశించియేపోవును. మరియు తాళకము, మణిశిల, మొదలగు సామాన్యపదార్థములుగూడ నశించి ఘనపదార్థములే మిగులును. కాన వంటయౌషధములు నిలువయున్నచో గుణప్రదములనుటకు ఎంతమాత్రమును సందేహములేదు.

118. ప్ర॥ ఈ మందులను తేనె, నెయ్యి, పంచదార, వెన్న, వీనితో సేవింప వలయునని సామాన్యముగ చెప్పినప్పుడు వీనినన్నిటిని కలిపియా? వీనిలో నొక్కొ-దానితోడనా? ఎంత పరిమితిగ కలుపవలయును?



119. స॥ ఒక్కొక్కదానితో ననియే యభిప్రాయము. అవసరమును బట్టి వానిలో దేనితోనైనను సేవింపవచ్చును. మరియు 2, 3 టితో కలిపి కూడ సేవింప వచ్చును. వీనిని మందు బాగుగ కలియునంత పరిమితిగ నుపయోగింపవలయును.

120. ప్ర॥ శుంఠి, దాసెనచెక్క, అల్లము, మొదలగు ద్రవ్యముల యొక్క అనుపానములతో సేవింపవలయునని సామాన్యముగ చెప్పినప్పుడు ఎట్లు సేవింప వలయును?

121. స॥ ఆ ద్రవ్యములనుండి స్వరసమును గాని, కషాయమును గాని గ్రహించి యా ద్రవముతో సేవింపవలయును. ఈ ద్రవానుపానము 2, 3, 4 తులముల పరిమితిగ నిచ్చుట సాంప్రదాయము. శుంఠి, మిరియాలు, మొదలగువానిని చూర్ణముగ కూడ చేర్చవచ్చును. చూర్ణమును అనుపానముగ చేర్చునెడల మందునకు 2, 3, 4 రెట్లు చేర్చుట సాంప్రదాయము.

122. ప్ర॥ రసగంధకములు తక్కువకలిసినట్టి గాని గంధకము కలియనట్టి గాని, పాదరసము కలియనట్టిగాని, వంట వసంతకుసుమాకరము, నవలోహాగ్ని కుమారము, పాషాణవాతరాక్షసము, మొదలగు మందులను వండుట ఎట్లు? అవి వంటయౌషధము లెట్లగును?

123. స॥ వంటయనగా ఉడికించుటయనియే యర్థము. సిందూరము లేనిచో వంటయౌషధముగ కాకపోనేరదు. పాదరసమధికముగ కలిసి సిందూరములేని కాంతి వల్లభరసము, రజతలోహరసాయనము, మొదలగునవి వంటయౌషధములు కాలేదా? ఈ మందులను ఆయా యోగములయందు చెప్పిన కాలప్రకారముగ గాని గంధకము మొదలగు ఇతర పదార్థములు నశించువరకు గాని వండవలయును.

124. ప్ర॥ మందులను తయారైన పిదప కుప్పెలనుగ చేయుటకు కారణమేమి?

125. స॥ కుప్పెలనుగ జేసినచో అక్షరములను వేయుటకు వీలుగ నుండును. ఇటునటుపడినను నశింపకుండును. మరియు తీసికొనుట మొదలగు వానికి సౌకర్యముగ నుండుటయేగాక మందునందలి ఘాటు (శక్తి) త్వరలో నశింపజాలదు. ఈ యుద్దేశము తోడనే కొందరు అభ్రకము, లోహము, మొదలగు వానిని భస్మపూర్తియైన పిదప మెత్తగ నూరియుంచక బిళ్ళలుగనే యుంచెదరు. కాని కాంతవల్లభరసము మొదలగు కొన్ని మందులను చూర్ణముగ నుంచవలసినదనియే స్పష్టముగ చెప్పబడి యున్నది.

కాని కాంతవల్లభరసము, రజతలోహరసాయనము, మొదలగు మందులను కొప్పెలుగ చేసినను కొంచెము తరుచుగ వాడుకొనుటకై 2, 3 తులములను ఏకముగ చూర్ణముచేసి యుంచుకొనుచు వాడుకొనుచుందురు.

126. ప్ర॥ వాతపిత్తశ్లేష్మవ్యాధులను అని సామాన్యముగ చెప్పినప్పుడు మూడు దోషములవలనను కలిగిన వ్యాధుల ననియా? ప్రత్యేక దోషములచే కలిగిన వ్యాధులనియా? మరియు "వాతపిత్తవ్యాధులను" మొదలగు రెండేసి దోషములు కలిసిన వ్యాధులను చెప్పినప్పుడు ద్వంద్వవ్యాధుల ననియా? లేక ప్రత్యేక దోషములచే కలిగిన వ్యాధుల ననియా?

127. స॥ ప్రత్యేక దోషములచే కలిగిన వ్యాధులను అనియే యనుకొనవలయును. అట్లయినచో ప్రత్యేక దోషములవలన కలిగిన వ్యాధులను, రెండేసి దోషములవలన కలిగిన వ్యాధులను, మూడు దోషములవలన కలిగిన వ్యాధులను కూడ గ్రహించుటకు వీలుగ నుండును. కాని కొన్ని యోగములయందు పిత్తవ్యాధులనని చెప్పి వాతపిత్తవ్యాధులననియు, కొన్ని యోగములయందు వాతవ్యాధులనని చెప్పి వాతపిత్తశ్లేష్మవ్యాధులననియు, మరల చెప్పుటచే పై యభిప్రాయము సరియైనదికాదని కొంత సందేహ మేర్పడుచున్నది. కాన నీ విషయమును యోగానుసారముగ నిర్ధారణ చేయవలసి యుండును.

128. ప్ర॥ మందును కొన్ని రసములతో మర్దనముగాని భావనముగాని రెండింటినిగాని చేయవలయునని చెప్పినప్పుడు ఆ రసములను క్రమము (వరుస) గ గ్రహింపవలయునా? వరుసగగాక యిష్టమువచ్చినట్లు గ్రహింపవచ్చునా?

129. స॥ వరుసగనే గ్రహింపవలయును. శాస్త్రకారు లనేకయుద్దేశములను మనస్సునందుంచుకొని వరుసను చెప్పియుండవచ్చును. అట్లు చేయనియెడల గుణభేదము కలుగుటయేగాక మందులయందు వర్ణభేదము కూడ కలుగుచుండును. వసంతకుసుమాకరము మొదలగు కొన్ని యోగములయందు "క్రమాత్" (వరుసగ) అని స్పష్టముగ చెప్పియే యున్నారు.

130. ప్ర॥ ఎండుద్రవ్యములను కొన్నిటిని, పచ్చిద్రవ్యములను కొన్నిటిని, పండ్లను కొన్నిటిని, చెప్పి వీని రసములతో అని సామాన్యముగ చెప్పినప్పుడేమి చేయవలయును?

131. స॥ పచ్చిద్రవ్యములనుండి స్వరసములను, పండ్లనుండి రసమును, ఎండుద్రవ్యములనుండి కషాయములను గ్రహింపవలయును.

132. ప్ర॥ వీనితో మర్దింపవలయుననిగాని భావనచేయవలయునని గాని చెప్పి నప్పుడు ఏమిచేయవలయును?

133. స॥ వానియొక్క రసములతో మర్దనము గాని, భావనము గాని చేయ వలయును.

134. ప్ర॥ మందును సేవించుటకు మండలము, అర్ధమండలము, మాసము మొదలగు కాలపరిమితిని చెప్పకపోయిన యెడల ఎన్ని రోజులు సేవింపవలయును?

135. స॥ ఇన్ని రోజులని చెప్పినను, చెప్పకపోయినను, వ్యాధి శాంతించు వఱకు సేవింపవలయును.

136. ప్ర॥ వంటగాని పుటము గాని, అయిన పిదప ఆ మందునకు సమానముగ గాని, సగముగ గాని నాభి మొదలగువానిని కలపవలయునని చెప్పినపుడు మొదట వేసిన మందున కనియా? పక్వమైన మందున కనియా?

137. స॥ పక్వమైన మందునకే సమానముగ గాని, సగముగ గాని కలప వలయును.

138. ప్ర॥ చాల యోగములలో కాస, శ్వాస, పాండు, క్షయ, మొదలగు కొన్ని రోగములను తరచుగ చెప్పుటకు కారణమేమి?

139. స॥ ఇవి తరుచు సంభవించుననియు, బాధాజనకములనియు, ఉపద్రవ కరములనియు, మొదలగు నుద్దేశములతో వీనిని తరచుగ చెప్పియుండవచ్చును.

140. ప్ర॥ మర్దించుట కుద్దేశమేమి?

141. స॥ మర్దించుటవలన ఘనరూపమునువీడి మృదుత్వము నొందును. అందు వలన మందంతయు సరిగ జీర్ణమై పూర్ణమైన గుణములను కలిగించును. మరియు నాయా ద్రవములతో మర్దించుటవలన త్వరలో మృదుత్వము నొందుటయేగాక నాద్రవద్రవ్యముల యొక్క గుణములు కూడ శరీరములో సంక్రమించును.

142. ప్ర॥ మందును 1, 2, 5, మొదలగు రోజులు మర్దింపవలయునని చెప్పి నప్పుడు రాత్రింబవళ్లు ఎడతెగకుండ నేకముగ మర్దింపవలయునా? రాత్రులయందు మాని పగటియందు మర్దించిన చాలునా? లేక పగటియందు కూడ అప్పుడప్పుడు మానుచుండవచ్చునా?

143. సు॥ కొన్ని యోగములయందు "రాత్రిందివా" (రాత్రింబవళ్లు) అని స్పష్టముగ చెప్పబడియున్నను పగటియందు మాత్రమే మర్దించుట సాంప్రదాయమై యున్నది. పగటియందు కూడ అప్పుడప్పుడు మానుట యెంతమాత్రము మంచిది కానేరదు.

## ఔషధపాక వివరణము

144. మర్దింపబడిన మందును మట్టిపూయబడిన గుడ్డలతో చుట్టబడిన కాచకుప్పె యందుంచవలెను. ఒక కుండలో పలచగ నిసుకపోసి యందుపైన సీసానుంచి సీసా మూతి వరకు ఇసుకపోసి పొయ్యిమీదనుంచి సరియైన అగ్నిచే పాకము వచ్చువరకు వండవలయును.

145. మందును వండుటకు పూర్వము శాస్త్రవిహితములగు మర్దనల నన్నిటిని చక్కగ చేయవలయును. చక్కగా ఆరినపిదపనే దీనిని కాచకుప్పెయందు పోయ వలయును. తడియున్నచో మందు చెడవచ్చును.

146. మందును వండు పాత్రలయొక్క వివరణము - మందును కాచెకుప్పె, పింగాణీగిన్నెలు, మొదలగు ననేక పాత్రలయందు వండవచ్చును.

147. అడుగు గుండ్రముగను మూతి పొడుగుగను నుండి దళసరిగ నుండునట్టి తేజాప సీసాలనబడు కుప్పెలయందు వండవచ్చును. ఈ సీసా చాల దృఢముగ (గట్టిగ) నుండును. త్వరలో బ్రద్ధలగుననెడి భయము లేదు. ఇందు వండినయెడల పాకము కొంచెమాలస్యముగ వచ్చును. మరియు నుండు మూతి వద్దకు వచ్చి మూతిని కప్పివేయుచుండును. అందుచే తరుచు కడ్డీవేయ నవసరము కలుగుచుండును. కాని యిందు వండబడిన మందు ఏ విధముగను నశింపక అంతయు సరిగవచ్చును. కుప్పెను బ్రద్దలుకొట్టగా పైసింధూరము కురిడీ కాయచక్కవలె సులభముగ నూడిపడును. అట్లు రాక పట్టుకొనియున్నను చులకనగ తీయుటకు వీలుగ నుండును. బ్రద్దలుకొట్టునప్పుడు పెద్దముక్కలుగ బ్రద్దలగును. కావున మందునందు సీసాముక్కలు చిన్నవిగను విశేషముగను కలియుటకు వీలుండదు. ఈ సీసాను బ్రద్దలుకొట్టియే మందును గ్రహింప వలసియుండును.

148. కొండపల్లి కుప్పెలనిగాని జగ్గంపేట కుప్పెలనిగాని చెప్పబడుచు లోపల నుండు సీసాభాగము కాగితమంత పలచగనుండి పైన సుమారు పావు అంగుళము దళసరిగ కేవలము మన్నుచే పూయబడి గుండ్రముగనుండి ఒలిచిన పెద్ద కొబ్బరికాయవలె

నుండు కుప్పెలయందుకూడ వండవచ్చును. దీనియందు వండినచో సీసా పలచగనుండుట వలన పాకము త్వరలో వచ్చును. తరుచు మాటి మాయుట, కడ్డీలు వేయవలసి యుండుట, మొదలగు కష్టములేవియు కలుగవు. కాని సీసా మిక్కిలి పలుచగ నుండుటచే ఏమాత్రము వత్తిడి తగిలినను త్వరలో పగిలిపోవును. అందుచే మందు వండినపిదప తీయుట, ఇటునటు తీసుకొనివెళ్లుట మొదలగువానికి భయముగ నుండును. మరియు మందును తీయుటకు కుప్పెను బ్రద్దలుకొట్టినప్పుడు లోపలి సీసా మిక్కిలి సన్నని ముక్కలుగనయి మందులో చాల కలియును. ఆ ముక్కలను తీయుటకుకూడ మిక్కిలి కష్టముగ నుండును. పలచని సీసాను పట్టుకొనియుండుటచే నిందలి సింధూర మును తీయుటకు కూడ బహుకష్టముగనే యుండును. త్వరలో రానేరదు. మరియు చిన్నచిన్న ముక్కలుగ నగుచుండును. ఈ ముక్కలను నీటిలో తడిపి సన్నని చాకుతో విదల్చిన యెడల సిందూరము సీసాముక్కనుండి కొంత త్వరలో విడును.

149. మందులను ఎట్టి సీసాలయందైనను వండవచ్చునని కొందరు చెప్పెదరు. కాంతవల్లభరసము, స్వర్ణవంగము, మొదలగు అడుగననుండు మందులను అట్లు వండు కొనవచ్చును. కాని సిందూరప్రధానమైన మందులను వండుట కంతసమంజసముగ నుండవు. మరియు అడుగున సరిగ గుండ్రముగ నుండకపోవుటచే కాంతవల్లభరసము మొదలగునవి కూడ సరిగ పక్వము కాకపోవచ్చును.

150. అడుగున కొద్దిగ అంచుకలిగి కొంతవరకు గుండ్రముగనుండి మూతి సన్నముగనుండి కాశీకుప్పెలనబడు సీసాలయందు వండవచ్చునని కొందరు చెప్పెదరు. కాని దానిని గూర్చి విశేషానుభవము లేకపోవుటచే విశేషించి వ్రాయ వీలుకలుగలేదు.

151. అడుగున ఏవిధమగు అంచులును లేక తట్టుగ గుండ్రముగ నుండి మధ్య యందు సన్నముగ గాని లావుగ గాని, లేకుండి సమానముగ పొడుగుగనుండి క్రింది భాగముకంటె పైభాగము కొంచెము వెడలుపుగనుండి అంచులు సమానముగనున్న రెండు పింగాణిగిన్నెలను గ్రహించి వానియందుకూడ వండెదరు. వీనియొక్క రెండు మూతులను నొకదానిపై నొకటి యుంచినచో సరిగ సంపుటమై యొకేపాత్రవలె నుండవలయును. మధ్యయందు ఇనుముకల అనగా ఇనుమునకు పింగాణిపూయబడిన పాత్రలనే గ్రహింపవలయును. పైన బోర్లించు పాత్రకు మధ్యయందు కడ్డీపోవుటకు వీలుగనుండునట్లు సన్నని రంధ్రమును చేయవలయును. బియ్యము, మినుములు, వీనిని కలిపి కొద్దిగ నీళ్లుపోసి జిగురువచ్చులాగున నూరి ముద్దగ చేయవలయును. ఈపింగాణి గిన్నెలకు రెండింటిని కలిపిన ప్రదేశమున ఈ ముద్దనే పూసి సంధిబంధనముచేసి పిదప మట్టిపూసిన గుడ్డపీలికలను సంధిబంధనము చుట్టును చుట్టవలయును. పిదప సంపుటమున కంతకును మట్టితో పూయబడిన గుడ్డలను చుట్టవలయును. ఇందు మందును వండిన యెడల ఎట్టి కష్టములను కలుగవు. సంధిబంధనమును విప్పి సిందూరమును గాని, అడుగుననున్న మందును గాని సుఖముగ గ్రహింపవచ్చును. సీసాముక్కలు మొదలగు నవి కలియుననెడి భయమును గాని, శ్రమ గాని ఏమియు కలుగదు, మందు ఇటునటు

ఎంతమాత్రము పోనేరదు పాత్రలను కొద్దిగ కూడ పట్టుకొనదు. చాకు మొదలగు వానితో సుఖముగ తీయవచ్చును. ఇది చాల సుఖకరమైన పద్ధతిగ నున్నది. మరియు నీపాత్రలను 2, 3, 4 వంటల వరకు కూడ నుపయోగించవచ్చును. పింగాణి నిషేధమనుట ఎట్లున్నను, అట్టి పాత్రలయందు వండబడిన మందు వికృతినొందునేమోయని కొందరు పెద్దలతో సంప్రదించగ పింగాణీయనునది కాచభేదమే యనియు దాని సంపర్కముచే వండబడిన మందు ఎంతమాత్రము వికృతినొందదనియు నిస్సందేహముగ నీ పాత్రలయందు వండవచ్చుననియు చెప్పిరి. మరియు నీ పింగాణియందు అడ్డుపరచు శక్తి యధికముగ కలదనియు నందుచే పాత్ర మధ్యయందున్న ఇనుముయొక్క గుణము మందునకు ఎంతమాత్రము సంక్రమించదనియు కూడ చెప్పిరి. సంధిబంధనమును విప్పి మందును తీసినపిదప మరల సంధిబంధనమును చేయుచు 2, 3, 4 వంటల వరకు నీ పాత్రల నుపయోగింపవచ్చును. మంట వేడిమిచే క్రింది పాత్ర త్వరలో చెడును. పై పాత్ర 5, 6 వంటల వరకు కూడ నుపయోగించును. ఏకారణముచేతనైనను, 1, 2 వంటలకే క్రింది పాత్రయొక్క గాని, పై పాత్రయొక్క గాని పింగాణిపూత పోయినయెడల నా పాత్రను మరల నెంతమాత్ర ముపయోగింపకూడదు.

152. ఒక డాకిపైన సమానముగు ఇంకొక డాకను బోర్లించి మట్టిగుడ్డలచే సంధిబంధనముచేసి యందు స్వర్ణవంగము మొదలగు మందులను వండెదరు. కడ్డీవేసి పాకము చూచుటకును మందునందలి గంధకము పోవుటకును పైన బోర్లించు డాకకు సన్నరంధ్రమును (సంధిబందనము చేయకుండగనే) చేయవలయును. ఇట్టి దీనియందు రజతలోహరసాయనము, రసభూపతి, మొదలగు మందులను మాత్రలనుగ (చిన్న చిన్న కప్పెలనుగ) జేసి పోసి వండవచ్చును. ఎటులననగా మంటను వేయుచు అప్పుడప్పుడు సంపుటమును ఎత్తి కదల్చుచుండిన యెడల మందుకప్పెలు క్రిందివి మీదునకును, మీదువి క్రిందునకును వచ్చుచుండును. పై డాకయొక్క రంధ్రమునుండి వచ్చు పొగకు గంధకపురంగు పోయి తెలుపుకలుగగనే పాకము వచ్చినట్లు గుర్తింపవచ్చును. లేదా సంపుటమును ఎత్తి ముక్కు వద్దనుంచి వాసనచూచినచో గంధకమున్నదియు లేనిదియు వాసనవలన స్పష్టముగ తెలియును. మందును చూర్ణముగనైనను పోసి వండవచ్చును. ఇట్లు చేసినయెడల అప్పుడప్పుడు విదల్చనవసరము లేదు. రంధ్రమునుండి వచ్చు పొగవలనను, సంపుటమును ఎత్తి ముక్కువద్దనుంచి వాసన చూచుటవలనను, కడ్డీని వేసి చూచుటవలనను, గంధకము నశించినదియు లేనిదియు పూర్తిగ గ్రహింపవచ్చును. గంధకము పూర్తిగ నశింపగనే పాకము వచ్చినట్లు గ్రహింపవచ్చును. చిన్న కప్పెలుగచేసి వండబడిన మందు పాకానంతరము కూడ కప్పెలుగనే యుండును. వానిని మరల నూరి కప్పెలను కట్టవలయును. పైమూకుడుకు 2, 3, రంధ్రములను కూడ చేయవచ్చును. రజతలోహరసాయనము, వాతరాక్షసము, మొదలగువానికి వాలుకాయంత్రమునందేగాక పుటమునందు కూడ పాకమును చెప్పుటచే నిట్లుకూడ పక్వము చేయవచ్చును. కాని, శాస్త్రకారులు చెప్పిన విధముననే చేయుట మంచిది.

153. సమానముగు రెండు మూకళ్ళప ప్రమాణముగు సంధిబంధనమునుచేసి యందు రసరాట్, స్వర్ణవంగము, మొదలగు మందులను వండెదరు. పైమూకుడునకు రంధ్రమును చేయవలయును. ఇందు రజతలోహరసాయనము, వాతరాక్షసము, మొదలగు మందులను కూడ వండవచ్చును. పైన చెప్పిన డాకలసంపుటముయొక్క విషయములన్నిటిని నిచ్చటకూడ గ్రహింపవలయును. డాకలసంపుటమైనచో ఎత్తి విచల్చుట, గంధకమును వాసనచూచుట, మొదలగు వానికి సౌకర్యముగ నుండును. మూకళ్ళ సంపుటమునకు వేడి హెచ్చుగ తగులును.

154. అడుగున తట్టుగ గుండ్రముగనుండి, ముఖము అడుగువలెనే వెడల్పుగ నుండి, పింగాణీగిన్నెలవలెనుండు, పాదుము (నస్యము) చేయుట కుపయోగించు మట్టి పాత్రలను సమానముగువానిని రెండింటిని గ్రహించి పింగాణీగిన్నెలకువలె సంధిబంధనము మొదలగువానిని చేసి యాసంపుటమునందు కూడ కాచకుప్పెలయందువలె నన్నియౌషధములను వండవచ్చును. ఇట్టి సంపుటమైన యెడల బ్రద్దలగుననియు, మందునందు సీసాముక్కలు పడుననియు మొదలగు భయములేవియు కలుగవు. ఈ పాత్రలను 2-3 సారులవరకు కూడ నుపయోగింపవచ్చును. కాని యొక కష్టము మాత్రము కలదు. పైనయుంచిన మట్టిపాత్ర ఎంత సున్నగనున్నను సిందూరము దానిని గట్టిగ పట్టుకొని త్వరలో సరిగ రానేరదు. అందుచే కొంత యౌషధము నశింపవచ్చును. కాంతవల్లభరసము, రజతలోహరసాయనము మొదలగువానిని వండుట కనుకూలముగనే యుండును.

155. పైన చెప్పినటువంటి గుండ్రనిమట్టిపాత్రను దానికి సమానముగు పింగాణి పాత్రను గ్రహించి పింగాణీగిన్నెను పైన బోర్లించి ఇదివరలో చెప్పిన విధముననే సంధిబంధనము మొదలగువానిని చేసి యాసంపుటమునందు కూడ మందును పక్వము చేయవచ్చును. ఇట్లు చేసినయెడల పైపాత్రకు సిందూరము గట్టిగ పట్టుకొనుట, త్వరలో సరిగ రాకపోవుట, కొంత నశించుట, మొదలగునవి కలుగనేరవు. క్రింది పాత్రను 2-3 వంటలయిన తరువాత తీసివేసి పైపాత్రను 5-6 వంటలవరకు నుపయోగింపవచ్చును.

156. మరియును వండుపాత్రలకు మృత్తికాలేపమాచరించు (మట్టిపూయు) విధానము—పుట్టమన్ను మొదలగు బాగుగ జిగురుకల పరిశుభ్రమగు మట్టిని తీసికొని వచ్చి నీటితో గరిటె జారుపాకమువలె నుండునట్లు కలుపవలయును. పరిశుభ్రమగు సన్ననివస్త్రమును తెచ్చి ఆయా పాత్రలకు సరిగ సరిపోవునటుల నలుచదరముగ చిన్నముక్కలుగ చింపవలయును. దీనిని సమానముగు పీట మొదలగు వానియందు పరచి పైన మట్టిని పలచగ సరిగ పూసి మధ్యయందు ఆయా పాత్రలనుంచి మట్టి వస్త్రముయొక్క నాలుగుకొనలను పైకెత్తి ఆయా పాత్రలయొక్క పైభాగము వరకు వచ్చునట్లుచేసి చేతితో అంతటను అదిమి ఆ పాత్రలకు సరిగ కలియునట్లు

చేయవలయును. బట్ట ముడతలు పడినయెడల నా ముడతలను విప్పి అంతటను సరిగ కలియునట్లు చేయవలయును. ఎంత సాగ చేసినను పాత్రయొక్క పైభాగమునందు ముడతలుపడుట, సరిగ కలియక పోవుట, మొదలగునవి కలుగవచ్చును. అచ్చట చిన్న చిన్న ముక్కలను వేయుటగాని మరల బట్ట చుట్టునప్పుడు కలియని ప్రదేశమునకు వచ్చునట్లు చేయుటగాని చేయవలయును. మరల పైవిధముననే మట్టిగుడ్డను చుట్టవలయును. ఇట్లు 3 సారులు మొదలు 7 సారుల వరకు సందర్భానుసారముగా చుట్టవలయును. వాలుకాయంత్రవిధానమునందు అంగుళము దళసరియగువరకు చుట్టవలయునని చెప్పబడియున్నది. అచ్చటచ్చట కొన్ని యోగములయందు ఏడుసారులు చుట్టవలయునని చెప్పబడియున్నది. చాల యోగములయందు పరిమితియే చెప్పబడియుండలేదు. వాలుకాయంత్ర విధానమునందు చెప్పబడిన విధానమున అంగుళము దళసరియగు వరకు చుట్టుటయే శ్రేష్ఠము. కాని అరంగుళము లేక పాతికయంగుళము మాత్రమే చుట్టు సాంప్రదాయములు కూడ కలవు. దళసరిగ చుట్టుటవలన ఔషధము కొంచెమాలస్యముగ పక్వమగును. ఇట్లగుటవలన గుణవృద్ధియే గాని గుణహాని యెంత మాత్రము కలుగదు.

157. అంగుళము దళసరిగ గాని, ఏడుసారులు గాని మట్టిగుడ్డలను చుట్టదలచిన రెండుసారుల కొంతవరకు చుట్టి అవి ఆరినపిదపనే మరల చుట్టుట మంచిది.

158. మట్టిపూయబడిన జగ్గంపేటకుప్పెలు మొదలగు వానికి వేరుగ మట్టిగుడ్డలను చుట్టనవసరము లేదు.

159. పాత్రలకు మట్టిగుడ్డలను చుట్టుట పాత్రలయందు మందును పోసిన పిదపనా? లేక మందును పోయకుండగనే చుట్టి పిదప మందును పోయవలయునా? అనెడి సందేహము కలుగుచున్నది. మందును పోసినపిదప మట్టిగుడ్డలను చుట్టవలయుననియు, మట్టిగుడ్డలచే చుట్టబడిన కాచకుప్పెయందు మందును పోయవలయుననియు, మట్టిగుడ్డలచే చుట్టబడిన కాచకుప్పెయందు మందును పోయవలయుననియు, రెండు విధములుగ కూడ శాస్త్రమునందు చెప్పబడినది. కాన ఎప్పుడైనను పోయవచ్చును. మట్టిపూయబడిన జగ్గంపేటకుప్పెలు మొదలగు వానియందు పిదపనే పోయవలసియుండును. ముఖము కొద్దిగ పెద్దదిగనుండి పొడుగుగనుండు తేజాపకుప్పెలు మొదలగు వానియందు ఎప్పుడు పోసినను సమానమే. కాని పింగాణీసంపుటము మొదలగువానియందు మాత్రము భేదము గలదు. మట్టిపూసిన పిదప పోయునెడల సన్ననిరంధ్రము గుండ కొద్దికొద్దిగ మెల్లగ పోయవలసియుండును. కొంత మందు ఇటునటు కూడ పోవును. పూర్వమునందే మందును పోయునెడల నిటునటుపోకుండ ఏకముగ సుఖముగ త్వరలో పోయవచ్చును. చిన్న చిన్న కుప్పెలనుగ చేసి డాకలు మొదలగు వానియందు వండునెడల గాని శాస్త్రమునందు చెప్పిన విధమున మాత్రలను (-చిన్న కుప్పెలను) గ చేసి వండునెడలగాని మట్టిని చుట్టుటకు పూర్వమే మందును పోయ

వలసి యుండును. మట్టిగుడ్డలను చుట్టుటకు పూర్వమే మందును పోయుట యనేక విధముల మంచిది.

160. కుప్పెయందు మందును పోయుట :— మట్టిగుడ్డలను చుట్టినపిదప పోయ వలసివచ్చినయెడల ఆయా రంధ్రములగుండ, చిగురున సన్నముగ పొడుగుగనుండు సీనాకేకుగరాటాలు మొదలగు వానిద్వారాగాని దళసరియగు కాగితములను క్రింద సన్నముగను, పైన వెడల్పుగను ఉండునట్లు చుట్టి వానిద్వారాగాని మందును మెల్లమెల్లగ పోయవలయును. మాత్రలను ఆయా రంధ్రములగుండ పోయవలసివచ్చునెడల ఆ రంధ్రములకు తగినంతమాత్రలనే చేయవలయును. వండవలసిన మందును పాత్రయందు ఎంతవరకు పోయవలయుననగా మందుచే పాత్రయొక్క నాల్గవవంతు గాని, సగముభాగము గాని, మూడువంతులు గాని నిండువరకు పోయవచ్చును. ఎంత వరకుపోసినను పాకము కొంచెము హెచ్చుతక్కువలుగ సమానకాలముననే వచ్చును. షడ్గుణము, పూర్ణచంద్రోదయము, మొదలగు సింధూరప్రధానమైనట్టియు గంధక మధికముగ కలిసినట్టియు మందులను నాల్గవవంతువరకు గాని, సగమువరకు గాని పోయ వలయును. అధికముగ పోసినచో ఉడుకునప్పుడు పొంగి బయటికి వచ్చును. కాంతవల్లభ రసము, రజతలోహరసాయనము, మొదలగు లోహప్రధానమైనట్టియు క్రిందనే యుండునట్టియు మందులను మూడువంతుల వరకు కూడ పోసి వండవచ్చును. ఇవి ఉడుకునప్పుడు పొంగుట మొదలగు లక్షణముల నెంతమాత్రము కలిగియుండవు.

161. కుండలయొక్క స్వభావము :— దట్టముగ మూతి వెడల్పుగనుండి త్వరగ పగులు స్వభావములేని కుండను గ్రహింపవలయును. సంపుటముతో సమానమైన ఎత్తు కలదిగ (మధ్యయందుంచినపుడు) నుండవలయును. సంపుటము నుంచినపుడు చుట్టును సుమారు అరజానెడు వైశాల్య ముంచవలెను. వైశాల్యము కొంచెము హెచ్చుగ గాని, తక్కువగాని యుండవచ్చును. ఎత్తు మాత్రము సంపుటముకంటె కొంత అధికముగనే యుండవలయును గాని తక్కువగ నుండరాదు. ఈ కుండను 1, 2, సారులకంటె నధికముగ నుపయోగింపకూడదు. ఇనుపపాత్ర మొదలగు వానినికూడ వండుట కుపయోగింపవచ్చును.

162. ఇసుకపోయుట :— మందు వండదలచిన కుండను చుట్టుకొనుదురు మొదలగు వానియందు సరిగనుంచి కొద్దిగ ఇసుకనుపోసి సుమారు అంగుళములో $\frac{1}{8}$ లేక $\frac{1}{4}$ లేక $\frac{1}{2}$ వంతు దట్టముగనుండునట్లు చేతితో పలచగ సవరించి యందుపై సంపుటము నుంచి సంపుటముయొక్క పైభాగము వరకు ఇసుకను పోయవలయును. ఇసుక లోన పడకుండునట్లు సంపుటముయొక్క రంధ్రమును కాగితము మొదలగు వానితో మూసి పట్టుకొనవలయును. ఇసుకను పోయునప్పుడు సంపుటము కదలి ఇటునటు వంగకుండు

నట్లును, కదలి ఇసుక అడుగునకు హెచ్చుగ గాని ప్రక్కలకు హెచ్చుతగ్గులుగ గాని చేరకుండునట్లును, సంపుటమును చేతితో కొద్దిగ అదిమి పట్టుకొనవలయును సంపుటము యొక్క అడుగునపోయు ఇసుకను ఇప్పుడు పోయు పరిమాణముకంటె అధికముగనే పోయవలసినదిగ వాలుకాయంత్ర విధానమునందు చెప్పబడియున్నది నాలుగు మూరెడాకుల దట్టముగ పోయవలయునని పెద్దలు చెప్పెదరని కొందరు చెప్పెదరు. ప్రారంభమున వ్రాసిన విధమున పోయుట ఇప్పటి వాడుకయై యున్నది ఎట్లు పోసినను పోయవచ్చును. దట్టము యొక్క ఆధిక్యతననుసరించి పాకకాల మధిక మగును. వేడి బాగుగ తగిలి పాకము త్వరలో వచ్చుటకై కొందరు గువ్వరాళ్ళన (పెద్దవిగనుండు ఇసుకరాళ్ళను) పోయుదురు. కొందరు మొరుముగనుండు ఇసుకన పోయుదురు. కొందరు అడుగున గువ్వరాళ్ళను పైన మొరుముఇసుకను పోయుదురు కొందరు అడుగున సన్ననిఇసుకనుపోసి పైన మొరుముఇసుకను గాని, గువ్వరాళ్ళన గాని పోయుదురు. ఎటులనైనను విశేషభేదమేమియు లేదు. ఒకసారి యుపయోగించి ఇసుకను 1, 2 సారులకంటె నధికముగ నుపయోగింపరాదు. మూతి పొడుగుగనుండ తేజాపసీసాయైనచో మూతి చిగురువరకు పోయనవసరములేదు, మూతిలో సగమువర పోసినను చాలును.

163. పొయ్యిల యొక్క స్వభావము :— దృఢముగను, కుండ యుంచు కనుకూలముగను, కుండకు వేడి సరిగ తగులునట్లును, కట్టబడినవిగ నుండవలయున సుమారు మూరెడుఎత్తును కలిగియుండవలయును. క్రిందను మీదను గుండ్రము నుండవలయును. ముందు భాగమున మాత్రము కట్టెలుంచుటకు కొద్దిగ రంధ్రముం వలయును. గుండ్రముగ కట్టునప్పుడు క్రిందిభాగమునందు కంటె పైభాగమున వైశాల్యమును క్రమముగ కొద్దిగ తగ్గించవలయును. అట్లు చేసినయెడల వేడి బాగు తగులును. పైనుండు వైశాల్యము కుండకంటె కొద్దిగ తక్కువగ నుండవలయున చాల తక్కువగనున్నను హెచ్చుగనుండి ఇతర సాధనములచే కుండను పొయ్యిమీ నిలవపెట్టినను వేడి సరిగ తగలదు. అన్నిటికంటె ముఖ్యమేమనగా కుండ నుంచినప్పు పొయ్యికిని కుండకును మధ్య ఏమియు అవకాశములేక అతికించినట్లుగ నున్నచ మంట నాలుగు ప్రదేశములకును వ్యాపింపక పైకి సరిగ పోనేరక ఏదియో యొ వైపునకు పోవుచుండును, అట్లగుటచే మందు త్వరలో పాకము నొందకపోవుటయేగా సరిగ పక్వము కూడ కానేరదు. కాన పొయ్యిమీద నాలుగు చిన్న దిమ్మెల (ఎత్తులను) సుమారు $\frac{1}{4}$ లేక $\frac{1}{2}$ అంగుళము ఎత్తుగ నుండునట్లు కట్టవలయును. అట్ చేయుటచే కుండ కొంచెము ఎత్తుగనుండి అడ్డుగలేకపోవుటచే అగ్నిజ్వాలలు న ప్రదేశములకును చక్కగ ప్రజ్వలించి యౌషధము సరిగ పాకము నొందగలదు. కొందరు భూమిలోనికి పొయ్యిని త్రవ్వి పైన గుండ్రముగ కట్టి యందుపై కుండనుంచెదరు. ఇట్లు చేసినచో గాలి తగులక, మంట సరిగ వ్యాపించి వేడి నిలుకడ తగులునని చెప్పెదరు. పొయ్యిలను గురించి యింకను ననేకవిషయములు కలవు గా విశేషప్రయోజనకారులు కాకపోవుటచేతను గ్రంథవిస్తరభీతిచేతను వ్రాయలేదు.

164. అగ్నులు :— మందాగ్ని, మధ్యమాగ్ని, తీక్ష్ణాగ్ని (గాఢాగ్ని), అని అగ్నులు మూడు విధములుగ నుండునని కొందరి మతము. వీనిని అగ్నిత్రయమందురు. దీపాగ్ని, కమలాగ్ని, మధ్యమాగ్ని, గాఢాగ్ని అని అగ్నులు నాలుగు విధములుగ నుండునని కొందరందురు. వీనినే చతుర్విధాగ్నులు లేక అగ్నిచతుష్టయము అని అందురు. ఇంకను కొన్ని మతభేదములు గలవు. దీపాగ్నియనినను, కమలాగ్నియనినను ప్రత్యక్షమగు వస్తువులతో సరిపోల్చుటచే కొంతవరకు గ్రహింపవచ్చును. మందాగ్ని యనగా కమలాగ్నివలె కన్పట్టుచున్నది. కాని మధ్యమాగ్నియనినను, గాఢాగ్ని యనినను సరిగ చెప్పుట కష్టము. సాంప్రదాయమును గాని, యుక్తిని గాని అనుసరించి వానిని గ్రహింపవలయును. ఈ అగ్నులను క్రమముగ వేయవలయును. మందునకు చెప్పిన కాలపరిమితి ననుసరించిగాని, అనుభవము ననుసరించిగాని ఈ అగ్నులయొక్క కాలమును విభాగము చేసికొనవలయును. క్రమాగ్నులచే వండవలయునని చాల యోగములయందు చెప్పుటచే నీ విభాగము చాలయవసరమైనది. యుక్తినిబట్టి చూచినను చాలయవసరమే. తొలుత స్వల్పమగు మంటను వేసినయెడల వస్తువు లన్నియు కరిగి కలిసి మెల్లగ పక్వమగును. ఒకదానితో నింకొకటి సరిగ సమ్మేళన మగును. పిదప మంటను క్రమముగ హెచ్చింపనిచో అనవసరమగు గంధకాదులు జీర్ణించి నశింపనేరవు. తుదకు గాఢాగ్ని చెప్పబడినది. పాకసమయమున గాఢాగ్నిని వేయుట యుక్తినిబట్టి చూచినచో నేవిధముగను సమంజసముగ నుండదు. పాక సమయమున మందాగ్నిని వేయుటయే యనేకవిధముల మంచిది. ఇట్టి విభాగము సిద్ధమకరధ్వజయోగమునందు స్పష్టముగ చక్కగ చెప్పబడినది. ఈ విభాగమే కొందరి మతమునందు అగ్నిచతుష్టయముగ నుండవచ్చును.

165. పాకపరిజ్ఞానము :— మందును పొయ్యిమీద పెట్టిన కొన్ని గంటలకు ఉడుకుటకు ప్రారంభమై పలచగ నగును. పిదప క్రమముగ నుడుకుచు ముద్దగ నగుచుండును. ఇందు కడ్డీని వేయుచుండినచో వానియొక్క పరిణామములన్నియు తెలియుచుండును. గుండ్రముగ నుండు గొడుగుఊచలు మొదలగువానిని కడ్డీలుగ నుపయోగింపవలయును. ఇవి సమానముగ నుండి అడుగున కొన మొదలగునవి లేకుండ నుండవలయును. దీనిని కుప్పెయొక్క రంధ్రముగుండ కుప్పెయందు వేసి యొక నిమిషములోపుగనే తీసి చూచినచో మందుయొక్క పరిణామములు చాలవరకు తెలియును. ముద్దగ నంటుట తగ్గుచున్నకొలదియు పాకోన్ముఖమైనదానినిగ తెలియ వలయును. ముద్దగ పట్టుకొనుట క్రమముగతగ్గి కొద్దిగ పలచగ పట్టుకొనును. క్రమముగ నింకను పలచగ (సన్నముగ) చెమర్చినట్లు పట్టుకొనును. తుదకు కడ్డీచిగురున పలచగ పట్టుటకూడ మాని చిగురునుంచి క్రమముగ పట్టుట తగ్గుచుండును. అప్పుడింకను పాకోన్ముఖమైనదని గ్రహింపవచ్చును. తుదకు కడ్డీ వేయునప్పుడు కుప్పె యొక్క ముఖము వద్దనే కొద్దిగ చెమర్చినట్లుగ పట్టును. కొంతసేపటికి ఎచ్చటను ఏమియు పట్టక వేసినవిధముగనే పొడిగ నుండును. అప్పుడు గంధకము నశించినట్లును, పాకము వచ్చినట్లును గ్రహించి మంటను తీసి నిప్పులను అటులనే యుంచినచో సరిగ పక్వమై

యుండును. కాని చెమర్చుట కూడ మానగనే 1–2 గంటలలో పూర్తిగ పాకమునకు వచ్చునని గ్రహించి కొద్దిగ మంటను వేయుచు కడ్డీని వేసి చూచుచుండినచో కుప్పెలో వేసిన కడ్డీయొక్క భాగము బూడిదపూసినట్లు తెల్లగనగును. క్రమముగ నింకను తెల్లగనగుచు ముగ్గుపూసినట్లగుచుండును. క్రమముగ తెల్లగ స్వచ్ఛముగనై వెండిని పూసినట్లు గాని వెండితోనే చేయబడినట్లుగాని యుండును. కుప్పెలో వేయుటకు పూర్వము కడ్డీయంతయు నల్లగనుండి కుప్పెలోవేసి వెంటనే తీయునప్పటికి సగము వెండితోను, సగము ఇనుముతోను చేయబడినట్లుండి చూపరులకు అధికమగు నాశ్చర్యమును కలిగించుచుండును. అప్పుడు గంధకమంతయు పూర్తిగ నశించినదనియు పాదరసము కూడ పైకి వచ్చుటకు ప్రారంభించినదనియు తెలిసికొని వెంటనే పొయ్యిలోనున్న నిప్పులను కూడ ఆర్పివేయవలయును. చెమర్చుట మానగనే కడ్డీని వాసన చూచినచో గంధకపువాసనను కలిగియుండును. క్రమముగ నా వాసన కూడ తగ్గి రసము కొద్దిగ తెల్లగపట్టుట ప్రారంభించును. రసముపట్టుచున్న కొలదియు కడ్డీ తెల్లగ నగుచుండును. అప్పుడు చేతివ్రేళ్ళకు కొద్దిగ తడిచేసి కడ్డీని నొక్కి రాచినచో పాదరసము తెల్లగ చిన్న చిన్న ఉండలుగ వ్రేళ్ళరేఖలలో అంటియుండును. క్రమముగ పాదరసము బాగుగ అంటుటయేగాక కడ్డీని నీటిలో నుంచిగాని ఊరకనేగాని చూచినచో కడ్డీకి తెల్లగ చిన్న చిన్న ఉండలుగ పట్టి కనబడుచునే యుండును. కడ్డీని నీటిలో నుంచి అరచేతిలో నొక్కి రాచినచో పాదరసము అరచేతిలోనికి దిగును. ఈ లక్షణములు కడ్డీకి వెండిపూసినట్లుండునప్పుడు కలుగును. ఇంకను పొయ్యిమీద నుంచినచో పాదరసము కడ్డీతో ముద్దలు ముద్దలుగ వచ్చుచు మందు మాడిపోవును. కాన కడ్డీ తెల్లగనై పాదరసము చేతివ్రేళ్ళకు పట్టుట ప్రారంభింపగనే పాకము సరిగ వచ్చినట్లుగ గ్రహించి నిప్పులను కూడ ఆర్పవలయును. కడ్డీకి చెమర్చుట మానగనే మంటను తీసి నిప్పుల నుంచినచో నొక్కొకపుడు లోపల గంధకము కొద్దిగ మిగుల వచ్చును. లేక పాకము హెచ్చుగ రావచ్చును. కాని కొద్ది మంటను వేయుచు లక్షణముల నన్నిటిని చూచి సరియైనపాకములో దింపవచ్చుననెడి అభిప్రాయముతోనే పిదప కూడ కొద్దిగ మంటను వేసి సరియైన పాకమును చూచి నిప్పులనుకూడ ఆర్పుమని చెప్పితిమి. పైన చెప్పిన పాకలక్షణములను బట్టి ఎట్టివారైనను నిర్భయముగ మందులను వండవచ్చును. కడ్డీకి ముద్దగపట్టుటయు చెమర్చుటయు కూడ మానువరకు ఏమియు భయము లేదు. పిదప కొద్దికాలములో గాని కడ్డీ కొద్దిగ తెల్లగనగుట ప్రారంభింపగనే గాని నిప్పులను చల్లార్చినయెడల మందు సరిగ పక్వము నొందియుండును. కడ్డీకి ఏమియుపట్టక చెమర్చకుండ పొడిగనుండుటయు, తెల్లగనగుటయు, ప్రత్యక్షములగు విషయములే కదా! ఈ లక్షణములను దూరమునుండి చూచికూడ పాకమును గుర్తింప వచ్చును. కాని ఎంత వ్రాసినను దగ్గరనుండి స్వయముగ చెప్పుచున్నను అన్నమును క్రొత్తగ వండుమనిషి అన్నమును తరుచు కలియత్రిప్పుచు మెతుకులను చాలసారులు చూచుచు చేతులు వగైరాలను కాల్చుకొనుట మొదలగు నవస్థలను పొందుచు తుదకు అన్నమును చెడగొట్టినట్లు ఔషధమును కూడ ప్రారంభమున కొందరు చెడగొట్ట

వచ్చును. కాని క్రమముగ నన్నిసంగతులును తెలియకలవు. పైన చెప్పిన పాకలక్షణము లన్నియు షడ్గుణము, పూర్ణచంద్రోదయము, రజతచంద్రోదయము, మకరధ్వజము, సిద్ధమకరధ్వజము, మొదలగు సిందూరప్రధానములగు మందులకే కలుగును. కాంతవల్లభ రసము, రజతలోహరసాయనము, వంటవసంతకుసుమాకరము, నవగ్రహి, వంటబాల సూర్యోదయము మొదలగు మందులయందు పాకలక్షణములు వేరుగ నుండును. వానికి ముఖ్యలక్షణము లేవియనగా గంధకపువాసన కడ్డీకైనను లేకుండ గంధకము నశించుట, తాళకము, మణిశిల, వెలిగారము మొదలగునవి కడ్డీకంటుకొనుచు తెలియుచు లేచి పోవుట మొదలగునవి. కాంతవల్లభరసము, రజతలోహరసాయనము మొదలగు లోహ ప్రధానమైనట్టియు, కొంతకాలమధికముగ వండినను నష్టము లేనట్టియు, మందులను కొంతకాల మధికముగనే వండవలయును. ఔషధ విషయములందును, ఔషధపాక సామాన్య విషయములయందును, ఈ విషయములు చాలవరకు వ్రాయబడి యుండుట చేతను ఇంతకంటె వివరించి వ్రాయుటకు వీలులేకపోవుటచేతను ఇతర మందులయొక్క పాకలక్షణములను ఇంతకంటె వ్రాయక విరమింపవలసి వచ్చినది. మరియు నవగ్రహి వంటబాలసూర్యోదయము మొదలగు కొన్ని యౌషధములు ఒక సమయమున కొన్ని లక్షణములతో పాకమునొంది యొకవిధముగ నుండును. ఇంకొకసారి వండునప్పు డింకొకవిధమగు లక్షణములతో పాకమునొంది మరియొక విధముగ నుండును. ఒకసారి అడుగున గడ్డకట్టి అధికముగ నుండును. ఇంకొకసారి గడ్డకట్టక మెత్తగ నుండి చాల తక్కువగ నుండును. గడ్డకట్టుట మెత్తగనుండుట మొదలగువాని ననుసరించి, తయారైన మందుయొక్క కుప్పెలు వేరువేరు రంగులలో నుండును. ఒక్కొక్క మందునకే ఇట్టి అనేక విషయములుండుటచే వ్రాయబూనినచో నవన్నియు ననేక గ్రంథములగునని తలంచుటచేతను, విషయ విమర్శకులకు నివియే కొంతవరకు మార్గదర్శకములుగ నుండునని తలంచుటచేతను నీవిషయములను ఇంతటితో పరిసమాప్తి నొందించితిని.



# ఔషధపాక సామాన్య విషయములు

166. వంట వండునప్పుడు ఏకారణముచేనైనను కుప్పెయొక్క రంధ్రమును మందు మూసివేయవచ్చును. మూసివేయునని తోచినప్పుడే కడ్డీని లోనికివేసి మూతి యొద్ద అంచులను అనునట్లుగ గుండ్రముగ మెల్లగ త్రిప్పినయెడల క్రమముగ రంధ్రము పెద్దదియగును. రంధ్రము పూర్తిగ పూయబడి లోనికి కడ్డీ చొరకున్నయెడల కడ్డీని ఎర్రగ కాల్చి రంధ్రమునుండి మెల్లగ నొక్కినయెడల క్రమముగ రంధ్ర మేర్పడును. త్వరలో రంధ్ర మేర్పడనియెడల రంధ్ర మేర్పడు వరకు ఎర్రగ కాల్చి పెట్టుచుండ వలయును.

167. రంధ్రమేర్పడనియెడల నీ క్రిందివిధముగ పాకమును గుర్తింపవలయును. ఒక చిన్న నల్లని కుండపెంకును కుప్పెయొక్క రంధ్రముపైనుంచి అప్పుడప్పుడు తీసి చూచుచుండవలయును. గంధక మున్నంతవరకు చెమర్చుచు రంధ్రాకారముగ గుండ్రముగ ఆ కుండపెంకును పట్టుచునే యుండును. గంధకము నశింపగనే చెమర్చుటయు పట్టుటయు మానును. క్రమముగ కుండపెంకునకు గంధకపువాసన కూడ యుండదు. పిదప పాదరసము చిల్లపెంకునకు రంధ్రాకారముగ తెల్లగపట్టును. అప్పుడు వ్రేళ్ళతో రాచినయెడల పాదరసము వ్రేళ్ళకంటును. అప్పుడు పాకము వచ్చినట్లు గుర్తింపవలయును. అనగా కడ్డీవేసి చూచినప్పుడు కలుగు పాకలక్షణములే కలుగును. కడ్డీతో నైనయెడల లోనికివేసి చూచుట, చిల్లపెంకులో నైనయెడల పైన నుంచి చూచుట. ఇదియే భేదము. మూతిని తెరచియుంచి తరచు కడ్డీని వేయుటకంటె మూతిని మూయించియేవండుట మంచిదని పెద్దలు చెప్పెదరు. అనుభవమును ధైర్యమును అధికముగ లేనియెడల నిట్లు చేయుట కష్టము.

168. కొందరు మట్టితో బిరడాలనుచేసి గాని లావుగనుండు పెంకుతో బిరడాలను చేసిగాని మూతియందు పెట్టి అప్పుడప్పుడు తీసి చూచుచు ఇదివరలో చెప్పిన చెమర్చుట మొదలగు పాకలక్షణములను బిరడాగుండ గ్రహించుచు పక్వము చేసెదరు.

169. కొందరు పైన బిరడాను పెట్టి పచ్చిటంకణమును పాలతో నూరి దానితో గాని, కేవలము మన్నుతో గాని బాగుగ సంధిబంధనముచేసి వండెదరు. ఇట్లు చేయు నప్పుడు కేవల అనుభవముచేతనే పాకమును గుర్తింపవలసి యుండును. అపుడు కుప్పెవద్ద వాసనచూచినచో గంధకపువాసన లేకుండుట, కుప్పెలోనుండి సూక్ష్మముగ వచ్చు పొగ గంధకపురంగు గాని వాసనగాని లేనిదై తెల్లగనుండుట మొదలగు కొన్ని లక్షణములచే కూడ పాకమును గుర్తింపవచ్చును.

170. కడ్డినివేసి యొకసారి గుండ్రముగ త్రిప్పి యొక నిమిషము కుప్పెయందు వదలియుంచి వెంటనే సరిగ మెల్లగ తీయవలయును. త్రిప్పినవెంటనే తీసినయెడల కడ్డితో మందు వచ్చి ముఖమునొద్దపట్టి ముఖమును మూయును.

171. కడ్డిని తీసినవెంటనే నిప్పుయందుంచినచో గంధకపువాసనతోడను, పొగతోడను, పచ్చగ మంట వచ్చును. తుదకు కొద్దిగ చెమర్చునప్పుడు కూడ నిప్పునందుంచినచో గంధకపువాసనయు, మంటయు వచ్చుచునే యుండును.

172. కడ్డిని తరచు ఎర్రగకాల్చి చల్లార్చుచుండవలయును. అందుచే దానిని పట్టియున్న గంధకము బాగుగ నశించును. లేనిచో మరల వేయునప్పుడు అదివరకు పట్టియున్న గంధకమే గునకు కనబడవచ్చును.

178. కడ్డిని మందుకుప్పెనుండి తీసినవెంటనే, శుభ్రమైన గుడ్డముక్కను తడిపి 5, 6 మడతలుగా పెట్టియుంచుకొని దానితో నొక్కి తుడవవలయును. కడ్డికి పట్టియున్న మందంతయు దానికి పట్టును. గుడ్డమడతచే కడ్డి మధ్యయందు చుట్టినట్లు నొక్కిపట్టి మందున్న కడ్డిభాగమును మెల్లగలాగినచో మందంతయు నొకేభాగమున ముద్దగ పట్టును. ఇష్టమువచ్చినట్లు ఊడ్చినచో గుడ్డనంతను పట్టును. ఈ గుడ్డను తడుపుటచే మందుయొక్కయు కడ్డియొక్కయు వేడిమిచే గుడ్డగాని చేతివ్రేళ్లు గాని కాలకుండును. మరియు మందు సరిగపట్టి వెంటనే చల్లారి గుడ్డను గట్టిగ జిగురువలె పట్టును. ముక్కలుముక్కలుగ వచ్చివేయును. వెంటనే ఈ మందును ఒలిచి తీసి మూతి రంధ్రముగుండ మందు కుప్పెలో వేయవలయును. ఈ గుడ్డ ఆరినయెడల అప్పుడప్పుడు తడుపుచుండవలయును. ఈ గుడ్డను, కడ్డిని శుభ్రమగు పింగాణీ కంచము మొదలగు వానియందు ఉంచవలయును.

179. మందునందు గంధకమున్నంతవరకు కుప్పెనుండి వచ్చు పొగ పచ్చగ గంధపువాసనతో వచ్చును. గంధకము నశింపగనే గంధకపువాసన ఏమియు లేకుండ తెల్లగ వచ్చును.

180. సిందూరప్రధానమగు మందుల యొక్క కుప్పెలను పాకసమయమున మూతిగుండ చూచినచో అడుగుభాగమున ఎఱ్ఱగనుండును. మరియు పాకసమయమున మూతి రంధ్రమునందు వ్రేలును ఉంచినచో చల్లగ నుండును.

181. ఉడుకుచున్న మందు ముద్దగ గట్టిపడగనే కడ్డీతో తీసి గుడ్డకు రాచి నప్పుడు గట్టిపడినపిదప కొద్దిగ ముక్కను ఖల్వములో నూరినయెడల కొద్దిగ నెఱ్ఱగ నగును. పాకము వచ్చుచున్న కొలదియు బాగుగ ఎఱ్ఱపడుచుండును. పైకి చూచుటకు మాత్రము నల్లగనే యుండును.

182. మందు ఉడుకునప్పుడు వేడిగ నున్నకుండ, కుప్పె మొదలగు వానిమీద నీళ్లు పడకూడదు.

183. వంట మధ్యయందు కుండ బ్రద్దలైనయెడల వెంటనే సంపుటమును ఇంకొక కుండయందుంచి వండవలయును.

184. ఒక్కొక్కప్పుడు కుప్పెయందొక విధమగు ఆవిరి బయలుదేరి కుప్పె బ్రద్దలగుట గూడ సంభవించును. అప్పుడు అధికమగు ధ్వని కలుగును. ఇందుచేతనే మూతిమూసి వండుటకు కొందరు భయపడెదరు.

185. గంధకాదుల పరిమితి, మర్దన, ఇసుకపోయుట, కుప్పె, మంట, మొదలగు వానియొక్క భేదముల ననుసరించి మందు 2—3 రోజులు వ్యత్యాసముగ పక్వమగును.

మరియు ఒకేసారిపెట్టిన యొకేవిధమగు మందుకప్పెలలో కొన్ని రెండు రోజులకే పక్వమగును. కొన్ని 4—5 రోజులకు పక్వము కావచ్చును.

186. స్వర్ణవంగము, కాంతివల్లభరసము, మొదలగు వానియందు కడ్డిని మందు అడుగునకు పోనిచ్చియే గంధకపువాసనను చూచుచుండవలయును.

187. మందు పక్వమై స్వాంగశీతలమైన పిదప బయటికి జాగ్రత్తగ తీసి తేజాపు కప్పెయైనచో పైనున్న మట్టిగుడ్డలను గీకివేసి శుభ్రముగ చేసి అడ్డముగ మధ్యకు బ్రద్దలు కొట్టియు, పలచనికప్పెయైన యెడల మట్టితోడనే మధ్యకు బ్రద్దలుకొట్టియు, పింగాణీ గిన్నెలు మొదలగు సంపుటములైనచో, పైనున్న మట్టిగుడ్డలను తీసి సంధి బంధనము విప్పియు, మందును గ్రహింపవలయును.

188. మందు పక్వమైనదని తెలిసికొనుటకు పాకలక్షణములే ప్రధానములు. కాని రోజులు ప్రధానము కాదు.

189. కొందరు రసభూపతి, రజతలోహరసాయనము, రసరాట్ మొదలగు వానిని డాకలసంపుటమునందు వండుట, రసభూపతిని కూడ పుటము వేయుట, మొదలగు వానిని చేయుదురు. ఇవి సింధూరప్రధానములుకాక గంధకాదులు జీర్ణింప వలసినవి మాత్రమే యగుటచే వారి యిష్టప్రకారముగ జీర్ణింపచేయుచున్నారు. కాని శాస్త్రమార్గము ననుసరించుటయే శ్రేష్ఠము.

190. మందును కప్పెయందు పోసినది మొదలు కాగితము మొదలగు వానిని బిరడాగచేసి కప్పెయొక్క రంధ్రమును మూయవలయును. అట్లు చేయుటచే ఇసుకను పోయునప్పుడందు ఇసుకపడకుండ నుండును. పోసినపిదప కూడ ప్రక్కలనుండి పడుట మొదలగునవి కలుగకపోవుటయేగాక పూర్వమునందు క్రిమికీటాదు లందు చేరకుండును. మరియు కప్పెకు మట్టిగుడ్డలు చుట్టినప్పటినుండియు కూడ మూత యుండుటయే మంచిది. లేనిచో మందును పోయుటకు పూర్వమునందే క్రిమికీటాదులు, దుమ్ము మొదలగునవి చేరియుండవచ్చును. ఈ ఉద్దేశములతోడనే మందు పక్వమవగనే చిల్లపెంకు మొదలగు వానినుంచి మూతిని కప్పవలయును.

191. ఒక్కొక్క కుండలో 2, 3, 4, కప్పెలను కూడ నుంచి వండెదరు. ఇట్లు వండునెడల అడుగుపాత్ర క్రిందను పైనను మిక్కిలి వెడల్పుగ నుండవలయును. పెద్దదిగనుండు ఇనపబూర్లెమూకుడు మొదలగువానిని కూడ నుపయోగింపవచ్చును. కప్పెల నధికముగ నుంచినకొలదియు పాక మధికకాలమునకు వచ్చును. అన్ని సీసాల యందలి మందునకును పాకము ఒకేసమయమున రాదు. పాకము వచ్చిన కప్పెయొక్క అడుగున వంపుగనుండు కొడవలి మొదలగువానిని పోనిచ్చి దానితో కప్పెను ఎత్తి

లాగి మెల్లగ తీయవలయును. ఇట్లు తీయునపుడు ఇతర కుప్పెలు కదలవచ్చును. రెండు విధములగు మందుల నొకేపాత్రయందుంచి వండకూడదు. ఎట్లైన నీపద్ధతి శ్రేయస్కరము కానేరదు.

192. నిలుచి కాలునట్టియు వేడిమధికముగ నుండునట్టియు తుమ్మ, చింత, మొదలగు వానియొక్క కట్టెలను మంటనిమిత్త ముపయోగించవలయును. ఆయా మందులకు ప్రత్యేకముగు కట్టెలను చెప్పినయెడల వానినే యుపయోగింపవలయును.

193. కట్టెలను అధికముగ ఎక్కువేయకుండగను మంటను అశ్రద్ధగ చూడకను సమానముగు మంట యుండునట్లు చూడవలయును.

194. వండునప్పుడు కడ్డీని తరచు వేయుట మంచి యలవాటుకాదు.

195. ఒకే సమయమున నొకేజాతిగల మందునే వండవలయును గాని 2, 3, జాతుల మందులను ఒకే సమయమున వండుట మంచిది కాదు.

196. 2, 3, జాతుల నొకేసారి వండునెడల వానిని కొంచెము దూరము దూరముగ పెట్టి వండవలయును. కడ్డీలు వేనికివానికే వేరుగ నుండవలయును. ఒక మందు యందుంచు కడ్డీని ఇంకొక మందునం దుంచుచుండకూడదు.

197. సిందూరప్రధానములగు మందులను వండునప్పుడు కుప్పెలోనుండి మంట రావచ్చును. అప్పుడు కడ్డీని వేసి ముందుగుమ్మ కలియత్రిప్పిన యెడల నామంట పోవును. లేదా చిల్లపెంకును తడిపి మూతిమీద నుంచవలయును. లేదా గుడ్డను తడిపి 5, 6 మడతలుగ పెట్టి కుప్పె ముఖముపై బాగుగ వేయవలయును. అప్పటికిని తగ్గని యెడల పొయ్యిలోని మంటను కూడ తగ్గింపవలయును. లోన మంట మండినయెడల ఔషధము మిక్కిలి త్వరలోనే పక్వమునొంది సరియైన గుణముల నెంతమాత్రమును కలిగింపదు.

198. కడ్డీని తరుచు వేసి చూడదలచుకొన్నను కుప్పెయొక్క రంధ్రమును చిల్లపెంకచే కప్పియుంచుటయే యనేకవిధముల మంచిది.

199. మూతి పొడుగుగనుండు తేజాపకుప్పెలయొక్క ముఖము కంటె మధ్య యందు చిగురున కొంత విరగవచ్చును. అందుచేతనే దీనికి ఇసుక కొంత తగ్గించి పోయవలసినదిగ చెప్పబడినది.

200. గంధక మధికముగ కలిసినట్టి గాని కుప్పెయం దధికముగ పోయబడినట్టి గాని మందు వండునప్పుడు పొంగి పైకి వచ్చుచున్నయెడల కడ్డీతో కలియత్రిప్ప వలయును. లేదా మంటను చాలవరకు తగ్గించుట కూడ చేయవలయును.

201. మందును పొయ్యిమీదనుంచి మంటవేయుటకు పూర్వము పూజ మొదలగు వానిని చేయవలయును.

202. వండునప్పుడు దగ్గరకు అస్పృశ్యులు, పాదరక్షలు (జోళ్ళు) కలవారు, మొదలగు వారిని రానియ్యకుండుటయేగాక ఇతరులను కూడ అందరిని తరుచు రానియ్య కూడదనియు గోప్యముగ వండవలయుననియు చెప్పెదరు.

103. ఘనౌషధములను గాని అధికమగు ఔషధములను గాని వండినప్పుడు కొందరు బ్రాహ్మణసంతర్పణ మొదలగు వానినికూడ చేయుదురు.

204. సిందూరప్రధానములగు నౌషధములయందు సిందూరము మొదట వేసిన పాదరసమునకు సమానముగ వచ్చును. లేక బహుస్వల్పముగ తగ్గవచ్చును.

205. గంధకము కొద్దిగ మిగిలినచో లేతపాకమనియు, గంధకము మిగలక పాదరసము (సిందూరము) నశింపకయున్నచో న్యాయ (సరియైన) పాకమనియు, పాదరసము నశించినచో దగ్ధ (మాడు) పాకమనియు చెప్పబడును. లేతపాకమును మాడుపాకమును గాని పొందిన మందు కొద్దిగ నల్లగనుండుటయేగాక వేడిమిని కూడ చేయును. సరియైన పాకమును పొందిన మందు సరియైన కుంకుమవర్ణములోనుండి సరియైన గుణములను కలిగించును.

206. 2—3 సార్లు వండవలసిన షడ్గుణము, మకరధ్వజము మొదలగు వానిని ప్రారంభములో చాల లేతపాకముగనే దింపుచు తుదకు సరియైన పాకములో దింపవలెను.

207. ఒక్కొక్కప్పుడు సరిగనే ఉడుకుచు పాకలక్షణములన్నియు సరిగ కలిగి మందు నిమిత్తము కుప్పెను విదల్చిచూడగ నందు ఏమియునుండక వట్టి డిప్పలే యుండును ఇందులకు గంధకాదులు మంచివి కాకుండుట, మర్దన సరిలేకుండుట, మొదలగునవియే కారణములు. కడ్డీతో తీసిన మందు జిగురుగ నల్లగ లేకుండుట, తీసిన ఈ మందును ఖల్వములోనుంచి నూరినయెడల కొంచెమైనను ఎఱ్ఱగలేని మట్టివలె నుండుట, మొదలగు లక్షణములచే నీ వినాశపాకమును (మందుండకపోవుటను) కూడ మనము గుర్తింపవచ్చును. కాని మన మప్పుడు చేయునదేదియు లేదు,

208. మందును కుప్పెనుండి తీయగనే తూచి నిలవయుండవలసిన ద్రవ్యముల యొక్కయు నశింపవలసిన ద్రవ్యముల యొక్కయు విభాగమును తెలిసికొని నశింపవలసిన ద్రవ్యములు నశించినదియు లేనిదియు తెలిసికొనవలయును.

209. రజతచంద్రోదయము, పూర్ణచంద్రోదయము మొదలగు మందుల యందడుగునుండు వెండి, బంగారము, మొదలగునవి మొదట వేసిన తూకముకంటె నధికముగ

కూడ నుండవచ్చును. గంధకాదులయందున్న పిట్టుకూడ నడుగునకు చేరుటయే ఇందులకు కారణము. అడుగున నేమియు నుండనవసరములేని షడ్గుణమునందడుగున నేదియో యుండుట చూచుచునే యున్నాము.

210. వేడి బాగుగ తగిలి ఔషధము త్వరగ పక్వమగుటకై మందును వండు కుండకు అడుగుభాగమున కొందరు 3, 4 రంధ్రములను పొడిచెదరు. ఈ విషయమును గూర్చి శాస్త్రమునం దెచ్చటను చెప్పబడి యుండలేదు. త్వరగ పక్వమగుటకు చేయబడు ప్రయత్నము లంత మంచివి కానేరవు.

211. మర్దింపబడిన మందును మాత్రలుగ చేసి వండవలయునని చాల యోగముల యందు చెప్పబడి యున్నది. అట్లు చేయుమనుటకు ప్రత్యేకమగు యుక్తి ఏమియు కనపడదు. అట్లు చేసినను ఏ విధమగు నష్టమును లేదు. చూర్ణముగనే పోసి వండు సాంప్రదాయము కూడ చాలవరకు కలదు.

212. మందును కొంతవరకు వండి ఏకారణముచేనైనను మానవలసి వచ్చిన యెడల నేమిచేయవలయుననగా అటులనేయుంచి కొద్దిరోజులైన పిదప వండవచ్చును. కాని, పాకము సరిగ రానేరదనియు, స్వర్ణవంగము మొదలగునవి చెడుననియు, రజత లోహరసాయనము మొదలగునవి సరిగ పాకము నొందవచ్చుననియు, తోచుచున్నది. దీనిని గూర్చి విశేషానుభవము లేకపోవుటచే విశేషించి వ్రాయుటకు వీలుకలుగలేదు.

213. మందులను స్వయముగ వండకూడదని తలచి కొందరు ఇతరులచే వండించెదరు. కొందరు స్వయముగనే వండెదరు.



# సామాన్య విషయములు

214. వైద్యస్వభావము :— కొంతమంది వైద్యులను దగ్ధహస్తులనియు, కొంత మందిని అమృతహస్తులనియు, కొందఱు తలంచుచుందురు. అది వారివారి అభిప్రాయ మునుబట్టి యుండును. ఎవరును కూడ రోగులనందఱిని బ్రతికింపలేరు. కాని జనవాక్య మును కూడ నొకవిధముగ సమర్థింపవచ్చును. కొందఱు వైద్యులు రోగి యొద్దకు వెళ్ళినది మొదలు ఇతర విషయముల నేమియు నాలోచింపక రోగస్వభావమేమి? ఎట్టి మందును ప్రయోగించిన యెడల రోగము నిశ్చయముగ నశించును? రోగియొక్క బాధను మన మెట్లు నివర్తింపచేయగలము? ఏ విధమున గాని మనము రోగిని మోసపుచ్చుటలేదు గదా? యనెడి నిష్కల్మషములగు ననేక భావములతో "ఈ మందును ఇచ్చుచున్నాను, ఇది పనిచేసి తీరవలయును" అనెడి అభినివేశముతో

కూడిన మనస్సుతో మందు నిచ్చెదరు. అట్టి మందును అభినివేశముతో కూడిన మనశ్శక్తియు కలిసి నిశ్చయముగ పనిచేయును. మనశ్శక్తి కూడ కొంతవరకు పని చేయునని అందరికిని తెలిసిన విషయమే. పూర్వమునందు ఋషీశ్వరులు అభినివేశముతో "నీవు ఫలాని విధముగ నగుదువుగాక" యని శపించగా నావిధముగ నైనట్లును, యుద్ధములయందు మంత్రమును జపించి "నీవు బ్రహ్మాస్త్రమై అందరిని నశింప జేయుదువుగాక" యని గడ్డిపరకను కూడ విసరగ నది బ్రహ్మాస్త్రమై యందరిని నశింపజేసినట్లును పురాణాదిగాథలనుండి వినుటలేదా? ఈ మనశ్శక్తి యనునది సామాన్యముగ కలుగునది కాదు. రావలెనన్నచో వచ్చునది కాదు. మందు యొక్క గుణమును, మనశ్శక్తియు కలిసినచో నధికముగ పనిచేయుటకు సందేహము లేదు. మందులను సమానముగ తయారుచేసినను కొందరు చేసినవి బాగుగ పనిచేయుననియు, కొందరు చేసినవి బాగుగ పనిచేయవనియు, వాడుకలు కలుగుటకు కూడ నిదియే కొంత కారణము. బాగుగ పనిచేయవలయుననెడి అభినివేశముతో చేసినయెడల నామనశ్శక్తి మందులయందు సంక్రమించి అధికమగు గుణముగలవానినిగ చేయును. ఈ వైద్యు లిచ్చినయెడల గాని, ఈ వైద్యుని యొద్దనున్న మందును ఇచ్చినయెడల గాని వ్యాధి తగ్గుననెడి రోగియొక్కయు, ఇతరులయొక్కయు నమ్మిక (మనశ్శక్తి) కూడ కలిసినచో వ్యాధి యింకను నిశ్చయముగ తగ్గుననియు, మందులు అధికమగు గుణముకలవిగ నుండు ననియు, వేరుగ చెప్పనవసరములేదు. కొందరు ప్రధాన విషయముల నాలోచింపక ఇతర విషయములనే ఆలోచించుచుండిన యెడల మనశ్శక్తి యట్లుండ రోగ నిర్ధారణాదికమే సరిగ లేకపోవుటచే వ్యాధి సరిగ శమింపనేరదు. ఇట్టి భావముల ననుసరించియే వైద్యులకు అమృతహస్తులనియు, దగ్ధహస్తులనియు పేరులు వచ్చు చున్నట్లు కనబడుచున్నది.

215. సాంగశీతలము లేక స్వాంగశీతలము :— అంగములతో కూడ లేక తనయొక్క అంగములతో కూడ చల్లారినదానికి సాంగశీతలము లేక స్వాంగశీతలమని పేరు. మందునకు అంగము లేవియనగా? సీసా, ఇసుక, కుండ, పొయ్యి మొదలగునవి. మందు పక్వమవగనే తొందరపడి పొయ్యి, కుండ, మొదలగువానిమీద నీళ్ళుపోసి చల్లార్చి తీయక సరిగ మ్రగ్గి చల్లారినపిదపనే తీయవలెనని యభిప్రాయము. అన్నము సరిగ ఉమ్మగిలినపిదపను, కూరలు పులుసు మొదలగునవి సరిగ మ్రగ్గినపిదపను, ఆయా రసములు సరిగ సమ్మేళనమగుటచే రుచిమంతములుగ నుండునట్లు మందులు కూడ వేడి మీద సరిగ మ్రగ్గినపిదపనే గుణవత్తరములుగ నుండునని యభిప్రాయము.

216. పొట్లములను కట్టుట :— పరిశుభ్రమైన కాగితములను నలుచదరముగ చింపవలయును. ఒక కాగితముమీద నింకొక కాగితమును కొద్దిగ నెక్కించుచు వరుసగ పరచవలయును. నలుబదిపొట్లములను కట్టుకొనవలసినయెడల పదేసికాగితముల చొప్పున నాలుగుపంక్తులుగ పరచవలయును. రెండవపంక్తి కాగితములను కూడ మొదట పంక్తికాగితముల మీద కొద్దిగ ఎక్కనియ్యవలయును. ఇట్లెక్కించుటచే

కాగితములు చాలదూరము వ్యాపించకపోవుటయేగాక గాలి వేసినను ఎగరవు. ఎగిరినను మందు, ప్రక్కకాగితముమీదనే పడును. సంఖ్య ప్రకారముగ పంక్తులుగ పరచినచో ఎన్ని కాగితములను పరచినదియు సుఖముగ తెలిసికొనుచుండవచ్చును. మందును వరుసగ వేసికొనుచు తుదకు అన్ని పొట్లములయందును మందు సరిగనుండునట్లు సవరింప వలయును. పొట్లమును కట్టునప్పుడు మందు ఇటునటు లేకుండ ఒకేప్రక్కకు వచ్చునట్లు చేసి పొట్లము విడిపోకుండునట్లును అందముగ నుండునట్లును చివరలు మొదలగునవి పైకి లేకుండునట్లును హస్తకౌశలముతో చురుకుగ కట్టవలయును. సిరాయొక్క గుణము మందులో సంక్రమించును. కావున అచ్చుకాగితములలో పొట్లములను కట్ట కూడదని చెప్పెదరు. ఇందులకు శాస్త్రప్రమాణ్యము గాని, యుక్తి గాని కనపడదు.

217. రసశబ్దార్థము :— ప్రతి మందుయొక్క పేరునకును తుదను "రసము" అనెడి పదము కలదు. దీని నిట్లు ప్రధానముగ చేర్చుటకు కారణ మాలోచింప వలయును. రసములనగా మహారసములు, ఉపరసమును, సాధారణ రసములు మొదలగునవి. అవి ఇందు చేరును గావున రసమని చెప్పబడును. మరియు "రస్యతే రోగశాన్త్యై ఇతి రసః" (రోగము నశించుకొరకు తినబడునది) కావున రసమని చెప్ప బడును. కావున రసమనగా మందని సరియైన అర్థము. ఓషధులచే తయారుచేయబడినది "ఔషధము" అని అన్వర్థనామమున్నను రూఢ్యర్థముచే ఔషధశబ్దమువలన నీ మందు లనుకూడ గ్రహింపవచ్చును.

218. ఆయుర్వేదమునందలి పరిమాణము :— పలము మొదలగు శబ్దములకు సరియైన నిర్ధారణ లేకపోవుటచే చాలమంది బాధ నొందుచున్నారు. అనేకులు అనేక విధములుగ గ్రహించుచున్నారు. ఇందులకు కారణమేమనగా శాస్త్రకారులు 2, 3, విధములుగ చెప్పియుండుటయేగాక దేశభేదములచే గూడ ననేక వాడుకలు కలవు. పలమనగా 3 తులములనియు, 4 తులములనియు, 6 తులములనియు, 8 తులము లనియు వాడుకలు దేశ భేదములచే కలవు. ఆవాలు, గురివిందగింజలు, మినుములు, మొదలగు వానిని శాస్త్రప్రకారముగ తూచుచు హెచ్చించుచు పలము మొదలగు వానిని నిర్ధారణ చేయుదమన్నను అట్లు చేయుటకుకూడ వీలుకలుగలేదు. ఆవాలు గాని, గురివిందగింజలు గాని, మినుములు గాని చాలరకములుగ లేవా? వేనిని గ్రహింపవలయును? పలమనుదానికి 3 తులములనియో 4 లేక 8 తులములనియో నిర్ధారణ చేసికొని దానినిబట్టి క్రింది పరిమాణమును తగ్గించుకొనుటయు మీది పరిమాణ మును హెచ్చించుకొనుటయు చేయవచ్చును. అనగా పలమనుదానికి 4 తులములని నిర్ధారణ చేసుకొని కర్షమనగా పలములో నాల్గవవంతు కావున 1 తులమనియు, శాణమనగా పదునాఱవవంతు కావున ¼ తులమనియు, ప్రస్థమనగా పలమునకు పదునాఱురెట్లు కావున 64 తులములనియు నిర్ధారణ చేసికొనవలయును. ఇదియే కొంత మంచిపద్ధతిగ కనబడుచున్నది. కాని ఇట్లు గ్రహించినయెడల కొన్ని సమయ ములయందు మాత్రము భేదము కలుగును. ఒక యోగమునందు రసము 1 పలము,

నాభి 1 తులము అని ఉన్నదనుకొనుడు. తులమనునది అందరికి సమానమేగదా? అప్పుడు పలమనగా 4 తులములని గ్రహించినవానికి నాభి రసములో నాల్గవవంతును, 6 తులములని గ్రహించినవారికి ఆరవవంతును, 8 తులములని గ్రహించినవారికి ఎనిమిదవ వంతును అగును. మరియు ద్రవద్రవ్యములను వానికి ప్రత్యేకముగ చెప్పిన కుడవాది ప్రమాణముగ కొలిచి ఇతర ద్రవ్యములను పలాది పరిమితముగ తూచినప్పుడు భేదము కలుగును. కుడవమనగా ప్రస్తుతపు అంగుళముల పరిమితిగ నాలుగంగుళముల లోతును, నాలుగంగుళముల వెడల్పునుకల పాత్రను గ్రహించితిమనుకొనుడు. అప్పుడు ఇతర ద్రవ్యములను పలాగులచే ఒక్కొక్కరు ఒక్కొకరీతిగ వేసినయెడల ద్రవ్యసమ్మేళన మునందు భేదము కలుగుటలేదా? అంగుళమనుదానిని పరిమితిలో నొక్కొకరు ఒక్కొక విధముగ గ్రహించినయెడల ఇంకను భేదములు కలుగునని వేరుగ వ్రాయ నవసరము లేదు. పరిమాణమును గూర్చి ప్రస్తుతము ఇదమిత్థమని నిర్ధారణ చేయుటకు వీలులేదు. కాని పలము నొకవిధముగ పరిష్కరించుకొని దానినిబట్టియే ఇతర పరిమాణములను నిర్ధారణ చేసుకొనుట కొంతవరకు మంచిదని తోచుచున్నది.



# నాటుకలోనున్న యోగములు

ఈ గ్రంథమునందు ఒకే జాతిగల యోగము లనేకములుండుటచే ఏ యోగమును చేయవలయునసెడి సందేహము కొందరికి కలుగవచ్చును. అట్టి సందేహము నివర్తించుటకు ఆంధ్రదేశమునందు ప్రసిద్ధముగ చేయబడుచున్న వానిని వరుసగ వ్రాయుచున్నాను.

అగ్నికుమారము 74–75
1 లేక 2 వ యోగము
అజీర్ణబడబానలరసము 57
ఆనందభైరవరసము 88
కస్తూరిమాత్రలు 91
కాలకూటరసము 199
క్రవ్యాధి 60
సువర్ణక్రవ్యాధి 61
త్రైలోక్యచింతామణి 155–156
తరుణార్కము 245
సముగరళతరుణార్కము 245
మహాతరుణార్కము 246

నవరత్నచింతామణి విశేషముగ చేయబడునదికాకపోవుటచే నిర్ణయించి వ్రాయవీలుకలుగలేదు.

పైత్యాంతకము 16
బాలసూర్యోదయము 114
వంటబాలసూర్యోదయము 278
రాజమృగాంకరసము 222
మేహాంతకరసము 240–241–271
మహామేహాంతకరసము
233–234–234–235
రజతచంద్రోదయము 19
రజతలోహరసాయనము 5–6–7
మహాలక్ష్మీవిలాసరసము 28
క్రమవృద్ధిమహాలక్ష్మీవిలాసరసము 29
వసంతకుసుమాకరము 211
వంటవసంతకుసుమాకరము 213
వాతాగ్నికుమారము 72–240
వాతరాక్షసము 22
సువర్ణవాతరాక్షసము 24
వాతవిధ్వంసిరసము 12
మహావాతవిధ్వంసిరసము 13
శ్వాసకుఠారరసము 144–269
లఘుసిందూరభూషణము 36
సువర్ణసిందూరభూషణము 37
సూతికామాత్రలు 103
లఘుసూర్యావర్తి 76
సువర్ణసూర్యావర్తి 77
వంటసూర్యావర్తి 252
స్వర్ణమాలినీవసంతము 42
స్వర్ణవంగము 65
హంతాశనరసము 80

విజ్ఞప్తి:— ఒకే జాతిగల యోగములనేకములున్నప్పుడే సందేహము కలుగును. సందేహనివృత్తి కొరకు నీ పట్టికను వ్రాయవలచుటచే విడిగనున్న సంనిపాత

భైరవి, శీతాంశురసము, మొదలగు యోగముల నీ పట్టికయందు వ్రాయలేదు. చేయదగిన యోగము వేరు పేజీ యందున్నచో పేజీ సంఖ్య మాత్రమియ్యబడినది. ఉదాహరణము :— హుతాశనము, ఇతర సందేహయోగములతో కలిసియున్నచో పేజీ సంఖ్య వ్రాయుచు యోగసంఖ్య కూడ వ్రాయబడినది. ఉ॥ లఘుసూర్యావర్తి : అన్నియు చేయదగిన యోగములే అయినచో వివరములు వ్రాయక పేజీ సంఖ్యమాత్ర మియ్యబడినది. ఉ॥ రజతలోహరసాయనము, కస్తూరిమాత్రలు : నిస్సందేహముగనున్న కొన్ని యోగములను కూడ కొన్ని స్థలములయందు సందర్భానుసారముగ నా జాతిలో చేర్చి వ్రాసితిని. ఉ॥ క్రవ్యాది : కొన్ని యొకేజాతిగ నున్నను వానియొక్క పేరుల చేతనే స్పష్టముగ తెలియుచుండుటచే మరల నిందు వ్రాయలేదు. ఉ॥ కాంతవల్లభ రసము, సువర్ణకాంతవల్లభరసము.

## గ్రంథవిషయము

* సమాప్తము *



# విజ్ఞాపన

## (చతుర్థ ముద్రణము)

నాచే రచింపబడిన ఈ ఆయుర్వేదౌషధరత్నాకరమునకు ఇయ్యది చతుర్థ అనగా నాలుగవ ముద్రణము. నాయొక్క ఈ గ్రంథము ఇట్లు నాలుగు ముద్రణములను పొందునని నేను తొలుత అనుకొనలేదు. ఇట్లు నాలుగు ముద్రణము లగుటనుబట్టియే ఈ గ్రంథము యొక్క ప్రాశస్త్యమును, నేను పొందిన శ్రమను, నాకుకల పరోపకారాభిరుచిని సుగుణ ప్రధానులగు చదువరులు గ్రహించుకొనగలరు. ఇందు నేను ఇంకను అనేక విషయములను చేర్చుటయందు ఉత్సాహశక్తులను కలవాడనే. కాని ఇతరములగు అనేక గ్రంథములను వ్రాసి వానియందు అనేక విషయములను వ్రాసియుండుటచేతను ఆ గ్రంథములను తరుచు ముద్రింపించుచుండవలసి వచ్చుచుండుటచేతను అవకాశమనునది లేకపోవుటచే ఈ గ్రంథమును ఇంతటి విషయములతో ముద్రింపించడమైనది. ఈ గ్రంథమునకు సంబంధించిన అనేక విషయములను ఇదివరలోని మూడు ముద్రణముల యొక్క విజ్ఞాపనములయందు వివరించి వ్రాసి యున్నాడను. కాన అట్టి విషయములను ఇచ్చట మరల ఉద్ఘాటింపలేదు.

గ్రంథమును వ్రాయుట అనునది ఒక వ్యక్తికే మాత్రమే ప్రత్యేకముగ సంబంధించినదై యున్నది. ముద్రణము పూర్తియగుట అనునది అనేకులతో సంబంధించిన పనియై యున్నది. కనుక గ్రంథమును వ్రాయుట కంటెను కూడ సరిచూచుకొనుచు ముద్రింపించుటయే ప్రకృత కాలమున అనేక విధముల శ్రమయని ఒక్కొక్కప్పుడు తలంపవలసి వచ్చుచున్నది. అయినను అనేక విధములుగ శ్రమనొంది ఈ నాలుగవ ముద్రణమును ఇట్లు పూర్తి చేసితిని.

నాకు సంపూర్ణమగు ఆరోగ్యమును ఉత్సాహమును ప్రసాదించవలసినదిగ శ్రీమద్ధన్వంతరిని అధికముగ ప్రార్థించుచు అట్లు ఒనర్చినయెడల నాశక్తికొలదియు ఆయుర్వేదసేవ చేసెదననియు చికిత్సావిషయమై అనుభవపూర్వకముగ ఒక నూతన గ్రంథమును ప్రచురింపదలచితిననియు మనవి చేసుకొనుచు ఈ విజ్ఞాపనమును ఇంతటితో పరిసమాప్తి నొందించుచున్నాను.

రాజమహేంద్రపురము
22—12—18

ఇట్లు గ్రంథకర్త,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

# విజ్ఞాపన

(తృతీయ ముద్రణము)

నాచే రచింపబడిన ఈ ఆయుర్వేదౌషధరత్నాకరము యొక్క ప్రథమ ద్వితీయ ముద్రణములు అచిరకాలములోనే ఆంధ్ర వైద్య సోదరుల యొక్క హస్తముల నలంకరించి ఈ తృతీయ ముద్రణమును ముద్రింపించుటకు శ్రీ ధన్వంతరి యొక్క పరిపూర్ణకటాక్షమే కారణమని పూర్తిగా నమ్ము చున్నాడను. ఇదివరలో ద్వితీయ ముద్రణమునందే అనేక విషయములను వ్రాసియుండుటచేతను, విషయములను అనవసరముగ వ్రాసి వైద్య సోదరులకు శ్రమను కలిగించుట ఇష్టము లేకపోవుటచేతను, చరకసంహితను సంపూర్ణముగ ఆంధ్రభాషలోనికి పరివర్తనము చేయుచు తత్కార్యభారములో నిమగ్నుడనై యుండుటచేతను, ఈ తృతీయ ముద్రణమునందు ఇంతకంటె అధికముగ విషయములను చేర్చియుండలేదు. కాని వీలైనంతవరకు కొన్ని యోగములను అధికముగ జేర్చితిని. మఱియు విషయములను చాలవరకు చక్కని శైలిలో నుండునట్లు వ్రాసితిని. యోగములు మొదలగు వానిని గూర్చి నా అభిప్రాయమును ద్వితీయ ముద్రణము యొక్క విజ్ఞాపనయందే వివరముగ వ్రాసియుండుటచే ఈ విజ్ఞాపనయందు ఇతర విషయములను విమర్శింపలేదు.

పొరపాటులు లేకుండుటకై అనేక విధములగు ప్రయత్నములను చేసితిని. ఎచ్చటనైన నున్నచో సవరించుకొని నన్ను మన్నింప కోరెద.

గ్రంథకర్త,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

........................
1—10—1934